మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రై మాసపత్రిక

జూలై-సెప్టెంబర్, 2012

దశాబ్ది ప్రత్యేక సంచిక

చైతన్యానికి చిరునామా మన మానవి
ఆగని కాలచక్రంలా నీ నడక సాగాలి !
అలుపెరగని నీ పయనం దశాబ్ది నుండి శతాబ్దికి చేరాలి !!



Andhra Pradesh
**Department of School Education (PE)**
Rajiv Vidya Mission (S.S.A.)



**Sri N. Kiran Kumar Reddy**
*Hon'ble Chief Minister of AP*

# Committed to Elementary Education

In Andhra Pradesh, the Department of School Education is anchoring the SSA. Children from varying backgrounds are in schools, Education guarantee centres, NRSTCS, RSTCS, Kasturbha Gandhi Balika Vidyalayas, Seasonal Hostels Centers for Migrated children, madarsas, special centers for differently abled are a few areas where the focus is on quality elementary education with accent on education for life. A concerted attempt is made to bridge all gender and social category gaps at this level, while progressing towards universal retention.



**Dr. Sailajanath .S**
*Minister for Primary Education, SSA, Adult Education, AP Open Schools Society, Jawahar Bal Bhavan, AP Mahila Samata Society, SIET, Public Libraries, SCERT, AP Text Book Press*









## Kasturba Gandhi Balika Vidyalayas

*Launched during 2004-05 as a Government initiative, the Kasturba Ghandhi Balika Vidyalayas (KGBV) programme is aimed at providing residential education programmes for girl students up to class VIII. The State Government has moved further by extending the programme to class IX and X to curb the school drop-out rates. The scheme witnessed sanctioning of 395 KGBVs with essential infrastructure and amenities as a residential set up to cater to education for girls belonging to SCs, STs, OBCs and minorities.*

## RIGHT TO EDUCATION (RTE)

*The Right to Education Act, passed by Parliament on 4 August 2009, sets out the modalities for providing free and compulsory quality elementary education conforming to the standards and norms specified in the Schedule for children aged between 6 and 14; for ensuring that children of weaker sections and disadvantaged groups are on no grounds deprived of completing elementary education; providing school infrastructure teaching staff and learning equipment; monitoring admission, attendance and completion of elementary education; ensure timely prescribing of curriculum and courses of study; and training facility for teachers. Enacted in accordance with Article 21 A of the Constitution, it puts India among 135 countries that have made education a fundamental right of every child.*

*For more details and suggestions*







State Project Director
**Rajiv Vidya Mission (SSA)**
Hyderabad, Andhra Pradesh.

చైతన్య మానవి

# "మానవి మన అందరిదీ"

సంపాదకీయం...

ఒక పత్రిక పెట్టాలి అనుకోవడం సులువే. కానీ దాన్ని నడపడం అంత సులువుకాదు. లక్షల రూపాయల పెట్టుబడితో నడుస్తున్న పత్రికలే నిలదొక్కుకోలేకపోతున్న ఈ కాలంలో చైతన్య మానవిని పదేళ్ళుగా నిరాటంకంగా తేవడం పత్రిక సాధించిన మొదటి విజయం.

చైతన్య మానవి గొప్పదనమేమిటంటే ఇది మహిళలచేత, మహిళల కోసం నడిచే మహిళల పత్రిక. నిరంతరం ఉద్యమ భాగస్వాముల ఆధ్వర్యంలో నడుస్తున్న పత్రిక. కొద్దిమంది మేధావులు, శ్రేయోభిలాషుల సహాయ సహకారాలున్నప్పటికీ, సమాచార సేకరణ నుండి సంపాదకీయం వరకూ మహిళలే. పేజీ మేకప్ దగ్గర నుంచి, కట్టలు కట్టి జిల్లాలకు పంపిణీ చెయ్యడం వీళ్ళే. పత్రికకు నిధులేర్పరచుకునేది వీళ్ళే. ప్రింటింగ్, పంపిణీ, అమ్మకం అన్నీ నాయకులు, సాధారణ కార్యకర్తలన్న తేడా లేకుండా చెయ్యడం విశేషం. మహిళల ఆకాంక్షలు, ఆశలే పెట్టుబడిగా 'చైతన్య మానవి' పురుడు పోసుకుంది.

మహిళలకు నాలుగు విషయాలు తెలిపి, ప్రాపంచిక జ్ఞానాన్ని, కొత్త విషయాలను తెలుసుకోవాలనే జిజ్ఞాసను రేకెత్తించడం, వారిని కార్యోన్ముఖులను చెయ్యడం పత్రిక ప్రధాన లక్ష్యం.

" చైతన్య మానవి" మహిళలనుద్దేశించి నడుస్తున్న పత్రికే అయినా కుటుంబ సభ్యులు కూడా చదివి "బాగుందండీ.....పత్రికా...." అంటున్నారంటే అతిశయోక్తి కాదేమో!

"ఆధునిక మహిళ చరిత్రను తిరగరాస్తుంది" అన్నాడు మహాకవి గురజాడ. ఆ మాటలు మహిళలపై ఆయనకున్న నమ్మకాన్ని, విశ్వాసాన్నే కాదు, మహిళలపై ఉంచిన గురుతర బాధ్యతను కూడా తెలియజేస్తున్నాయి. పత్రికను నిర్వహిస్తున్న సమయంలో గురజాడ సూక్తులే గుర్తుకు వస్తాయి.

ఆడదానికి చదువెందుకు? ఉద్యోగాలు చెయ్యాలా? ఊళ్ళేలాలా? అన్న స్థాయిని దాటి మహిళలు విద్యతో వచ్చిన ఆత్మవిశ్వాసం, అవగాహన శక్తితో అన్ని రంగాల్లో ముందుంటున్నారు. అయినా అనేక మంది చదువుకున్న మహిళలు కుటుంబ పరిధి దాటి ఈవలికి రాలేకపోతున్నారు. సమాజం గురించి తెలుసుకోవడానికి ఆసక్తిని ప్రదర్శించలేకపోతున్నారు. ఆసక్తి ఉన్నా వాళ్ళ జిజ్ఞాసను చంపివేసే ధోరణిలోనే టి.విలు, సినిమాలు పనిచేస్తున్నాయి. నల్లమందులాంటి మత్తులో పడికొట్టుకునేట్లు చేస్తున్నాయి. ఈ దశలో మహిళలలో నిగూఢంగా ఉన్న మేధోశక్తిని, కార్యదక్షతను వెలికి తీయడం కోసం ఐద్వా 'మానవి' పత్రికను ప్రారంభించింది.

ఓ వైపు రోజు వారి కార్యక్రమాల్లో తలమునకలవుతూనే, పత్రికను సమర్థవంతంగా నిర్వహించడంలో ఐద్వా కార్యకర్తలు ఎక్కడా వెనుకబడలేదు. నేను, నా కుటుంబం అనే పరిధిలో సమాజం ఆలోచిస్తూంది. అదే చట్రంలోని సాధారణ కుటుంబం నుండి వచ్చిన మహిళా కార్యకర్తలు పత్రికను తమదిగా భావించి, పుస్తకాలు అమ్మడం, చదివించడం, డబ్బులు జమకట్టడం ప్రశంసనీయం.

అయితే ఇది నాణానికి ఒకవైపు మాత్రమే. పున్నమినాటి చంద్రునికి కూడా మచ్చలున్నాయి. అచ్చు తప్పులతోపాటు సాధారణ మహిళలకు అర్థం కాని భాషా పద ప్రయోగాలు, ఆ! ఏముందిలే ఇందులో...? అన్నట్టు సాగే కొన్ని ఐటెమ్స్ దగ్గర నుంచి అనేక లోపాలు దీంట్లో లేకపోలేదు.

వీటన్నింటిని సవరించుకోవడం అవసరం. పత్రికను మరింత ఆకర్షణీయంగా మరియు ఒక ప్రత్యామ్నాయ ఆలోచనా విధానాన్ని మహిళల ముందు ఆవిష్కరించేలా, అలాగే మహిళలు తమకు తెలియకుండానే తమ పట్ల సాగుతున్న అణచివేతను అర్థం చేసుకునే విధంగా, ఆడవాళ్ళకు ఏం తెలుసులే అనే ధోరణి నుండి బయటపడి, సమాజంలో సగభాగం వ్యక్తులుగా తమ వంతు కర్తవ్యం నిర్వర్తింపజేసే ఒక సాధనంగా మహిళలను మలచాల్సిన అవసరం ఉంది. భవిష్యత్తులో మానవి ఆ కర్తవ్యాన్ని సమర్థవంతంగా నిర్వహించగలదని కోరుకుందాం.

ఇంతవరకూ మానవిని నడపడంలో సహకరించిన శ్రేయోభిలాషులందరికీ కృతజ్ఞతలు. భవిష్యత్తులో కూడా ఇటువంటి సహకారం చైతన్య మానవికి, తద్వారా మహిళా సంఘానికి అందగలదని ఆశిద్దాం!!

# చైతన్య మానవి

ఈ సంచికలో...




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం**

**రాష్ట్ర కమిటీ**

చిరునామా:

బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్: 2,1-8-1, బాగ్‌లింగంపల్లి,
హైదరాబాద్ - 500 044. ఫోన్ : 27605845.

సంపాదకులు

**టి. జ్యోతి**

మేనేజర్

**ఎం. సుధ**

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం

అల్లూరి మన్మోహిని

ఎస్. పుణ్యవతి

కె. స్వరూపరాణి

**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజామాబాద్, హైదరాబాద్ - 500 044.




# చైతన్యపు దీపిక మానవి

దశాబ్ది వేడుకకు ముస్తాబయింది మన మానవి
చైతన్య మానవికి అప్పుడే పదేళ్ళొచ్చేసాయి!
పావడా కట్టిన పాపాయి అయింది మానవి
తెల్లని పావడాపై
చైతన్యపు దారంతో
ఉద్యమాల పూలు కుట్టుకుంది మానవి
స్ఫూర్తినిచ్చే పూలను సిగలో పెట్టుకుని
ఆగని నడకతో వేగం పుంజుకుని
అలుపెరుగని పోరాటంతో
అవనిలో సగం మేమేనంది మానవి
తెల్లని పతాకతో తట్టి లేపి
చెదరని చిరునవ్వుతో
ఆత్మవిశ్వాసానికి ఆరంభం నేనేనంది మన మానవి!
మనందరి మానవి!!
చైతన్య మానవి మహిళా ఉద్యమ కరదీపిక
ఆ దీపికను అందుకుందాం! అనుసరిద్దాం!!

**- మైలవరపు నాగమణి.**

# మహిళలు నడుపుతున్న పత్రికలు

## నాడు - నేడు

- కొండవీటి సత్యవతి

తెలుగు పత్రికలకు నూట యాభై సంవత్సరాల చరిత్ర ఉంది. మొదటి తెలుగు పత్రిక ఎప్పుడు ప్రచురితమైంది? ఆ పత్రిక ఏది? ఎవరు ప్రచురించారు అనే అంశం మీద భిన్న అభిప్రాయాలున్నాయి. "ఆంధ్రజాతి అక్షర సంపద తెలుగు పత్రికలు" పేరుతో శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారు రాసిన పుస్తకం ప్రకారం తెలుగులో తొలి పత్రిక "వృత్తాంతి". ఈ పత్రిక ఆవిర్భావం జరిగింది 1832-38 మధ్య అని వారు పేర్కొన్నారు. ఈ పత్రిక వారపత్రికగా మద్రాసు నుంచి ప్రతి గురువారం వెలువడేది. మండిగ వెంకట రాయశాస్త్రి "వృత్తాంతి" సంపాదకులు. ఆ తరువాత 1878 సంవత్సరంలో కందుకూరి వీరేశలింగం రాజమండ్రిలో స్థాపించిన "వివేక వర్ధని' పత్రికను గురించి ప్రముఖంగా చెప్పుకోవాలి. వీరేశలింగం పంతులు పత్రికల్ని ఒక ఉద్యమంలా నిర్వహించాడు. స్త్రీల కోసం కూడా వీరేశలింగం ఒక పత్రికను ప్రారంభించాడు. దానిపేరు ''సతీహిత బోధిని" ఇది మాసపత్రిక. స్త్రీల ఆరోగ్యం, నీతి సూత్రాలు, భార్యలుగా స్త్రీల విద్యుక్త ధర్మాలు మొదలైన వాటిమీద ఈ పత్రికలో వ్యాసాలుండేవి.

తెలుగులో తొలి తెలుగు పత్రిక 'వృత్తాంతి' అనుకుంటే స్త్రీల కోసం నడిచిన తొలిపత్రిక ఏది? స్త్రీలు నడిపిన మొదటి పత్రిక ఏది అనే విషయంలో కూడా స్పష్టమైన ఆధారాలున్నట్టు కనపడదు. స్త్రీల కోసం ప్రత్యేకంగా పత్రికలు నడపాల్సిన అవసరముందని ఆలోచన చేసిన వారిలో ప్రథములు కందుకూరి వారే. వారు 'సతీహిత బోధిని' పేరు గల ఒక స్త్రీల పత్రికను నడిపారు. స్త్రీ విద్య గురించిన ప్రచారం ఈ పత్రికలో ఉండేది.

ఆ తరువాత అంటే 1893లో "తెలుగు జనానా" పత్రిక వెలువడింది. ఈ పత్రికను రాయసం వెంకట శివుడు ప్రారంభించి చాలా కాలం పాటు నడిపారు. స్త్రీ విద్య, స్త్రీల కోసం పాటలు, పద్యాలు, స్త్రీలు రాసిన రచనలు ఈ పత్రికలో ప్రచురించేవారు. తెలుగులో తొలి కథ రాసిన బండారు అచ్చమాంబ రచనలు చాలా తరచుగా ఈ పత్రికలో ప్రచురితమవుతూ ఉండేవి.

స్త్రీల కోసం ప్రత్యేకంగా పత్రికలు నడపాల్సిన అవసరముందని ఆలోచన చేసిన వారిలో ప్రథములు కందుకూరి వారే. వారు 'సతీహిత బోధిని' పేరు గల ఒక స్త్రీల పత్రికను నడిపారు. స్త్రీ విద్య గురించిన ప్రచారం ఈ పత్రికలో ఉండేది.

1902లో ఎస్.సీతారామయ్యగారు కేవలం స్త్రీల కోసం ప్రారంభించిన పత్రిక "హిందూ సుందరి". ఆరోజుల్లో "హిందూ సుందరి" చాలా ప్రాచుర్యం పొందిన పత్రిక. స్త్రీలకు సంబంధించిన ఎన్నో అంశాలు ఈ పత్రికలో ఉండేవి. స్త్రీ విద్య, బాల్యవివాహాలు, స్త్రీల సంఘాల ఆవశ్యకత వంటి భిన్న అంశాల మీద స్త్రీలు రాసిన కథలు, వ్యాసాలు, ఉపన్యాసాలు ఇందులో ఉండేవి. తెలుగు సాహిత్యానికి ధ్రువతారలాంటి బండారు అచ్చమాంబ రాసిన తొలికథ "ధనత్రయోదశి" 1902లో హిందూ సుందరిలోనే ప్రచురితమైనది.

స్త్రీల కోసం నడిచే పత్రికల నిర్వహణ కూడా స్త్రీలే చేపట్టాలనే ఆలోచన చేసినవారు కూడా 'హిందూ సుందరి'ని ప్రారంభించిన సీతారామయ్యగారే కావడం గమనార్హం. వీరి కోరిక, ఆశయం ఫలించి 1904లో మొనలికంటి రమాబాయమ్మ, వెంపటి శాంతాబాయమ్మగార్లు హిందూ సుందరి

| | | |
|---|---|---|
| తెలుగు జనానా | తెలుగు తల్లి | చూపు |
| హిందూ సుందరి | వనిత | తర్జని |
| సావిత్రి | స్త్రీ విముక్తి | భూమిక |
| అనసూయ | నూతన | మహిళామార్గం |
| సౌందర్య వల్లి | లోహిత | చైతన్య మానవి |
| గృహలక్ష్మి | మాతృక | నవోదయం |
| ఆంధ్ర లక్ష్మి | ఆహ్వానం | స్త్రీ స్వేచ్ఛ |
| ఆంధ్రమహిళ | వృత్తాంతి | మానుషి |

**స్త్రీల కోసం నడిచే పత్రికల నిర్వహణ కూడా స్త్రీలే చేపట్టాలనే ఆలోచన చేసినవారు కూడా 'హిందూ సుందరి'ని ప్రారంభించిన సీతారామయ్యగారే కావడం గమనార్హం. వీరి కోరిక, ఆశయం ఫలించి 1904లో మొసలికంటి రమాబాయమ్మ, వెంపటి శాంతాబాయమ్మగార్లు హిందూ సుందరి ప్రతికాధిపతురాండ్రయినారు. అంటే వందేళ్ళ క్రితమే ఒక పత్రికకు ఇరువురు స్త్రీలు అధిపతులయ్యారన్నమాట.**

ప్రతికాధిపతురాండ్రయినారు. అంటే వందేళ్ళ క్రితమే ఒక పత్రికకు ఇరువురు స్త్రీలు అధిపతులయ్యారన్నమాట. బహుశా వీరివురే తెలుగులో మొట్టమొదటి మహిళా సంపాదకులు, జర్నలిస్టులు కూడా అయ్యుండవచ్చు.

ఆ తరువాత 1910లో పులుగుర్త లక్ష్మి నరసమాంబ 'సావిత్రి' అనే పత్రికను నిర్వహించారు. ఇది కాకినాడ నుండి ప్రచురితమయ్యేది. లక్ష్మి నరసమాంబ మంచి వక్త. హిందీ, బెంగాలీ భాషలలో గొప్ప పాండిత్యమున్నదామెకు. స్త్రీలకు విద్య అవసరమని వాదిస్తూ, తన పత్రిక ద్వారా ప్రచారం చేసేది. కందుకూరి సంఘ సంస్కరణోద్యమం పట్ల ఈమెకు వ్యతిరేక భావాలుండేవి. ఈ అంశమై సావిత్రిలో చర్చోపచర్చలు జరుగుతుండేవి. పత్రికను ప్రోత్సహించమని ఈమె చేసిన విజ్ఞప్తిని గమనిస్తే ఆనాటికీ, ఈనాటికీ స్త్రీల పత్రికల ఆర్థిక స్థితిలో ఏమి మార్పులేదని అర్థమవుతుంది.

"సోదర సోదరీమణులారా! వ్యయ ప్రయాసలకోర్చి స్త్రీల విద్యాభివృద్ధి కొరకే పత్రికను ప్రకటించుచున్నాము. తపాలా ఖర్చు, కాగితపు ఖర్చు, అచ్చు ఖర్చులకు సంవత్సరమునకు బంపెడు 12 పత్రికలకును రూ॥1-0-0 అగుచున్నది. తక్కిన గుమాస్తా ఖర్చు, ఉత్తర ప్రత్యుత్తరములకగు పోస్టు ఖర్చు మున్నగునవి మేము భరించుచున్నాము. ఈ పనియందు వేమభిలషించిన స్త్రీ విద్యాభివృద్ధియే మా లాభము. కాబట్టి విద్యాభిమానులెల్లరు మా యుద్యమమునకు దోడ్పడి మేమందింపవోవుచున్న వి.పి.ని స్వీకరింప బ్రార్థించుచున్నాము......" లక్ష్మీ నరసమాంబ ఎంత కష్టపడి స్త్రీల అభ్యున్నతి కోసం 'సావిత్రి' పత్రికను నడిపిందో ఈ ప్రకటన చూస్తే అర్థమౌతుంది. బండారు అచ్చమాంబ రాసిన 'అబలా సచ్చరిత్ర రత్నమాల' 'సావిత్రి'లోనే ప్రచురింపబడింది. తెలుగులో తొలి స్త్రీల చరిత్రగా వినుతికెక్కిన 'అబలా సచ్చరిత్ర రత్నమాల' పుస్తక రూపంలో వచ్చినప్పుడు ఈ గ్రంథానికి లక్ష్మీనరసమాంబ ముందుమాట రాసింది.

1914లో వింజమూరి వెంకట రత్నమ్మ అనే ఆమె కాకినాడ నుంచి 'అనసూయ' పేరుతో ఒక పత్రికను నడిపింది. ఆనాటి మహిళోద్యమానికి 'అనసూయ' ఎనలేని సేవ చేసింది. వింజమూరి వెంకట లక్ష్మీ నరిసింహరావు ఈ పత్రిక ప్రకాశకులు. వెంకట రత్నమ్మ ప్రతికాధిపురాలు. ఈ పత్రికలో స్త్రీలకు, బాలికలకు ఉపయోగపడే రచనలను ప్రచురిస్తుంటామని, గృహనిర్వహణ, ప్రకృతి శాస్త్రాలు, పురాణ స్త్రీల చరిత్రలు, వివిధ రంగాలలో వన్నెకెక్కిన ప్రపంచ ప్రసిద్ధ మహిళల చరిత్రలు మొదలగువాటిని ప్రచురిస్తామని చెప్పుకున్నారు. ఆ కాలంలో అప్పుడప్పుడే విస్తరిస్తున్న అభ్యుదయ భావాలు ఈ పత్రిక తొలి సంచికలో కన్పిస్తూండటం విశేషం.

1918లో అంటే ఇరవయ్యవ శతాబ్ది రెండవ దశకంలో స్త్రీలు సంపాదకులుగా వెలువడిన మరో పత్రిక "సౌందర్యవల్లి". గాడిచర్ల హరిసర్వోత్తమరావు భార్య రమాబాయి ఈ పత్రిక ప్రకాశకురాలు, సంపాదకురాలు. "సౌందర్యవల్లి' పత్రికను ఎందుకు ప్రారంభించామో చెబుతూ " యింకను ఆంధ్రదేశమున మాసపత్రికా ప్రకటనము సక్రమముగా అభివృద్ధి మార్గము పట్టలేదు. ఈ కొరతను తీర్చవలయుననుట మా యుద్దేశ్యము...... అయితే స్త్రీల సంక్షేమం కోసం ఉద్దేశించిన రచనలే ఎక్కువగా ఉన్నప్పటికినీ 'సౌందర్యవల్లి' పత్రిక మీద స్త్రీల పత్రిక అని ఎక్కడా లేదు. స్త్రీల కోసం ప్రత్యేకం ఒక విశ్వవిద్యాలయం ఉండాలని మొదటిసారిగా ఒక ప్రతిపాదన చేసిన కీర్తి, గౌరవం సౌందర్యవల్లి పత్రికకు దక్కుతాయి. స్త్రీ విద్యావనరాలను గుర్తించి, ప్రత్యేక విశ్వవిద్యాలయం ఉండాలని ప్రతిపాదించిన రమాబాయి, గాడిచెర్ల హరిసర్వోత్తమరావుల ముందుచూపు ఎంతైనా కొనియాడదగినది.

ఆ తరువాత ప్రముఖంగా చెప్పుకోవలసిన పత్రిక 'గృహలక్ష్మి". ఈ పత్రికను 1928 సంవత్సరంలో స్థాపించి ఉజ్వలంగా నడిపిన వారు డాక్టర్ కె.ఎన్.కేసరి. స్త్రీల అభివృద్ధి కోసం కృషి చేసిన 'గృహలక్ష్మి 1960 వరకు కొనసాగడం విశేషం. స్త్రీలు అన్ని రంగాల్లోను, శారీరకంగా, మానసికంగా పురుషులతో సమానమని దృఢంగా నమ్మిన పత్రిక 'గృహలక్ష్మి'. స్త్రీల ఆరోగ్యం, విద్య మొదలైన అంశాలమీద రచనలు ప్రచురితమయ్యేవి. రచయిత్రుల ప్రతిభను గుర్తిస్తూ వారికి గృహలక్ష్మి స్వర్ణకంకణం అవార్డును ప్రతి సంవత్సరం ప్రధానం చేయడం 'గృహలక్ష్మి' ప్రత్యేకత. ఈ పత్రిక నిర్వహణలో మహిళల పాత్ర

**"మొట్టమొదటి జనానా పత్రికయు, పిమ్మట హిందూ సుందరియు, తుట్టతుదకు అనసూయయు వెలువడి దేశమునకెంతయో సేవ చేయుచుండి క్రమముగా నిలిచిపోయినవి. అట్టి లోపమును బాపుటకై స్త్రీల కుపయుక్తమగు నొక తెలుగు పత్రికను వెలువరించి శక్త్యానుసారము దేశసేవ చేయవలెనను కుతూహలము నన్ను బురికొల్పుటచే నీ పత్రికను ప్రచురింప సాహసించితిని".**

లేకపోయినప్పటికీ మహిళలలో ఉన్నతాదర్శాలు కలిగించడం, వారి హక్కుల కోసం రచనల ద్వారా పోరాడటం తన లక్ష్యాలుగా గృహలక్ష్మి నిర్దేశించుకున్నట్లుగా ఆ పత్రిక ప్రతులను చూస్తే అర్థమవుతుంది. "స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను పెంపొందించుటకేర్పడిన సచిత్ర మాస పత్రిక" అని గృహలక్ష్మి కవర్ పేజీమీద ముద్రించి ఉంటుంది. 1953లో తన 78వ ఏట మరణించే వరకూ కేసరిగారు ఎంతో ఉత్సాహంగా పత్రిక పనిని, గృహలక్ష్మి అవార్డు పనిని కొనసాగించారు. గృహలక్ష్మి మద్రాసు నుండి వెలువడేది.

బరంపురం నుండి వెలువడిన 'ఆంధ్రలక్ష్మి' గురించి కూడా ప్రముఖంగా ప్రస్తావించాల్సివుంది. 1921 సంవత్సరంలో కళ్ళేపల్లి వెంకట రమణమ్మ సంపాదకురాలుగా "ఆంధ్రలక్ష్మి' పత్రిక మహిళల సంక్షేమం కోసం మొదలైంది. తొలి సంచికలో సంపాదకీయం రాస్తూ వెంకట రమణమ్మ ఇలా రాసారు. "మొట్టమొదటి జనానా పత్రికయు, పిమ్మట హిందూ సుందరియు, తుట్టతుదకు అనసూయయు వెలువడి దేశమునకెంతయో సేవ చేయుచుండి క్రమముగా నిలిచిపోయినవి. అట్టి లోపమును బాపుటకై స్త్రీల కుపయుక్తమగు నొక తెలుగు పత్రికను వెలువరించి శక్త్యానుసారము దేశసేవ చేయవలెనను కుతూహలము నన్ను బురికొల్పుటచే నీ పత్రికను ప్రచురింప సాహసించితిని". ఈ పత్రికకు స్త్రీల చేత చందాలు కట్టించడానికి గాను 'శారద లేఖలు" అనే శీర్షిక కింద ఉత్తరాలు రాయడం కనిపిస్తుంది. అలాంటి ఒక ఉత్తరం " మా పట్టణవాన స్త్రీలకు నాటకములయందున్న యభిలాష పత్రికలయందులేదు. పకోడీలయందున్న యభిరుచి పత్రికల యందు లేదు. ఉన్నచో ఏడు దినములు చిరుతిండి కట్టిపెట్టినచో యేడాది పత్రిక చదువవచ్చును కదా!" అని ఒక పాఠకురాలు రాసింది. దేశ దేశాల్లోని

**ఆంధ్రమహిళా సభ వ్యవస్థాపకురాలు, ప్రముఖ సంఘ సేవికురాలు గుమ్మిడిదల దుర్గాబాయమ్మ 1943లో స్థాపించిన 'ఆంధ్రమహిళ' గురించి మాట్లాడుకోవాలి. స్వాతంత్ర్య సమరంలో కార్యకర్తగా పాల్గొని, నాయకత్వస్థాయికి ఎదిగి, సి.డి.దేశ్‌ముఖ్‌ని వివాహం చేసుకున్న తర్వాత దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్‌గా ప్రాచుర్యం పొందిన దుర్గాబాయమ్మ ఆంధ్రరాష్ట్రంలో మహిళల ఉన్నతి కోసం తన జీవితాన్ని అంకితం చేసింది. రెండు దశాబ్దాలపాటు 'ఆంధ్రమహిళ' పత్రికను నడిపింది.**

స్త్రీలకు సంబంధించిన వార్తలను ఈ పత్రిక ప్రచురించేది. అప్పటి బళ్ళారి తాలూకా బోర్డులో ఒక స్త్రీకి సభ్యత్వం లభించిన వార్తను ముఖ్యమైన వార్తగా ప్రచురించింది.

ఆంధ్రమహిళా సభ వ్యవస్థాపకురాలు, ప్రముఖ సంఘ సేవికురాలు గుమ్మిడిదల దుర్గాబాయమ్మ 1943లో స్థాపించిన 'ఆంధ్రమహిళ' గురించి మాట్లాడుకోవాలి. స్వాతంత్ర్య సమరంలో కార్యకర్తగా పాల్గొని, నాయకత్వస్థాయికి ఎదిగి, సి.డి.దేశ్‌ముఖ్‌ని వివాహం చేసుకున్న తర్వాత దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్‌గా ప్రాచుర్యం పొందిన దుర్గాబాయమ్మ ఆంధ్రరాష్ట్రంలో మహిళల ఉన్నతి కోసం తన జీవితాన్ని అంకితం చేసింది. రెండు దశాబ్దాలపాటు 'ఆంధ్రమహిళ' పత్రికను నడిపింది. మారుతున్న సమాజంలో మహిళలెదుర్కొనే సమస్యల పట్ల అవగాహనతో రచయిత్రులు రాసే రచనలు ఇందులో ఉండేవి. కనుపర్తి వరలక్ష్మమ్మలాంటి స్వాతంత్రోద్యమ నాయుకురాండ్ర రచనలతోపాటు మాలతీచందూర్, కె.రామలక్ష్మి లాంటి ఆధునిక రచయిత్రుల రచనలు ఆంధ్రమహిళలో ఉండేవి. దుర్గాబాయమ్మ సంపాదకీయాలు చాలా పదునుగా, ఘాటుగా ఉండేవి. ఎవ్వరినైనా విమర్శించటానికి వెనుకాడేదికాదు. ఉమ్మడి మద్రాసు ప్రభుత్వంలో ప్రకాశం మంత్రివర్గం ఏర్పడినప్పుడు మహిళాభ్యుదయానికి ప్రత్యేక విధానాన్ని రూపొందించవలసిందిగా సూచిస్తూ 1947 మార్చి సంచిక సంపాదకీయంలో ఇలా రాశారు.

"వీరి ఆశయంలో పెద్ద లోటు కనిపిస్తూయుంది. స్త్రీ జనాభ్యుదయానికి దోహదమిచ్చే కార్యక్రమమునకు ప్రోత్సాహం లేకపోయింది. హరిజనుల గోడు, కుటీర పరిశ్రమల దుస్థితి ప్రభుత్వం వారి గమనానికొచ్చాయి. పెద్ద స్కీములు మొదలెట్టారు. పెద్ద మొత్తాలు ప్రత్యేకించారు. జాతీయాభ్యుదయాలలో ముఖ్య విషయాలైన వీటి పునరుద్ధరణకు కొత్త కొత్త ప్రభుత్వ శాఖలు, ఉద్యోగులు సృష్టించబడ్డ విషయం చూస్తూనేయున్నాం. కాని, మహిళాభ్యుదయం విషయంలో మటుకు ప్రభుత్వం కొంత అశ్రద్ధ వహించింది". ప్రభుత్వం యంత్రాంగంలో స్త్రీల సంక్షేమం కోసం ఒక ప్రత్యేక శాఖ ఏర్పాటు చేయాలని దుర్గాబాయమ్మగారు ఆనాడే 'ఆంధ్రమహిళ' ద్వారా సూచించారు. మహిళలు స్వశక్తి మీద ఆధారపడే విధంగా విద్య నేర్చుకుని చిన్న చిన్న పరిశ్రమలను ఏర్పాటు చేసుకోవడం ద్వారా స్త్రీల సముద్ధరణ జరగాలని ఆమె ప్రబోధించేవారు.

1943లో రాచమళ్ళ సత్యవతీదేవి సంపాదకత్వంలో "తెలుగుతల్లి" పత్రిక నడిచింది. అభ్యుదయ రచయితల సంఘానికి సొంత పత్రిక ఏర్పడటానికి ముందు అభ్యుదయ సాహిత్య ప్రచురణలో మొదటగా ఉపయోగపడిన పత్రిక 'తెలుగుతల్లి'.

హైదరాబాదు నుంచి వెలువడిన మొట్టమొదటి పత్రికగా ప్రాచుర్యం పొందిన 'వనిత' అతి కొద్దికాలమే వెలువడినప్పటికీ విలువైన సమాచారంతో, మహిళల సమస్యలపై దృష్టిపెట్టిన పత్రిక. ప్రముఖ స్త్రీవాద రచయిత్రి, కేంద్ర సాహిత్య అకాడమీ

అవార్డు గ్రహీత అబ్బూరి ఛాయాదేవి గారి సంపాదకత్వంతో నడిచిన 'వనిత' తెలుగు పత్రికల చరిత్రలో చెరగని స్థానం సంపాదించుకున్నది. నాయని కృష్ణకుమారి, తురగా జానకీరాణి, ఉన్నమ విజయలక్ష్మి ఆంధ్ర యువతీ యండలి వ్యవస్థాపకురాలు యల్లాప్రగడ సీతాకుమారి గార్ల వంటి ప్రసిద్ధుల రచనలు 'వనిత'లో ఉండేవి. అబ్బూరి వరద రాజేశ్వరరావుగారి సోదరి, అప్పట్లో డి.ఈ.వో.గా పనిచేసిన సత్తిరాజు రాజ్యలక్ష్మిగారు పిల్లల వికాసం గురించి రాసిన రచనలుండేవి. సంపాదకురాలుగా స్త్రీలలో చైతన్యం కలిగించే రచనలను ప్రచురించడం అబ్బూరి ఛాయాదేవిగారు అనుసరించిన విధానంగా కనిపిస్తుంది ఈ పత్రికలోని రచనలు గమనిస్తే. అప్పట్లో హైద్రాబాద్‌లోని బర్కత్‌పురా ప్రాంతంలో "ఆంధ్ర యువతీ మండలి" ప్రాంగణం సేవాభావం కలిగిన పలువురు ప్రముఖ మహిళలకు వేదికగా ఉండేది. హైదరాబాద్ సంస్థానం ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు భార్య అనంత లక్ష్మీదేవి ఆంధ్ర యువతీ మండలికి అధ్యక్షురాలిగా ఉండటం విశేషం.

అబ్బూరి ఛాయాదేవి గారి సంపాదకత్వంతో వెలువడిన 'వనిత' తర్వాత వచ్చిన వనితాజ్యోతి, మహిళ, వనిత లాంటి పత్రికలు వ్యాపారాత్మక ధోరణిలో నడిచాయి. ఇవి స్త్రీల పత్రికలే అయినప్పటికీ వీటిని నిర్వహించినవారు మాత్రం పురుషులే. కుటుంబంలోను, సమాజంలోను యథాస్థితి కొనసాగేవిధంగా పితృస్వామ్య భావజాలానికి లోబడే రచనలతో ఈ పత్రికలు నడిచేవి. అప్పుడప్పుడూ వరకట్నం లాంటి సమస్యల మీద వ్యాసాలు ప్రచురించినప్పటికీ కుట్లు, అల్లికలు, గృహాలంకరణ, సౌందర్యపోషణ, వంటలు లాంటి వాటి చుట్టూనే ఈ పత్రికలు కేంద్రీకృతమవుతూ, స్టీరియోటైప్ (మూస నమూనాలు) పాత్రలకే మహిళల్ని

**'లోహిత' తెలుగులో వచ్చిన మొదటి స్త్రీవాద కరపత్రిక. లోహిత అంటే ఎరుపు. స్త్రీవాద సాహితీ సమాఖ్య ప్రచురణ కింద ఈ కరపత్రిక సంవత్సరం లోపు నడిచింది. పత్రిక మొదటిసంచికలో "శతాబ్దాలుగా అణగారిపోయి ఉన్న ఆడవాళ్ళ విముక్తి కోసం ఈ నూతన సంవత్సరం స్త్రీవాద సాహిత్య వేదికగా 'లోహిత'ను వెలువరిస్తున్నాం" అని రాశారు.**

పరిమితం చెయ్యడం కనిపిస్తుంది.

ఇరవయ్యవ శతాబ్ది చివరి దశకంలో వచ్చిన కొన్ని పత్రికలు వామపక్ష, స్త్రీ వాద భావజాలంతో తమవైన ముద్రను కలిగి ఉండడం మనం గమనించవచ్చు. ఆర్థికంగా ఎన్నో ఇబ్బందులనెదుర్కొంటూ కొంత కాలం నడిచి మూతపడిన పత్రికలు కూడా చాలానే ఉన్నాయి.

1978లో ప్రారంభమై సుమారు ఐదు సంవత్సరాల పాటు వెలువడిన పత్రిక 'నూతన' ఈ విలక్షణ మానవత్రిక సంపాదకురాలు ఎం.రత్నమాల. 'నూతన' వర్కింగ్ ఎడిటర్‌గా 'నమ్ము' కొంతకాలం పనిచేశారు. ఈ పత్రికలో కథలు, కవిత్వం, పాటలు ప్రచురించేవారు. ప్రజా సమస్యలమీద వ్యాసాలతోపాటు 'స్త్రీ విముక్తి' పేరుతోమహిళల పేజీ ఉండేది. కొత్తగా రాయడం మొదలుపెట్టిన రచయితలను ఈ పత్రిక చాలా భిన్నమైన పద్ధతిలో ప్రోత్సహించేది. వారి రచనల్లోని లోటుపాట్లను చెప్పి సలహాలిస్తూ రచయిత బాగా అర్థం చేసుకుని తిరిగి పంపితే పత్రికలో ప్రచురించేవారు. 'ఈనాడు' దినపత్రికలో సబ్ ఎడిటర్‌గా పనిచేసిన రత్నమాల సంపాదకురాలుగా 'నూతన' పత్రిక ఐదేళ్ళపాటు నడిచి ఆగిపోయింది.

1970 సంవత్సరంలో అప్పటికి ముప్పాళ్ళ రంగనాయకమ్మగానే పిలవబడుతున్న రంగనాయకమ్మ గౌరవ సంపాదకురాలుగా మొదలైన మాసపత్రిక 'వసుధ' సీరియల్స్, కథలు, కవితలు ప్రచురించేవారు. మంచి ప్రమాణాలతో, చదివించే గుణంతో ఎన్నో ఫీచర్లు, వ్యాసాలు ఉండేవి. చలం ఇష్టాగోష్ఠిలాంటి శీర్షికలు పత్రికను పదికాలాలు దాచుకునే విధంగా ఉండేవి. హాస్య,వ్యంగ్య రచనలకు పెద్దపీట వేయడం 'వసుధ' ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు.

1989లో హైద్రాబాదు నుండి వెలువడిన 'లోహిత' తెలుగులో వచ్చిన మొదటి స్త్రీవాద కరపత్రిక. లోహిత అంటే ఎరుపు. స్త్రీవాద సాహితీ సమాఖ్య ప్రచురణ కింద ఈ కరపత్రిక సంవత్సరం లోపు నడిచింది. పత్రిక మొదటి సంచికలో "శతాబ్దాలుగా అణగారిపోయి ఉన్న ఆడవాళ్ళ విముక్తి కోసం ఈ నూతన సంవత్సరం స్త్రీవాద సాహిత్య వేదికగా 'లోహిత'ను వెలువరిస్తున్నాం" అని రాశారు. అలాగే ఈ తొలి సంచికలో జయప్రభ వ్యాసం, కొండవీటి సత్యవతి కథ 'ఊరేగింపు' ప్రచురించబడినాయి. 'లోహిత' పత్రికను కొండవీటి సత్యవతి, జయప్రభ సంయుక్తంగా నిర్వహించారు.

1992 సంవత్సరంలో విజయవాడలో మొదలైన మహిళల త్రైమాస పత్రిక 'మాతృక' ప్రగతిశీల మహిళల కరదీపిక మన మాతృక" అని ముఖపత్రం మీద ట్యాగ్‌లైన్ ఉంటుంది. కె.రమ మాతృక సంపాదకురాలుగా ఉండేవారు. సంపాదక వర్గంలో రమ, టాన్యా, వి.సంధ్య, జి.ఝాన్సీ, విమల ఉన్నారు.

"సమాజంలో సగభాగంగా ఉన్న మహిళలకు సమాన హక్కులు ఆచరణలో గ్యారంటీ లేని ఏ వ్యవస్థ కూడా మహిళా ప్రయోజనాలకు వ్యతిరేకమైనదే. అలాంటి వ్యవస్థ కోసం ముస్లిం,క్రైస్తవ, హిందూ మహిళలందరూ ముందడుగు వేయాల్సిన అవసరం ఉంది'' అని ఒక సంపాదకీయంలో రాశారు. మహిళల హక్కుల కోసం పోరాడే ఉద్యమాలను ఈ పత్రిక సమర్థిస్తుంది. మద్దతు ఇస్తుంది. మహిళలపై జరిగే దౌర్జన్యాలను, అత్యాచారాలను గురించి తెలియజేస్తుంది.

1993 ఏప్రిల్ నుండి 1998 ఆగస్టు వరకు నడిచిన పత్రిక 'ఆహ్వానం' ఇది స్త్రీల పత్రిక కానప్పటికీ స్త్రీల ఆధ్వర్యంలో నడిచిన పత్రిక సమయం సామ్రాజ్యలక్ష్మి (ఎస్.ఎస్.లక్ష్మి) వ్యవస్థాపక సభ్యులుగా, సంపాదకురాలుగా ఈ పత్రిక నడిచింది. సకుటుంబ మాసపత్రిక అనే ట్యాగ్‌లైన్ 'ఆహ్వానం' కింద ఉంటుంది. సాహిత్యం, సంగీతం, సైన్స్, నృత్యం గురించిన కాలమ్స్ ఉండేవి. ఆయా రంగాలలో ప్రముఖులతో పరిచయాలు, ఉన్నత ప్రమాణాలతో ఉండే కథలు, కవితలు దీనిలో ప్రచురించేవారు. వి.సత్యవతి, ఓల్గా లాంటి స్త్రీవాద రచయిత్రులు, అల్లం రాజయ్య, గంటేడు గౌరు నాయుడు, తమ్మేటి రఘోత్తమరెడ్డి లాంటి ప్రఖ్యాత కథకుల కథలు, ఆహ్వానంలో ఉండేవి. "ఇప్పుడు ప్రముఖులైన, మంచిపేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న రచయిత/రచయిత్రులందరూ ఒకప్పుడు ఆహ్వానంలో కథ రాసినవారే" అంటారు ఎస్.ఎస్.లక్ష్మి. ఉన్నత ప్రమాణాలతో నడిచిన 'ఆహ్వానం' పత్రిక ఆర్థిక ఇబ్బందులతో 1998లో ఆగిపోయింది.

స్త్రీల సమస్యల మీద, సామాజికాంశాల మీద పదునైన సంపాదకీయాలతో కాత్యాయని నడిపిన 'చూపు' పత్రిక గురించి తప్పక తెలుసుకోవాలి. ఈ పత్రిక ఎప్పుడు మొదలైంది ఎప్పుడు ఆగిపోయింది లాంటి వివరాలు తెలియలేదు. కాత్యాయనిని అడిగినప్పటికీ తన పనుల హడావిడిలో తను, ఇరవై తారీఖు నేను ఈ వ్యాసాన్ని 'చైతన్య మానవి' వారికి ఇవ్వాల్సి ఉండడం చేత 'చూపు' వివరాలు సేకరించ లేకపోయాను. కానీ 'చూపు' లాంటి సీరియస్ పత్రికల అవసరం ఇప్పుడెంతో ఉంది.

హక్కుల న్యాయవాది, సామాజిక కార్యకర్త ఎం.ఏ వనజ నడిపిన విలక్షణ పత్రిక 'తర్జని' గురించి తప్పక ప్రస్తావించుకోవాలి. అంతకుముందు 'దిశ న్యూస్ లెటర్'ని తెచ్చిన వనజ 2006 ఏప్రిల్ నుండి 'తర్జని' పత్రికను ప్రారంభించింది. వివిద సామాజిక అంశాల మీద లోతైన విశ్లేషణలతో, చట్టాల గురించి, చట్టాలెందుకు అమలవ్వడం లేదు? ఎలా అమలు చేయించుకోవాలి? లాంటి అంశాల మీద పాఠకుల్ని చైతన్యపరిచే వ్యాసాలతో తర్జని నడిచింది. రెండేళ్ళ క్రితం మరణించిన వనజ లేని లోటు, 'తర్జని' పత్రికలేని లోటు ఈరోజు స్పష్టంగా తెలుస్తోంది. బాలల, మహిళల, వికలాంగుల, అణగారిన వర్గాల వారి హక్కుల కోసం పోరాడుతూ, వారిని చైతన్యపరిచేలా నడిచిన 'తర్జని' లాంటి పత్రికల అవసరం ఈరోజు చాలా ఉంది.

1993 జనవరిలో ప్రారంభమైన మరో స్త్రీల పత్రిక 'భూమిక' 1989లో వెలువడిన 'లోహిత' తర్వాత తెలుగులో సమగ్రమైన స్త్రీవాద పత్రికగా ప్రారంభమైన పత్రిక భూమిక'. మొదట్లో త్రైమాస పత్రికగా ప్రారంభమై, ద్వైమాస పత్రికగా కొంతకాలం కొనసాగి 1999 నుండి మాసపత్రికగా నిలదొక్కుకున్నది. అన్వేషి రీసెర్చ్ సెంటర్ ఆఫ్ ఉమెన్ సహకారంతో మొదలైనప్పటికీ భూమిక కొండవీటి సత్యవతి యాజమాన్యంలో, ఆమె సంపాదకత్వంలోనే నడుస్తోంది. గత 20 సంవత్సరాలుగా అవిచ్ఛిన్నంగా నడుస్తున్నది "భూమిక"

స్త్రీ విషయాలను, స్త్రీ సమస్య'ను పునరాలోచించి ఒక అంచనా వెయ్యటానికి కావాల్సిన అంశాలను పొందుపరిచే ముఖ్యోద్దేశ్యంతో తెలుగులో స్త్రీల పత్రిక 'భూమిక' తీసుకురావాలనుకున్నాం' అంటూ భూమిక ఉద్దేశ్యాలను పేర్కొన్నారు. ముఖ్యంగా స్త్రీ వాద దృక్పథం నుండి సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను విశ్లేషణాత్మకంగా పరిశీలించడం, ఏమాత్రం గుర్తింపు పొందని, అంచులకు నెట్టివేయబడిన 'స్త్రీల చరిత్ర, కళలు, సాహిత్యాలను వివిధ భాషల నుండి సేకరించి ప్రచురించడం......" మొదలైన పంధొమ్మిది ఉద్దేశ్యాలతో భూమిక వెలువడుతోంది. ప్రారంభంలో కార్యనిర్వాహక వర్గంలో జి.భారతి, కె.సజయ, వి.వసుధ, టిఎస్ఎస్ లక్ష్మి, ఎ.ఉమామహేశ్వరి, డి.మనోరమ, సి.ఉషారాణి, సభ్యులు, అడ్వయిజరీలో వసంత కన్నభిరాన్, కె.లలిత, శాంతా రామేశ్వరరావు, రమా మేల్కొటే, సూసీతారు, వీణాశతృఘ్న సభ్యులు. తరువాత కాలంలో పాతవారు వెళ్ళిపోయి సభ్యులు చేరినా అడ్వయిజరీలో మాత్రం ఎవ్వరూ వెళ్ళిపోలేదు. మరికొంతమంది చేరారు.

'భూమిక' స్త్రీ వాద పత్రికే అయినప్పటికీ అనేక సామాజిక అంశాల మీద ప్రత్యేక సంచిక లెన్నో వెలువడ్డాయి. దశాబ్ది ప్రత్యేక సంచిక, 2012 మార్చిలో ద్విదశాబ్ది ప్రత్యేక సంచిక వెలువడ్డాయి. ఆర్థిక ఇబ్బందులతో సతమతమవుతున్నప్పటికీ భూమిక నిరంతరాయంగా, ప్రతి సంచికలోను ఆసక్తిదాయకమైన, ఆలోచనాత్మకమైన వ్యాసాలు, కథలు, ఇతర రచనలతోను కొనసాగుతున్నది.

వామపక్షభావాలతో వెలువడుతున్న మరో పత్రిక 'మహిళా మార్గం'. మొదట్లో ఈ పత్రిక ఎం. విష్ణుప్రియ సంపాదకత్వంలో తిరుపతి నుండి వెలువడేది. ఆ తర్వాత పి.పవన సంపాదకత్వంలో హైద్రాబాదు నుండి రావడం జరిగింది. పవనతోపాటు సంపాదక వర్గంలో ఎం. విష్ణుప్రియ, బి.అనూరాధ, జి.రేణుక ఉన్నారు. "మన సమాజం స్త్రీలను ఒక రకంగాను, పురుషులను మరో రకంగాను

**2006 ఏప్రిల్ నుండి 'తర్జని' పత్రికను ప్రారంభించింది. వివిద సామాజిక అంశాల మీద లోతైన విశ్లేషణలతో, చట్టాల గురించి, చట్టాలెందుకు అమలవ్వడం లేదు? ఎలా అమలు చేయించుకోవాలి? లాంటి అంశాల మీద పాఠకుల్ని చైతన్యపరిచే వ్యాసాలతో తర్జని నడిచింది. రెండేళ్ళ క్రితం మరణించిన వనజ లేని లోటు, 'తర్జని' పత్రికలేని లోటు ఈరోజు స్పష్టంగా తెలుస్తోంది.**

నిర్ణయించింది. స్త్రీని పురుషుడికి బానిసగా మార్చే క్రమంలోనే ఈ నిర్వచనాలు వచ్చాయి. "అటు సమాజంలో స్త్రీల పట్ల అమలయ్యే వివక్ష గురించి మహిళా మార్గం రాసిన అంశాలు ఈ పత్రిక విధానాలను పట్టిస్తున్నాయి. పనిచేయని ప్రభుత్వ సంస్థల్ని విమర్శించటంలో మహిళా మార్గం ముందుంటుంది. ప్రస్తుతం మహిళా మార్గం క్రమబద్ధంగా రావడంలేదు.

వామపక్ష భావాలతో, స్త్రీల ఆధ్వర్యంలోను మొదలైన మరో పత్రిక 'చైతన్య మానవి' 'ఐద్వా'. (ఆలిండియా డెమొక్రటిక్ ఉమెన్స్ అసోసియేషన్) ఈ పత్రికను ప్రచురిస్తోంది. ఎస్. పుణ్యవతి 'చైతన్య మానవి' సంపాదకురాలు. మల్లు స్వరాజ్యం, అల్లూరి మన్మోహిని, టి. జ్యోతి, కె. స్వరూపరాణి సంపాదక వర్గంలో ఉన్నారు. 'మానవిగా' మొదలైన ఈ పత్రిక ప్రస్తుతం 'చైతన్య మానవి' పేరుతో నడుస్తోంది. "మహిళా ఉద్యమ కరదీపిక" ట్యాగ్‌లైన్ ఉంటుంది. కథలు, కవితలు, వ్యాసాలు, ఉద్యమ వార్తలు దీనిలో ప్రచురితమవుతాయి. 'ఐద్వా' చేపట్టే అన్ని రకాల పోరాట వార్తలు ఇందులో చోటు చేసుకుంటాయి. పది సంవత్సరాలుగా 'మానవి' నిరంతరాయంగా వస్తూనే ఉంది.

గత కొన్ని సంవత్సరాలుగా చిత్తూరు జిల్లా నుండి ఒక అపూర్వమైన స్త్రీల పత్రిక వెలువడుతోంది. ఇది 'వెలుగు' ప్రోగ్రామ్ కింద మొదలైంది. దీని పేరు "నవోదయం" "గ్రామీణ పేద మహిళలే రాసుకుంటున్న పత్రిక" అని కవర్ పేజీ మీద రాసి ఉంటుంది. గ్రామీణ స్త్రీలే ఎడిటర్లు, రిపోర్టర్లుగా ఉన్నారు. వారి వారి గ్రామాల్లోని సమస్యల గురించి, తాము సాధించిన విజయాల గురించి, సారా సమస్య గురించి ఇందులో రాస్తుంటారు. తమ ప్రాంతాల్లోని ఉద్యోగుల అవినీతి గురించి, గ్రామాల్లోని ఆరోగ్య సమస్యల గురించి నవోదయంలో రచనలు ప్రచురిస్తారు. బహుశా గ్రామీణ స్త్రీల ఆధ్వర్యంలో మహిళల కోసం మహిళల చేత నడపబడుతున్న విలక్షణ పత్రిక నవోదయంగా గుర్తించాల్సి ఉంటుంది. జాతీయ స్థాయిలో జరిగే మహిళా జర్నలిస్టుల కాన్ఫరెన్స్‌లన్నింటికీ ఈ గ్రామీణ మహిళలు హాజరవుతూ తమ అనుభవాలను పంచుకుంటుంటారు.

"నవోదయం" "గ్రామీణ పేద మహిళలే రాసుకుంటున్న పత్రిక" అని కవర్ పేజీ మీద రాసి ఉంటుంది. గ్రామీణ స్త్రీలే ఎడిటర్లు, రిపోర్టర్లుగా ఉన్నారు. వారి వారి గ్రామాల్లోని సమస్యల గురించి, తాము సాధించిన విజయాల గురించి, సారా సమస్య గురించి ఇందులో రాస్తుంటారు. తమ ప్రాంతాల్లోని ఉద్యోగుల అవినీతి గురించి, గ్రామాల్లోని ఆరోగ్య సమస్యల గురించి నవోదయంలో రచనలు ప్రచురిస్తారు. బహుశా గ్రామీణ స్త్రీల ఆధ్వర్యంలో మహిళల కోసం మహిళల చేత నడపబడుతున్న విలక్షణ పత్రిక నవోదయంగా గుర్తించాల్సి ఉంటుంది.

ప్రముఖ సంఘ సేవకురాలు మల్లాది సుబ్బమ్మగారి ఆధ్వర్యంలో 'స్త్రీ స్వేచ్ఛ' పేరుతో ఒక పత్రిక చాలాకాలం నడిచింది. స్త్రీల అంశాల మీద కథలు, వ్యాసాలు ప్రచురించేవారు. తను చేసే వివిధ కార్యక్రమాలకు ఈ పత్రిక వేదికగా చేసుకునేవారు సుబ్బమ్మగారు. ఈ పత్రిక ఆగిపోయి చాలా కాలమైంది. వాసిరెడ్డి కాశీరత్నంగారు ఒక మహిళా పత్రికను నడుపుతున్నారు. చిన్న వయస్సులో అకాల మరణం పాలయిన వేముగంటి సుజాతారావ్ మహిళల కోసం ఒక పత్రిక నడిపింది. ( ఈ రెండు పత్రికల వివరాలు తెలియరాలేదు)

తెలుగు పత్రిక కానప్పటికీ ఒక మహిళ ఆధ్వర్యంలో రెండు దశాబ్దాల పాటు విజయవంతంగా నడిచి, ఆర్థిక ఇబ్బందుల వల్ల ఆగిపోయిన "మానుషి" పత్రిక గురించి తప్పక కుండా చెప్పుకోవాలి. 'మానుషి'ని ప్రారంభించి, నిర్వహించి, సంపాదకురాలుగా కొనసాగినవారు మధుకిష్వర్. గొప్ప నిబద్ధతతో స్త్రీల కోసం నడిపిన పత్రిక ఇది. స్త్రీల దృష్టికోణం నుండి, స్త్రీల వాస్తవ సమస్యలను ప్రచురించే పత్రిక 'మానుషి'. స్త్రీలను వేధించే ఎన్నో సమస్యల గురించి, సమాజంలో స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలను గురించి, చట్టబద్ధంగా వారికి సంక్రమించాల్సిన హక్కుల గురించి, పోరాడటంలో మానుషి ముందుండేది. అలాగే ఢిల్లీ నుండి వెలువడి ఆగిపోయిన పత్రిక "లాయర్స్ కలెక్టివ్". ప్రముఖ న్యాయవాది ఇందిరాజైసింగ్ ఆధ్వర్యంలో నడిచిన ఈ పత్రికలో స్త్రీలకు సంబంధించిన న్యాయపరమైన హక్కులు, చట్టాల గురించి వ్యాసాలుండేవి. ముఖ్యమైన కేసులు, తీర్పులు, స్త్రీలకు అవసరమైన న్యాయ అంశాలు కూడా ఈ పత్రికలో ఉండేవి. ఇది కూడా ఆగిపోయి చాలా కాలమే అయ్యింది.

తెలుగులో స్త్రీల ఆధ్వర్యంలో స్త్రీల కోసం పత్రిక ప్రారంభమై వందేళ్ళు పైనే దాటినప్పటికీ ఇప్పటికి కూడా పట్టుమని పది పత్రికలు కూడా స్త్రీల కోసం నడవడంలేదు. ప్రస్తుతం నడుస్తున్నవి కూడా ఆర్థిక ఇబ్బందుల్లో కొట్టుమిట్టాడుతున్నాయి. సమాజంలోని అన్ని రంగాల్లోను వివక్షకు గురవుతూ నవాలక్ష సమస్యలతో సతమతమవుతున్న మహిళలు తమంత తాముగా పెద్ద పెద్ద పత్రికల్ని నెలకొల్పి, నిర్వహించడం ఈ అత్యాధునిక కాలంలోను అసాధ్యంగానే ఉంది. ఆస్తిహక్కు సంపాదించుకున్నప్పటికి అమలుకు నోచుకోనిచోట, కుటుంబ వనరుల్లో గానీ, సమాజ వనరుల్లో గానీ తమకంటూ ఖచ్చితమైన వాటాలేని స్త్రీలు స్వతంత్రంగా ఏపని చేయాలన్నా ఎన్నో అడ్డంకుల్ని ఎదుర్కోవలసి వస్తుంది. పత్రికలు నడపడం కత్తిమీద సాములాంటి వ్యవహారం. ఒక ఆశయానికి కట్టుబడి నిబద్ధతతో నడిపే పత్రికలు వ్యాపార ధోరణికి వ్యతిరేకంగా ఉండడంతో వనరుల సమస్యను పెద్ద ఎత్తున ఎదుర్కోవాల్సి ఉంటుంది. అడ్డదిడ్డమైనవి, స్త్రీలను కించపరిచే వ్యాపార ప్రకటనలకు దూరంగా ఉండటం, ప్రభుత్వ ప్రకటనలు అందకపోవడం కూడా పెద్ద సమస్యే. లాభాపేక్ష లేకపోవడం, స్త్రీల అంశాలే ఊపిరిగా ఉండటం వల్ల కూడా ఈనాడు స్త్రీలు నడుపుతున్న పత్రికలు కొనఊపిరితో కొనసాగడానికి కారణం. 'మానుషి' లాంటి విశిష్టమైన పత్రికలు ప్రకటనలను తీసుకోకపోవడం, దానిని ఒక పాలసీ కింద అమలు చేయడం వల్ల ఆర్థికంగా

కుంగిపోయి పత్రిక ఆగిపోయే స్థితి వచ్చింది. ఈ బాటనే స్త్రీల పత్రికలు నడుపుతున్న వారందరూ నడవడం వల్లను, తమ పత్రికల్ని వ్యాపారాత్మకం, లాభాత్మకం చేసుకోలేక, చేసుకోవడం ఇష్టంలేక మూసేసుకోవడానికైనా ఇష్టపడుతున్నారు కానీ ఈనాటి ప్రధాన స్రవంతి ప్రతికారంగం అనుసరిస్తున్న విధానాలను అనుసరించలేకపోతున్నారు.

నిజానికి ఈనాటి పత్రికా రంగం స్వరూపమే పూర్తిగా మారిపోయింది. వ్యాపార దృష్టి విపరీతంగా పెరిగింది. పత్రికా నిర్వహణ కోట్ల రూపాయల్లోకి మారిపోయింది. ధన సంపాదనకు ఏమాత్రం ఉపకరించని భాష, సాహిత్య, స్త్రీల, అణగారిన ప్రజల అంశాలు క్రమంగా దూరమై రాజకీయాలు, సినిమా వార్తలు, క్రికెట్‌లాంటి క్రీడా వార్తలు, వాణిజ్య ప్రకటనలతోను నిండిపోయాయి. స్వాతంత్ర్యోద్యమం నాటి ఉన్నత విలువలు, మిలిటెన్సీ ఈనాటి పత్రికల్లో లేకపోవడానికి కారణం కూడా వ్యాపారదృష్టే. సామాజిక వనరుల్ని కొల్లగొట్టి రాజకీయ పార్టీలు పెట్టిన రాజకీయ నాయకులు కోట్లాది అక్రమ సొమ్ముల్ని పెట్టుబడిగా పెట్టి పత్రికలు పెట్టి తమ తమ బాకాలను ఊదుకోవడం ఈనాటి వాస్తవం. తమ వ్యాపారాలను పెంపొందించుకోవడానికి పత్రికల్ని నడపడం కూడా మనం చూస్తున్నాం.

పై నేపథ్యంలోంచి చూసినప్పుడు మహిళలు పత్రికలు నిర్వహించడం ఎంత కష్టసాధ్యమైన అంశమో అర్థం చేసుకోవచ్చు. నిజానికి ఈరోజు వందల్లో, వేలల్లో స్త్రీల కోసం పత్రికలు నడవాల్సిన అవసరం ఉంది. ప్రపంచీకరణ విసిరిన పెను సవాళ్ళ మధ్య, పెచ్చురిల్లిపోతున్న హింస, ఇంటా బయటా స్త్రీల జీవితాలను అతలాకుతలం చేస్తున్నవేళ వేనవేల పత్రికలు స్త్రీల గొంతును వినిపించాల్సి ఉంది. దేశవ్యాప్తంగా ఎన్నో స్త్రీల పత్రికలు నడుస్తూ, స్త్రీలకు అండగా ఉండాల్సిన అవసరం ఉంది. మెయిన్ స్ట్రీమ్‌కి ధీటుగా సమాంతర ప్రత్యామ్నాయ పత్రికలు నడవాలి. వీటిని నడపడం చాలా సమస్యలతో కూడుకున్నదే అయినప్పటికీ స్త్రీల పత్రికలు, సమాంతర పత్రికలు లేకపోతే, అవి ఆగిపోతే పేద ప్రజల, దళితుల, ఆదివాసీల, అణగారిన ప్రజల గొంతుకూడా వినబడదు. ముఖ్యంగా స్త్రీల గొంతు శాశ్వతంగా వినబడకుండా పోతుంది. ప్రధాన స్రవంతి పత్రికలకు ఈ అంశాలు "లాభదాయకమైనవి" కావు. పేద ప్రజల, మహిళలు ఆశలు, ఆకాంక్షలు, సమస్యలు మెయిన్ స్ట్రీమ్ మీడియాకు పట్టవు. లాభాలే వారి మంత్రం. వాటి కోసం స్త్రీల శరీరాలను కూడా వాణిజ్య ప్రకటనల' రూపంలో సొమ్ము చేసుకునే దిగజారుడుస్థితి కొనసాగుతున్న చోట, వారు నడిపే స్త్రీ పేజీలు కూడా వ్యాపారాత్మకంగానే ఉంటున్నాయి.

ఇంతటి వ్యతిరేక వాతావరణంలో కూడా స్త్రీల కోసం లాభాపేక్ష లేకుండా నిబద్ధతతో కొన్ని పత్రికలు నడుస్తుండడం సంతోషించాల్సిన అంశం. స్త్రీల సమస్యలు విపరీతంగా పెరిగిపోతున్న ఈనాటి తరుణంలో మరిన్ని పత్రికలు రావాల్సిన అవసరం ఉంది. ప్రస్తుతం నడుస్తున్న స్త్రీల పత్రికలు కొనసాగాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

పదేళ్ళు పూర్తి చేసుకుంటున్న 'చైతన్యమానవి' ఐద్వా లాంటి జాతీయస్థాయి సంస్థ ఆధ్వర్యంలో నడవడం అభినందనీయం. 'చైతన్య మానవి' మరింత సమగ్రంగా, సుస్థిరంగా మనగలగాలని కోరుకుంటున్నాను.

## ఆ.....చిరునవ్వు-ఓ ఆయుధం

ముక్కు పచ్చలారని
చిన్నారి మెడను పసుపుతాడు-అది
విదేశీ ముష్కరుల నుండీ
రక్షణనే వేశామన్నా
వ్యక్తురాలైన తరువాత
ఆ పసుపుతాడు పలుపుతాడైంది
భర్త ఆమెకు నచ్చకపోయినా
భర్తకు ఆమె నచ్చకపోయినా
అవ్యక్తురాలై, అశక్తురాలై రగిలింది

అగ్నికి ఆజ్యంలా
బాల్య వివాహాలకు తోడు
దక్షిణాదిని కన్యాశుల్కం
ఉత్తరాదిన సతీసహగమనం
పచ్చని మగువ జీవితం
మోడు చేసే ఆచారం
స్త్రీ శక్తిని నిర్వీర్యం చేసిన దురాగతం
మహానుభావుల కృషి
మహనీయుల సంకల్పం
దురాచారాలు రూపుమాశాయి

స్త్రీ విద్య-
చాకలి పద్దు స్థాయినుండీ
అంతరిక్షయానం దాకా ఎగసింది
ఆలోచనలతో గెలిచి
ఆర్థిక స్వాతంత్ర్యం సాధించి
అయినా సమాజం రెండవ స్థానాన్నే కేటాయించింది
అందుకే
పురుషునితో పోటీపడింది
ఇంటా బయటా వేధింపులు, వేదనలు
వరకట్నాలు, గృహహింసల
అగ్ని పరీక్షలకు ఎదురునిలిచింది
పురుషునిలా...
పురుషునికంటే ధీటుగా నిలవాలనే
తపనలో...
నిరంతరం శ్రామిక శక్తిగా ఎదిగే క్రమంలో
ఆమె
సంసార బంధంలో భర్తకు చేదోడు-వాదోడు స్థాయినుండీ
అష్ట భుజాలతో సంసార రథం లాగే స్థాయికి చేరింది.
ఫలితంగా జీవన సమరంలో
ఆమెది ఒంటరిపోరు
బాధ్యత మరచిన భాగస్వామిపై
అది-అలుపెరుగని పోరు

'క్రిందపడ్డా పై చెయ్యి నాదే' అనుకునే
పురుష స్వామ్యంపై
తిరుగుబాటు వేటు
ఆమె చెదరని ఆత్మవిశ్వాసానికి ధీటు
చైతన్యానికి ప్రతీక
చిరునవ్వుల ఆయుధంలో సంచరించే
ఆమె...ఓ చైతన్య మానవి
అందరిలో చైతన్యానికి ప్రతీక.

- దుర్గా ప్రసన్న

## సమర శీల...చైతన్య జ్వాల....

# కెప్టెన్ లక్ష్మి సెహగల్

- కె.అంజన

ఓ సమర శీల..

చైతన్య ధార....

ప్రజా వైద్య రత్న...

నిత్య స్ఫూర్తి ప్రదాత...

అన్నిటినీ మించి

గొప్ప మానవి...

**తొ**లుత స్టెతస్కోప్ పట్టినా.... తర్వాత తుపాకీ చేపట్టి కదం తొక్కినా.... యాభైయేళ్ళ వయసులో ఎర్రజెండా చేబూనినా అన్నీ ప్రజల కోసమే! దేశం కోసమే.

పేద ప్రజలకు మరీ ముఖ్యంగా నిరుపేద మహిళలకు వైద్య సేవలందించాలన్న లక్ష్యంతో వైద్య విద్యనభ్యసించారు. భారతమాతను విదేశీ దాస్య శృంఖలాలనుంచి విముక్తి చేయాలన్న లక్ష్యంతో కదన రంగంలోకి ఉరికి రాణి ఝాన్సీ రెజిమెంట్‌కి కెప్టెన్‌గా కదం తొక్కి పోరాడారు. స్వాతంత్ర్యానంతరం అశేష పీడిత ప్రజలకు అంకితమవడానికే అరుణ పతాకం చేబూనారు. అన్ని దశల్లోనూ వైద్య సేవ ఆపకుండా...తన తుది ఘడియల వరకు పేదలకు ఉచిత వైద్యం అందించారు

* * *



20,21శతాబ్దంలో పరాధీన భారతంలో వలస పాలనను, అనంతరం స్వాతంత్ర భారతదేశాన్ని చూశారు. స్వాతంత్రానంతరం దేశ నిర్మాణంలోనూ పాల్గొన్నారు. దేశంలో ఒక చారిత్రాత్మక పరివర్తనా సమయంలో తొలి నుండి తుది వరకు స్థిరంగా పేద ప్రజల పక్షానే నిలిచిన గొప్పవ్యక్తి సెహగల్. సెహగల్ ఎక్కడ పనిచేసినా తోటివారితో, కార్యకర్తలతో, రోగులతో, మిత్రులతో, కుటుబ సభ్యులతో,ప్రేమగా, ఆత్మీయంగా ఉండేవారు.

**20,21శతాబ్దంలో పరాధీన భారతంలో వలస పాలనను, అనంతరం స్వాతంత్ర భారతదేశాన్ని చూశారు. స్వాతంత్రానంతరం దేశ నిర్మాణంలోనూ పాల్గొన్నారు. దేశంలో ఒక చారిత్రాత్మక పరివర్తనా సమయంలో తొలి నుండి తుది వరకు స్థిరంగా పేద ప్రజల పక్షానే నిలిచిన గొప్పవ్యక్తి సెహగల్. సెహగల్ ఎక్కడ పనిచేసినా తోటివారితో, కార్యకర్తలతో, రోగులతో, మిత్రులతో, కుటుబ సభ్యులతో,ప్రేమగా, ఆత్మీయంగా ఉండేవారు.**

* * *

లక్ష్మీ సెహగల్ అసలు పేరు లక్ష్మీ స్వామినాధన్, గోవింద్, ఎస్‌కె. స్వామినాధన్, మృణాళిని ఆమె తోబుట్టువులు, లక్ష్మి చెన్నైలో 1914లో జన్మించారు. తండ్రి డా॥ స్వామినాధన్. ప్రముఖ న్యాయవాది. మేధావి. తల్లి అమ్ముకుట్టి. సామాజిక కార్యకర్త. స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగ సభ సభ్యురాలిగా చేశారు. ఇద్దరూ స్వతంత్ర పోరాటయోధులే. పైగా వారిది కులాంతర వివాహం. ఇక్కడ స్వామినాధన్ గురించి మరికొంత వివరంగా చెప్పుకోవాలి. ఆయన కేరళలోని సాధారణ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. కుటుంబ భారం మీద పడడంతో తన చదువు పూర్తి చేయలేకపోయారు. తనకంటే పై క్లాసు విద్యార్థులకు చదువు చెపుతూ ఆ రాబడితో తోబుట్టువులను చదివించారు. అప్పుడు మున్సిఫ్ మేజిస్ట్రేట్‌గా ఉన్న పిలావిలా గోవిందమీనన్ సాయంతో బి.ఎ పూర్తి చేసి లా చేశారు. ప్రతి తరగతిలోనూ ప్రథమ స్థానంలో ఉండే ఆయన తెలివితేటలకు గుర్తింపుగా 'గిల్‌క్రిస్ట్' విద్యార్థి వేతనం లభించింది. ఆయన ఎడిన్‌బరో వెళ్ళి రిసెర్చ్ చేయాల్సి వచ్చింది. ఆయనకు ఆయన బంధుగణమంతా వ్యతిరేకించింది. సముద్రం దాటితే కులం, జాతి పోయినట్టే అని భావించేవారు. అవేవీ లెక్కపెట్టకుండా ఎడిన్‌బరో వెళ్ళి బారిస్టరు పూర్తిచేశారు. అక్కడినుంచే అమెరికా వెళ్ళి మూడేళ్ళ పరిశోధనను మూడు మాసాల్లో పూర్తిచేసి తిరిగి భారత్ చేరుకున్నారు. విదేశాల్లో హేతువాద చైతన్యం పెంచుకున్నాడు. ఫలితం? ఆయన ఇంట్లో వంటవాడితోసహా పనిచేసేవారంతా అంటరానివారే. కుటుంబంలో తన ముందున్న అందరి బాధ్యతలు పూర్తిచేసుకున్నాక వివాహం

చేసుకోవాలనుకున్నారు. గోవింద్‌మీనన్ కుమార్తె అమ్ముకుట్టిని పెళ్ళాడారు. వివాహానంతరం టీచర్‌ని నియమించి ఆమెకు ఇంగ్లీషు రాయడం, చదవడం నేర్పించారు. స్వతహాగా తెలివిగలదైన అమ్ముకుట్టి త్వరగానే అవన్నీ నేర్చుకుంది. సామాజిక కార్యక్రమాల్లో క్రియాశీలకంగా పాల్గొంది. ఈ కుటుంబ వాతావరణమే చిన్నారి లక్ష్మిని ప్రభావితం చేసింది. ఇంటా బయటా నిత్యం సాగే రాజకీయ కార్యక్రమాలు ఆమెకు స్ఫూర్తినిచ్చాయి. బాల్యంలోనే ఎంతో ఉత్సాహంగా జాతీయ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. విదేశీ వస్తువులు, మద్యాన్ని దహనం చేశారు. హైస్కూల్ విద్య పూర్తయ్యాక సత్యాగ్రహ సభల్లో, ఊరేగింపుల్లో పాల్గొనేది. అయితే పోలీసులు లాఠీచార్జ్ చేస్తుంటే అహింసా మార్గంలో చేతులు ముడుచుకు కూర్చోవాలన్న గాంధీ మాట లక్ష్మికి ఎంతమాత్రం నచ్చేదికాదు. పైగా చదువులు మానేసి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనాలనే గాంధీజీ పిలుపు కూడా ఆమెకు నచ్చలేదు. రాజకీయాల్లో పాల్గొంటున్నా విద్యార్థుల మొదటి కర్తవ్యం చదువేనని, విద్యలో నిష్ణాతులైతేనే దేశానికి పురోగతి అని భావించేది. కమ్యూనిస్టులకు సంబంధించిన మీరట్ కుట్ర కేసు విషయంలో గాంధీజీ వ్యవహరించిన తీరుతో లక్ష్మికి ఆయన పట్ల ఉన్న భ్రమలన్నీ పటాపంచలయ్యాయి. పేదలకు, ముఖ్యంగా మహిళలకు సేవ చేయాలన్న ఆలోచనతో వైద్యవిద్య అభ్యసించాలని నిర్ణయించుకున్నారు. 1938లో మద్రాస్ మెడికల్ కాలేజీ నుంచి ఎంబిబిఎస్ పట్టా పుచ్చుకున్నారు. ఆ మరుసటి సంవత్సరం ప్రసూతి వైద్యంలో డిప్లొమా పొందారు.

**బోస్ అంత గొప్ప వ్యక్తిని అప్పటి వరకు దూరం నుంచి చూడటం, మాట వినడం తప్ప మాట్లాడటం ఊహకే అందని విషయం. అలాంటిది స్వయంగా కలిసి స్త్రీ శక్తిపై తనకు గల నమ్మకాన్ని, స్త్రీలు పురుషులతో సమానంగా ఏదైనా సాధించగలరని, స్వాతంత్ర్య పోరాటంలో చురుకుగా పాల్గొనాలని చెప్పినప్పుడు లక్ష్మికి కలిగిన ఆనందం అంతా ఇంతాకాదు. దాని వల్ల పురుషాధిక్యత, అణచివేత, పరాధీనతల నుంచి బయటపడొచ్చని, సమాన హక్కులు కోరవచ్చని లక్ష్మి భావించారు. మహిళా రెజిమెంట్‌కు నాయకత్వం వహించమని బోస్ తనను అడిగిన వెంటనే ఎటువంటి తటపటాయింపులు లేకుండా అంగీకరించారు.**

### మలుపుతిప్పిన మనుష్యులు.... మాటలు...

సరోజినీ నాయుడు, అమ్ముకుట్టి స్వామినాథన్ కుటుంబాల మధ్య మంచి సంబంధాలుండేవి. మీరట్ కుట్రకేసులో సరోజినీ నాయుడు చెల్లెలు సుహాసిని కూడా ఉంది. ఆమెమీద అరెస్టు వారెంట్ లేకపోయినా నిఘా ఉండేది. దాంతో సుహాసిని కొద్ది రోజులు లక్ష్మి వాళ్ళ ఇంట్లోనే ఉంది. అప్పుడే ఇరువురికి పరిచయమైంది. జర్మనీ కమ్యూనిస్టు పార్టీ గురించి, తను అందులో ఎలా చేరిందీ, హిట్లర్ అధికారంలోకి వచ్చాక తన వ్యతిరేకులను ఎలా ఏరివేసింది, ముఖ్యంగా కమ్యూనిస్టులను ఎలా వేటాడింది ఆమె చెప్తుండేది. ముఖ్యంగా రష్యా చారిత్రాక విప్లవం గురించి కూడా సుహాసిని ఉత్తేజకరంగా వివరించేది. సుహాసిని చెప్పిన కోణం నుంచి పీడితుల్ని, పీడకుల్ని రెండు వర్గాలుగా చూడగలిగింది లక్ష్మి. ఎందుకంటే మొదటి నుండి ఆమె కష్టపడి పనిచేసినా ఫలితం లభించని శ్రామికుల్ని తలచుకున్నప్పుడల్లా ఎంతో బాధపడేది. బానిస విదేశీ పాలన పోయి దేశం స్వతంత్రం పొందితే ఈ సమస్యలన్నీ వాటంతటవే బాగుపడతాయనుకునేది. అయితే నెహ్రూ చెప్పే సామ్యవాదంలో కుళ్ళు సమాజాన్ని కూల్చే విప్లవ ప్రస్తావన ఉండేదికాదు. అసమానతలు లేని రాజ్యం కావాలని కోరుకోలేదని ఆమెకు అర్థమైంది. అందుకే ఇవన్నీ గమనిస్తూనే రష్యా విప్లవం గురించి, సామ్యవాదం గురించి అందిన పుస్తకాలన్నీ చదువుతుండేది. ఎడ్గార్ స్నో రచించిన 'చైనాపై అరుణతార' ఆమెను ఎంతగానో ప్రభావితం చేసింది. వ్యక్తులుగా ఆమెను అమితంగా ప్రభావితం చేసిన వారిలో సుభాష్ చంద్రబోస్ ఒకరు.

1940లో చెన్నై నుంచి సింగపూర్ వెళ్ళి పేదలకు వైద్యం చేశారు. అక్కడే బ్రిటిష్ వ్యతిరేక పోరాటం పట్ల ఆకర్షితులయ్యారు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్‌లో క్రియాశీలక పాత్ర పోషించారు. 1943లో సింగపూర్ వచ్చిన బోస్ ఒక సభలో మాట్లాడుతూ మహిళలు ఆజాద్‌హింద్ ఫౌజ్‌లో చేరి పాల్గొనకపోతే పోరాటం అసంపూర్ణంగానే ఉంటుందని చెప్పడం అక్కడ సభికులనే కాదు! లక్ష్మిలోనూ ఆలోచనలు రేకెత్తించింది. వీరనారి రాణి ఝాన్సీభాయి పేరిట మహిళా బ్రిగేడ్ ఏర్పాటు గురించి బోస్ ఆలోచించారు. అదే విషయమై లక్ష్మితో మాట్లాడారు. బోస్ అంత గొప్ప వ్యక్తిని అప్పటి వరకు దూరం నుంచి చూడటం, మాట వినడం తప్ప మాట్లాడటం ఊహకే అందని విషయం. అలాంటిది స్వయంగా కలిసి స్త్రీ శక్తిపై తనకు గల నమ్మకాన్ని, స్త్రీలు పురుషులతో సమానంగా ఏదైనా సాధించగలరని, స్వాతంత్ర్య పోరాటంలో చురుకుగా పాల్గొనాలని చెప్పినప్పుడు లక్ష్మికి కలిగిన ఆనందం అంతా ఇంతాకాదు. దాని వల్ల పురుషాధిక్యత, అణచివేత, పరాధీనతల నుంచి బయటపడొచ్చని, సమాన హక్కులు

కోరవచ్చని లక్ష్మి భావించారు. మహిళా రెజిమెంట్‌కు నాయకత్వం వహించమని బోస్ తనను అడిగిన వెంటనే ఎటువంటి తటపటాయింపులు లేకుండా అంగీకరించారు. తన క్లినిక్ మూసివేసి ఆ బాధ్యతలను స్వీకరించారు. (బోస్ ఆమెకు కల్నల్ హోదా ఇచ్చినప్పటికీ ప్రజల మనోఫలకాల్లో మాత్రం కెప్టెన్‌గానే ముద్రపడిపోయింది) దాంతో కెప్టెన్ లక్ష్మి అయ్యారు. మొత్తం ఆసియాలోనే ఇలా ఓ రెజిమెంట్‌కు కమాండర్‌గా వ్యవహరించిన తొలి మహిళగా చరిత్ర సృష్టించారు. అంతేకాదు! 1943 అక్టోబరులో సుభాష్ చంద్రబోస్ ఏర్పరచిన స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వంలో ఏకైక మహిళా మంత్రిగా లక్ష్మి సెహగల్ స్థానం సంపాదించుకున్నారు. ఇక ఆమె కదనరంగంలో పాల్గొన్న అనుభవం గురించి ఎంత చెప్పినా తక్కువే. రాణి లక్ష్మి రెజిమెంట్‌లో శిక్షణ పొందిన మహిళా అధికారులను, సైనికులను రంగూన్‌కు చేర్చే ఏర్పాటు చేస్తే అక్కడి నుంచి యుద్ధరంగానికి వెళ్ళాల్సి ఉంటుందన్న నేతాజీ మాటలు లక్ష్మిసెహగల్‌లో ఒకరకమైన ఆతురుతను కలిగించాయి. సింగపూర్ నుంచి రంగూన్ వెళ్ళే రోజు కోసం ఆమె ఎంతో ఆదుర్దాగా ఎదురుచూశారు. పరిమిత ఆహారం తీసుకుంటూ వందల మైళ్ళ కొలదీ నడక, తుపాకీలు, తూటాలు, శత్రువులు, కాల్పులు, బాంబుదాడులు, రక్తపాతం...అన్నీ అనుభవమైనాయి.

★ ★ ★

**తిరిగి ఇండియాకు...**

బ్రిటిష్ వారు 1946 మార్చి 4వ తేదీన ఆమెను యుద్ధఖైదీగా ఇండియా తీసుకువచ్చారు. ఆమెకు భారత్‌లో లభించిన స్వాగత సంరంభం అంతా ఇంతా కాదు. కలకత్తాలో నేతాజీ ఇంటికెళ్ళినప్పుడు కుటుంబ సభ్యులు రాత్రంతా బోస్ గురించి ప్రశ్నలు వేసి వివరాలు అడిగి తెలుసుకున్నారు. వారుకూడా నేతాజీ విమాన ప్రమాదం అంతా ఒక ఎత్తేనని, సరైన అవకాశం దొరకగానే వస్తారని భావించారు. (లక్ష్మి సెహగల్ మాత్రం విమాన ప్రమాదం జరిగిందనే భావించేవారు)!

అనంతరం 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌లో కల్నల్‌గా పనిచేసిన ప్రేమ్ కుమార్ సెహగల్‌ను వివాహమాడారు. అప్పుడే లక్ష్మి సెహగల్ అయ్యారు. వీరికి ఇద్దరు పిల్లలు. సుభాషిణీ, అనీషా. కాన్పూరులో తిరిగి తన వైద్యవృత్తిని కొనసాగించారు. పాకిస్తాన్ నుంచి వస్తున్న శరణార్థులకు చికిత్స అందించాలన్న ఉద్దేశ్యం బాగా ఉండేదామెకు. దేశ విభజన సమయంలో ముస్లింలకు వైద్యం చేసిన ఏకైక వైద్యురాలిగా అప్పట్లో ఆమె మహ్మదీయులలో మంచి పేరు సంపాదించుకున్నారు.

★ ★ ★

**మార్క్సిస్టు పార్టీలో అడుగిడిన వేళ....**

ప్రజల కోసం పనిచేయాలన్న నేతాజీ మాటను ఆమె ఎన్నడూ విస్మరించలేదు. ప్రజల కోసం పనిచేసే సిపిఎం సభ్యత్వం (1971)లో తీసుకోవడంలో ఆ మాటల ప్రభావం ఉంది. అయితే దాంతోపాటు తమ పెద్దమ్మాయి సుభాషిణి ప్రభావం కూడా ఎంతో ఉంది. స్కాలర్‌షిప్‌తో చదువుకోవడానికి విదేశాలు వెళ్ళిన సుభాషిణి స్వదేశం వచ్చాక భారత కమ్యూనిస్టు పార్టీ మార్క్సిస్టులో చేరింది. ముఖ్యంగా ట్రేడ్ యూనియన్‌లో పనిచేయసాగింది. ప్రజాతంత్ర యువజన సమాఖ్యలో కూడా చురుగ్గా పనిచేసే సుభాషిణి వల్ల పార్టీలో స్థానిక, ప్రాంతీయ, జాతీయ స్థాయిలో పనిచేసే మిత్రులను కలుసుకునే అవకాశం లక్ష్మీసెహగల్‌కు కలిగింది. అప్పుడు ఇంటికి "పీపుల్స్ డెమోక్రసీ' వచ్చేది. అది క్రమం తప్పకుండా చదివేవారు లక్ష్మి. 1971లో బంగ్లా యుద్ధం ప్రారంభమైంది. ఆ సంఘీభావ సంఘంలో డాక్టరుగా స్వచ్ఛందంగా చేరారు. అదే సమయంలో పీపుల్స్ డెమోక్రసీలో 'అన్ని రకాల సహకారం అవసరం ' అంటూ కా॥ జ్యోతిబసు ఇచ్చిన పిలుపు లక్ష్మి సెహగల్‌ను ఆకట్టుకుంది. వెంటనే తన ప్రతిపాదనను పంపడం, సరిహద్దు దగ్గర వైద్య సదుపాయాన్ని అందించడానికిగాను పిలుపు రావడం జరిగిపోయాయి. ఎంతో నిబద్ధతతో వైద్య సహాయం అందించారు లక్ష్మి. అనంతరం కాన్పూరు రాగానే పార్టీ సభ్యత్వం తీసుకున్నారు. పార్టీ తరపున రాజ్యసభ సభ్యురాలిగానూ పనిచేశారు. 1981లో ఐద్వా వ్యవస్థాపక సభ్యుల్లో లక్ష్మి సెహగల్ ఒకరు. నాటి నుండి తుదిశ్వాస వరకు నిబద్ధ సైనికురాలిలా అనేక బాధ్యతలు నిర్వర్తించారు.

ఆమె తన వృత్తిని అధికంగా ప్రేమించేవారు. వృద్ధాప్యంలో సైతం కాన్పూర్‌లోని సివిల్ లైన్స్ రోడ్‌లోని ఆసుపత్రికి ప్రతిరోజూ వెళ్ళేవారు. అక్కడికి ఎక్కువగా పేద, కార్మిక కుటుంబాలకు చెందినవారే వచ్చేవారు. రోగుల దగ్గర

**పీపుల్స్ డెమోక్రసీలో 'అన్ని రకాల సహకారం అవసరం ' అంటూ కా॥ జ్యోతిబసు ఇచ్చిన పిలుపు లక్ష్మి సెహగల్‌ను ఆకట్టుకుంది. వెంటనే తన ప్రతిపాదనను పంపడం, సరిహద్దు దగ్గర వైద్య సదుపాయాన్ని అందించడానికిగాను పిలుపు రావడం జరిగిపోయాయి. ఎంతో నిబద్ధతతో వైద్య సహాయం అందించారు లక్ష్మి. అనంతరం కాన్పూరు రాగానే పార్టీ సభ్యత్వం తీసుకున్నారు. పార్టీ తరపున రాజ్యసభ సభ్యురాలిగానూ పనిచేశారు. 1981లో ఐద్వా వ్యవస్థాపక సభ్యుల్లో లక్ష్మి సెహగల్ ఒకరు. నాటి నుండి తుదిశ్వాస వరకు నిబద్ధ సైనికురాలిలా అనేక బాధ్యతలు నిర్వర్తించారు.**

డబ్బుందా లేదా అనే విషయాన్ని పట్టించుకోకుండానే లక్షలాది మందికి ఉచితంగా వైద్యం అందించిన నిస్వార్థ సేవకురాలు. వైద్య వృత్తితోపాటుగా సామాజిక కార్యక్రమాలు చేస్తూ నిత్య స్ఫూర్తి ప్రదాతగానే వెళ్ళిపోయారు.



**కొన్ని ముఖ్య ఘట్టాలు:**

- 1936లో లక్ష్మి వివాహం టాటా ఎయిర్‌లైన్స్‌లో పనిచేసే బి.కె.ఎన్.రావుతో జరిగింది. అందరినీ కాదని నచ్చినవాడిని వివాహం చేసుకునే ధైర్యం లేక ఈ పెళ్ళి జరిగిందన్నది ఆమె మనోగతం. తన అభిప్రాయాలు, వ్యక్తిత్వంతో పనిలేకుండా సగటు గృహిణిగా బ్రతకలేకపోయింది. వారు ఆరు నెలలకే విడాకులు తీసుకున్నారు.
- ఇందిరా గాంధీ హత్యానంతరం జరిగిన సిక్కు వ్యతిరేక అల్లర్లలో బాధితులకు లక్ష్మి అండగా నిలిచారు. సిక్కు వ్యతిరేక గుంపును విజయవంతంగా ఎదుర్కొన్నారు.
- 1986లో మిస్ వరల్డ్ పోటీలకు వ్యతిరేకంగా ఐద్వా ఆధ్వర్యంలో జరిగిన ప్రచారోద్యమంలో పాల్గొన్నందుకు లక్ష్మి సెహగల్ అరెస్టయ్యారు.
- సుభాష్ చంద్ర బోస్ జీవితంపై పలు చిత్రాలు, డాక్యుమెంటరీలు వచ్చాయి. అందులో శ్యామ్ బెనగల్ తీసిన 'బోస్ ది ఫర్‌గాటన్ హీరో'. ఒకటి. ఆ చిత్రాన్ని తీసేటపుడు అందులో లక్ష్మి సెహగల్ పాత్రను రాజేశ్వరి పోషించింది. ఆమె ప్రత్యేకంగా లక్ష్మి సెహగల్‌ను కలిసి మాట్లాడటమే కాక ఆమెతో చాలా సమయం వెచ్చించింది.
- ఆమె జీవితం మీద 2006లో ఒక యువ దర్శకుడు డాక్యుమెంటరీ తీసాడు.
- తనుచేసిన సేవలకు గాను లక్ష్మి సెహగల్ ఎన్నో అవార్డులు అందుకున్నారు. భారత ప్రభుత్వం 1998వ సం॥లో ఆమెను అత్యంత ప్రతిష్టాత్మక పద్మ విభూషణ్ అవార్డుతో సత్కరించింది.
- అఖిల భారత ప్రజతంత్ర మహిళా సంఘం (ఐద్వా) 1981లో ఏర్పడింది. ఆ సంఘం వ్యవస్థాపక సభ్యులలో లక్ష్మి సెహగల్ ఒకరు.
- 1984లో భోపాల్ గ్యాస్ దుర్ఘటన జరిగినపుడు నగరం నుండి వెళ్ళిన వైద్య బృందానికి లక్ష్మి సెహగల్ నాయకత్వం వహించారు. తరువాత గ్యాస్ ప్రభావం గర్భిణిలపై ఎలా ఉంటుందన్న అంశంపై ఒక నివేదిక రూపొందించారు.
- 2002లో భారత రాష్ట్రపతి పదవికి వామపక్ష అభ్యర్థిగా బరిలోకి దిగారు. ప్రత్యర్థి అబ్దుల్ కలామ్‌పై విజయం సాధించలేకపోయినా ప్రచార సమయంలో మతతత్వ రాజకీయాలను ఎదిరించ బూనుకున్నారు.!! అంతటి భావ పరిణితి సెహగల్ సొంతం. అప్పట్లో బిజెపితో స్నేహం చేస్తున్న చంద్రబాబునాయుడు "లక్ష్మి సెహగల్ ఎవరికి తెలుసు?" అని అపహాస్యం చేశారు. హైదరాబాద్ సభలో మాట్లాడినపుడు ఆమె "ఆయనకు నేను కాకపోయినా కనీసం నేతాజి అయినా తెలుసునని ఆశిస్తాను" అని చమత్కరిస్తే చప్పట్లు మార్మోగాయి.
- లక్ష్మి సెహగల్‌కు ఇద్దరు కుమార్తెలు. సుభాషిణీ అలి, అనీషాపూరి. సుభాషిణీ అలి సిపియం నాయకురాలు. మనవడు షాద్ అలి 'బంటి అవుర్ బబ్లి', 'జూమ్ బరాబర్ జూమ్' వంటి విజయవంతమైన చిత్రాలు రూపొందించారు. మనవడు తీసిన చిత్రాలు ఏ ఒక్కటి కూడా వదలకుండా చూసేవారు.

# RR's DURBAR

జమ్మిచెట్టు దగ్గర, మొగల్‌రాజ పురం, విజయవాడ-10



R.R's
## Joints
Expect More.....

శ్రీ కృష్ణా ఎస్టేట్స్
ప్రకాశం రోడ్
గవర్నర్‌పేట, విజయవాడ-2

బుడమేరు సెంటర్
రామకృష్ణాపురం
విజయవాడ-11

స్వాతి థియెటర్ రోడ్
భవానీపురం
విజయవాడ-12

# ఉద్యమాల గని మానికొండ సూర్యావతి

-కె. స్వరూపరాణి

**2**002, జులై 4న మహిళా ఉద్యమ నిర్మాత మానికొండ సూర్యావతిగారి వర్ధంతి రోజున **'చైతన్య మానవి'** ప్రారంభించాం. పత్రిక ప్రారంభించి దశాబ్ది కాలమైంది. దశమ వార్షికోత్సవాల ప్రత్యేక సంచిక తెస్తున్న సందర్భంగా సూర్యావతిగారి జ్ఞాపకాలు, ఉద్యమ అనుభవాలను మానవి పాఠకుల కొరకు.

**బాల్యం:**

కృష్ణా జిల్లా గన్నవరం తాలూకా ఇందుపల్లి గ్రామంలో 1921లో సంపన్న కుటుంబంలో సూర్యావతిగారు జన్మించారు. ఆనాటి సామాజిక కట్టుబాట్ల కారణంగా చిన్న వయస్సులోనే వివాహాలు జరిపించేవారు. సూర్యావతిగారికి కూడా 16 సంవత్సరాలకే మానికొండ సుబ్బారావుగారితో వివాహం జరిగింది. సూర్యావతిగారి బాల్యం, చదువు అంతా కాటూరు గ్రామంలో తన పినతండ్రిగారైన కడియాల గోపాలరావు గారింట్లో జరిగింది. జాతీయోద్యమం ముమ్మరంగా జరుగుతున్న కాలమది. కడియాల గోపాలరావుగారిల్లు యువతీ యువకులకు రాజకీయ విద్యాకేంద్రంగా ఉండేది. గోపాలరావుగారి ప్రోద్బలంతో కాటూరు గ్రామంలో మహిళలతో సమావేశం జరిగింది.

**ఉద్యమ ప్రవేశం:**

స్వాతంత్రోద్యమంలో మహిళలు పాల్గొనాలన్న మహాత్మాగాంధీ పిలుపు ద్వారా చైతన్యవంతులైన స్త్రీలు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. మహిళా సంఘాలు స్థాపించారు. అవి పట్టణాలకు, ఉన్నత వర్గాల మహిళలకే పరిమితమైనాయి. మహానేత పుచ్చలపల్లి సుందరయ్య, చంద్ర రాజేశ్వరరావు, కడియాల గోపాలరావుగార్ల ప్రోద్బలంతో 1936లో గ్రామీణ స్త్రీల సమస్యలను అధ్యయనం చేసి మహిళలను చైతన్యపరిచే కార్యక్రమాలను నిర్వహించడానికి మహిళా సంఘం ఏర్పాటు చేయాలని సంకల్పించారు. 1936లో తూర్పు కృష్ణాలో 56 మంది సభ్యులతో మహిళా సంఘం ఏర్పడింది. తరువాత తూర్పుకృష్ణాలో జరిగిన మహాసభలో వల్లభనేని సీతామహాలక్ష్మి, చంద్ర సావిత్రిదేవి అధ్యక్ష, కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. ఆ తర్వాత కాలంలో సంఘం అనేక జిల్లాలకు విస్తరించింది.



1942లో కృష్ణా జిల్లా గరికపర్రులో జరిగిన మహాసభలో వల్లభనేని సీతామహాలక్ష్మి అధ్యక్షులుగా, సూర్యావతిగారు కార్యదర్శిగా ఎన్నికయ్యారు. స్త్రీలకు విద్యా సౌకర్యాలు కల్పించాలని, పురుషులతో పాటు సమానకూలి యివ్వాలని, ఆస్థిహక్కు కల్పించాలని, మరుగు దొడ్లు, ప్రసూతి ఆసుపత్రులు కట్టించాలని మహాసభలో తీర్మానాలు చేసి బ్రిటిష్ ప్రభుత్వానికి పంపారు. ఆ తరువాతి కాలంలో వాటి సాధనకు అనేక ఉద్యమాలు జరిగాయి.

**సమాజంలో ఆనాటి సాంఘిక పరిస్థితులు:**

భర్త చనిపోతే ఆ స్త్రీ జీవితమంతా ఒకరిమీద ఆధారపడి బ్రతకవలసిందే. అదే భార్య చనిపోతే నెల కాకుండానే మగాడు మరలా వివాహం చేసుకునేవారు. భర్త ఆస్థిలో వాటా లేదు. పుట్టింటి ఆస్తిలోగాని మెట్టినింటి ఆస్తిలో గాని స్త్రీకి ఏవిధమైన హక్కులు ఉండేవికాదు. భర్త చనిపోయిన స్త్రీలను వితంతువుగా చేసే క్రతువులు మానసికంగా ఆమెను కుంగదీసేవి. పుట్టినప్పటినుండీ ఉన్న బొట్టు, గాజులు, పువ్వులు భర్తపోయిన స్త్రీ పెట్టుకోవడానికి లేదు. కొన్ని తరగతులలో తలనీలాలు తీసి తెల్ల చీరలు ధరించాలి. వితంతువు ఎదురుపడితే అపశకునమని ఈసడించుకునేవారు. గ్రామాలలో ప్రసూతి సౌకర్యాలు లేవు. మూఢాచారాలతో మంత్రసానితోనే పురుడు పోయించేవాళ్ళు. వైద్యం అందక తల్లీపిల్లలు మృత్యువాత పడేవాళ్ళు. సాంఘిక దురాచారాలు మహిళాభివృద్ధికి తీవ్ర ఆటంకాలుగా ఉండేవి.






The joy of good taste






# ప్రియతో
# ప్రతి భోజనం ఒక విందు




## 12 క్యాటగిరీలు మరియు 331 ప్రొడక్ట్‌లు

పచ్చళ్ళు | స్పైస్ మరియు మసాలా పౌడర్స్ | కలినరీ మరియు మసాలా పేస్ట్స్
రెడీ టు ఈట్ ఫుడ్స్ | కన్వీనియంట్ మిక్సెస్ | రెడీ టు కుక్ మిక్సెస్ | పాపడ్స్ | ఎడిబుల్ ఆయిల్స్
స్వీట్స్ మరియు సావరీస్ | కమోడిటీస్ | హెల్త్ ఫుడ్స్ | ఫ్రూట్ పల్ప్స్

www.priyafoods.com




**Ushodaya Enterprises Pvt. Ltd. (Foods Division)**

**Corporate office:** Plot No.: A1/1(Part), Block No.:3, IDA, Uppal, Hyderabad - 500 039. A.P., India. Tel.: 040-27200351, 27200354, Fax: 27202596.

**Factory:** 9-49, Poranki, Vijayawada - 521 137. A.P., India. Tel.: 0866-2585346, 2585347, Fax: 2582802. E-mail: response@priyafoods.com.

149A



# రూరల్ డెవలప్‌మెంట్ ట్రస్టు

## అనంతపురం

### ఆర్.డి.టి. గ్రామీణ ప్రజల సాధికారత కొరకు పాటు పడుతున్న ఒక స్వచ్ఛంద సంస్థ

- పేదరికపు విషవలయంలో చిక్కుకున్న గ్రామీణ ప్రజలను వారి బాధల నుండి శాశ్వతంగా విముక్తి చేయడం, వారు స్వావలంబన మరియు స్వయం సమృద్ధిని సాధించుటకు ఇతోధికంగా దోహదపడడం, వీరు ఇతర వర్గాలతో సమానంగా, గౌరవంగా, శాంతియుతంగా సహజీవనము గడుపునట్లు కృషి చేయడం.
- తీవ్ర కరువు కాటకాదుల వలన ఎడారిగా మారుతున్న అనంతపురం జిల్లాలోని భూ వనరులను పరిరక్షించి అభివృద్ధి పరచి అవి ప్రజల అవసరములను తీర్చ గలస్థాయికి పెంపొందించి ప్రజలు మరియు వనరులు పరస్పర సహజీవనం సాగించునట్లు చేయడం,
- మారుతున్న ప్రజల అవసరాలను, కాలానికి అనుగుణంగా పని చేయగలగినట్టి లక్షణములు కల్గి యుండడం, దయ, కరుణ కల్గిన న్యాయబద్ధమైన సమాజాన్ని నిర్మించు ప్రయత్నంలో ప్రజలను ముఖ్య పాత్రధారులుగా చేసి వారి జీవితాలలో సంస్థ ఒక శాశ్వత భాగంగా ఉండునట్లు తీర్చిదిద్దడం పరమావధిగా వుంచుకొని ఆర్.డి.టి. 1969 సంవత్సరము నుండి అనంతపురం జిల్లాలో పని చేస్తున్నది.

### ఆర్.డి.టి. ఈ జిల్లాలో క్రింది పర్యావరణ సమస్యలను గుర్తించింది.

1. వర్షాధార పంటలు తరచుగా రైతుకు నష్టాన్ని కలిగించుటచే, రైతులు ఎక్కువగా బోరు బావులు త్రవ్వి నీటిని విచక్షణా రహితంగా వాడటం వలన జిల్లా భూగర్భ జలాలు నానాటికి అడుగంటిపోవడం.
2. అధిక నేలకోత వలన సారవంతమైన భూమిపై పొర రోజు రోజుకు తగ్గిపోవటం, అందులోను సేంద్రియ ఎరువులు వాడకపోవడం వలన భూమి తన యొక్క ఉత్పాదక సామర్థ్యాన్ని కోల్పోతుంది.
3. జిల్లా భూభాగంలో 33 శాతం పచ్చదనం లేకపోవటం, విచక్షణారహితంగా అడవులలోని చెట్లను నరకడం, పంట మార్పిడి లేకుండా ఒకే రకం పంట వేయటం వలన విపరీతమైన తెగుళ్లు, రోగాలు సోకడం.
4. పశు పక్ష్యాదుల సంఖ్య క్షీణించడం.
5. బహురకాల పంటల బదులు ఒకేరకం (వేరుశనగ) పంటను పండించడం వలన విపరీతమైన తెగుళ్ళు, రోగాలు సోకడం,
6. ఎడారి ప్రాంతపు ఛాయలు అక్కడక్కడ కనిపించడం. (కణేకల్లు ప్రాంతం)

### సహజ వనరులను పరిరక్షించడానికి ఈ క్రింది చర్యలను ఆర్.డి.టి. చేపట్టింది.

1. అనువైన ప్రదేశాలల్లో సాధ్యమైనన్ని ఎక్కువ ఊట చెరువులను నిర్మించి, తెగిపోయిన పాత చెరువులను పునరుద్ధరించి భూగర్భ జలాలను అభివృద్ధి చేయడం.
2. భూగర్భ జలాల సంరక్షణ చర్యలలో భాగంగా నీటిని పొదుపుగా వాడుకొనుటకు బిందు, తుంపర్ల సేద్యంను ప్రోత్సహించడం, వేరుశనగ పండించుటకు బదులుగా పండ్ల తోటల పెంపకాన్ని ప్రోత్సహించడం.
3. పశుగణాభివృద్ధి చేయడానికి సంకరజాతి ఆవులను లబ్దిదారులకు ఇవ్వడం, వాటి ఆరోగ్యాన్ని పరిరక్షించడం.
4. జిల్లాలో లభించు అపారమైన సౌరశక్తి వినియోగం కొరకు సోలార్ మోటార్లు, పండ్ల తోటల పెంపకమును ప్రోత్సహిస్తూ ఎంపిక చేసిన లబ్దిదారులకు ఇవ్వడం.
5. పశువుల పేడను ఉపయోగించి గోబర్ గ్యాస్‌ను తయారు చేసి వంట చెరుకు బదులుగా ఉపయోగించడం.
6. జిల్లాలో అడవులను అభివృద్ధి చేయడం.



# జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ : నల్లగొండ

పేదరిక నిర్మూలనకు ఇందిరాక్రాంతి పథం ఎంతో దోహదపడుతోంది. జిల్లాలోని పేద మరియు నిరుపేదకుటుంబాలలోని 6 లక్షల 78 వేల 061 మంది మహిళలతో 61 వేల 670 స్వయం సహాయక సంఘాలను 59 మండల సమాఖ్యలు (1965) గ్రామ సంఘాలు (వి.ఓ.లు) ఏర్పాటు చేసి వారికి వివిధ పథకాల ద్వారా ఆర్థికంగా బలోపేతం చేయడానికి కృషి చేస్తున్నాము. ఈ పథకము ప్రతి పేద మహిళను ఆర్థికంగా శక్తివంతురాలిని చేసి వారిలో ఆత్మవిశ్వాసాన్ని నింపుతోంది.

## స్వర్ణ జయంతి గ్రామ స్వరోజ్‌గార్ యోజన పథకము (యస్.జి.యస్.వై.) :

పథకము క్రింద 2011-12 సం॥లో (250) టార్గెట్‌కుగాను (225) వ్యక్తిగత రుణములకు రూ.20.69 లక్షలు సబ్సిడీ మంజూరు చేయడం జరిగింది. ఇప్పటి వరకు (181) యూనిట్లు గ్రౌండింగ్ చేయబడినవి.

## బ్యాంకు లింకేజి :

ఈ 2012 -13 ఆర్థిక సంవత్సరము జిల్లాలో 21వేల 013 గ్రూపులకు రూ॥435 కోట్లతో బ్యాంకు లింకేజి సమకూర్చాలని లక్ష్యంగా నిర్ణయించగా ఇప్పటి వరకు 4వేల 512 గ్రూపులకు రూ 81కోట్ల 25 లక్షల రూపాయుల బ్యాంకు లింకేజి సమకూర్చడమైనది.

## పావలా వడ్డీ పథకము :

ఆర్థికంగా మహిళలను బలోపేతం చేయడం కోసం పావలా వడ్డీ పథకాన్ని ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా ప్రవేశపెట్టి మహిళా సాధికారతకు పెద్దపీట వేసింది.2011-12 సంవత్సరమునకు మహిళా సంఘములకు సంబంధించిన పావలావడ్డీ చెల్లింపులు వారు వాయిదాలు చెల్లించిన అప్పు వివరాలు సంబంధిత బ్యాంకుల నుండి నేరుగా సమాచారమును సేకరించి, సంబంధిత మహిళా సంఘముల సేవింగు ఖాతాల ద్వారా (45009) గ్రూపులకుగాను రూ.18.05 కోట్లు రూపాయలు నేరుగా జమ చేయబడినవి. మరియు మే మాసంలో ప్రజాపథం కార్యక్రమంలో చెక్కులు నమూనా పంపిణీ చేయబడినది.

## మహిళా సంఘాలకు వడ్డీ లేని రుణాలు :

జనవరి 1వ తేదీ 2012 సంవత్సరము నుండి మహిళా సంఘాలకు రూ.0.50 లక్షల నుండి 5.00 లక్షల వరకు (ఎవరైతే నెలా నెలా 100 శాతం వడ్డీ చెల్లించే సంఘాలకు) వడ్డీ లేని రుణాలను ఇవ్వడానికి ప్రణాళికలు రూపొందించబడుచున్నవి.

## స్త్రీ నిధి :

రాష్ట్రములో నివసిస్తున్న అత్యంత నిరుపేద కుటుంబాలు అనగా యస్.సి. / యస్.టి. కుటుంబాలు, స్త్రీ యాజమాన్య కుటుంబాలు, (ఒంటరి స్త్రీలు) వికలాంగులు ఉన్న కుటుంబాలు భూమి లేని కుటుంబాల వారికి ఆదాయ అభివృద్ధి కొరకు అప్పు అందించాలని స్త్రీ నిధి ఏర్పాటు చేయడం జరిగినది. ఒక సంఘానికి గరిష్ఠంగా రూ.1,50,000లు, ఒక సభ్యురాలికి రూ.15,000/-లు ఇవ్వబడును. స్త్రీ నిధి 2011 -12లో మొత్తం (38) మండలములకు గాను మొత్తం కార్పస్ ఫండ్ (వాటా ధనము) రూ.33.25 కోట్లు లక్ష్యము కాగా, (1415) స్వయం సహాయక సంఘాలకు రూ.4.84 కోట్లు ఆదాయ అభివృద్ధి కొరకు రుణము మంజూరి చేయడం జరిగినది.

స్త్రీ నిధి క్రింద 2012-13లో మొత్తం (59) మండలములకు గాను మొత్తం కార్పస్ ఫండ్ (వాటాధనము) రూ.42.72 కోట్లు లక్ష్యము కాగా, ఇప్పటి వరకు రూ.2.60 కోట్లు ఆదాయ అభివృద్ధి కొరకు (1790) స్వయం సహాయక సంఘాలకు రుణము మంజూరి చేయడం జరిగినది.

## మార్కెటింగ్ - వరి కొనుగోలు :

ఆర్థిక సంవత్సరము 2011-12 సం॥కు రబీ సీజనులో వరి ధాన్యం కొనుగోలు నిమిత్తము (210) సెంటర్లను నెలకొల్పి మహిళా గ్రామ సంఘాల ద్వారా (210) కొనుగోలు కేంద్రాల నుండి దాదాపు 12 లక్షల 66 వేల 968 క్వింటాళ్ళ వడ్లు కొనుగోలు చేయడం వలన (23137) రైతులకు మేలు జరగడమేకాక మహిళా సంఘాలు కమీషన్ ద్వారా సుమారు 3 కోట్ల 51 లక్షల రూపాయలు సంపాదించుకొని ఆర్థికంగా మరింత బలోపేతం కావడానికి అవకాశం ఏర్పడింది.

## మహిళా సమాఖ్యల ఆధ్వర్యంలో సుస్థిర వ్యవసాయము (యం.కె.యస్.పి.) 2012-13

ప్రస్తుతము 2012-13 సంవత్సరానికి సేంద్రియ పద్ధతుల ద్వారా వ్యవసాయము చేయుటకు వీలుగా ఖరీఫ్ కార్యచరణ, ప్రణాళిక అమలు పరుచుటకుగాను అదనముగా 5 మండలముల పరిధిలో 109 గ్రామములలో కార్యక్రమము విస్తరింపచేయుటకు ప్రణాళికలు చేయబడి మొత్తము 30 మండలములలో 510 గ్రామముల యందు 1,45,394 ఎకరములలో (40860) మంది రైతులతో అమలు చేయుటకుగాను ఇట్టి దానిని గ్రామీణా పేదరిక నిర్మూలన సంస్థ (సెర్ప్) హైదరాబాద్ వారిచే ఆమోదింపబడిన కార్యక్రమము.

అగ్రిగోల్డ్ పాలు

అమృతపుజాలు

⌘ పాలు
⌘ పెరుగు
⌘ లస్సీ
⌘ బట్టర్ మిల్క్
⌘ ఫ్లావర్డ్ మిల్క్
⌘ నెయ్యి




పెరుగు

పాలు

బట్టర్ మిల్క్




లస్సీ

పాలు, పాల పదార్థములు







ఫ్లావర్డ్ మిల్క్



Amrutha Varshini

DAIRY FARMS PVT. LTD.

అమృతవర్షిణి డైరీ ఫామ్స్ ప్రై. లిమిటెడ్




నెయ్యి

అగ్రిగోల్డ్ టవర్స్ ప్రక్కన, నిమ్మగడ్డ సోమశంకరరావు వీధి, ఓల్డ్ రెవిన్యూ కాలనీ,
లబ్బీపేట, విజయవాడ - 520 010, ఫోన్ : 0866-2477027, సెల్ : 93934 51111

మధ్య తరగతి, ఉన్నత వర్గాల స్త్రీలు బయటకు రావటానికి వీలులేదు. ఘోషా పద్ధతి ఉండేది. గ్రామీణ స్త్రీలు బయటకు వెళితే ఎడ్లబండ్లకు తెరలు కట్టుకుని ప్రయాణం చేసేవారు. ఫ్యూడల్ ధోరణులతో స్త్రీలకు ఎలాంటి అవకాశాలు ఉండేవి కావు. చదువుకున్న స్త్రీ చెడిపోతుందనే భావం బలంగా ఉండేది. చంకలో బిడ్డకు కూడా వివాహాలు జరిపించేవారు. కన్యాశుల్కం కొరకు ముక్కుపచ్చలారని పిల్లలను ముసలివాళ్ళకిచ్చి పెళ్ళిళ్ళు చేసేవారు. భర్త చనిపోతే ఆ స్త్రీ జీవితమంతా ఒకరిమీద ఆధారపడి బ్రతకవలసిందే. అదే భార్య చనిపోతే నెల కాకుండానే మగాడు మరలా వివాహం చేసుకునేవారు. భర్త ఆస్థిలో వాటా లేదు. పుట్టింటి ఆస్తిలోగాని మెట్టినింటి ఆస్తిలో గాని స్త్రీకి ఏవిధమైన హక్కులు ఉండేవికాదు. భర్త చనిపోయిన స్త్రీలను వితంతువుగా చేసే క్రతువులు మానసికంగా ఆమెను కుంగదీసేవి. పుట్టినప్పటినుండీ ఉన్న బొట్టు, గాజులు, పువ్వులు భర్తపోయిన స్త్రీ పెట్టుకోవడానికి లేదు. కొన్ని తరగతులలో తలనీలాలు తీసి తెల్ల చీరలు ధరించాలి. వితంతువు ఎదురుపడితే అపశకునమని ఈసడించుకునేవారు. గ్రామాలలో ప్రసూతి సౌకర్యాలు లేవు. మూఢాచారాలతో మంత్రసానితోనే పురుడు పోయించేవాళ్ళు. వైద్యం అందక తల్లీపిల్లలు మృత్యువాత పడేవాళ్ళు. సాంఘిక దురాచారాలు మహిళాభివృద్ధికి తీవ్ర ఆటంకాలుగా ఉండేవి.

మధ్యతరగతి ఆడవాళ్ళు బయట పనులకు పోకూడదనే ఆంక్షలు ఉండేవి. ఈ ఆంక్షలకు వ్యతిరేకంగా మహిళలను బయటకు తీసుకువచ్చి పొలం పనులలో ప్రోత్సహించేందుకు తాము కూడా స్వయంగా పాల్గొనేవారు. స్త్రీలు అనేకరకాలుగా అణచివేతకు, వివక్షకు గురయ్యేవారు. చదువు, ఉద్యోగాలు పురుషులకు మాత్రమే. వివాహ విషయంలో ఆడపిల్లల ఇష్టాయిష్టాలకు సంబంధం లేకుండా పెద్దవారి ఇష్టానుసారమే జరిగేవి. కొన్ని

**అవమానాలు, ఛీత్కారాలకు ఏమాత్రం వెరువకుండా సంఘ నిర్మాణంలో అనేకమంది కార్యకర్తలుగా ముందుకొచ్చారు. స్వాతంత్ర్య పోరాటంలోనూ, తెలంగాణా సాయుధ పోరాటంలో అమరులైన కుటుంబాల నుండి మహిళలు ఉద్యమంలో ప్రధానపాత్ర వహించారు.**

సామాజిక తరగతులలో పెళ్ళయిన తర్వాత భర్తను చూడటానికి గాని, భర్తతో మాట్లాడాలంటే రాత్రిళ్ళు తప్ప వీలుపడేదికాదు. ఇంటి కోడలు ఎవరి ముందు కూర్చోవడానికి, మాట్లాడటానికి వీలులేదు. భర్తకు అక్రమ సంబంధాలు ఉన్నా మౌనంగా భరించాలే తప్ప ప్రశ్నించే అవకాశం లేదు. అనాగరికమైన ఫ్యూడల్ ఆచారాలు, సంప్రదాయాలు మహిళలను వెనక్కి నెట్టాయి. పైగా మహిళల ఆభివృద్ధికి ఆటంకంగా ఉన్న సాంఘిక దురాచారాలను భక్తి, మూఢవిశ్వాసాల ద్వారా మహిళలే ఒప్పుకుని వాటిని ఆచరించేటట్లుగా నాటి సామాజిక పరిస్థితులుండేవి.

**ఆనాటి సామాజిక పరిస్థితులపై ఎదురీత:**

మహిళా సంఘం విస్తరణకు కాలినడకన గ్రామ గ్రామాన పర్యటించారు. నేడున్న రవాణా సౌకర్యాలు ఆనాడు లేవు. స్త్రీలు గడపదాటి బయటకు రాకూడదనే సామాజిక కట్టుబాట్లు, ఆంక్షలు ఉన్న కాలంలో అనేక ఆటుపోట్లు ఎదుర్కొని, మొక్కవోని దీక్షతో మహిళా సంఘం నిర్మాణానికి ఆనాటి నాయకులు ఎంతగానో కృషి చేశారు. సూర్యావతిగారితోపాటు నాగళ్ళ రాజేశ్వరమ్మ, చంద్ర సావిత్రి దేవి, వల్లభనేని సీతామహాలక్ష్మి, డా॥ అచ్చమాంబ, కాట్రగడ్డ హనుమాయమ్మ మొదలైన వారు ఉన్నారు. సంఘం ఏర్పాటుకు పురుషుల నుండే గాక మహిళల నుండి కూడా ఛీత్కారాలనెదుర్కొన్నారు. "ఆడవాళ్ళకు సంఘాలేమిటి? మొగుడికి అన్నం వండి పెట్టరా? వెధవ ముండలకు పెళ్ళిళ్ళు చేస్తారా?" అని అంటూ మొఖం మీదే తలుపులు వేసేవారు. అవమానాలు, ఛీత్కారాలకు ఏమాత్రం వెరువకుండా సంఘం నిర్మాణంలో అనేకమంది కార్యకర్తలుగా ముందుకొచ్చారు. స్వాతంత్ర్య పోరాటంలోనూ, తెలంగాణా సాయుధ పోరాటంలో అమరులైన కుటుంబాల నుండి మహిళలు ఉద్యమంలో ప్రధానపాత్ర వహించారు. వెల్లంకి అన్నపూర్ణమ్మ, గుత్తికొండ అన్నపూర్ణమ్మ, మాలెంపాటి శారద, మాలెంపాటి వసుమతి, గుత్తికొండ సీతమ్మ, సూరపనేని జగదాంబ, నాదెళ్ళ చిట్టెమ్మ, మండవ మల్లికాంబ, దండమూడి భిక్షావతి మొదలైన వారు మహిళా ఉద్యమంలో కీలకపాత్ర పోషించారు. ఉద్యమం రాష్ట్రంలో వివిధ జిల్లాలకు విస్తరించే క్రమంలో మోటూరు ఉదయం, మల్లు స్వరాజ్యం వంటి నేతలు ప్రముఖ పాత్ర పోషించారు.

**సంస్కరణోద్యమాలు:**

ఆనాటి సాంఘిక పరిస్థితులలో స్వాతంత్రోద్యమంలో పాల్గొంటూనే సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు నిర్వహించారు. రాజా రామ్మోహన్‌రాయ్, వీరేశలింగం, ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌లు నిర్వహిస్తున్న సతీసహగమనం, బాల్య వివాహాలకు వ్యతిరేకంగా, వితంతు పునర్వివాహాలు, స్త్రీ విద్య కొరకు జరుగుతున్న ఉద్యమాలు స్ఫూర్తిని కలిగించాయి. కమ్యూనిస్టు పార్టీ స్త్రీల అభ్యున్నతికి, స్త్రీల సమస్యల పరిష్కారానికి సంఘం యొక్క అవసరాన్ని గుర్తించింది. సమాజంలో సగభాగంగా వున్న మహిళలు చైతన్యం కాకుండా సమాజ మార్పు జరగదని భావించి తమ కుటుంబాలలో వున్న మహిళలను గుర్తించి తర్ఫీదు యిచ్చి కార్యకర్తలుగా తయారు చేసిన ఘనత కమ్యూనిస్టులదే. ఆ స్ఫూర్తితో సనాతన భావాలకు వ్యతిరేకంగా మహిళలను సంఘటిత పరిచి పోరాటాలు నిర్వహించటమే గాక ఆచరణలో చేసి చూపించారు. పెనమలూరు ఆశ్రమంలో

ఒక వితంతువుకు వివాహం చేస్తుండగా ఆ ఊరి సనాతనవాదులు "మా గ్రామాన్ని అపవిత్రం చేస్తారా?" అని రౌడీలతో దాడి చేయించారు. ఆ తర్వాత దాడి చేసిన వారి వద్దకు వెళ్ళి "మేం చేసిన తప్పేంటి? జీవితాంతం ఆమె వితంతువుగా ఎలా ఉండగలుగుతుంది? వివాహం చేసుకుంటే తప్పేమిటి?"అని ప్రశ్నించి వాళ్ళను కూడా ఒప్పించారు. ఆనాడు యువజన సంఘం కార్యక్రమాలు కూడా బాగా నడిచేవి. యువకులు సంస్కరణ ఉద్యమాలలో చురుకుగా పాల్గొనేవారు. ఆదర్శ వివాహాలు చేసుకోవటానికి ముందుకు వచ్చేవారు.

మొట్టమొదటిసారిగా 1948లో సాహిత్యం ద్వారా మహిళలలో అభ్యుదయ ప్రచారానికి 'ఆంధ్రవనిత' పత్రికను స్థాపించారు. అభ్యుదయ భావాలు ప్రజలలోనికి ప్రచారం కాకూడదనే కారణంతో అప్పటి ప్రభుత్వం పత్రికను రద్దు చేసింది. స్త్రీలకు వారసత్వపు హక్కు కోసం ఉద్యమాలు నడిచాయి. సాంఘిక దురాచారాలకు వ్యతిరేకగా పోరాడుతూనే స్త్రీల సమాన హక్కులు కోసం ప్రభుత్వాలతో పోరాడి హక్కులు సాధించారు. స్త్రీవిద్య, భర్త ఆస్తిలో వాటా, సమాన పనికి సమానవేతనం, బాల్యవివాహాల నిరోధక చట్టం, పుట్టింటి ఆస్తిలో మగపిల్లవాడితో సమాన హక్కు మహిళా సంఘాల ద్వారానే సాధించుకోగలిగాం.

మొట్టమొదటిసారిగా 1948లో సాహిత్యం ద్వారా మహిళలలో అభ్యుదయ ప్రచారానికి 'ఆంధ్రవనిత' పత్రికను స్థాపించారు. అభ్యుదయ భావాలు ప్రజలలోనికి ప్రచారం కాకూడదనే కారణంతో అప్పటి ప్రభుత్వం పత్రికను రద్దు చేసింది. స్త్రీలకు వారసత్వపు హక్కు కోసం ఉద్యమాలు నడిచాయి. సాంఘిక దురాచారాలకు వ్యతిరేకగా పోరాడుతూనే స్త్రీల సమాన హక్కులు కోసం ప్రభుత్వాలతో పోరాడి హక్కులు సాధించారు.

**ప్రజా ప్రతినిధిగా:**

సూర్యావతిగారు 1950వ దశకంలోనే నందమూరు పంచాయితీ ఎన్నికలలో మూడు సార్లు ప్రెసిడెంట్‌గా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 1958లో ఎం.ఎల్.సిగా ఎన్నికై శాసనమండలిలో ప్రజాసమస్యలను ప్రస్తావించి వాటి పరిష్కారం కోసం కృషి చేశారు. 1987లో ఉంగుటూరు మండల అధ్యక్షురాలిగా ఎన్నికయ్యారు. గ్రామాలలో మరుగుదొడ్ల సమస్య తీవ్రంగా ఉండేది. బుడమేరు వరద గ్రామాలను ముంపుకి గురిచేసేది. అలాంటి సమయాలలో ప్రజలు పడుతున్న బాధలు చూసి ముంపు నివారణకు చర్యలు తీసుకోవటమేగాక దేశంలో ఎక్కడా లేని విధంగా 1,810 వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణం చేపట్టారు. నిధుల కోసం అనారోగ్యాన్ని పక్కన పెట్టి హైద్రాబాద్‌కి అనేకమార్లు తిరిగి పట్టుదలతో నిధులు మంజూరు చేయించారు. తన పదవిని ఏనాడూ స్వంత ప్రయోజనాలకు కాకుండా నిస్వార్థంగా ప్రజల సమస్యల పరిష్కారానికి అలుపెరుగని కృషి చేశారు.

**నిర్బంధాలను సైతం లెక్కచేయక:**

తెలంగాణా సాయుధ పోరాటం సందర్భంగానూ, 1964లో చైనాలో యుద్ధం జరిగినప్పుడు చంటి పిల్లల తల్లిగా ఉన్న సూర్యావతిగారిని పిల్లల నుండి విడదీసి భర్తతోపాటు జైలులో నిర్బంధించారు. 'ఆంధ్ర వనిత' పత్రికను నిషేధించినప్పుడు నిషేధానికి వ్యతిరేకంగా మహిళలు ఆందోళనకు పూనుకున్నప్పుడు లాఠీచార్జి చేసి, సూర్యావతి, అన్నే అనసూయ, మోటూరు ఉదయం తదితర నాయకులతో సహా 70 మంది మహిళలను నందిగామ జైలులో నిర్బంధించారు. నిర్బంధాన్ని సైతం ధైర్యంతో ఎదుర్కొనారు. 1936లో 56 మందితో ఏర్పడిన సంఘం ఈనాడు దేశవ్యాప్తంగా శాఖోపశాఖలుగా విస్తరించి కోటి యాభై లక్షల సభ్యత్వంతో 25 రాష్ట్రాలకు విస్తరించింది.

1947లో ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నికై రాష్ట్రమంతటా అనేక జిల్లాలలో సంఘ నిర్మాణానికి విస్తృతంగా కృషి చేశారు. చనిపోయేవరకూ రాష్ట్ర ఉపాధ్యక్షులుగా కొనసాగారు. 1942 నుండి 1989 వరకు కృష్ణాజిల్లా కార్యదర్శిగా 89 నుండి 1993 వరకూ జిల్లా అధ్యక్షురాలిగా సుదీర్ఘకాలం పనిచేశారు. రాష్ట్రంలో మహిళలపై హింస పెరుగుతోందని, కుటుంబ సమస్యలతో మహిళలు పడుతున్న బాధలు గమనించి 1990లో కృష్ణాజిల్లా మహిళా న్యాయసలహా కేంద్రాన్ని స్థాపించటంలో ఆమె పాత్ర మరువలేనిది. నెల్లూరు జిల్లాలో జరిగిన సారా వ్యతిరేక ఉద్యమం రాష్ట్ర వ్యాపిత ఉద్యమంగా తీర్చిదిద్దటంలో సూర్యావతిగారు కీలకపాత్ర పోషించారు. కృష్ణాజిల్లా సారావ్యతిరేక పోరాట కమిటీని వేసి అన్ని మహిళా సంఘాలను, స్వచ్ఛంధ సంస్థలను ఐక్యం చేసి పెద్ద ఎత్తున పోరాటాలు నిర్వహించారు.

**నేనెరిగిన మానికొండ సూర్యావతి:**

1975లో ఆనాటి ప్రధాని ఇందిరా గాంధీ ఎమర్జన్సీ విధించింది. అన్ని ప్రజాస్వామ్య హక్కులు కాలరాచిన ఆ చీకటి కాలంలో ప్రజాసంఘాల ద్వారా ప్రజాసమస్యలపై పని చేయడమేగాని రాజకీయ కార్యక్రమాలను నిర్వహించలేని స్థితి. ఆ సమయంలో తిరువూరులో జరిగిన మహిళల జనరల్‌బాడీ సమావేశానికి సూర్యావతిగారు హాజరయ్యారు. ఆమె ప్రసంగం మొదటిసారిగా విన్నాను. ఆ తర్వాతి కాలంలో 1977 నుండి 1993 జులై 4

**ఆమె నిరాడంబరత, క్రమశిక్షణ, ఆశయానికి అంకితమై పనిచేయటం, త్యాగశీలత , కార్యకర్తల యెడల ప్రత్యేక శ్రద్ధ కార్యకర్తల సాధక బాధలు శ్రద్ధగా విని పరిష్కార మార్గాలు చూపటం ఇవన్నీ ఆమెనుండి నేర్చుకోవాల్సిన అంశాలు. కార్యకర్తలలో వున్న పొరపాటు ధోరణులను సరిదిద్దుకునేటట్లుగా సున్నితంగా చెప్పేవారు.**

చనిపోయేవరకూ మహిళా ఉద్యమంలో ఆమెతో కల్సి పనిచేసే సదవకాశం నాకు లభించింది. ఆమె నిరాడంబరత, క్రమశిక్షణ, ఆశయానికి అంకితమై పనిచేయటం, త్యాగశీలత , కార్యకర్తల యెడల ప్రత్యేక శ్రద్ధ కార్యకర్తల సాధక బాధలు శ్రద్ధగా విని పరిష్కార మార్గాలు చూపటం ఇవన్నీ ఆమెనుండి నేర్చుకోవాల్సిన అంశాలు. కార్యకర్తలలో వున్న పొరపాటు ధోరణులను సరిదిద్దుకునేటట్లుగా సున్నితంగా చెప్పేవారు. సంపన్న కుటుంబంలో జన్మించినా చాలా సాదాసీదాగా వుండేవారు. సూర్యావతీగారు, జోయాగారు,నేను 1993జులై4న జరిగిన ప్రజాసంఘాల సదస్సుకి హైదరాబాద్ వచ్చాం. కుమార్తె వాణి కొన్న బెంగాలీ కాటన్‌చీర కట్టుకున్నారు. చీరకు జరీ పోగు వుందని చాలా ఫీలయ్యారు. 15సంవత్సరాల వయస్సులోనే చెవిదిద్దులు పెట్టుకోవటం మానివేశానని చెప్పారు. కారణమడిగితే మహిళాసంఘం కార్యక్రమానికి గ్రామం వెళితే "తను పెట్టుకున్న చెవిదిద్దులు బాగున్నాయని" మహిళల నుండి వచ్చిన కామెంట్ పై నాయకుల దృష్టికి వెళ్ళింది. మీరు నగల ప్రచారానికి వెళుతున్నారా? సంఘం ప్రచారానికి వెళుతున్నారా? అనే విమర్శకు గురయ్యానని ఆనాటి నుండి నగలు ధరించటం మానివేశానని చెప్పారు. ఆమె నిబద్ధత, నిర్మాణ సూత్రాలకు కట్టుబడి వున్న పద్ధతులు కార్యకర్తలు నేర్చుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

**1993 జులై 4వ తేదీన 41 ప్రజాసంఘాల రాష్ట్ర సదస్సులో మానికొండ సూర్యావతిగారు ప్రసంగిస్తూ "పరాయిదేశ పరిపాలనకు వ్యతిరేకంగా స్వాతంత్ర్యం కోసం పోరాడాం. ఆ స్వాతంత్ర్యం పేరుతో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం మన దేశ సంపదను పరాయి ప్రభుత్వాలకు తాకట్టు పెడుతోంది. ఈ విధానాలకు వ్యతిరేకంగా అన్ని తరగతుల ప్రజలు మరో సంగ్రామాన్ని నిర్వహించాలి"అని పిలుపునిచ్చారు.**

మహిళా ఉద్యమాల ఫలితంగా సమాజంలో అనేక మార్పులు చోటుచేసుకున్నాయి. మహిళలు విద్య, ఉద్యోగాలలో రాణిస్తున్నారు. మహిళలు పనిచేయని రంగమంటూ లేదు. అయినా ఈనాటికీ రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలలో మహిళలు వివక్ష, అసమానతలను ఎదుర్కొంటున్నారు. పోరాడి సాధించుకున్న చట్టాలు నిర్వీర్య మవుతున్నాయి. సరళీకరణ విధానాలు మహిళలపై భారాలు పెంచుతున్నాయి. స్త్రీలను వ్యక్తిత్వం ఉన్న మనిషిగా గాక అంగడి సరుకుగా చూపిస్తున్నారు. అత్యాచారాలు, లైంగిక వేధింపులు, వరకట్న హత్యలు, ఆడపిల్లల అక్రమ అమ్మకాలు, ప్రేమోన్మాదుల దాడులు పెరిగాయి. సమాజంలో భద్రత లేకపోవటం, వరకట్న సమస్యల వలన ఆడపిల్లల పుట్టుక ప్రశ్నార్థకంగా మారింది. మరోప్రక్క పాలక వర్గాలు అనుసరిస్తున్న విధానాలు ప్రజలలో అసమానతలు పెంచుతున్నాయి. ప్రభుత్వరంగాన్ని విదేశీ మార్కెట్‌శక్తులకు అప్పగిస్తోంది. ఈ నేపథ్యంలోనే 1993 జులై 4వ తేదీన 41 ప్రజాసంఘాల రాష్ట్ర సదస్సులో మానికొండ సూర్యావతిగారు ప్రసంగిస్తూ "పరాయిదేశ పరిపాలనకు వ్యతిరేకంగా స్వాతంత్ర్యం కోసం పోరాడాం. ఆ స్వాతంత్ర్యం పేరుతో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం మన దేశ సంపదను పరాయి ప్రభుత్వాలకు తాకట్టు పెడుతోంది. ఈ విధానాలకు వ్యతిరేకంగా అన్ని తరగతుల ప్రజలు మరో సంగ్రామాన్ని నిర్వహించాలి"అని పిలుపునిచ్చారు. అదే ఆమె చివరి ప్రసంగం. సభ తర్వాత సుందరయ్య విజ్ఞాన కేంద్రానికి వచ్చి జోయా గారితో కలిసి కుమార్తె వాణి యింటికి వెళ్ళారు. అక్కడే గుండె పోటుతో మరణించారు. 13సంవత్సరాలకే స్వాతంత్రోద్యమంలోనూ, ఆ తరువాత వామపక్ష భావాల వైపు ఆకర్షింపబడి జీవిత సర్వస్వం పీడిత ప్రజల విముక్తి కొరకు అలుపెరుగని కృషి చేశారు. ఆమె అడుగుజాడలలో నిబద్ధతతో కృషి చేయటమే మనం ఆమెకు యిచ్చే నివాళులు.

# మనకెందుకు?

- ఉపద్రష్ట కృష్ణప్రియ

(మానవి దశాబ్ది కథల పోటీలో మొదటి బహుమతి పొందిన కథ)

**బా**ల్కనీలో పేపర్ చదువుకుంటున్న జానకమ్మ ఆటో శబ్దం వినబడడంతో తలెత్తింది. ఎదురింటిలోంచి పదేళ్ళ మేఘన స్కూలు డ్రెస్‌లో బయటికొచ్చింది. ముద్దుగా బొద్దుగా విరిసీ విరియని మొగ్గలా వుంటుంది మేఘన. ఆటోవాడు ఎప్పటిలాగే "రా తల్లీ" అంటూ ఆమె గుండెల దగ్గర గట్టిగా పట్టుకుని ఎత్తి, అతడి ముఖాన్ని ఆమె గుండెపై రాస్తూ ముద్దులాడుతూ ఆటోలో కూర్చోపెట్టాడు. బయటికి వచ్చిన ఆయా స్కూల్ బ్యాగ్ ఆటోలో పెట్టి 'టాటా' చెప్పగానే ఆటో కదిలింది. ఆ దృశ్యాన్ని రోజూ చూస్తూనే ఉన్నా ఎందుకోగానీ జానకమ్మకి ఆరోజు కొత్త కోణంలో కనిపించింది. అతడు ఆమె గుండెపై రాసి, ముద్దు పెడుతున్నప్పుడు మేఘన అసౌకర్యంగా కదిలినట్లనిపించింది. ఆ క్షణంలో ఆటోవాడి కళ్ళల్లో కాంక్ష గుర్తుకురాగానే ఒళ్ళంతా చమటలు పట్టేసాయి జానకమ్మకు. టిఫెన్ తినడానికి రమ్మనమని చెబుదామని వచ్చిన కొడుకు ప్రసాద్ "ఏమైందమ్మా" అన్నాడు గాభరాగా. తాను చూసిన సంగతి అతడికి చెప్పడమే మంచిదనుకుని, విషయం వివరించింది జానకమ్మ. అతడు ఒక్క క్షణం ఏమీ మాట్లాడలేదు. వస్తూనే విషయం విన్న కోడలు ప్రమీల "పాప తల్లీ, తండ్రీ పెద్ద ఉద్యోగస్తులు. ఆ ఆటోవాడు పాపని చూసుకుంటున్న ఆయాకూడా వారికి దూరపు బంధువులే. అతడు మేఘనని స్కూలుకేకాదు, ప్రతి శనివారం, సాయంవేళ పార్కుకి తీసుకెళతాడు. చాలా మర్యాదస్తుడు. అనుమానాలు వదిలి టిఫెన్ చేద్దురుగాని రండి" అంటూ విసుక్కుంది. మరేమీ అనలేక మౌనంగా ఉండిపోయిందావిడ. మరో రెండు రోజులు గడిచాయి. అప్పుడప్పుడు ఆమె తొడలమీద చేతులేస్తూ బుగ్గలు పట్టి లాగుతున్నాడు అతడు. ఆ కాస్సేపూ కుంచించుకు పోతోంది మేఘన. మళ్ళీ ధైర్యం చేసి ప్రసాదుతో " ఆ ఆటోవాడి గురించి, మేఘన అమ్మా నాన్నలకు చెప్దాంరా" అంది ప్రాధేయపడుతూ.

"మనకెందుకమ్మా అనవసరపు గొడవలు? నువ్వేదో ప్రశాంతంగా రిటైర్డ్ లైఫ్ గడుపుతావని, ఈ బాల్కనీకీ గ్రిల్స్ పెట్టించి విశాలంగా కట్టించానుగానీ, నువ్విలాగ పక్కవాళ్ళ విషయాల్లో తలదూరుస్తావని అనుకోలేదు" అన్నాడు ప్రసాద్.

''అదేవిట్రా అలాగంటావు? ఆటోవాడి దుర్బుద్ధి నేను కళ్ళారా చూశాను. ఆ ఇంటివారికి తెలియదు. వాళ్ళు తిడతారని భయపడి ఊరుకుంటే ఆ పిల్లకి జరగరానిది ఏదైనా జరిగితే మనల్ని మనం క్షమించుకోగలమా చెప్పు? మనమీ సంఘంలో బ్రతుకుతున్నందుకు, ఈ సంఘానికి కాస్తంత ప్రేమనీ, బాధ్యతనీ పంచడం నేర్చుకోండిరా...'' అంది ఆవేదనగా జానకమ్మ.

ఆవిడ బాధ పడలేక, మర్నాడు ఆ సమయంలో అక్కడ కూర్చుని అంతా చూసి నిజమే అని తేల్చుకున్నారు ప్రసాదూ, ప్రమీల. వాళ్ళకి చెప్పే బాధ్యత జానకమ్మకి అప్పచెప్పారు. ఓ ఆదివారం, వాళ్ళింటికెళ్ళి మాటల సందర్భంలో ఆటోవాడి గురించి చెప్పింది జానకమ్మ.

"నీకు మేము మరీ పనికిరాని చవటల్లాగా, పిల్లని పెంచుకోవడం చేతకానివాళ్ళలాగా కనిపిస్తున్నామా? ఆటోవాడు మాకు చాలా కావలసినవాడు. చాలా మంచివాడు. చూపులన్నీ ఎదురింటిమీద పెట్టుకోక, నీ ఇల్లు సర్దుకోవమ్మా...ఇంక నడు, మాకు చాలా పనుంది" అంటూ వీధి వాకిలి చూపించారు వారు.

కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వచ్చిన జానకమ్మని జాలిగా చూశారు ప్రసాదూ, ప్రమీల. జానకమ్మ ఆందోళన తట్టుకోలేక, బాల్కనీలో కూర్చోవడం మానేసింది. భారంగా వారం రోజులు గడిచాయి. ఓ రోజు ప్రొద్దునే పరిగెట్టుకొచ్చారు మేఘన తల్లిదండ్రులు మీ అమ్మగారేరీ?" అంటూ

"ఎందుకూ? తాపీగా ప్రశ్నించాడు ప్రసాదు. బిక్కు బిక్కుమని చూడసాగింది ప్రమీల. హాల్లో అలికిడికి బయటకు వచ్చింది జానకమ్మ. " క్షమించండమ్మా! రెండు రోజుల నుండి ఆటోవాడు రావటంలేదు. ఎందుకోనని వాకబు చేస్తే, మా పాపతో చదివే మరోపిల్లని రేప్ చేశాడని పోలీస్ కంప్లైంట్ ఇచ్చారట. ఇప్పుడు వాడు జైల్లో ఉన్నాడు. మీ మాటవిని అప్పుడే జాగ్రత్త పడితే ఆ పాప అన్యాయం జరగకపోను" అన్నారు బాధగా "అవును" అంది బాధ కలిసిన గొంతుతో.



# దుర్గాబాయ్ దేశ్‌ముఖ్

**- వకుళాభరణం లలిత**

దుర్గాబాయి ఆంధ్రదేశంలో చరిత్ర, సంస్కృతులకు కేంద్రమైన గోదావరి తీరంలోని రాజమండ్రిలో జన్మించేనాటికి (1909) తెలుగునాట జాతీయోద్యమం ఊపిరిపోసుకుంటోంది. ఒకవైపు సంస్కరణోద్యమం, మరోవైపు జాతీయ భావజాలం-వీటి రెండింటిలో నిబిడీకృతమైన దేశభక్తి, త్యాగశీలత, సేవానిరతి ఆమెను ప్రభావితం చేశాయి. దుర్గాబాయి జాతీయోద్యమంలో పాల్గొని కఠిన కారాగార శిక్షను అనుభవించారు. రాజ్యాంగ నిర్మాణసభ, ప్రణాళికా మండలిలో సభ్యురాలిగా, కేంద్ర స్త్రీ సంక్షేమ సంస్థ తొలి అధ్యక్షురాలిగా బాధ్యతలను నిర్వహించిన ఈమె కృషి సామాన్యమైనదికాదు.

సాంఘిక సంస్కరణ ఉద్యమానికి ఊపిరిగా నిలిచి వాటి నిర్మాణానికి జవసత్వాలను కల్పించిన వీరేశలింగం ఆంధ్రదేశ సంఘ సంస్కరణానికి వైతాళికుడు. ఆంధ్రదేశంలోని ప్రజా జీవితాన్ని మధ్యయుగాల మూఢ నమ్మకాల నుంచి, ద్వంద్వ ప్రమాణాల నుంచి, దురాచారాల నుంచి, ఆనాడు పేరుకుపోయిన నిర్బంధాల నుంచి తప్పించి స్త్రీని విద్యావంతురాల్ని, చైతన్యవంతురాల్ని చేయాలన్న తపన ఏర్పడ్డ తరుణంలో దుర్గాబాయి జన్మించటం గొప్ప చారిత్రక ఘటన. ఆనాడు సమాజంలో ఎటుచూసినా బాల్య వివాహాలే.

ఈ బాల్య వివాహాలు బ్రాహ్మణుల్లో ఎక్కువ. బాల్య వివాహాలు చేయని తల్లితండ్రులు మత ధర్మాలను ఉల్లంఘించిన వారిగాను, పాపులుగాను పరిగణన పొందేవారు. ఆ పొరపాటు భావం నుంచి దుర్గాబాయి తండ్రి బివిఎన్ రామారావు, తల్లి కృష్ణవేణమ్మలు తప్పించుకోలేకపోయారు. వారు ఎనిమిది సంవత్సరాలప్పుడే దుర్గాబాయిని సుబ్బారావుకిచ్చి బాల్య వివాహం జరిపించారు. ఆయన చేసిన తప్పు తెలుసుకునే నాటికి రామారావుకు మరణం సంభవించింది. దుర్గాబాయి ఎవరినైనా వివాహం చేసుకోవాలంటే తప్పక చేయమని



భార్య దగ్గర మాట తీసుకుని తనువుచాలించాడు.

దుర్గాబాయి తండ్రి సంఘ సేవకుడు. ప్లేగు, కలరా వంటి అంటువ్యాధులు వచ్చిన వారికి తాను సేవచేయటమే కాదు. తన బిడ్డల చేత కూడా సేవ చేయించేవాడు. కుల, మత భేదాలు పాటించక భార్యా బిడ్డలను చర్చికి, మసీదుకు కూడా తీసుకువెళ్ళేవాడు. మనుష్యులకు మరణ భయం ఉండకూడదని వాళ్ళను స్మశానానికి కూడా తీసుకెళ్ళేవాడు.

కాకినాడలో దుర్గాబాయిగారిల్లు ఎంతో విశాలమైంది. ఇంట్లో అద్దెకుంటున్న వ్యక్తి భార్యను కొట్టడాన్ని గమనించింది దుర్గాబాయి. స్త్రీ విద్యావంతురాలు కావలసిన అవసరాన్ని గ్రహించింది దుర్గాబాయ్. తండ్రి మరణించినప్పుడు తల్లిని అందవికారిగా చేయాలని చూసిన బంధువర్గానికి, వారి ఛాందస భావాలకు గట్టిగా బుద్ధి చెప్పింది దుర్గాబాయి.

పితృస్వామ్య సమాజంలో స్త్రీలకు జరుగుతున్న సామాజిక అన్యాయాన్ని గుర్తించిన దుర్గాబాయి స్త్రీలకు న్యాయం చేకూర్చాలనీ, స్త్రీలను విద్యావంతులుగా మలచాలనీ అభిప్రాయపడింది. స్త్రీ విద్యకోసం 12వ ఏటనే హిందీ ప్రచార పాఠశాలను నెలకొల్పింది. దానికి ఆమె ప్రిన్సిపాల్, గురువుకూడా.

స్త్రీలు విద్యావంతులు కావాలి. తమ కాళ్ళపై తాము నిలబడగల సాధికారత ఉంటేనే సమాజంలో స్త్రీకి సముచిత స్థానం ఏర్పడుతుంది. తనకు జరుగుతున్న అన్యాయాలను తెలునుకుని, ఎదుర్కోగలుగుతుంది. ఎక్కడైనా తన తల్లియే తనకు విద్యార్థిగా ఉండటం చాలా అరుదైన విషయం. దుర్గాబాయికి ఆ అరుదైన అవకాశం దక్కింది. కేవలం గృహ నిర్వహణకు, పిల్లల పెంపకానికి, భర్తకు సహధర్మచారిణిగా ఉండటానికే కాదు స్త్రీకి విద్య అవసరం. ఆరోజుల్లో సంఘ సంస్కర్తలు, విద్యావంతులైన స్త్రీలు నడిపిన పత్రికలు, రాసిన గ్రంథాలు స్త్రీలలో సంస్కారాన్ని, ప్రావీణ్యతను పెంచడానికి తోడ్పడ్డాయి. స్త్రీ ఆలోచనా శక్తిని పెంపొందించి వారి మేధోశక్తికి, కళాత్మక హృదయానికి, శక్తి సామర్థ్యాలను పెంచే విద్యావిధానం అవసరమని దుర్గాబాయి భావించినందువల్లే ఆంధ్రమహిళా సభ స్థాపించటం జరిగింది. సరైన విద్య, విజ్ఞానం మానవాభ్యుదయానికి పునాది వంటిది. స్త్రీ శక్తిని దేశాభ్యుదయానికి ఉపయోగించడం ఎంతో అవసరం. వారిలో ఆలోచనా విధానాన్ని రేకెత్తించినప్పుడే, చైతన్యాన్ని కలిగించినప్పుడే వారిలో సేవాతత్పరత

పెరుగుతుంది. ప్రతీ అమ్మాయి తన వ్యక్తిత్వాన్ని అభివృద్ధి పరుచుకోవడానికి అవకాశాలుండాలి. వృత్తి విద్యలో చేరడానికి అవకాశం ఉండాలి. వ్యాపార వాణిజ్య విషయాల్లో కూడా ఆమెకు ప్రజ్ఞ ఉండాలి.

దుర్గాబాయి జీవితం ఒక మహోన్నత ఆశయ సాధనకే అంకితం. భర్త నీడలో ఇంటికే పరిమితమై కాలం గడపడం తన లక్ష్యం కాదు. భర్త సుబ్బారావు మంచివాడే. దుర్గాబాయికి ఆసక్తికరమైన ప్రజాహిత కార్యక్రమాలకు ధనాన్ని వెచ్చించడానికి ఏమాత్రం వెనుకంజ వేయలేదు. ఆమె చేసే ప్రతి పనిలో అండగా నిలిచాడు. భార్యపై విపరీతమైన అనురాగం ఉండేది. కాని దుర్గాబాయి లక్ష్యం వేరు. అందుకే ఆమె భర్తకు నచ్చజెప్పి, రెండో వివాహానికి ఉద్యుక్తుని చేసింది. దురదృష్టవశాత్తు 1941వ సంవత్సరంలోనే అతి చిన్న వయస్సులోనే ఆయన మృతి చెందాడు. మరణానికి ముందు రెండోభార్య తిమ్మాయమ్మతో దుర్గాబాయి దగ్గరికి వెళ్ళమని సలహా ఇచ్చాడు కూడా. ఆమె ఆంధ్ర మహిళా సభలో పారిశ్రామిక విభాగంలో చేతిపనుల సంస్థలో తగిన శిక్షణ పొంది ఉద్యోగస్తురాలైంది.

నాడు సమాజంలో ధనవంతులైన న్యాయవాదులు, ఉద్యోగస్తులు, వ్యాపారస్తులూ దేవదాసీ విధానాన్ని ప్రోత్సహించేవారు. శుభకార్యాల్లో దేవదాసీ స్త్రీల నృత్యం ఉండి తీరాల్సిందే.

ఆంధ్రదేశ పర్యటనలో భాగంగా గాంధీజీ రాజమండ్రి రావటం గమనించిన దుర్గాబాయి దేవదాసీలు, పరదాల్లో బంధితులైన ముస్లిం యువతుల్లో మార్పు రావటానికి గాంధీజీ అవసరమని భావించింది. స్థానిక పాఠశాలలో సమావేశాన్ని ఏర్పాటు చేశారు. సమావేశంలో స్త్రీలందరు ఒంటిమీద నగలు వలచి ఇచ్చారు. వాటి ఖరీదు 25,000ల రూపాయలు.

గాంధీ ఉపన్యాసం ఐదు నిమిషాలు అనుకుంటే రెండు గంటలవరకూ సాగింది. గాంధీ ఉపన్యాసాన్ని తర్జుమా చేసిన దుర్గాబాయి అప్పటి నుండీ దక్షిణ భారతదేశంలో గాంధీజీ మాట్లాడిన ఉపన్యాసాలనన్నింటినీ తర్జుమా చేసేది. గాంధీజీ రాకతో దుర్గాబాయి కుటుంబంలో కూడా మార్పు వచ్చింది. కాకినాడలోనే ఆయన రాక ఒక గొప్పమలుపు. దురాచారాల్లో చిక్కుకుపోయి జడపదార్థాలుగా మిగిలిపోయిన సంప్రదాయ స్త్రీ వర్గం కళ్ళు తెరవడానికి ఇది ఒక గొప్ప ప్రేరణ.

దుర్గాబాయి జీవితం చిన్ననాటినుండీ వడ్డించిన విస్తరికాదు. స్వాతంత్ర్యోద్యమ మిషతో చదువు ఆగిపోగా తర్వాత గోరాగారి సహాయంతో మెట్రిక్యులేషన్ పాసై ఇంటర్ మీడియట్ చదవటానికి కాశీ వెళ్ళింది. దుర్గాబాయికి జీవితంలో ప్రేరణ కల్పించిన మహనీయులు గాంధీజీ, మదనమోహన మాలవ్యలు. మాలవ్య అండదండలతో ఇంటర్ పూర్తిచేసి రాజనీతి శాస్త్రంలో బిఏ ఆనర్స్ చేయాలన్న తపనను మాలవ్య స్వాగతించలేదు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మహిళలకు వసతి గృహంలో లేదన్న మిషతో ఆనాటి ఉపకులపతి కట్టమంచి రామలింగారెడ్డి సీటు ఇవ్వకుంటే ప్రకటన ద్వారా అమ్మాయిలను రప్పించి, తావే వసతి గృహాన్ని ఏర్పర్చుకోవటం ఆమె సమర్థతకు నిదర్శనం. బిఏ ఆనర్స్ తర్వాత ఆమెకు లండన్‌లో ఆర్థికశాస్త్ర సంస్థలో సీటువచ్చినా ఆమె వెళ్ళలేదు. మద్రాసులో న్యాయశాస్త్రంలో ఉత్తీర్ణురాలై నేర సంబంధిత న్యాయవాది అయింది. ఏపనిచేసినా అది అర్థవంతమై ఉండాలన్న అభిప్రాయం ఆమెకు బలంగా ఉండేది.

**దుర్గాబాయి దృష్టిలో స్త్రీ విద్యకు అడ్డువచ్చేవి మూడు అంశాలు:** 1. వివాహం, చదువుకన్నా కట్నకానుకలను వరునికి సమర్పించాలి. 2. సంప్రదాయ కట్టుబాట్లు, ఆచార వ్యవహారాలు, కొడుకుకు ప్రాముఖ్యతనివ్వటం. 3. ఆడపిల్లలు చదివి ఏం చెయ్యాలి? ఉద్యోగాలు చెయ్యాలా? ఊళ్ళేలాల్నా? అనే ఉదాసీన వైఖరి.

కాకినాడలో స్థాపించిన బాలికా హిందీ పాఠశాల, తర్వాత దుర్గాబాయి స్థాపించబోయే సంస్థలన్నింటికీ బీజప్రాయమైంది. గాంధీజీ నాయకత్వంలో ఉప్పు సత్యాగ్రహం జరిగింది. సి. రాజగోపాలాచారి, ప్రకాశం పంతులు నాయకత్వం వహించారు. వారిద్దరూ జైలుకు వెళ్ళిన తరువాత దుర్గాబాయి ఆ ఉద్యమ రథసారధి అయింది. చిన్ననాటినుండీ 'ఇంటికి శివాలక్ష్మి, పొరుగింటికి మహాలక్ష్మి" అనే అపవాదు దుర్గాబాయికి ఉండేది.

దుర్గాబాయికి చిన్న వయస్సు నుండే ప్రజ్ఞాశీలత, ధైర్యసాహసాలు, పట్టుదల జీవిత లక్ష్యాసాధన ఉండేవి. 'కొల్లాయి గట్టితేనేమి?' 'మూడు వరకల పిలక' 'మాకొద్దీ తెల్లదొరతనం' అనే పాటలను పాడుతుండేదట. గాంధీజీ దుర్గాబాయిని చేతి గాజులివ్వమంటే వెంటనే ఇచ్చివేసిందామె. గాంధీజీ రూపం ఆమె మనోఃఫలకంపై గాఢంగా ముద్రవేసింది.

విదేశీ వస్త్రాలను నడిరోడ్డులో కుప్పగా పోసి తగులబెట్టడమే కాక ఇంటిల్లిపాదీ ఖాదీ వస్త్రాలను ధరించారు. వాటిని రోడ్లలో ఇంటింటికి తిరిగి అమ్మినందున దుర్గాబాయి తల్లి కృష్ణవేణమ్మను అరెస్టు చేశారు.

ఉప్పు సత్యాగ్రహం భారతదేశంలో అత్యంత ప్రముఖమైన ఉద్యమమైంది. స్త్రీలు పాల్గొనడాన్ని నిషేధించిన గాంధీజీ, దుర్గాబాయి మొండి పట్టుదలను, ఉత్సాహాన్ని చూసి ఏమనలేక అంగీకరించారు. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారు మాత్రం 'ఆడదానివి నీకెందుకు ఇవన్నీ?' అని నిరుత్సాహపరిచారు. కాశీనాధుని నాగేశ్వరరావు, ప్రకాశం పంతులు ఉప్పు

సత్యాగ్రహాన్ని చీరాలలో ప్రారంభించాలంటే మద్రాసులో ప్రారంభించేటట్లు దుర్గాబాయి వాళ్ళను ఒప్పించారు. రాయిపేటలో సత్యాగ్రహ శిబిరాలు లేచాయి. వాటిపేరు 'ఉద్యానవనం'. ప్రకాశం పంతులు తరువాత దుర్గాబాయే ఉద్యమ నాయకురాలైంది.

దుర్గాబాయి నాయకురాలై నిర్వహించిన ఊరేగింపులు, పెల్లుబికిన ఆ ఉత్సాహం అదొక రసవత్తర ఘట్టం. ప్రజల్లో ఇంతటి దేశభక్తి, ఐకమత్యం, స్వార్థరాహిత్యం వెల్లివిరిశాయా? అనే భావం కలిగింది. 'దుర్గాబాయికీ జై' అనే నినాదాలు మిన్నుముట్టాయి. జమదగ్ని అనే దేశభక్తునికి గట్టి దెబ్బ తగలడంతో ఏమైనా అయితే తల్లికి తెలియజేయమని చెప్పాడు. లార్డ్ కన్నింగ్ హామ్ ఆమెను 'సివంగి దుర్గాబాయి' అనటం అతిశయోక్తి కాదు. ఆమెపై లాఠీ చార్జీ చేస్తే ఆమె పిడికిట్లో ఉప్పు ఉంది. ఎన్ని లాఠీ దెబ్బలు తగిలినా ఉప్పును మాత్రం వదలలేదు. ఆమె ధైర్యం, చురుకుదనం, ఉత్సాహం అనన్యసామాన్యాలని పేరు ఉన్నాయి. ఆమెను ప్రజలు సింహంతో పోల్చేవారు. శాసనసభ ధిక్కారం చేసినందుకు ఒక సంవత్సరం జైలు శిక్ష ఆమెకు పడింది. ఆమెను రాయవెల్లూరు జైలుకు తరలించారు. రాయవెల్లూరు అనుభవాలు దుర్గాబాయికి మరుపురాని జ్ఞాపకాలు. ఆమె దృష్టిలో అది ఒక సాంస్కృతిక కేంద్రం. జైల్లో ఎంతో మంది నాయకురాళ్ళుండేవారు. దుర్గాబాయి పాట జైలంతా మారుమ్రోగేదట. దుర్గాబాయికి రుక్మిణీ లక్ష్మీపతి అనే అనుభవజ్ఞురాలితో సావాసం కుదిరింది. దుర్గాబాయి హిందీ పాఠాలను జైల్లో ఎంతోమందికి నేర్పేది. జైల్లో కూడా ఆమె ఒక వ్యక్తి కాదు. ఒక మహాశక్తి. జైల్లో ఆమె 'లక్ష్మి' అనే నవలను, పత్రికలకు వ్యాసాలను రాసింది. జైలు వాతావరణాన్ని నాటకాలతో, కార్యక్రమాలతో సజీవంగా ఉంచేవారు. దిండ్లలో ఉత్తరాలు పెట్టి కుట్టి బయటకు వెళ్ళే ఖైదీల చేత వార్తలు పంపేవారు. 'మీరు త్వరగా రావాలి" అని బొట్టుపెడ్తే 'స్వాతంత్ర్య సంపాదన కోసం ఉద్యమించండి" అని అర్థం స్ఫురించేది.

1931 జాతీయ కాంగ్రెస్ కరాచీలో జరిగితే జవహర్‌లాల్ నెహ్రూ, జమునాలాల్ బజాజ్ దుర్గాబాయిని గుర్తించారు. అంతకు ముందు కాకినాడలో అడిగినట్లే మళ్ళీ బజాజ్ ధనమేమైనా అవసరమా? అని అడిగితే, అక్కరలేదని చెప్పింది. నెహ్రూకు జత ధోవతులను తయారు చేసి దుర్గాబాయి బహూకరించింది.

'సి' క్లాసునే కోరుకుంది. దాంతో ఆమె ప్రమాదకరమైన వ్యక్తిగా ప్రభుత్వ దృష్టిలో పడింది. జైలు అధికారులు ఆమెను 'సి' క్లాసుగా గుర్తించి మధుర జైలుకు తరలించారు. నరకమంటే ఏమిటో ఆమెకు తెలిసింది. మరణశిక్ష విధింపబడ్డ ఖైదీల ఆక్రందనలు, అరుపులు, ఆర్తనాదాలకు అలవాటు పడ్డ దుర్గాబాయికి గొంతు పిసికి చంపబోతున్న పసిబిడ్డ ఆక్రందన వినిపించింది. పసిబిడ్డ ఏడుపు విన్న దుర్గాబాయి ఒక్క తృటిలో పక్కగది గోడ ఎక్కి అవతలివైపుకు దూకి, గొంతు పిసికి చంపబోతున్న పసిబిడ్డను బలవంతంగా లాక్కుని గుండెలకు హత్తుకుంది. ఆ భీభత్స వాతావరణంలో ఆమె చేసిన సాహసం చూసి ధైర్యస్థైర్యాలకు అచ్చెరువొందిన ఆఫీసర్లతో తనకు తోడుగా వీణ కొనివ్వండని అడిగింది.

తన గాంధర్వ వీణానాదంతో మధుర జైలు జీవితానికి ప్రాణం పోసుకుంది దుర్గాబాయి. స్త్రీల పరిస్థితిని అర్థం చేసుకున్న దుర్గాబాయి స్త్రీలు విద్యావంతులవ్వాలనీ, తాను న్యాయశాస్త్రం చదివి, ఇలాంటి సమస్యలకు పరిష్కార మార్గాలను అన్వేషించాలని ఆశించారు.

**దుర్గాబాయి చేసిన సేవల్లో అత్యంత ప్రధానమైనవి:**

1. సంక్షిప్త విద్యా విధానం ప్రవేశ పెట్టడం. స్త్రీలందరూ విద్యా వంతులు కావటానికి ఇదో చక్కని అవకాశం. కేంద్ర సాంఘిక సంక్షేమ శాఖ అధ్యక్షురాలిగా దుర్గాబాయి స్త్రీలకు ఎనలేని సేవ చేశారు. జాతీయ విద్యామండలి అధ్యక్షురాలిగా దుర్గాబాయి సమర్పించిన నివేదిక విద్యారంగానికే ఒక భాష్యం వంటిదని విద్యావేత్తలు అభిప్రాయపడ్డారు.

2. స్త్రీల, పిల్లల, వికలాంగుల ఆరోగ్య పరిస్థితులను మెరుగుపర్చటం కోసం ఆమె ఆంధ్రమహిళా సభావిభాగం సృజనాత్మకమైన నిరోధిత, ఆరోగ్య పరీక్షల కార్యక్రమాన్ని ప్రారంభించారు. హైద్రాబాద్‌లో కూడా నర్సింగ్‌హోం ఏర్పాటు చేశారు. రెండు రాష్ట్రాలకు సంబంధించిన ఆంధ్రమహిళాసభ నర్సింగ్‌హోంలు అభివృద్ధి చెందాయి. అప్పటికే ప్రణాళికా సంఘం గ్రామీణ ప్రాంతాలకు ఆరోగ్య సేవలను అందించాలని ఆలోచించింది. ఆ సమయంలోనే దుర్గాబాయి రాజ్యాంగ నిర్మాణ సభలో సభ్యురాలిగా ఢిల్లీలో ఉండేది.

3. ప్రణాళికా సంఘ సభ్యురాలిగా చేసిన నెహ్రూ సాంఘిక సంక్షేమ బాధ్యతలను దుర్గాబాయికి కేటాయించాడు. అయితే అందులో ఒక్క నయాపైసా నిధులు లేనందు వల్ల ఆ కార్యక్రమాన్ని ఏవిధంగా నిర్వహించగలనని దుర్గాబాయి నెహ్రూను ప్రశ్నల వర్షం కురిపిస్తే ఆయన ఊపిరాడక ఆమెను ఆనాటి ఆర్థిక మంత్రి మరియు ప్రణాళిక సంఘ సభ్యుడైన సిడి దేశ్‌ముఖ్ వద్దకు పంపారు.

సాంఘిక సంక్షేమం అంటే ఆర్థిక, నైతిక, వైద్య, విద్య, కళాభివృద్ధికి సంబంధించినది. దేశ్‌ముఖ్‌తోకూడా దుర్గాబాయి తన వాదనా పటిమను చూపింది. పైగా నేను జన్మతః సంఘసేవికను. 30 ఏళ్ళుగా సంఘసేవకుల మధ్య జీవిస్తున్నాను" అని చెప్తూ స్వచ్ఛంధ సంస్థలకు చేయూతనివ్వాల్సిన అవసరాన్ని చెప్పింది. ప్రణాళిక సంఘం కాల పరిమితి చివరి దశలో ఉన్న కారణంగా పదికోట్లు

ఆమె అడిగిన నాలుగు కోట్లు ఇస్తామని ఆయన చెప్పారు. సాంఘిక సంక్షేమం అనేది ఒక అనాథకు, ఒక అంగవికలునికి, ఒక వ్యాధిగ్రస్తుని సమస్యలకు సరైన పరిష్కారం చూపాలి. ఈ పనికి కొత్తగా సంస్థల నేర్పర్చాల్సిన పనిలేదు. అంత వరకూ పనిచేస్తున్న స్వచ్ఛంధ సంస్థలకు చేయూతనిస్తే, అవే ఆ పనిని చేయగలవని దుర్గాబాయి చెప్పారు.

సేవ విషయంలో దుర్గాబాయిని "తల్లి"గా కొలిచేవారు. ఆంధ్రమహిళా సభ ప్రారంభోత్సవానికి దుర్గాబాయి చేస్తున్న సేవచూసి సిడి దేశ్‌ముఖ్ ముగ్ధుడై ఆమెను వివాహం చేసుకుంటానన్నాడు. వాళ్ళిద్దరి వివాహానికి ప్రణాళికా సంఘం కార్యాలయం కళ్యాణ వేదికయింది.

కేంద్ర సాంఘిక సంక్షేమ అధ్యక్షురాలిగా దుర్గాబాయి పదేళ్ళపాటు అత్యద్భుతంగా పనిచేసి, ఆదర్శవంతంగా కార్యక్రమాలను నిర్వహించగలిగింది. అవిరామంగా, అవిచ్ఛిన్నంగా పనిచేసి స్త్రీ సంక్షేమానికే కాదు, బలహీన వర్గాల సంక్షేమం కోసం కూడా ఎన్నో కార్యక్రమాలను చేపట్టింది.

4. స్త్రీ విద్యావిషయక అవసరాలను, అవకాశాలను, అభ్యున్నతి పథకాలను పరిశీలించిన భారత ప్రభుత్వం 1958లో జాతీయ స్త్రీ విద్యా సమాఖ్యను నెలకొల్పి దానికి ఆమెను ఛైర్మన్‌గా నియమించారు. 1959 నుండి 62 వరకు చేసి తరువాత దానికి రాజీనామా చేసింది.

ఆమె కృషికి యునెస్కో అవార్డు, నెహ్రూ లిటరసీ అవార్డ్, పాల్. జిహస్‌మన్ అవార్డులతోపాటు సిడి దేశ్‌ముఖ్, దుర్గాబాయిలిరువురకూ "పద్మభూషణ్' రావటం హర్షణీయం.

రాజ్యాంగ నిర్మాణ సభలో ఆమె చేసిన కృషి అనితరమైంది. రాజ్యాంగ నిర్మాణం ఒక చారిత్రాత్మక ఘట్టం. దుర్గాబాయి పట్టిష్టమైన ఉపన్యాసాలు చేసింది. హిందూ కోడ్ బిల్లుపై చేసిన ఉపన్యాసాలు, ఆమె పడ్డ తపనకు మచ్చు తునకలు. బిల్లులను ప్రతిపాదిస్తే వాటికి విలువైన సలహాలను దుర్గాబాయి తన అనుభవంతో ఇవ్వగలిగింది. టంగుటూరి ప్రకాశం, నెహ్రూలు దుర్గాబాయి శక్తి సామర్థ్యాలను గుర్తించి అటువంటి సేవలు దేశానికి ఉపయోగపడాలని భావించారు. అంతటి శక్తి యుక్తులున్నందువల్లే ఆమె స్త్రీలలో మొదటి ప్రణాళికా సంఘ సభ్యురాలు కాగలిగింది.

ఆమె స్థాపించిన సంస్థలు ఆంధ్ర మహిళా సభ, మద్రాసు 'లిటిల్ లేడీస్ ఆఫ్ బృందావన్' గా ప్రారంభమైన ఆ సంస్థ పెరిగి పెద్దదై విస్తృతమైన కార్యక్రమాలను చేపట్టింది. దుర్గాబాయి ఏర్పాటుచేసే కార్యక్రమాలకు చుట్టుపక్కల ప్రాంతాల నుండి జమిందారులు హాజరయ్యేవారు. సభ్యతా,సంస్కృతి ఇందులో వెల్లివిరిసింది.

దుర్గాబాయి ' డబ్బు ప్రధానం కాదు. కుడి భుజంగా పనిచేసే కార్యకర్తలు కావాలి" అనటం కార్యకర్తకిచ్చే ప్రాధాన్యతను తెలియజేస్తుంది. ఏ పనియైనా తాను చేశానని చెప్పుకోవటం ఎక్కడా తటస్థించేదికాదు.

హైదరాబాద్‌లో పెట్టిన ఆంధ్రమహిళా సభకు కూడా ఎంతో త్యాగం చేసి నిబద్ధతతో పనిచేసిన వ్యక్తులే వచ్చారు. వాళ్ళసేవ బిలియనుల రూపాయలకంటే విలువైందని ఆమె చెప్పారు.

స్త్రీ సాధికారత విషయంలో ఆమె చేసిన కృషి అనన్యసామాన్యం. సమాజ పరివర్తన కోసం కంకణబద్ధులైన వారిని తీసుకుని, వారి సేవలను సంస్థల అభివృద్ధికి వినియోగించారు.

**దేశ్‌ముఖ్ దంపతులిద్దరూ జీవితాంతం కొన్ని విలువలకు కట్టుబడి ఉన్నారు. ఆ విలువలు:**

1. అంతరాత్మయే వారి గురువు, వారి సిద్ధాంతం.
2. కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యాలను జయించటం.
3. అనాస్తకతను పెంచుకోవటం
4. సేవాసక్తతను పెంపొందించటం
5. తక్కువగా మాట్లాడటం, ఎక్కువ పనిచేయటం.
6. అనుభవంతో పరిజ్ఞానాన్ని సంపాదించటం
7. ఉత్సాహ పూరితమైన ఆదర్శవాదం-సాధారణ జీవితాన్ని గడపగలగటం.
8. నిర్మొహమాటంగా, నిర్భయంగా మాట్లాడటం.
9. మంచిపనులు చేయటానికి వెనుకంజ వేయకపోవటం.
10. బహుమతులను, కీర్తిని ఆశించక పోవటం

నిజాయితీ, చిత్తశుద్ధి, భావుకత, ఆచరణలో పాటించగలగడం వల్లనే అనుకున్న పనిని దుర్గాబాయి చేయగలిగారు.

దేశ్‌ముఖ్ దంపతులు, ఇద్దరూ కలిసి దేశ విదేశాల్లో ప్రయాణాలు చేశారు. దానికి తోడు ఆమె రచించిన గ్రంథాలు, ఆమె మేధాసంపన్నతకు నిదర్శనాలు. ఆమె జీవితమే ఒక సందేశం. ఆమె మే 9వ తేదీన 1981లో మరణించినా శాశ్వతంగా నిలిచి ఉన్నారు.

ఆమె స్వయంసిద్ధ. ఆత్మధృతితో, వీడని పట్టుతో సంకల్పసిద్ధి పొందిన ధన్యజీవి. స్వాతంత్ర్య సమరయోధగా, సేవా సంస్థల పట్టుకొమ్మగా విద్యావేత్తగా శాశ్వతకీర్తిని పొందిన దుర్గాబాయి అశురత్వం పొందారు. భారతదేశంలో ఇంత వరకూ ఇటువంటి వ్యక్తి ఉండటం అన్నది అరుదైనమాట. శ్రీశ్రీ లాగా మానవుడే నా సందేశం అనగల శక్తి, సామర్థ్యం ఆమెకే ఉన్నాయి. ఆమె జీవితం స్త్రీలకే కాదు, అందరికీ ఆదర్శప్రాయం, మార్గదర్శకం. ★





# నేటి భారతం

- గోపాలుని అమ్మాజి

"సీతమ్మను పోలీసోళ్ళు పట్టుకెళ్ళారంట, మొగుణ్ణి పచ్చడి బండతో తలపగలకొట్టి సంపేసిందంట. సీతమ్మ అట్టా సేసిందంటే నాకిప్పటికీ నమ్మ బుద్ధి కావటంలేదు."

"ఆ యెదవ సచ్చినోడు ఏం చేశాడో మనకేం తెలుసు. లేకుంటే సీతమ్మ అంత పని చేస్తుందా? దాదాపు పదేనేళ్ళ నుంచి సూత్తన్నాం. ఆమె పనేంటో ఆమె గోలేంటో ఆమెదే గాని ఏనాడూ ఎవళ్ళని ఒక్క మాటని ఎరుగదు."

"ఇరవై నాలగ్గంటలు ఆమె దాసంతా ఆ పిల్లలమీదనే. ఇద్దరూ ఆడ కూతుళ్ళాయె. ఈ సచ్చినోడేమో నిన్న మొన్నటి దాకా ఆడపిల్లలని ఆళ్ళ ముఖం కూడా నూడకపాయె. ఆడకూతుళ్ళని కన్నదని పిల్లల్ని కన్న రెండుసార్లు సీతమ్మని నానా యాగీ సేసి ఎన్నియిదాల ఏపుకు తిన్నాడు. ఇప్పుడు కూడా ఏదో ఎదవవని సేసుంటాడు. ఆడకూతురు. ఎన్నాళ్ళు భరాయిస్తుంది?"

"సాల్లే ఊరుకో, మనందరం బరాయించటంలా. అందుకని మొగుణ్ణి సంపేత్తారా? కలికాలం, కలికాలం బుద్ధులు కాకపోతే. అంతగా భరాయించలేకపోతే పిల్లల్ని తీసుకుని పుట్టింటికి పోవాల. అంతేగానీ కట్టుకున్నాణ్ణి యింత రాక్షసత్వంగా సంపేయటమేనా? ఆడదికదా కొంచెమైనా మానవత్వం వుండక్కర్లా?"

"మొగుణ్ణి వదిలేసి పుట్టింటికి ఎడితే ఆడకూడా నీలాంటోళ్ళు నోరు పారేసుకోకుండా వుంటారా? మొగుడేదో అన్నంత మాత్రాన ఒళ్ళు కొవ్వెక్కి వదిలేసిందని పెతిరోజు ఆడిపోసుకోరూ. సీతమ్మ లాటి మడిసే వాణ్ణి తలపగలకొట్టిందంటే ఆడెంత దౌర్భాగ్యపు పని చేశాడో."

"సీతమ్మ మొగుడు ఈరయ్య రెండేళ్ళ నుంచి పక్క వీధిలో ఉన్న ఆ సానిముండ లేదూ! దుర్గ! దానింటికి పోయి పద్దాకల ఆడనేవుంటున్నాడట. ఆ యిసయంలో ఏదన్నా గొడవయిందో ఏమో. పెళ్ళాన్ని, సంసారాన్ని వదిలేసి పద్దాక దాని దగ్గరే వుంటే ఏ ఆడదానికైనా బాధే కదా!

"ఈ మద్దె కొన్నాళ్ళ నుంచి ఆడపిల్లలిద్దర్ని బాగానే సూసుకుంటున్నాడట. వాళ్ళ కోసం పండ్లు,

మన పేటలో దాదాపు యాభై కుటుంబాలున్నాయి. ఈడున్న ఆడోళ్ళ బతుకులు సీతమ్మ బతుకున్నా మంచిగా ఏవన్నా వున్నాయా? ఇక్కడున్న ఆడోళ్ళందరి బతుకులు ఒకేలాగా ఉంటాయి. పగలంతా సచ్చే శాకిరి సేయటం, సీకటి పడ్డాక తాగుబోతు మొగుళ్ళ సేతిలో సావు దెబ్బలు తినటం, దెబ్బలకి వళ్ళంతా పులిసిపోయినా ఆడికి కోరిక పుడితే ఒళ్ళప్పగించి బాధని దిగమింగుకుని కళ్ళంబట నీళ్ళు కార్చుకుంటూ "సంసారం సేత్తన్నాం' అనుకుని తృప్తి పడటం. ఇదేగదే మనందరి బతుకులు. ఇంతోసి బతుకులకి ఏ పేరెట్టుకున్నా ఒకటే. మనంటోళ్ళకి పేరు పిల్సుకోటానికే గాని బతుకులు

సీతమ్మకి పెళ్ళినాటికి పద్నాలుగేళ్ళు. వీరయ్యకి యిరవైనాల్గు. పెళ్ళి చేసేటప్పుడు పెద్దలు వీరయ్య యవ్వనాన్ని చూశారేగానీ అతను సీతమ్మకి ఈడవునా కాదా అని మాత్రం ఆలోచించలేకపోయారు. పెళ్ళయిన రెండేళ్ళకే సీతమ్మ నీళ్ళోసుకుంది. పురుటికెళుతున్న భార్యతో 'మగ పిల్లాడినే కనాల. ఆడకూతుర్ని కంటే ఆడనే వుండిపోవాల. గుర్తుంచుకో'' అని శాసించాడు.

బిర్యానీలు తెస్తున్నాడని సీతమ్మ చెప్పింది. ఇంతలో ఏమెచ్చిందో ఏమో ఆ భగవంతుడికే తెలియాలి."

"ఆ సీతమ్మ తల్లి పేరెట్టుకున్నందుకు దీని బతుకుంతా కూడా కట్టాలే అయిపోయాయి. ఏం సేత్తాం."

"సాల్లే నీ మెట్ట యేదాంతం. మన పేటలో దాదాపు యాభై కుటుంబాలున్నాయి. ఈడున్న ఆడోళ్ళ బతుకులు సీతమ్మ బతుక్కన్నా మంచిగా ఏవన్నా వున్నాయా? ఇక్కడున్న ఆడోళ్ళందరి బతుకులు ఒకేలాగా ఉంటాయి. పగలంతా సచ్చే శాకిరి సేయటం, సీకటి పడ్డాక తాగుబోతు మొగుళ్ళ సేతిలో సావు దెబ్బలు తినటం, దెబ్బలకి వళ్ళంతా పులిసిపోయినా ఆడికి కోరిక పుడితే ఒళ్ళప్పగించి బాధని దిగమింగుకుని కళ్ళంబట నీళ్ళు కార్చుకుంటూ "సంసారం సేత్తన్నాం' అనుకుని తృప్తి పడటం. ఇదేగదే మనందరి బతుకులు. ఇంతోని బతుకులకి ఏ పేరెట్టుకున్నా ఒకటే. మనంటోళ్ళకి పేరు పిల్సుకోటానికే గాని బతుకులు దిద్దుకోటానికి కాదు. నాకు సూడు. మాయమ్మ 'ఝాన్సీ లచ్చిమి' అని పెట్టినాది. కానీ ఆ పేరు నా బతుక్కి ఏమయినా ఉపయోగపడిందా?"

"ఛీ, నీయమ్మ. పొద్దుగాలే ఆడముండలంతా ఏంటే మీటింగెట్టారు. మీ పాడుగోలతో బంగారం లాంటి నా నిద్దరంతా పోయినాది. 'సీతమ్మ సీతమ్మ' అని తెగ బాధపడిపోతున్నారు. అదేమన్నా ఆ సీతమ్మ తల్లి లాగా పెద్ద పతివ్రతా ఏంటి? ఎవరికీ తెలీకుండా ఎవడితోనో బాగోతం నడుపుతా వుంటాది. రంకుతనం ఎన్నాళ్ళని దాగుతుంది. అది కాస్తా దాని మొగుడికి తెలిసి మక్కెలిరగదన్నుంటాడు. ఇసయం బయటపడిందన్న భయంతో ఆడి నెత్తి పగలకొట్టుంటది. వాడి ఖర్మకాలి సచ్చాడు. దానికి మీరందరూ పనీపాట మానేసి సీతమ్మని ఓ పెద్ద పతివ్రతని సేసి మాట్లాడేస్తన్నారు. ఛూ! దాని బతుకు సెడ." అసలే వంకరబుద్ధి. దానికి తోడు రాత్రి తాగిన మత్తు యింకా వదల్లేదు. అందుకే నోటికొచ్చినట్టు పేలాడు బంగారయ్య. అప్పటిదాకా గుంపుగా వున్న ఆడవాళ్ళందరూ బంగారయ్యని శాపనార్థాలు పెడుతూ ఎవరి పన్లకి వాళ్ళు వెళ్ళిపోయారు.

బంగారయ్య అన్నట్లు సీతమ్మ నిజంగానే సీత, సుమతి వంటి పతివ్రతలతో పోల్చతగ్గ మనిషి మాత్రం కాదు. ఎందుకంటే సీతమ్మకి జీవితం, దాని విలువ బాగా తెలుసు. ఒక తల్లిగా తన బాధ్యత తెలుసు. కష్టాలొచ్చినప్పుడు ఏడుస్తూ ఎవరికోసమో ఎదురు చూడకుండా దాన్నుంచి ఎలా బయటపడాలో తెలుసు. ఇవన్నీ తెలుసు కాబట్టే తాగుబోతు, తిరుగుబోతు అయిన వీరయ్యని మొగుడుగా కట్టుకున్నా సంసారాన్ని ఎంతో సహనంతో నెట్టుకురాగల్గుతోంది. కూతుళ్ళిద్దర్ని ఎంతో జాగ్రత్తగా, ఏ లోటూ రానీయకుండా పెంచుకుంటోంది. వాళ్ళని పెద్ద చదువులు చదివించలేకపోయినా మంచి చదువులు చదివించటానికి తాపత్రయం పడుతోంది. అలాంటి సీతమ్మని జీవితానికి ఏ లక్ష్యం లేకుండా ఏడ్పులతోనే జీవితాన్ని గడిపేసిన పతివ్రతలతో పోల్చటం తప్పేమరి.

సీతమ్మకి పెళ్ళినాటికి పద్నాలుగేళ్ళు. వీరయ్యకి యిరవైనాల్గు. పెళ్ళి చేసేటప్పుడు పెద్దలు వీరయ్య యవ్వనాన్ని చూశారేగానీ అతను సీతమ్మకి ఈడవునా కాదా అని మాత్రం ఆలోచించలేకపోయారు. పెళ్ళయిన రెండేళ్ళకే సీతమ్మ నీళ్ళోసుకుంది. పురుటికెళుతున్న భార్యతో 'మగ పిల్లాడినే కనాల. ఆడకూతుర్ని కంటే ఆడనే వుండిపోవాల. గుర్తుంచుకో'' అని శాసించాడు. వీరయ్య. పెళ్ళిలో మగపెళ్ళి వాళ్ళు ఏది డిమాండ్ చేసినా 'సరే సరే' అంటూ తలాడించిన తండ్రి గుర్తొచ్చాడు సీతమ్మకి ఆక్షణంలో. అందుకే ఆమె కూడా 'అలాగే' అంటూ వాగ్దానం చేసేసింది.

కానీ సీతమ్మ జీవితంలో మొదటిసారి తనిచ్చిన మాట నిలబెట్టుకోలేకపోయింది. పురుడు పోసిన డాక్టరమ్మ బిడ్డని చేతుల్లోకి తీసుకుంటూ 'సీతమ్మా! నీకు మహాలక్ష్మి లాంటి ఆడపిల్ల పుట్టింది.' అనగానే సీతమ్మ గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి. 'బిడ్డొచ్చిన వేళ్ళ, గొడ్డొచ్చిన వేళ'అంటారు. ఈ బిడ్డ వల్ల తన భవిష్యత్తు ఏమవుతుందో. ఇంక తను అత్తింటికి వెళ్ళే యోగ్యత ఉందో లేదో అని సీతమ్మ మనసులోనే భయంతో కుళ్ళి కుళ్ళి ఏడ్చింది.

ప్రతి ఆడది మొదటిసారి తల్లైనపుడు పొందే మధురానుభూతిని సీతమ్మ జీవితానికి దక్కకుండా చేసింది వీరయ్య శాసనం.

బిడ్డపుట్టి ఆర్నెల్లయినా సీతమ్మ

బిడ్డపుట్టి ఆర్నెల్లయినా సీతమ్మ అత్తింటి వాళ్ళెవరు బిడ్డని కానీ, తల్లిని గానీ చూట్టానికి రాలేదు. ఈ ఆర్నెల్లల్లో సీతమ్మ తండ్రి నర్సింహ కనీసం పదిసార్లయినా వీరయ్య దగ్గరికి వెళ్ళి అతని కాళ్ళు పట్టుకున్నాడు భార్యని కాపురానికి తెచ్చుకోమని. చివరికి పూరి పెద్దల జోక్యం చేసుకుని వీరయ్యని, అతని తల్లిదండ్రుల్ని పిలిపించి పంచాయితీ పెట్టారు. నాలుగ్గంటల సుదీర్ఘ చర్చల అనంతరం నర్సింహ వీరయ్యకి పాతికవేలు యిచ్చేట్టు, వీరయ్య భార్యని, బిడ్డని తన వెంట తీసుకుపోయేట్టు ఒప్పందం కుదిరింది. ఆ తీర్పువిని సీతమ్మ అవాక్కయింది. ఆడబిడ్డ పుట్టింది తన మొగుడివల్ల. కన్నది తను. మధ్యలో తండ్రికెందుకు జరిమానా పడిందో అర్థంకాక వెర్రి ముఖం వేసింది.

ఇంట్లోకి పైసా యివ్వకపోగా ఎదురు సీతమ్మ కష్టపడి సంపాదిస్తున్న డబ్బు తీసుకుపోయి జల్సా చేస్తున్నాడు. సీతమ్మ అన్నీ మౌనంగా భరిస్తూనే ఉంది. కానీ ఆమె మౌనం వెనక ఎన్నో స్థిరమైన నిర్ణయాలు వున్నాయి. కూతుళ్ళిద్దర్ని మంచి చదువులు చదివించాలనుకుంది. ఆ పేటలోని ఆడవాళ్ళ బ్రతుకుల్లాగా వాళ్ళ బ్రతుకులు చాకిరీకి, బానినత్వానికి బలికాకూడదనుకుంది. వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడేలా తీర్చి దిద్దాలనుకుంది.

అత్తింటి వాళ్ళెవరు బిడ్డని కానీ, తల్లిని గానీ చూట్టానికి రాలేదు. ఈ ఆర్నెల్లల్లో సీతమ్మ తండ్రి నర్సింహ కనీసం పరిసార్లయినా వీరయ్య దగ్గరికి వెళ్ళి అతని కాళ్ళు పట్టుకున్నాడు భార్యని కాపురానికి తెచ్చుకోమని. చివరికి పూరి పెద్దల జోక్యం చేసుకుని వీరయ్యని, అతని తల్లిదండ్రుల్ని పిలిపించి వంచాయితీ పెట్టారు. నాలుగ్గంటల సుదీర్ఘ చర్చల అనంతరం నర్సింహ వీరయ్యకి పాతికవేలు యిచ్చేట్టు, వీరయ్య భార్యని, బిడ్డని తన వెంట తీసుకుపోయేట్టు ఒప్పందం కుదిరింది. ఆ తీర్పువిని సీతమ్మ అవాక్కయింది. ఆడబిడ్డ పుట్టింది తన మొగుడివల్ల. కన్నది తను. మధ్యలో తండ్రికెందుకు జరిమానా పడిందో అర్థంకాక వెర్రి ముఖం వేసింది.

“యాడనుంచి తెత్తావయ్యా పాతికేలు. దాని పెళ్ళికి సేసిన అప్పుకే వడ్డీలు కట్టలేక సత్తన్నాం. మళ్ళీ పాతికేలు అప్పంటే మాటలా? అయిన ఇప్పుడు మనకెవరిత్తారయ్యా పాతికేలు.” లబోదిబో మంది సీతమ్మ తల్లి కనకాలు.

‘ఏడనో తలతాకట్టెట్టి తెత్తాలేవే. ఏం సేత్తాం చెప్పు. తల్లీ కూతుళ్ళిద్దర్ని యింటో ఎట్టుకుని జీయితాంతం పోసించేకన్నా యిదే నయం. పిల్ల కాపురం సక్కబడతాది, నలుగురిలో దానికి, మనకి కూడా మర్యాదగుంటది. పెళ్ళయి, వయసులో వున్న పిల్ల మొగుణ్ణొదిలేసి మన కాడ వుంటే సుట్టూతావున్న గుంటనక్కల్నుంచి పెతిచ్చనం దాన్ని కాపాడాలంటే అయ్యేమాటేనా సెప్పు. ఇయన్నీ ఆలోసించే ఒప్పుకున్నానే.” కండువాతో కళ్ళొత్తుకుంటూ చెప్పాడు నర్సింహ.

నర్సింహ పాతికవేలు యివ్వగానే వీరయ్య పెళ్ళాన్ని, కూతుర్ని తనతో తీసుకెళ్ళాడు. వీరయ్యకి నర్సింహ దగ్గర్నుంచి పాతిక వేలేయితే వచ్చాయిగానీ, ఆ డబ్బు సీతమ్మకి మొగుడి ప్రేమనీ, పసిబిడ్డకి తండ్రి మమకారాన్ని మాత్రం కొనిపెట్ట లేకపోయాయి. పైపెచ్చు ప్రతిరోజూ ఏదో వంకతో యిద్దర్ని నోటికొచ్చినట్టు తిట్టేవాడు. సీతమ్మని గొడ్డుని బాదినట్టు బాదేవాడు ఆడపిల్లని కన్నదని.

ఏడాది తిరక్కుండానే సీతమ్మ తన ప్రమేయం లేకుండానే మళ్ళీ గర్భవతయింది. ఈసారి నెలతప్పిన దగ్గర్నుంచే ఆమె గుండెల్లో దడ మొదలైంది. మళ్ళీ ఆడపిల్ల పుడితే తన గతేమవుతుందో అన్న భయంతో కనిపించిన దేవుడికల్లా మొక్కటం మొదలెట్టింది. ఆమె ఎన్ని దేముళ్ళకి మొక్కినా చివరికి మళ్ళీ ఆడపిల్లే పుట్టింది.

వీరయ్య మళ్ళీ గంగిర్లెత్తిపోయాడు. ఈసారి నిజంగానే పెళ్ళానికి విడాకులు యిచ్చేస్తానని నానా జాతర చేశాడు. ఊరి పెద్దలందరూ కూడబలుక్కుని చివరికి ఒక నిర్ణయానికొచ్చారు. అందరూ ఒక్కుమ్మడిగా వీరయ్య యింటికి వెళ్ళి సీతమ్మని, పిల్లల్ని యింటికి తెచ్చుకోకపోతే మర్యాద దక్కదని, పోలీస్ కేస్‌పెట్టి బొక్కలో తోయించటమో లేదా తామే మక్కెలిరగతన్నటమో చేస్తామని బెదిరించారు. చేసేది లేక చచ్చినట్టు అత్తవారింటికి వచ్చి చక్కగా బారసాల చేసుకుని సీతమ్మని, పిల్లలిద్దర్ని యింటికి తెచ్చుకున్నాడు.

బెదిరించి బలవంతంగా పంపిన కాపురం లాగానే వుంది సీతమ్మ పరిస్థితి. ఆమె బాధలు మునుపటికన్నా ఎక్కువయ్యాయి. పెళ్ళాం మీద కచ్చతో వీరయ్య ఆటో వేయటం కూడా మానేశాడు. ఇంట్లోకి పైసా యివ్వకపోగా ఎదురు సీతమ్మ కష్టపడి సంపాదిస్తున్న డబ్బు తీసుకుపోయి జల్సా చేస్తున్నాడు. సీతమ్మ అన్నీ మౌనంగా భరిస్తూనే ఉంది. కానీ ఆమె మౌనం వెనక ఎన్నో స్థిరమైన నిర్ణయాలు వున్నాయి. కూతుళ్ళిద్దర్ని మంచి చదువులు చదివించాలనుకుంది. ఆ పేటలోని ఆడవాళ్ళ బ్రతుకుల్లాగా వాళ్ళ బ్రతుకులు చాకిరీకి, బానినత్వానికి బలికాకూడదనుకుంది. వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడేలా తీర్చి దిద్దాలనుకుంది. అందుకే సీతమ్మ శారీరకంగా ఎంత కష్టపడుతున్నా ఆ కష్టం ఆమె మనసుని తాకటం లేదు. వీరయ్య తాగుడికి తోడు సానికొంపలకి కూడా అలవాటు పడ్డాడు. ఊరంతా అప్పులు చేశాడు. ఫలితంగా వున్న ఒక్క ఆటో కూడా అమ్ముకోవాల్సి వచ్చింది. అదేమని ఎవరన్నా అడిగితే ‘తన పెళ్ళాం ఆడపిల్లల్ని కంటే మరి అప్పులు కాక ఏమవుతుంది.’ అంటూ తన కష్టాలన్నీ ఏకరువు పెడతాడు.

సీతమ్మ రెండు, మూడు సార్లు వీరయ్యని దుర్గ ఇంట్లో చూసింది. కానీ దాని గురించి వీరయ్యనేమి ప్రశ్నించలేదు. సీతమ్మ తనకి వీరయ్య మీద హక్కు, అధికారం ఉన్నాయని ఎప్పుడూ అనుకోలేదు. వస్తాడు, తింటాడు, ఒక్కోసారి కొడతాడు, అప్పుడప్పుడు పక్కన పడుకుంటాడు, పోతాడు. అంతే, అంతకన్నా ఆమె అతని గురించి ఎక్కువ ఆలోచించ దల్చుకోలేదు. సీతమ్మ జీవిత ధ్యేయం ఒక్కటే. బిడ్డలిద్దర్ని బాగా చదివించి గొప్పవాళ్ళని చేయాలి. దానికి అతడు ఆటంకం కాకూడదనే అతన్ని తన ఆలోచనల్లోంచి పూర్తిగా తుడిచి పారేసింది.

సీతమ్మ కలలకి తగ్గట్టే పిల్లలిద్దరూ చదువుల్లో ఎప్పుడూ ఫస్టే. ఇంటి దగ్గర్లో ఉన్న గవర్నమెంటు స్కూల్లోనే పిల్లల్ని చదివిస్తోంది. పెద్ద కూతురు ఏడు, చిన్నది ఆరు

చదువుతున్నారు. ఎంత పని వున్నా నెలకొకసారి బడికి వెళ్ళి టీచర్లతో మాట్లాడి వస్తుంది సీతమ్మ.

ఈ మధ్య వున్నట్టుండి వీరయ్యకి కూతుళ్ళ మీద ప్రేమ పుట్టుకొచ్చింది. అడపాదడపా వాళ్ళ కోసం పళ్ళు, బిర్యానీ పాకెట్లు తెస్తున్నాడు. 'ఆడపిల్లలంటే మహాలచ్చిమి అని తెలీక యిన్నాళ్ళు యీళ్ళని తిట్టిపోశానే. ఇక నుంచి సూడవే సీతాలూ, యీళ్ళని ఎలా సూసుకుంటానో' అంటూ ఉద్వేగంగా మాట్లాడేవాడు. కానీ సీతమ్మ తాగుబోతు మాటల్ని పెద్దగా పట్టించుకునేది కాదు. మాటలేగానీ వీరయ్య పిల్లల కోసమని ఏనాడు పది రూపాయలు తెచ్చి సీతమ్మ చేతిలో పెట్టింది లేదు.

ఒక రోజు సీతమ్మకి స్కూల్ నుంచి కబురొచ్చింది. పెద్ద పిల్ల రమణి రజస్వల అయిందని. పక్కింటి మీనాక్షిని వెంటతీసుకెళ్ళి పిల్లని తీసుకొచ్చింది. చాప పరిచి, శాస్త్రానికి ఐదుగురు ముత్తయిదువులని పిలిచి కూర్చోపెట్టింది. ఎందుకో తెలీదుగానీ సీతమ్మకి కొంచెం ఖంగారు, గాబరా వచ్చాయి. అప్పుడే పిల్ల పెద్దదైపోయిందనే ఆలోచనో లేదా వీరయ్య విషయం విని ఏం భాగోతం చేస్తాడో అన్న భయమో ఆమెకే స్పష్టంగా తెలీటం లేదు. కానీ విషయం చెప్పగానే వీరయ్య "దీనికింత ఖంగారెందుకే. ఆడపిల్ల ఈడొస్తే పెద్ద మడిసి కాదా ఏంటి? పదకొండోనాడు మన పేటోళ్ళందరిని పిలిసి భోజనాలు పెడదాం. అయినా ఆదంతా నే సూసుకుంటానే. నువ్వు ఖంగారు పడమాక." అన్నాడు చాలా తాపీగా. ఏదో తాగుబోతు మాటలనుకుంది గానీ సీతమ్మ, వీరయ్య అన్నట్టుగానే భోజనాలు ఆర్భాటంగానే పెట్టాడు. సీతమ్మకి పెళ్ళాయాక బహుశా యిదేనేమో మనసుకి ఆనందం కల్గించిన విషయం.

పదకొండోరోజు ఫంక్షన్ అయిన మర్నాడే రమణి స్కూల్‌కి వెళ్ళటానికి రెడీ అయింది. 'అప్పుడే వద్దు తల్లీ, ఇంకా ఒళ్ళు పచ్చి ఆరలేదు. ఇంకో వారం రోజులు యింటికాడే వుంటే మంచిది. అంతగా అయితే నీ స్నేహితులు దగ్గర నోట్స్‌లు అడిగి యింటికాడే రాసుకుందువుగానీ" అంది సీతమ్మ. "ఇప్పటికే రెండు వారాలు పోయింది. ఇంకో వారం అంటే హాఫ్ ఇయర్లీ పరీక్షల్లో మార్కులు తగ్గిపోతాయి." అంటూ నసిగింది రమణి. "మళ్ళీ ఒంటి మీదకి ఏదైనా వస్తే అసలు పరీక్షలకే యిబ్బందయిపోతుంది. ఈ ఒక్కసారికి నా మాట యినవే తల్లీ'' అంటూ బ్రతిమలాడింది సీతమ్మ.

ఒక రోజు ప్రొద్దున్నే వీరయ్య చుట్ట కాల్చుకుంటూ "ఒసేయ్ సీతాలూ! నేను పని చేసేకాడ మా అమ్మగార్కి ఏదో ఆపరేషన్ చేశారంట. ఇంటి నిండా పనోళ్ళు వుండార్లే. కానీ టైంకి మందులు, రసాలు యియ్యటానికి సాయంగా వుంటుందని మన రమణిని పంపమన్నారే" అన్నాడు.

సీతమ్మ యింతెత్తున లేచింది. "సచ్చినా నా బిడ్డని పనులకి పంపను. అది సదువుకోవాల. ఈల్లేదని మీ యమ్మగారికి సెప్పు" అంది.

"నీయమ్మ. అసలు నే సెప్పేది సాంతం యినకుండానే ఏంటే నీ యెదవ గోల. ఆవిడ గారేదో పర్మెంటుగా నీ కూతుర్ని తనింట్లో పెట్టుకుంటానన్నట్టు గింజుకుంటావ్. ఒక వారం రోజులడిగింది. అంతే. ఎలాగూ ఈ వారం రోజులు బడికి వెళ్ళదుకదా అని నేనూ సరే అన్నా. అది నీ ఒక్కతికే కూతురా ఏటి? నా క్కూడా కూతురే' అన్నాడు.

ఏమో, నీ మాటలమీద నాకస్సలు నమ్మకం లేదు. అసలు నువ్వేడ పని సేత్తన్నావో కూడా నాకు తెల్వదాయె. ఆ అమ్మగారు ఎవరోఏంటో మరి. మాటిచ్చానన్నావు కాబట్టి, అదీ ఒక్క వారమే అంటున్నావని పంపుతా. ఇక ముందు ఎప్పుడూ నాకు సెప్పకుండా ఎవళ్ళకి మాటివ్వమాకు. అది సదువుకుంటున్న పిల్ల. దాని సదువు పోద్ది" ఖచ్చితంగా చెప్పింది సీతమ్మ.

రమణి తల్లి వంక బిక్కు బిక్కుమంటు చూసింది. "అమ్మా! పనికెళ్ళటం నాకిష్టం లేదే" అంది ఏడుపు ముఖం పెట్టి. 'నాక్కూడా యిష్టం లేదు తల్లీ, కానీ తిక్క ముండాకొడుకు. పంతం వస్తే అసలుకే బడి మాన్పించి నిన్ను ఏడనో పనికి కుదురుస్తాడు. అందుకే ఒప్పుకున్నా. ఒక్క వారమేగా. ఆ తర్వాత ఎట్టాగూ బడికెళతావు కాబట్టి వాడడిగినా యిక నేను పంపేది లేదు"అంది సీతమ్మ కూతుర్ని సముదాయిస్తూ.

"ఇదిగో, ముందే సెప్తున్నా. బిడ్డని రాత్రిళ్ళు ఆడ వదిలేది లేదని సెప్పు. వెంట పెట్టుకొచ్చెయ్. మళ్ళీ ఉదయాన్నే తీస్కపోతుదవు గానీ, అసలే దానికి పని కొత్త." రమణిని వెంట పెట్టుకుని వెళ్తున్న వీరయ్యని హెచ్చరించింది సీతమ్మ. వీరయ్య మూర్ఖత్వానికి భయపడి పంపుతోందే గానీ సీతమ్మకి మాత్రం అసలు యిష్టం లేదు.

సాయంత్రం పని నుంచి యింటికొచ్చిన సీతమ్మకి, బడి నుండి వచ్చిన చిన్న కూతురు కమలకి ఇంట్లో రమణి లేకపోయేసరికి ఏదోగా అనిపించింది. ఇద్దరు దిగులు దిగులుగా కూర్చున్నారు. రాత్రి పొద్దు పోయాక వీరయ్య యథాప్రకారం పీకలదాకా తాగి ఒంటరిగా వచ్చాడు. రమణి కనపడకపోయేసరికి సీతమ్మకి గుండె గుభేలంది. వీరయ్యని గట్టిగా నిలేసింది. ' బిడ్డ ఏదయ్యా! రాత్రికి యింటికి తీసుకొచ్చేమన్నావా'అంది ఖంగారుగా.

" ఛీ, ముదనష్టపు ముండ. ఇంకా యింట్లోకి సాంతం రాకముందే ఏంటే నీ ఎదవగోల. దాన్ని నేనేమైనా నంపేత్తాననుకున్నావా ఏంటి? అమ్మగారింటికి యియ్యాల బంధువులొచ్చారంట. అందుకని ఈ ఒక్క రోజుకి సాయంగా దాన్ని ఆడనే వుంచమని అడిగారు. తెల్లారేపాటికల్లా పంపిత్తానన్నార్లే" అన్నాడు వీరయ్య తాగిన మైకంలో.

"అదేంటయ్యా! ఆడపిల్లని అలా ముక్కూ ముఖం తెలీని కాడ వంటరిగా వదిలేసొచ్చావా? రేపు దాన్ని సచ్చినా పనికి పంపను"ఖచ్చితంగా చెప్పేసింది సీతమ్మ.

సీతమ్మకి ఆ రాత్రంతా నిద్దరపట్టలేదు. చిన్న పిల్ల, పుట్టినప్పటి నుంచి యిప్పటిదాకా ఏనాడూ తల్లిని వదిలి వుండలేదు. ఎలా వుందో అనే దిగులుతో ఆ రాత్రంతా కంటి మీద కునుకులేదు సీతమ్మకి. వీరయ్య మాత్రం వెంటతెచ్చుకున్న చికెన్ బిర్యాని గొంతుదాకా తిని హాయిగా గుర్రుపెట్టి నిద్రపోయాడు.

ఇంకా సాంతం తెల్లారక ముందే లేచింది సీతమ్మ. వాకిట్లో ముగ్గేసి, పొయ్యిమీద టీ గిన్నె పెట్టి దాని ముందు ఆలోచిస్తూ దిగాలుగా కూర్చునుంది. రాత్రి రమణి యింటికి రాకపోయేసరికి ఆమె ఆలోచనలు పరిపరివిధాల పరిగెత్తుతున్నాయి. ఇంతలో యింటిముందు కారాగిన శబ్దం వినబడింది. అంతే ఒక్క ఉదుటున వాకిలి దగ్గరికి పరిగెత్తింది. ఎవరో రమణిని దిగబెట్టి వెళ్ళిపోయారు. రమణి సీతమ్మని చూడగానే 'అమ్మా'అంటూ పరిగెత్తుకొచ్చి గట్టిగా వాటేసుకుంది. ఆమె శరీరం భయంతో వణికిపోతోంది. సీతమ్మని పట్టుకుని పెద్దగా ఏడ్వటం మొదలెట్టింది. కూతుర్ని ఆ స్థితిలో చూసిన సీతమ్మ మెదడు ఆ క్షణంలో మొద్దుబారిపోయింది. కూతుర్ని ఎలా తీసుకొచ్చి లోపల మంచం మీద కూర్చోపెట్టిందో కూడా ఆమెకి తెలీలేదు. జరగరానిదేదో జరిగిందన్న విషయం మాత్రం ఆ తల్లి మనసుకి తెలుస్తూనే ఉంది. కానీ ఆదేమిటో కూతురి నోటితో వినటానికి ఆమెకి ధైర్యం చాలటంలేదు. కాళ్ళకింద భూమి కదిలిపోతున్నట్లు, తల్లో నరాలన్నీ చుట్టచుట్టుకు పోతున్నట్టు అనిపిస్తోంది. కూతురి వంక పిచ్చిదానిలా చూస్తోంది. కానీ రమణి ఆదేమీ గమనించే స్థితిలో లేదు. ఏడుస్తూనే వెక్కిళ్ళ మధ్య చెప్పింది. "అమ్మా! నాన్న నన్ను ఆ దుర్గకి అప్పగించాడే. ఆమె నన్ను రాత్రి బలవంతంగా వాళ్ళ దగ్గరికి పంపింది. వాళ్ళు రాత్రంతా నన్ను ఎలా పీక్కుతున్నారో చూడు" అంటూ లంగా పైకెత్తి చూపించింది. రక్తం వరదలు కడుతోంది. సీతమ్మ కళ్ళు తిరిగి పోయాయ్. పెద్ద మనిషయి పదిహేను రోజులు కాలేదు. వంటి పచ్చి కూడా ఆరలేదు. అలాంటి పసిబిడ్డ మీద యింతటి పైశాచికత్వమా? తల్లి గుండె బద్దలవుతోంది. ఆ క్షణంలో ఆమెకి హఠాత్తుగా రాత్రి వీరయ్య మాట్లాడిన మాటలు గుర్తొచ్చాయి. రాత్రి తాగొచ్చి చికెన్ బిర్యాని తింటూ ప్రక్కనే మంచం మీద నిద్రపోతున్న చిన్న కూతురు కమల వంక చూసి 'ఒసేయ్ సీతాలూ! ఈ చిన్న గుంటకి కూడా పెద్దమడిసయ్యే ఈడొచ్చిన్నట్లున్నాది కదే. ఇది పెద్ద మడిసయితే పెద్ద దానికి సేసిన దానికన్నా ఘనంగా ఫంక్షన్ చేస్తానే. సూద్దువుగానీ" అన్నాడు.

ఆ మాటలు గుర్తు రాగానే సీతమ్మ వెన్నులో వణుకు పుట్టుకొచ్చింది. అతి ప్రయత్నం మీద తనని తాను సంభాళించుకుంది. ఆవేదనతో ఆమె రక్తం మరిగిపోతోంది. రెండే రెండు నిమిషాలు కళ్ళు మూసుకుని చాలా స్థిరంగా ఆలోచించింది. అంతే. ఆమెలోని నిజమైన ఆడది తల్లి రూపంలో బయటకొచ్చింది. ఆమె కళ్ళు మొదట ప్రక్కనే ఉన్న పచ్చడి బండ మీద, ఆ తర్వాత సారా మత్తులో గుర్రుపెట్టి పశువులా నిద్రపోతున్న వీరయ్య మీద నిలిచాయి. అపర కాళికలా లేచింది సీతమ్మ. వీరయ్య తలమీద బలంగా రెండే రెండు దెబ్బలు వేసింది. ఆ తర్వాత అతడు బతికాడో చచ్చాడో కూడా చూడలేదు. వెంటనే రమణిని తీసుకుని డాక్టర్ దగ్గరికి పరిగెత్తింది. జరుగుతున్నదంతా అయోమయంగా చూస్తుండిపోయింది కమల. కోర్టులో జడ్జిగారి ముందు జరిగినదంతా వున్నదున్నట్టు చెప్పింది సీతమ్మ. ఈ కథలో జడ్జిమెంట్ ఎలా వుండాలి అనేది నేను పాఠకులకే వదిలేస్తున్నాను.

ఆమెలోని నిజమైన ఆడది తల్లి రూపంలో బయటకొచ్చింది. ఆమె కళ్ళు మొదట ప్రక్కనే ఉన్న పచ్చడి బండ మీద, ఆ తర్వాత సారా మత్తులో గుర్రుపెట్టి పశువులా నిద్రపోతున్న వీరయ్య మీద నిలిచాయి. అపర కాళికలా లేచింది సీతమ్మ. వీరయ్య తలమీద బలంగా రెండే రెండు దెబ్బలు వేసింది. ఆ తర్వాత అతడు బతికాడో చచ్చాడో కూడా చూడలేదు. వెంటనే రమణిని తీసుకుని డాక్టర్ దగ్గరికి పరిగెత్తింది.

"అమ్మా! నాన్న నన్ను ఆ దుర్గకి అప్పగించాడే. ఆమె నన్ను రాత్రి బలవంతంగా వాళ్ళ దగ్గరికి పంపింది. వాళ్ళు రాత్రంతా నన్ను ఎలా పీక్కుతున్నారో చూడు" అంటూ లంగా పైకెత్తి చూపించింది. రక్తం వరదలు కడుతోంది. సీతమ్మ కళ్ళు తిరిగి పోయాయ్. పెద్ద మనిషయి పదిహేను రోజులు కాలేదు. వంటి పచ్చి కూడా ఆరలేదు. అలాంటి పసిబిడ్డ మీద యింతటి పైశాచికత్వమా? తల్లి గుండె బద్దలవుతోంది.

ఎందుకంటే కోట్ల రూపాయలు సంపాదించాలనే ధనాశతో సారా కాంట్రాక్టర్లు, లిక్కర్ డీలర్స్, పదవీ వ్యామోహంతో రాజకీయ నాయకులు అధికారం నిలబెట్టుకోవటం కోసం ప్రభుత్వాలు మద్య పానాన్ని పెంచి పోషిస్తున్నారు. తమ స్వార్థం కోసం పగలు, రాత్రి అని కూడా లేకుండా ప్రజల్ని బానిసల్ని చేసి మత్తులో ముంచేస్తున్నారు. వీరయ్య లాంటి బలహీనులు వాళ్ళ చేతిలో పావులవుతుంటే, ఏ పాపం ఎరుగని సీతమ్మ, రమణి లాంటి అమాయకపు ఆడవాళ్ళు మాత్రం దానికి బలైపోతున్నారు. నిజానికి నేటి సమాజంలో మత్తు మైకంలో మగవాళ్ళు చేస్తున్న అతిపాశవిక చర్యలతో పోలిస్తే వీళ్ళిద్దరి కథ ఒక చిన్న ఉదాహరణ మాత్రమే అనిపిస్తుంది. అంటే ఆలోచించండి! నేడు సమాజం ఎంతటి ప్రమాద స్థితిలో వుందో. ఇది యిలాగే కొనసాగితే రేపటి మన దేశ భవిష్యత్తు ఒక చీకటి ప్రశ్నగా మిగిలిపోతుంది. అప్పుడు మనకి మంచి పౌరులు కాదు కదా! అసలు మనిషనే వాడే కనిపించడు. సో, ఈ కథలో నిజమైన నేరస్థులెవరో, శిక్ష ఎవరికి పడాలో పాఠకుల అభిప్రాయానికే వదిలేస్తున్నాను.

**గమనిక:** ఈ కథలోని పాత్రల సంభాషణలో వాడిన 'యాస'లో ఏదైనా తప్పులుంటే ఇది నా చిన్న ప్రయత్నంగా మాత్రమే భావించగలరు. •

# ఆ అమ్మలు ఉద్యమ

# వేగుచుక్కలు

- బి.సుధాకిరణ్

**వారు చదువుకోలేదు కానీ జీవితాన్ని చదివారు. ఉద్యోగాలు చేయలేదు. ఉద్యమాల్లో చురకత్తులవలె మెరిశారు. కుటుంబాన్ని అశ్రద్ధ చేయలేదు. ఉద్యమంలో కుటుంబాలతో మమేకమయ్యారు. కష్టకాలంలో అజ్ఞాత వీరులకు కనురెప్పలయ్యారు. మాకెందుకు ఉద్యమాలు అనుకోలేదు.....సమాజ శ్రేయస్సు కమ్యూనిస్టు పోరాటాల్లోనే ఉందని నమ్మారు. పోరాటంలో ముందుకురికారు. వడివడిగా వడిశల చేపట్టి పైరు పాడుచేస్తున్న పిట్టల్ని తోలినట్లు జమిందారు తొత్తుల్ని పారద్రోలకుంటే బతుకులేదన్న ఆ వీరత్వం...కారపు సంచులు చేతపట్టి పోలీసు, భూస్వామ్య గూండాలకు ఎదురేగిన ధీరత్వం...అందుకే ఆ అమ్మలు ఉద్యమ వేగుచుక్కలు. నైజాం నవాబు పీచమణచిన 1950లో జరిగిన తెలంగాణా సాయుధ పోరాటానికి కృష్ణానదికి ఈవల వద్దునున్న కృష్ణా, గుంటూరు జిల్లాలు వెన్నుదన్నుగా నిలిచాయి. జిల్లా నలుచెరుగులా సాగిన ఉద్యమంలో తుపాకీ తూటాలకు నేలకొరిగిన వీరులకు ధీటుగా వీరవనితలూ ఉద్యమ రహదారిలో నడిచారు. వారిలో కొందరి సంక్షిప్త పరిచయం...'చైతన్య మానవి' పాఠకుల కోసం.....**

### కనుమూరి కమలమ్మ
### రామాపురం, దాచేపల్లి మండలం

కామ్రేడ్ కమలమ్మ పుట్టింది కృష్ణాజిల్లా కాట్రపాడు. మెట్టినిల్లు గుంటూరు జిల్లా పల్నాడు ప్రాంతం రామాపురం. భర్త కమ్యూనిస్టు ఉద్యమకారుడు కావడంతో కమలమ్మ ఉద్యమంలో మమేకమవడానికి ఎక్కువ రోజులు పట్టలేదు. తెలంగాణా సాయుధ పోరాటకాలంలో రహస్యంగా ఉంటున్న కమ్యూనిస్టులందరికీ వారి ఇల్లు నిలయంగా ఉండేది. ప్రజానాట్యమండలి ప్రదర్శించే "మా భూమి" నాటకంలో ఆమె సీత పాత్రలో నటించి విరాళాలు, వసూలు చేసి, తెలంగాణా సాయుధ పోరాటయోధులకు అందిస్తూ ఉండేది. రహస్యంగా కమ్యూనిస్టు దళాలకు అన్నం ముద్దలు అధికంగా మూటకట్టి గేదెలు కాసే కుర్రవాళ్ళతో పంపేవారు. పల్నాడు ప్రాంతంలో మహిళా ఉద్యమానికి ఆమె నాయకత్వం వహించారు. 1948 కమ్యూనిస్టుల మీద నిర్బంధంలో కమలమ్మ భర్తను అరెస్టు చేశారు. వారు నడుపుతున్న స్కూలును, వారు నివసిస్తున్న ఇల్లును పోలీసులు నేలమట్టం చేశారు. అయినా ఆమె ఉద్యమంలోనే ప్రజల్ని చైతన్యం చేస్తూ పనిచేశారు. ఆమె మీద కూడా పోలీసుల నిర్బంధం పెరగడంతో ఇద్దరు చిన్నబిడ్డలతో పుట్టింటికి చేరింది. మలబారు పోలీసులు అక్కడ కూడా ఆమెను నిర్బంధాలకు గురిచేయడంతో ఆమె తన ఇద్దరు చిన్నపిల్లలతో అద్దంకి ప్రాంతంలో రహస్య జీవితం గడపవలసి వచ్చింది. వృద్ధురాలైన ఆమె అత్తగారు చనిపోయినప్పుడు కూడా ఆమెగాని, ఆమె భర్తగాని రామాపురం రావడానికి వీలులేకపోయింది. ఆ కాలంలో కమ్యూనిస్టులపై సాగిన నిర్బంధకాండకు ఇది ఒక తార్కాణం. 1951వ సంవత్సరంలో కమ్యూనిస్టులపై నిర్బంధం సడలించిన మీదట, కడలూరు జైలునుండి ఆమె భర్త విడుదలైన తరువాత మాత్రమే ఆమె రహస్యజీవితం నుండి బయటకు రాగలిగింది. అప్పటినుండి 72వ ఏట మరణించే వరకు పార్టీ, ప్రజాసంఘాల పురోభివృద్ధికి జీవితాన్ని అంకితం చేసిన ఆమె ఒక ఆదర్శ కమ్యూనిస్టు.

### ధరణికోట మాణిక్యమ్మ
### నరసరావు పేట తాలూకా సాతులూరు

కామ్రేడ్ ధరణికోట మాణిక్యమ్మ నరసరావుపేట సాతులూరు. ఆమె జీవితంలో అత్యంత విషాదం భర్త, ఇద్దరు బిడ్డలు చనిపోవడం. దీంతో పుట్టింటికి వచ్చి తమ్ముడు దగ్గర ఉన్నారు. ఆమె తమ్ముడు ఉద్యమకారుడు. కామ్రేడ్ మాణిక్యమ్మ కూడా ఉద్యమబాటలో అడుగిడారు. 1948లో కమ్యూనిస్టు పార్టీపై నిర్బంధ తారాస్థాయికి చేరుకుంది. నాయకులందరూ అజ్ఞాతవాసంలోకి వెళ్ళారు. పార్టీ నిర్ణయం మేరకు రహస్యంగా పనిచేస్తున్న నాయకుల పోషణ, భద్రత బాధ్యతలను సంతోషంగా తన భుజాలపైకి ఎత్తుకున్నారు. డెన్ నిర్వాహకురాలిగా రహస్యంగా పనిచేస్తున్న నాయకులకు అన్ని సౌకర్యాలను

## చైతన్య మానవి ప్రత్యేక సంచికకు శుభాకాంక్షలతో...

# చౌక డిపో డీలర్ల అసోసియేషన్
## అమలాపురం మండలం

బోధించు! సమీకరించు!! పోరాడు!!!





మహిళలకు మొట్టమొదటి రాజ్యాంగ హక్కులు కల్పనకై పోరాడిన
డా॥ బి.ఆర్. అంబేద్కర్ స్ఫూర్తితో 'చైతన్యమానవి' ముందుకుసాగాలని ఆకాంక్షిస్తూ....




**ఎన్. చిట్టిబాబు**
తహశీల్దారు
అమలాపురం మండలం. తూ॥గో॥జిల్లా.

10 వసంతాలు పూర్తి చేసుకున్న

## చైతన్య మానవి ప్రత్యేక సంచికకు శుభాకాంక్షలతో...




**మానేపల్లి అయ్యాజీ వేమా**
బి.ఎ., బి.ఎల్.,
మాజీ ఎమ్మెల్యే, నగరం
ఎల్.బి. నగర్ - రాజోలు, తూ॥గో॥జిల్లా.
సెల్ : 98492 61499.



# తెలుగు అకాడమి





హిమాయత్‌నగర్, హైదరాబాదు - 500 029.

అధ్యక్షులు
**మాన్యశ్రీ సి. దామోదర రాజనర్సింహ**
ఉప ముఖ్యమంత్రి,
ఉన్నత, సాంకేతిక విద్య శాఖామాత్యులు,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

ఈ మెయిల్: info@teluguacademy.net
వెబ్: www.teluguacademy.net
ఫోన్‌నంబర్లు: 040-23225215, 23226041
ఫ్యాక్స్ : 040-23225359


## అకాడమి లక్ష్యాలు

భాషాప్రయుక్త రాష్ట్రాల ఆవిర్భావం తర్వాత ప్రాంతీయ భాషల అభివృద్ధి, వికాసానికి భారత ప్రభుత్వం తీసుకున్న కొన్ని చర్యల ఫలితంగా తెలుగు అకాడమి ఆవిర్భవించింది. తెలుగు అకాడమి ప్రధాన ధ్యేయం తెలుగు భాషను అభివృద్ధి పరచి విద్యా విషయక గ్రంథాలను విద్యార్థులకు అందించడం.

## అకాడమిలో లభించే పుస్తకాలు

ఇంటర్ నుంచి పి.జి.వరకు పాఠ్యపుస్తకాలు అందివ్వడం అకాడమి బాధ్యతలలో ప్రధానమైనది. మాండలికాల వంటి భాషా గ్రంథాలు, నిఘంటువులు, పాఠశాల స్థాయి నిఘంటువులు, పదకోశాలు, పారిభాషిక పదకోశాలు, పోటీ పరీక్షలకు అవసరమైన గ్రంథాలు, తెలుగు బోధన శిక్షణగ్రంథాలు, వ్యక్తిత్వ వికాసగ్రంథాలు, స్వయం ఉపాధికల్పనకు ఉపకరించే పుస్తకాలు అకాడమి ప్రచురిస్తుంది. అకాడమి ప్రధానంగా భాషా వికాసం కోసం, భాషను పరిపుష్టం చేయడానికి ఉద్దేశించింది.

తెలుగు అకాడమి 40 సంవత్సరాలుగా "తెలుగు" త్రైమాసిక వైజ్ఞానిక పత్రికను కూడా నిర్వహిస్తున్నది.

## అకాడమి విక్రయ కేంద్రాలు

అకాడమి ప్రచురించే పుస్తకాలను హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి, అనంతపురం, వరంగల్, గుంటూరులలోని పంపిణీ కేంద్రాల ద్వారా రాష్ట్రమంతటా విద్యార్థులకు అందచేస్తున్నది.

## తెలుగు రానివారికి తెలుగు నేర్పించడం

పరిపాలన రంగంలో తెలుగును అధికారభాషగా ప్రవేశపెట్టి, దాన్ని సులువుగా అమలుపరచడానికి ప్రభుత్వం చేస్తున్న కృషిలో సహకరించడం అకాడమి లక్ష్యాలలో ఒకటి. అధికారభాషగా తెలుగును అమలుపరిచే ప్రభుత్వ విధానంలో భాగంగా, అకాడమి లక్ష్యాలకనుగుణంగా రెండోభాషగా తెలుగు బోధన కార్యక్రమం కింద తెలుగు భాషను నేర్చుకోవాలనుకునేవారికోసం, ప్రభుత్వ, ప్రభుత్వేతర ఉద్యోగుల తదితరుల కోసం గత 40 సంవత్సరాలనుంచి తెలుగులో పరిచయకోర్సును, ఉన్నత కోర్సులను నిర్వహిస్తుంది. బోధన కాల వ్యవధి 48 పనిరోజులు. కోర్సులు పూర్తి అయ్యేనాటికి తెలుగులో మాట్లాడడం, రాయడం, చదవడం కొంతవరకు అలవరచుకోవచ్చు. పరిచయ కోర్సులో ప్రవేశానికి విద్యార్హత ఎస్.ఎస్.సి., ఉన్నత కోర్సులో చేరడానికి పరిచయకోర్సు పూర్తిచేసి ఉండాలి. ఇప్పటివరకు 54 పరిచయకోర్సులు, 40 ఉన్నతకోర్సులను అకాడమి నిర్వహించింది. ఈ కోర్సు పూర్తిచేసి ఉత్తీర్ణులయి ఉన్నతస్థాయిలో నిలిచినవారికి బంగారు పతకం బహూకరించడం జరుగుతున్నది.

ఈకోర్సుకు సంబంధించి తెలుగు పరిచయవాచకం రూ.45/-లకు, రాత పనిపుస్తకం రూ.16/-లకు ఉన్నత వాచకం రూ.24/- లకు, లర్న్ తెలుగు సి.డి. రూ.60/-లకు తెలుగు అకాడమి విక్రయిస్తున్నది.

## అకాడమి అందించే విద్యార్థి పురస్కారాలు

2001 సంవత్సరం నుంచి తెలుగు అకాడమి ఇంటర్మీడియట్‌లో తెలుగు మాధ్యమంలో చదివి రాష్ట్రస్థాయిలో ప్రథమ, ద్వితీయ స్థానాలు సాధించిన విద్యార్థులకు పురస్కారాలు అందచేస్తున్నది.


ఉపాధ్యక్షులు
**శ్రీ ఎమ్.జి. గోపాల్, ఐ.ఏ.ఎస్.**
రాష్ట్రఉన్నత విద్యాశాఖ ముఖ్యకార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

సంచాలకులు
**ఆచార్య కె. యాదగిరి**
ఎం.ఎ., పి.హెచ్.డి.

చైతన్య మానవి దశాబ్ది పూర్తి చేసుకున్న
సందర్భంగా శుభాకాంక్షలతో...



**A.C.Dibbalamma,**
Assistant Director,
Office of the District Educational office,
Kurnool

మహిళా ఉద్యమ కరదీపిక చైతన్య మానవి
10 సం॥ పూర్తి అయిన సందర్భంగా ప్రత్యేక శుభాకాంక్షలు



**హనుమన్న**
సబ్-రిజిస్ట్రార్,
కర్నూలు -2

చైతన్య మానవి దశాబ్ధి పూర్తి
చేసుకొన్న సందర్భంగా
శుభాకాంక్షలతో...

# పౌరసరఫరాల శాఖ కర్నూలు జిల్లా



కర్నూలు జిల్లా నందు మొత్తం 1096754 కుటుంబ సరఫరా కార్డులు కలవు. ఇందులో తెలుపు కార్డులు (WAP) 8,32,181 , అంత్యోదయ 61,138 (AAY ) కార్డులు, అన్నపూర్ణ (AP) 1,556 కార్డులు గలవు. వీటికి అదనంగా చెంచు కుటుంబాలకు అంత్యోదయ కార్డులు 1,757 కార్డులు, హెచ్ఐవి, లెప్రసీ వ్యాధిగ్రస్తుల కుటుంబాలకు 589 అన్నపూర్ణ (AP) కార్డులను మంజూరీ చేయబడినవి. మరియు కార్డులేని వారికి రచ్చబండ కార్యక్రమంలో 1,98,503 కూపన్లు జారీ చేయడమైనది. ఈ మొత్తం కార్డులకు జిల్లా మొత్తానికి 169318.97 క్వింటాళ్లు బియ్యంను కార్డుదారులకు పంపిణీ చేయబడుతున్నవి. ఇందులో తెలుపు కార్డులకు కుటుంబ సభ్యుల సంఖ్యను బట్టి ఒక్కొక్కరికి 4 కేజీల ప్రకారం మరియు అంత్యోదయ కుటుంబాలకు ఒక్క కార్డుకు 35 కేజీల ప్రకారం మరియు అన్నపూర్ణ, హెచ్ఐవి, లెప్రసీ కుటుంబాలకు ఒక్క కార్డుకు 10 కేజీల ప్రకారం పూర్తి ఉచితంగా ఇవ్వబడుతున్నవి. జిల్లాలోని చేనేత కుటుంబాలకు 27.50 క్వింటాళ్ల బియ్యం జారీ చేయబడుతున్నవి. మరియు కుటుంబానికి (కార్డుకు) ఒక్క కేజి ప్రకారం మొత్తం కార్డులకు 984070 కేజీల కందిబ్యాడలు, మరియు ఫాంఆయిల్ 984070 లీటర్లను మరియు చక్కెర 4920.35 క్వింటాళ్లను, గోధుమలు 700 క్వింటాళ్లను కేటాయించబడుతున్నవి. జిల్లాలో 25 హోల్‌సేల్ కిరోసిన్ డీలర్లు గలరు. వీరి ద్వారా 2376 చౌకధరల దుకాణంలకు 2004 కిలోలీటర్ల కిరోసిన్‌ను కార్డుదారులకు పంపిణీ చేయచున్నారు.

కర్నూలు జిల్లా నందు 47 గ్యాస్ ఏజన్సీలు గలవు. ఇందులో 356389 జనరల్ కనెక్షన్లు గలవు మరియు దీపం కనెక్షన్లు 143360 గలవు. ఈ వినియోగదారులకు గ్యాస్ సిలిండర్లను పంపిణీ చేయబడుతున్నాయి.

పైన తెల్పుతున్న అన్ని వర్గాల ద్వారా పౌర సరాఫరాల శాఖ, కర్నూలు జిల్లా, జిల్లా ప్రజలకు అన్ని రకాల సేవలు చేయచూ అందరి మన్ననలు పొందుతున్నది.

**జిల్లా పౌరసరఫరాల అధికారి**

**కర్నూలు.**

# తూర్పు గోదావరి జిల్లా పశుసంవర్ధక శాఖ

పశుపోషకుల కృషి, రాష్ట్ర ప్రభుత్వ వినూత్న పశుపోషణ పథకాల తోడ్పాటుతో మన రాష్ట్రం పశుపోషణలో గణనీయమైన అభివృద్ధి సాధించి దేశములోనే మాంసము మరియు గుడ్ల ఉత్పత్తిలో మొదటి స్థానములో మరియు పాల ఉత్పత్తిలో రెండవ స్థానములో నిలచినది. ఇంకా అభివృద్ధి సాధించుటకు చక్కటి అవకాశములు కలవు.

పశూత్పత్తుల అవసరాల దృష్ట్యా రైతులు మేలు జాతి పశుపోషణతోపాటు వాటి ఆరోగ్య సంరక్షణలో శాస్త్రీయ యాజమాన్య పద్ధతులు పాటించినప్పుడే అధికముగా నాణ్యమైన పాలు మరియు మాంసము పొందగలుగుతాము. దీనితో ప్రజల అవసరాలు తీర్చడమేకాకుండా ప్రపంచ వాణిజ్యపోటీలో నాణ్యమైన ఉత్పత్తులతో పోటీపడగలుగుతాము. మన రాష్ట్ర ప్రభుత్వము పశుసంవర్ధక శాఖ ద్వారా పశుపోషకుల సంక్షేమము మరియు వారి ఆర్థికాభివృద్ధి గురించి వివిధ పశుపోషక పథకాలు చేపట్టుచున్నది.

**మినీ డైరీలు:** 25% రాయితీతో 10 లేదా 20 మేలు జాతి పాడి పశువులు (ఆవులు, గేదెలు)తో మినీడైరీ ఏర్పాటు, కేంద్ర ప్రభుత్వ RKVY పథకం ద్వారా అమలు చేయబడును. పశుపోషణపట్ల ఆసక్తి కలిగి పశుగ్రాస సాగుకు భూమి కలిగిన వారు అందరూ అర్హులే.

**పశుక్రాంతి పథకము:** 50% రాయితీతో 2 మేలు జాతి పాడి పశువులు పంపిణీ ద్వారా రాష్ట్ర ప్రభుత్వము పశుక్రాంతి పథకము అమలు చేయబడుచున్నది. దారిద్ర్యరేఖకు దిగువనున్న రైతులు అర్హులు.

**పాడిపశువుల భీమా పథకము:** ఒక్కో రైతు రెండు పాడిపశువులను భీమా చేయించుటకు పశు భీమా ప్రీమియంలో 50% రాయతీతో పశుగణాభివృద్ధి సంస్థ ద్వారా అన్ని జిల్లాలలో అమలు చేయబడుతున్నది. ఇందులో సంబంధిత రైతుకు కూడా భీమా సౌకర్యము కల్పించబడినది.

**జీవక్రాంతి పథకము:** అర్హులైన లబ్ధిదారులకు (దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నవారు) 50% రాయతీతో 20 పొట్టేలు పిల్లలు యూనిట్‌ని, గొర్రెలు మేకల యూనిట్‌ని, విత్తనపు పొట్టేలు పంపిణీతో ప్రోత్సాహము.

**గొర్రెల భీమా పథకము:** గొర్రెలు భీమా చేయుటకు చెల్లింపబడు ప్రీమియంలో 2/3వ వంతు ప్రభుత్వము రాయతీ ఇస్తుంది. గొర్రెల పెంపకదారులందరూ అర్హులు.

**పశుగ్రాసాభివృద్ధి కార్యక్రమము:** పశుపోషణలో పశుగ్రాసాల ప్రాముఖ్యత ఎంతో ఉంది. పశుగ్రాసాల సాగు, సక్రమ వినియోగము మరియు నిల్వ చేయుటకు రైతులను రాష్ట్ర ప్రభుత్వము వివిధ పథకములతో ప్రోత్సహిస్తున్నది.

1) రైతులకు 75% రాయతీపై మేలు జాతి పశుగ్రాస విత్తన సరఫరా.
2) యంత్రముతో నడుచు చాఫ్ కట్టర్స్ (గడ్డి కత్తిరించు యంత్రాలు) 75% రాయతీపై పంపిణీ (యూనిట్ విలువ రూ:20వేలు)
3) సైలేజి (పాతర గడ్డి) తయారు చేయు యూనిట్స్ (యూనిట్ విలువ 1 లక్షా 5 వేలు) 100% ఆర్థిక సాయం.
4) రూ.10,000/- యూనిట్ విలువతో అజొల్లా ఉత్పత్తికి 50% రాయతీతో ప్రోత్సాహము.

పై తెలిపిన పథకములలో ప్రోత్సాహంతో పశువుల ఆరోగ్య సంరక్షణ గురించి జీవాలలో ఉచితంగా సంవత్సరానికి రెండుసార్లు నట్టల నివారణ కార్యక్రమము మరియు వివిధ వ్యాధులను అరికట్టడానికి ఉచితముగా, జీవాలలో (గొర్రెలలో) మశూచి టీకాలు, పిపిఆర్ వ్యాధి నిరోధక టీకాలు, పశువులలో గాలికుంటు వ్యాధి నిరోధక టీకాలు చేపట్టుచున్నది. మారుమూలగ్రామాలలో కూడా పశువైద్యసేవల నిమిత్తము మొబైల్ వెటర్నరీ సేవలు మరియు ఇంటిముందే గర్భధారణతో రైతులకు సేవలనందిస్తూ ప్రత్యేక ఆరోగ్య శిబిరములు కూడా నిర్వహించుచున్నది.

పై ప్రభుత్వ పథకాల ప్రోత్సాహముతో రైతు సోదరులు పశువులు మేపు మరియు ఆరోగ్యముపట్ల అవగాహనతో పశుపోషణ చేపట్టి ఆర్థికముగా అభివృద్ధి చెందాలని పశుసంవర్ధక శాఖ ఆశిస్తున్నది.

**శ్రీ పినిపే విశ్వరూప్**
పశుసంవర్ధక శాఖామాత్యులు

**శ్రీమతి నీతూ కుమారీ ప్రసాద్, ఐ.ఏ.ఎస్.,**
కలెక్టర్, తూర్పుగోదావరి జిల్లా

**డా॥ కె.యస్. లివింగ్ స్టన్**
సంయుక్త సంచాలకులు(ప.సం.శాఖ.
తూర్పుగోదావరి జిల్లా.

కల్పించారు. ఆచూకీ చిక్కితే చావు తప్పదని తెలుసు. అయినా ఆమె కొద్దిగా కూడా జంకకుండా డెన్‌ను నిర్వహించారు. పెంచుకున్న సోదరి కుమారుడిని కూడా పార్టీలో ఇంకా సమర్థంగా పనిచేయమని ప్రోత్సహించేవారు. పార్టీపై నిర్బంధం తొలగిన తర్వాత కూడా అమ్మ "గోర్కిమెస్" పేరుమీద పార్టీ మెస్‌ను నడిపారు. కామ్రేడ్స్‌ను ఆమె బిడ్డల్లాగా ఆదరించేవారు. పార్టీని ఆర్థికంగా ఆదుకునేందుకు ఆమె తనకున్న 1/2 ఎకరాన్ని తెగనమ్మి పార్టీకి ఇచ్చిన త్యాగమూర్తి మాణిక్యమ్మ. చివరి వరకూ కమ్యూనిస్టుగానే జీవించారు.

జమిందారీ గూండాలు ఎప్పుడు గ్రామం మీద పడినా "కట్టుకు రండి కారాలు" అంటూ కా॥వియ్యమ్మ అందరికంటే ముందు గూండాలపై ఎదురుదాడికి నాయకత్వం వహించేది. ఆమె సూచన మేరకు పార్టీ కుటుంబాలలో కారపు మూటలు ఎప్పుడూ సిద్ధంగా ఉండేవి. అందుకనే కామ్రేడ్ వియ్యమ్మను కారపు మూటల వియ్యమ్మ అని అందరూ పిలిచేవారు

**ముత్తేవి కోటమ్మ**

**(తెనాలి తాలూకా-తెనాలి)**

ముత్తేవి కోటమ్మ జాతీయోద్యమం పట్ల ఆకర్షితులయ్యారు. చిన్నతనం నుండే ఖద్దరు ధరించేవారు. సోదరుడు వెంకట సుబ్బయ్య కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేస్తూండేవారు. వారి ప్రభావంతో కామ్రేడ్ కోటమ్మగారు కూడా ఉద్యమం లోకి వచ్చారు. తెనాలి, విజయవాడల్లో పార్టీ నడిపిన మహిళా పాఠశాలకు హాజరయ్యారు. మహిళా సమస్యల పరిష్కారానికి కృషి చేశారు. 1943లో కామ్రేడ్ మాధవాచార్యను వర్ణాంతర వివాహం చేసుకున్నారు. నిర్బంధ సమయంల్లోనూ పార్టీ బాధ్యతలు నిర్వర్తించారు.

**చింతల కోటేశ్వరమ్మ**

**(దావులూరు, కొల్లిపర మండలం)**

కమ్యూనిస్టు ఉద్యమ నాయకులు చింతల సూర్యనారాయణతో వివాహం కోటేశ్వరమ్మను ఉద్యమంవైపు ఆకర్షించేలా చేసింది. దావులూరులో జరిగిన రాజకీయ పాఠశాలలో కామ్రేడ్ చింతల కోటేశ్వరమ్మ కమ్యూనిస్టు పార్టీ సభ్యులయ్యారు. ఈరోజుల్లో వీరి ఇల్లు వచ్చిపోయే కామ్రేడ్లకు, అజ్ఞాత జీవితం గడిపే కామ్రేడ్‌లకు, పార్టీ నిర్మాణానికీ కేంద్రంగా ఉండేది. మహిళల సమస్యల మీద కామ్రేడ్ చింతల కోటేశ్వరమ్మ పనిచేశారు. 1948 పార్టీ పై నిర్బంధ కాలంలో దావులూరిలోని నాయకులు అందరూ రహస్య జీవితంలోకి వెళ్ళారు. దుగ్గిరాలలో అజ్ఞాతంలో ఉన్న కామ్రేడ్ చింతల కోటేశ్వరమ్మను పోలీసులు అరెస్టు చేశారు. కామ్రేడ్ చింతల సూర్యనారాయణ ఆచూకీ చెప్పమని పోలీసులు తీవ్ర చిత్రహింసలు పెట్టారు. అయినా కామ్రేడ్ చింతల కోటేశ్వరమ్మ నోరు మెదపలేదు. దొంగ కేసులు పెట్టి రేపల్లె సబ్‌జైలులో నిర్బంధించారు. పార్టీ నిర్బంధం తొలగిన తరువాత మహిళా బుర్రకథ దళంలో కామ్రేడ్ మోటూరు ఉదయంగారికి పార్వతితోపాటు కామ్రేడ్ చింతల కోటేశ్వరమ్మ వంతలుగా ఉండేవారు. వీరి దళం బుర్రకథ చెప్పడం మొదలు పెడితే మహిళలు ఆసాంతం అయిపోయేవరకూ కదిలేవారు కాదు. కామ్రేడ్ చింతల కోటేశ్వరమ్మ బెంగాల్ కరువు నిధికి ఐదు సవర్ల బంగారపు గొలుసు విరాళంగా ఇచ్చారు. భర్త, చింతల సూర్యనారాయణతో పార్టీ కార్యకలాపాల్లో పాల్గొంటూ తెనాలిలో హోటల్ నడిపారు.

**బావిరెడ్డి వియ్యమ్మ(గాజుల్లంక-కొల్లూరు)**

కామ్రేడ్ బావిరెడ్డి వియ్యమ్మ కొల్లూరు మండలంలోని గాజుల్లంకలో జన్మించారు. భర్త సుబ్బయ్య. చల్లపల్లి జమిందారు భూదాహానికి, దోపిడికి వ్యతిరేకంగా సాగిన సుదీర్ఘపోరాటంలో ప్రాణాలు కోల్పోయిన అనేక మంది అమర వీరులలో కామ్రేడ్ వియ్యమ్మ కూడా ఒకరు. జమిందారీ గూండాలు ఎప్పుడు గ్రామం మీద పడినా "కట్టుకు రండి కారాలు" అంటూ కా॥వియ్యమ్మ అందరికంటే ముందు గూండాలపై ఎదురుదాడికి నాయకత్వం వహించేది. ఆమె సూచన మేరకు పార్టీ కుటుంబాలలో కారపు మూటలు ఎప్పుడూ సిద్ధంగా ఉండేవి. అందుకనే కామ్రేడ్ వియ్యమ్మను కారపు మూటల వియ్యమ్మ అని అందరూ పిలిచేవారు. 1947 ఏప్రిల్ 10న రైతులు తమ పొలాల్లోని రెల్లుగడ్డిని కోసి కట్టలుకట్టుకుని, రాత్రి పదిగంటలకు మరుసటి రోజు సంతలో అమ్ముకుందామని బయలుదేరారు. ఈ వార్త తెలుసుకున్న జమిందారు తొత్తులు మునసుబుకు కబురు పెట్టడం, మునసబు గూండాలను రప్పించడం చకచక జరిగిపోయాయి. గడ్డి కూడా వదలకుండా తినే జమిందారు మనుషులురెల్లుగడ్డి తమదని, దాన్ని అమ్ముకునే హక్కు రైతులకు లేదని వాదనకు దిగారు. కాదూ కూడదని అమ్ముకోవడానికి ప్రయత్నిస్తే ప్రాణాలు తీస్తామని హెచ్చరించారు. ఈ వార్త గ్రామంలోకి చేరగానే కామ్రేడ్ వియ్యమ్మ, కామ్రేడ్ సనకా సుబ్బారావు నాయకత్వంలో రైతు సంఘపు కార్యకర్తలు అందరూ కల్లాల దగ్గరకు చేరారు. వియ్యమ్మ ముందు నిలిచింది. పోలీసుల ఆటలు, జమిందారు నిరంకుశత్వం సాగే రోజులు పోయాయని, రైతుల కష్టం రైతులకే చెందే రోజులు వచ్చాయని వియ్యమ్మ పోలీసులకు చెప్పింది. మొదట దాడి చేద్దామనుకున్న జమిందారు గూండాలు, పోలీసులు ప్రజాశక్తిని చూసిన తరువాత ప్రత్యక్షంగా ఎదుర్కొలేమని కపట నాటకం ఆడారు. ఘర్షణ వద్దని తాము వెనక్కి వెళ్ళిపోతున్నామని చెప్పి వెనుదిరిగి వెళుతున్నట్లుగా నాటకమాడారు. నిజమని నమ్మిన రైతు సంఘ కార్యకర్తలు ఊరిలోకి బయలుదేరారు. హఠాత్తుగా పోలీసులు పరుగెత్తుకుంటూ వచ్చి రైతుల మీద పడ్డారు. ఈ హఠాత్ పరిణామానికి నివ్వెరపోయిన కార్యకర్తలు ఎదురుదాడికి సిద్ధమయ్యేలోపే పోలీసులు వియ్యమ్మపై తూటాలను కురిపించారు. వీరనారి వియ్యమ్మ నేలకొరిగారు. ఇది చూసిన కార్యకర్తలు పోలీసులపై దాడి చేశారు. పోలీసులు కాల్పులను ఉధృతం చేశారు. అందరి కన్నా

ముందున్న కామ్రేడ్ సనకా సుబ్బారావు ుండెల్లోకి దూసుకుపోయిన పోలీసు తూటా ఆయన ప్రాణాలను బలిగొంది. అంతేకాకుండా కామ్రేడ్ పత్తి సుబ్బారావు, అన్నెం పున్నెం ఎరుగని మరో పసివాడు ాడిపర్తి వెంకటేశ్వరరావు కూడా ప్రాణాలను ోగొట్టుకున్నారు. ఎంతోమంది రైతు సంఘ ార్యకర్తలు గాయపడ్డారు. మృతదేహాలను క్కడే విడిచిపెడితే, ఆ వీరుల దేహాలను జలు చూస్తే వారి ఆగ్రహంలో తాము ొట్టుకుపోతామని భావించిన జమిందారు ూండాలు, పోలీసులు తమతో ఆ ృతదేహాలను తీసుకువెళ్ళిపోయారు.

**దుగ్గి అన్నమ్మ (రెంటపాళ్ళ-సత్తెనపల్లి)**

కామ్రేడ్ దుగ్గి అన్నమ్మ రెంటపాళ్ళ వాసం. భర్త వెంకయ్య వ్యవసాయకూలీ ుటుంబం. తొమ్మిదిమంది పిల్లలు. వీరిది మ్యూనిస్టు కుటుంబం. కామ్రేడ్ అన్నమ్మ ాలి పనులకు వెళ్ళేవారు. ఆమె భర్త ామ్రేడ్ వెంకయ్య రైతులకు చెప్పులు ట్టేవారు. రైతులు కొలిచిన జొన్నలు, చ్చిన కొద్దిపాటి కూలీ వారి జీవనాధారం. ద్ద కుటుంబం కావడంతో కామ్రేడ్ న్నమ్మ వచ్చిన ధాన్యాన్ని పొదుపుగా ాడేవారు. వీరి ఇల్లు ఊరికి చివరగా ఉండి క్కనే దట్టమైన బీళ్లు, పొదలతో కలిసి ండేది. సాయంత్రం అయితేనే గీమంటూ వరూ అటువైపు రావడానికి కూడా ద్ధపడేవారు కాదు. దీంతో అజ్ఞాతంలో ఉన్న మ్యూనిస్టు నాయకులకు వీరి ఇల్లు ఆశ్రయ ంద్రంగా మారిపోయింది. తరచు రింటిలోనే అర్ధరాత్రిపూట వచ్చి ఆశ్రయం సుకునేవారు. వచ్చిన ప్రతి నాయకునికి దనకుండా వారికున్నదాంట్లోనే అన్నంపెట్టి డుపు నింపేవారు. కామ్రేడ్ దుగ్గి అన్నమ్మ, యకులు ఎప్పుడు వస్తారోనని, వారి ఆకలి ర్చడం కోసం ముందుగానే జొన్నలు తొక్కి సిబెట్టి మూటకట్టేది. కామ్రేడ్స్ రాగానే న్నమ్మ వారికి వేడివేడిగా వండి పెట్టి వారి కలి తీర్చేది. కమ్యూనిస్టు పార్టీకి ఆ జుల్లో అమ్మగా ప్రసిద్ధికెక్కిన కామ్రేడ్ న్నమ్మ ఆమె సంతానం, బంధువులను తం పార్టీవైపు వచ్చేలా చేయగలిగింది.

**పెద్ద కుటుంబం కావడంతో కామ్రేడ్ అన్నమ్మ వచ్చిన ధాన్యాన్ని పొదుపుగా వాడేవారు. వీరి ఇల్లు ఊరికి చివరగా ఉండి పక్కనే దట్టమైన బీళ్లు, పొదలతో కలిసి ఉండేది. సాయంత్రం అయితేనే గీమంటూ ఎవరూ అటువైపు రావడానికి కూడా సిద్ధపడేవారు కాదు. దీంతో అజ్ఞాతంలో ఉన్న కమ్యూనిస్టు నాయకులకు వీరి ఇల్లు ఆశ్రయ కేంద్రంగా మారిపోయింది. తరచు వీరింటిలోనే అర్ధరాత్రిపూట వచ్చి ఆశ్రయం తీసుకునేవారు. వచ్చిన ప్రతి నాయకునికి లేదనకుండా వారికున్నదాంట్లోనే అన్నంపెట్టి కడుపు నింపేవారు.**

ఆమె పెద్ద కొడుకు పెదలింగయ్యను తెలంగాణా సాయుధ పోరాట సమయంలో కొరియర్‌గా బాధ్యతలు నిర్వహించడానికి పంపింది. చివరి వరకు కమ్యూనిస్టుగానే ఉన్న కామ్రేడ్ అన్నమ్మ స్ఫూర్తి సదా చిరస్మరణీయం.

**ఫణిదెం ఆదెమ్మ, (రెంటపాళ్ళ-సత్తెనపల్లి)**

కామ్రేడ్ ఫణిదెం ఆదెమ్మ కుటుంబం రెంటపాళ్ళలో ఊరు చివర నివాసం ఉండేవారు. కుటుంబం రజక వృత్తిదారులవడంతో ఇల్లిల్లూ తిరిగి అన్నం పోగేసుకునేవారు. కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేసే వారి కుటుంబం అజ్ఞాతంలో ఉన్న కామ్రేడ్స్‌కు అన్నం చేరవేయడంలో తన వృత్తిని ఈ కామ్రేడ్ ఉపయోగించుకునేవారు. కామ్రేడ్ మొక్కపాటి మస్తాన్‌రావు రాత్రిళ్ళు ఏదో సమయంలో రహస్యంగా వీరింటికి వచ్చి భోజనం చేసి వెళ్ళేవారు. రాత్రిళ్ళు వచ్చే దళసభ్యుల సమాచారం ముందుగా తెలిస్తే ఊళ్ళో అదనంగా పెరుగు, పచ్చళ్లు పోగుచేసి ఇంటికి తెచ్చేది. అజ్ఞాతంలో ఉంటూ రాత్రిళ్ళు వచ్చిన నాయకులకు భోజన ఏర్పాట్లు చేయడంలో చాలా జాగ్రత్తలు తీసుకునేవారు కామ్రేడ్ ఆదెమ్మ. రజకవృత్తిలో ఉండటం వల్ల బుట్టలో ఎంత అన్నం తీసుకువచ్చినా పోలీసులకు అనుమానం వచ్చేది కాదు. దీంతో పోరాట యోధులకు ఆహారం అందించడంలో వారి సమాచారం అందచేయడంలో ఎంతో చాకచక్యంగా వ్యవహరించిన కామ్రేడ్ ఆదెమ్మ చివరి వరకూ కమ్యూనిస్టుగానే ఉన్నారు.

**కొర్లకుంట పేరమ్మ, (రెంటపాళ్ళ-సత్తెనపల్లి)**

కామ్రేడ్ కొర్లకుంట పేరమ్మ కమ్యూనిస్టులకు ఆదర్శంగా నిలిచారు. ఆమె భర్త కబ్బయ్య తెలంగాణా సాయుధ పోరాటం ముమ్మరంగా జరుగుతున్న రోజులు. కృష్ణ ఈవల గట్టున ఉన్న అటవీ ప్రాంతంలో అక్కడి నుండి వచ్చిన దళ సభ్యులు, నాయకులు రక్షణ పొందుతున్న సమయం. కామ్రేడ్ పేరమ్మ నాయకత్వం సూచన మేరకు కొరియర్‌గా బాధ్యతలు నిర్వహించేవారు. అజ్ఞాతంలో ఉన్న నాయకులకు వాగుదాటి అన్నం తీసుకువెళ్ళి అందించేవారు. పసిగట్టిన పోలీసులు వాగు దాటుతున్న కామ్రేడ్ పేరమ్మను పట్టుకున్నారు. ఎవరికి అన్నం తీసుకువెళుతున్నావో చెప్పమని చిత్రహింసలు పెట్టారు. అయినా ఆమె నోటి నుండి మాట రాకపోవడంతో ఆ కామ్రేడ్‌ను వివస్త్రను చేసి గర్భిణి అనికూడా జాలి లేకుండా పోలీసు మూకలు జుట్టుపట్టి చెరువులోముంచి హింసించారు. అయినా కామ్రేడ్ కొర్లకుంట పేరమ్మ నోటి నుండి అక్షరం కూడా రాబట్టలేక విసిగి ఆమెను వదిలేశారు. పేదల గుండెల్లో గూడు కట్టుకున్న కమ్యూనిస్టులను కాపాడుకోవడంలో ప్రాణాన్ని సైతం ఫణంగా పెట్టడానికి సిద్ధపడ్డ కామ్రేడ్ పేరమ్మ త్యాగం అనన్యం. ఆమె చివరి వరకూ కమ్యూనిస్టుగానే ఉన్నారు.

**తంగెడ జానకమ్మ**

**(రామాపురం-దాచేపల్లి మండలం)**

తంగెడ జానకమ్మ అత్తగారు ఊరు రామాపురం. పుట్టిన ఊరు కారంపూడి మండలం పేటసన్నిగండ్ల. జానకమ్మకు రామాపురంలోని 60 ఎకరాల భూస్వామి తంగెడ లక్ష్మీ నరసింహారావుతో వివాహం

జరిగింది. ఒక కొడుకు. అనారోగ్యంతో జానకమ్మకు కొడుకు పుట్టిన కొద్దికాలానికే భర్త చనిపోయాడు. ఈ ఊరిలో కరణంగా ఉన్న దివాకరుని శేషయ్య సోదరి భర్త కావడంతో జానకమ్మ ఆర్థిక లావాదేవీల్లో కలుగజేసుకుంటుండేవాడు. అప్పటికే ఏటి ఒడ్డు గ్రామమైన రామాపురం ఉద్యమాలకు కేంద్రం. అన్ని కులాలు ఆందోళనలు నడుపుతున్న నేపథ్యం. ఉద్యమం బలపడే కొద్దీ పోలీసుల దాడులు పెరిగాయి. కరణంగా ఉన్న జానకమ్మ మరిది మాల, మాదిగలను, రజకులను హీనంగా చూడటమే కాక ప్రశ్నించిన వారిపై రకరకాలుగా ఫిర్యాదులు తయారుచేసి పైకి పంపేవాడు. పోలీసులు ఈ పేర్లు ఉన్నవారిని అరెస్టు చేసి హింసించేవారు. భర్త చనిపోయిన జానకమ్మ ఆస్తి అనుభవించాలని కరణం పథకం వేశాడు. ఎక్కడో జరిగిన హత్యలకు జానకమ్మకు సంబంధం ఉందంటూ పోలీసులకు మోసాడు. పోలీసులు జానకమ్మ ఇంటిలో సోదాలు జరిపారు. దీంతో కమ్యూనిస్టులతో జానకమ్మకు సంబంధాలు బలపడ్డాయి. సమస్యల నేపథ్యంలో పెరిగిన జానకమ్మ భూస్వామి భార్య అయినప్పటికీ స్వభావసిద్ధంగా పేదల పట్ల ప్రేమతో మెలిగేది. భర్త చనిపోతే ఇంటిలో పడి ఉండకుండా తన ఆస్థి వ్యవహారాలు తానే స్వయంగా చూసుకుంటూ కమ్యూనిస్టు ఉద్యమకారిణిగా ఎదిగిన జానకమ్మను భూస్వాములు భరించలేకపోయారు. ఆమె మరిదితో కలిసి ఏదో ఒకటి చేయాలని కుట్రలు పన్నారు. జానకమ్మ నిత్యం దళసభ్యులతో కలిసి పల్నాడు ప్రాంతంలోని ప్రజల సమస్యల మీద పనిచేయడం మొదలుపెట్టింది. తెలంగాణా సాయుధపోరాటంలో పాల్గొని, నల్గొండ, మిర్యాలగూడ నుండి వచ్చిన దళ సభ్యులకు, నాయకులకు తన ఇంట్లో రక్షణ ఇవ్వడమే కాక, తోటి కామ్రేడ్స్ గోళ్ళమూడి నారాయణరావు, ఉప్పురాజిరెడ్డిల సహకారంతో నిడుంజర్ల అడవుల్లో వారిని అజ్ఞాతంలో ఉంచింది.

**ఉద్యమంలో వీరులకు ధీటుగా, వీర వనితలూ ఉద్యమ రహదారిలో నడిచారు. తమ మాన ప్రాణాలకన్నా మిన్నగా ఉద్యమాన్ని ఉద్యమకారుల్ని పురిటి బిడ్డలా కాపాడారు. భూమి కోసం, భుక్తి కోసం సాగిన తెలంగాణా సాయుధ పోరాటంలో ఎర్ర నక్షత్రాలై మెరిశారు.**

విషయం పసిగట్టిన కరణం, భూస్వాములు కుమ్మక్కై, ఈ విషయాన్ని పోలీసులకు మోశారు. ఆమెను మట్టుపెట్టకుంటే తమకు మనుగడ లేదని భావించారు. దీంతో ఆమెతో కలిసి దళ సభ్యులుగా ఉన్న కామ్రేడ్ గుర్రం నాగయ్య, గుర్రం కోటయ్య భీమానాదుల వీరారెడ్డి, ఉప్పురాజిరెడ్డి, ఆకూరి కిచ్చారెడ్డి, గోళ్ళమూడి నారాయణరావులను చంపేయాలని కరణం ద్వారా పైకి కాగితాలు పంపించారు. 1950లో ఒకరోజు రాత్రి కరణం కుటుంబాన్ని కాపలా ఉన్న పోలీసు కానిస్టేబుల్‌ను, వ్యాపారిని దళసభ్యులు కాల్చిచంపారు. తెలంగాణా నుండి రామాపురం వచ్చిన ఒక దళాన్ని అడవులలోకి తీసుకువెళ్ళి రాజారెడ్డికి వాళ్ళను అప్పజెప్పింది. రాజారెడ్డి దళం ఆ దళానికి రహస్యంగా రక్షణ కల్పించేవారు. కరణంను ఈ దళమే చంపిందని ఊరంతా గోలపుట్టింది. జానకమ్మ, ఆమె కొడుకు, దళ సభ్యులు అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు. పోలీసులు మదార్ ద్వారా జానకమ్మ ఇల్లు సోదాలు చేయించారు. మూడు తుపాకులు, ఒక బైనాక్యూలర్ స్వాధీనం చేసుకున్నారు. ప్రత్యేక అధికారి బాపయ్యనాయుడు వారందరిని పట్టుకోవడానికి వలపన్నాడు. అడవితల్లి ఒడిలో ఉన్న జానకమ్మను అరెస్టు చేశాడు. ఆమెను కాల్చనని సానుభూతిపరుల నుండి రూ. 6వేలు లంచంగా తీసుకున్నాడు. ఆమెకు రక్షణ కల్పిస్తాననీ, ఏటి ఆవల ఒడ్డుకు పంపిస్తానని నమ్మబలికి పులిపాడు దగ్గర పొగాకు తోటలోకి తీసుకువెళ్ళారు. అక్కడ కామ్రేడ్ జానకమ్మను బంధించి ఆమెపై ముళ్ళకంపలు వేసి సజీవంగా కాల్చిచంపాడు. సాధారణ జీవన నేపథ్యం నుండి ఉద్యమకారిణిగా ఎదిగి ఉద్యమ మణిపూసగా ఒదిగి ఈ ఉద్యమం కోసమే ఒరిగిన కామ్రేడ్ జానకమ్మ అమరజీవి.

**నిమ్మగడ్డ రాజ్యలక్ష్మి, (దుగ్గిరాల)**

కామ్రేడ్ నిమ్మగడ్డ రాజ్యలక్ష్మి 1930లో మధ్య తరగతి రైతు కుటుంబంలో జన్మించారు. 1948లో తెనాలి ప్రాంతంలో రహస్యంగా పనిచేసే కామ్రేడ్స్ కొరకు పార్టీ ఒక రహస్య స్థావరాన్ని నడిపింది. కామ్రేడ్ రాజ్యలక్ష్మి తన భర్తతో కలసి ఆ రహస్య స్థావర నిర్వహణ బాధ్యతలు నిర్వహించారు. అందులో పనిచేస్తుండగానే పార్టీపై నిర్బంధం బాగా పెరిగింది. దీనికి తోడు వారి కుటుంబంలో వచ్చిన ఇబ్బందుల కారణంగా ఆమె భర్త పార్టీ పనినుండి దూరమవుదామని ప్రతిపాదించారు. కామ్రేడ్ రాజ్యలక్ష్మిని కూడా పార్టీ పని మానుకోమని ఒత్తిడి చేశారు. "అవసరమైతే నిన్నయిన (భర్తనైనా) వదులుకుంటానుగాని, పార్టీని వదులుకోనని" రాజ్యలక్ష్మి ఖచ్చితంగా చెప్పారు. ఆ కారణంగానే ఆమె భర్తనుండి విడాకులు తీసుకోవలసి వచ్చింది. కమ్యూనిస్టు పార్టీలో చీలిక వచ్చినప్పుడు సిపిఐ(యం)లో కొనసాగారు. 1951లో పోరాటం విరమించిన తరువాత ప్రయివేటుగా 8వ తరగతి పాసయ్యారు. ఆ తరువాత హిందీలో పలు పరీక్షలలో ఉత్తీర్ణురాలై, తెనాలిలో ప్రవీణాప్రచారక్ పూర్తి చేశారు. ఆ హిందీ కోర్సు చదువుతున్న సమయంలోనే 1960లో ఈమని పంచాయితీ సమితిలో కో-ఆప్టెడ్ మెంబరుగా ఎన్నికయ్యారు. 1964 నుండి 1993 వరకు గుంటూరు స్టాల్ గరల్స్ హైస్కూలులో హిందీ టీచరుగా పనిచేశారు. టీచరుగా పనిచేసిన కాలంలోనూ ఆమె పార్టీ సానుభూతిపరురాలిగా కొనసాగారు.

ఉద్యమంలో వీరులకు ధీటుగా, వీర వనితలూ ఉద్యమ రహదారిలో నడిచారు. తమ మాన ప్రాణాలకన్నా మిన్నగా ఉద్యమాన్ని, ఉద్యమకారుల్ని పురిటి బిడ్డలా కాపాడారు. భూమి కోసం, భుక్తి కోసం సాగిన తెలంగాణా సాయుధ పోరాటంలో ఎర్ర నక్షత్రాలై మెరిశారు.

# మహిళలు - ఆరోగ్య సమస్యలు

- డా॥ కె.భారతీ సాగర్

స్త్రీలలో ఆరోగ్య సమస్యలు, పురుషులకు సాధారణంగా వచ్చేవే కాకుండా స్త్రీలకు ఉన్న సంతానోత్పత్తి, నెలసరి వచ్చే రుతుస్రావం వంటి శారీరక ధర్మాల వలన ఇంకా అనేకమైన ఆరోగ్య సమస్యలు ఉత్పన్నమవుతాయి. ముఖ్యంగా ఆడపిల్లలు రజస్వల అయినప్పటి నుంచి, (సుమారు 13 సంవత్సరాల వయస్సు నుంచి) ఈ సమస్యలు ఉత్పన్నం అవుతాయి. పుట్టినప్పటినుండి తొమ్మిది సంవత్సరాల వయస్సున్న ఆడపిల్లల్లో రక్తహీనత, అతిసారం, న్యూమోనియా, మలేరియా వంటి వ్యాధులు ఎక్కువగా ఉత్పన్నం అవుతాయి.

యుక్త వయస్సుకొచ్చిన బాలికలలో పౌష్టికాహారలేమి, రక్తహీనత, జననేంద్రియాలలో ఇన్ఫెక్షన్లు, అధిక రుతుస్రావం, రుతుశూల వంటి సమస్యలు సాధారణంగా వస్తాయి. అయితే ఇవే కాకుండా హెచ్.ఐ.వి, ఎయిడ్స్ వంటి ప్రాణాంతక వ్యాధులు, చిన్న వయస్సులోనే గర్భధారణ, తద్వారా వచ్చే సమస్యలు కూడా ఎక్కువవుతున్నాయి.

మధ్య వయస్సు స్త్రీలలో గర్భసంచిలో గడ్డలు, అండాశయాలలో నీటితిత్తులు, అధిక రుతుస్రావం, తెల్లబట్ట ఎక్కువగా అవటం, వంధ్యత్వం, నడుము నొప్పి, గర్భాశయం, అండాశయం, గర్భకోశ ముఖద్వారా కాన్సర్లు, జననేంద్రియ ఇన్ఫెక్షన్లు మొదలైన సమస్యలు ఎక్కువగా వస్తాయి.

ముట్లుడిగిన స్త్రీలలో అధికంగా మెనోపాజ్ వల్ల ఆరోగ్య సమస్యలు వస్తాయి. స్త్రీల ఆరోగ్యానికి రక్షణగా నిలిచే ఈస్ట్రోజెన్, ప్రొజెస్టిరాన్ హార్మోనుల స్రావం పూర్తిగా నిలిచిపోవటం వలన అప్పటి వరకూ గుండె జబ్బులు రాకుండా ఆపిన రక్షణ కవచం ఉండదు. దీని వలన గుండె జబ్బులు, మెదడులో రక్తం గడ్డకట్టటంలాంటి సమస్యలు రావచ్చు. పై రెండు హార్మోనుల స్రావం ఆగిపోవటం వలన సుమారు 15 శాతం మంది స్త్రీలలో మెనోపాజల్ సిండ్రోమ్ అనే ఆరోగ్య సమస్య ఉత్పన్నం అవుతుంది. దీని వలన మానసిక ఆందోళన, డిప్రెషన్, శరీరంలోంచి వెచ్చని ఆవిర్లు వచ్చినట్లుండటం, గుండె దడ, నిద్రపట్టకపోవటం, మోకాళ్ళ నొప్పులు, కండరాల నొప్పులు వంటివి వస్తాయి.

**యుక్త (కిశోర) వయస్సు బాలికలలో ఆరోగ్య సమస్యలు:**

**పౌష్టికాహార లేమి, రక్తహీనత:-** మన కుటుంబాలలో మగపిల్లవాని పెరుగుదల గురించి పట్టించుకున్నంతగా ఆడపిల్లలను పట్టించుకోకపోవడం వలన ఆడపిల్లల్లో శారీరక అభివృద్ధి అంతంత మాత్రం ఉంటుంది. అంతేకాకుండా ఆడపిల్లల్లో రజస్వల (నెలసరి రుతుస్రావం మొదలయ్యే) దశలో అవసరమైనంత రక్తపుష్టి లేకుండా ఉంటుంది. దీని వలన రజస్వల కాగానే అధిక రక్తస్రావం కావడం లేదా ఆలస్యంగా అంటే 15,16 సంవత్సరాల వయసు వస్తున్నా రుతుస్రావం ప్రారంభం కాకపోవడం జరుగుతోంది. ఇవే కాకుండా రక్తహీనత వలన ఇన్ఫెక్షన్లు రావటం, అధికంగా తెల్లబట్ట పోవడము వంటి సమస్యలు కూడా మొదలవుతాయి.

రక్తహీనత, మాంసకృత్తుల లోపం వలన ఆడపిల్లల శారీరక, మానసిక అభివృద్ధి సరిగా ఉండదు. ఈ బలహీనత గర్భసంచి వంటి ప్రత్యుత్పత్తి అవయవాల బలహీనతకు దారితీస్తుంది. దీని వలన రుతుస్రావ సమయంలో (నెలసరి) పొత్తి కడుపులో నొప్పి, నడుమునొప్పి, కాళ్ళు నొప్పులు వంటి సమస్యలు వస్తాయి.

ప్రతినెలా రుతుస్రావ సమయంలో పోయే రక్తస్రావం వలన దాదాపుగా ఒక గ్రాము హిమోగ్లోబిన్ తగ్గుతుంది. ఆడపిల్లల్లో దానిని పూరించటానికి ఇనుము శాతం అధికంగా ఉన్న మాంసం, కాయగూరలు, ఆకుకూరలు, పప్పు దినుసులు వంటివాటిని ఆహారంలో ఇవ్వవలసి ఉంటుంది. ఐరన్ మాత్రలు ఇవ్వటం, కడుపులోని నులి పురుగులు, కొక్కి పురుగులకు మందులు ఇవ్వటం ద్వారా ఈ స్థితిని నియంత్రించవచ్చును.

**మన కుటుంబాలలో మగపిల్లవాని పెరుగుదల గురించి పట్టించుకున్నంతగా ఆడపిల్లలను పట్టించుకోకపోవడం వలన ఆడపిల్లల్లో శారీరక అభివృద్ధి అంతంత మాత్రం ఉంటుంది. అంతేకాకుండా ఆడపిల్లల్లో రజస్వల (నెలసరి రుతుస్రావం మొదలయ్యే) దశలో అవసరమైనంత రక్తపుష్టి లేకుండా ఉంటుంది. దీని వలన రజస్వల కాగానే అధిక రక్తస్రావం కావడం లేదా ఆలస్యంగా అంటే 15,16 సంవత్సరాల వయసు వస్తున్నా రుతుస్రావం ప్రారంభం కాకపోవడం జరుగుతోంది. ఇవే కాకుండా రక్తహీనత వలన ఇన్ఫెక్షన్లు రావటం, అధికంగా తెల్లబట్ట పోవడము వంటి సమస్యలు కూడా మొదలవుతాయి.**

మధ్యతరగతి కుటుంబాలలో కూడా మనం చూస్తూ ఉంటాం. మగపిల్లవానికి పాలు, గ్రుడ్లు తినిపించినంతగా ఆడపిల్లల్ని పట్టించుకోవడం ఉండదు. వీరిలో కూడా ఎముకల పెరుగుదల శారీరక, మానసిక వికాసం అవసరం అనే ఆలోచన పురుషాధిక్య భావజాలం ఉన్న ఈ సమాజంలోని అత్యధికులకి ఉండటంలేదు.

**అధిక రక్తస్రావం (ప్యూబర్టీ మెనోరేజియ):-** యుక్త వయస్సు బాలికలలో నెలసరి సమయంలో అధిక రక్తస్రావం కావటాన్ని ప్యూబర్టీ మెనోరేజియా అంటారు. రజస్వల అయిన ఒకటి, రెండు సంవత్సరాల సమయంలో అండం విడుదల సరిగా ఉండకపోవటం వలన, నిరంతర ఈస్ట్రోజెన్ హార్మోన్ స్రావం వలన గర్భాశయం లోపలిపొర ఎక్కువగా పెరిగి అధిక రక్తస్రావానికి దారితీస్తుంది. అధిక రక్తస్రావం రక్తహీనతకు దారితీసి, పెరుగుదలకు ఆటంకంగా మారుతుంది. కనుక వెంటనే చికిత్స చేయించటం అవసరమవుతుంది. దీనికి రెండు, మూడు నెలలు మందులు వాడటం ద్వారా ఈ సమస్యలను నివారించి, హార్మోనుల సమతుల్యతను పెంచవచ్చును.

**యువతులలో, మధ్య వయస్సు స్త్రీలలో సమస్యలు :** అండాశయంలో నీటితిత్తులు ఏర్పడ్డాన్ని (పాలిసిస్టిక్ ఒవేరియన్ డిసీజ్) అంటారు, సగటున 15-20 శాతం మంది స్త్రీలలో ఇది కనబడుతుంది. కుటుంబ చరిత్ర ఉన్నవాళ్ళలో అధికంగా వస్తుంది. సాధారణంగా అధిక శారీరక బరువు ఉన్న అమ్మాయిల్లో ఇది కనబడుతుంది. దాని వలన **నెలసరి సరిగా రాకపోవడము, వచ్చినా తక్కువ రక్తస్రావం అవడమూ, ముఖం మీద వెంట్రుకలు పెరగడం, బొంగురు గొంతు రావడము వంటివి ఉంటాయి.** అధిక బరువున్న వాళ్ళల్లో అధికంగా ఉన్న కొవ్వు నుంచి ఏర్పడే హార్మోనుల వలన శరీరంలోని హార్మోనుల

**ప్రతినెలా రుతుస్రావ సమయంలో పోయే రక్తస్రావం వలన దాదాపుగా ఒక గ్రాము హిమోగ్లోబిన్ తగ్గుతుంది. ఆడపిల్లల్లో దానిని పూరించటానికి ఇనుము శాతం అధికంగా ఉన్న మాంసం, కాయగూరలు, ఆకుకూరలు, పప్పు దినుసులు వంటివాటిని ఆహారంలో ఇవ్వవలసి ఉంటుంది.**

అసమతుల్యత ఏర్పడి అండాశయంలో అధికంగా నీటితిత్తులు ఏర్పడుతాయి. వీటిని పొత్తికడుపు స్కానింగ్ ద్వారా నిర్ధారించవచ్చును. నీటితిత్తులు అనగానే చాలామంది తల్లులు భయపడతారు. కాని భయపడవలసిన పనిలేదు. మూడు నుండి ఆరు నెలల పాటు చికిత్స తీసుకోవడం ద్వారా దీనిని నయం చేసుకోవచ్చును.

పి.సి.ఒ.డి. కిశోర బాలికల్లోనే కాక యువతులు, మధ్య వయస్సు స్త్రీలలో కూడా అధికంగా కనపడుతుంది. ఇది గర్భధారణకు అవరోధంగా పరిణమిస్తుంది. ఆండ్రోజన్ అనే హార్మోన్ అధికంగా ఉత్పత్తి అవడం వలన అండశయాల్లోని ఫాలికల్స్ పూర్తిస్థాయిలో పరిణితి చెందవు. తద్వారా అండం ఉత్పత్తి జరగదు. అండం విడుదల కాని కారణంగా స్త్రీలలో వంధ్యత్వం ఉంటుంది. ఇటువంటివారిలో అండం విడుదల కావటానికి క్లోమిఫెన్ సిట్రేట్ వంటి మందులు ఇవ్వటం ద్వారా సమస్యని అధిగమించవచ్చును. మందులకు లొంగని కేసుల్లో లావరోస్కోపీ ద్వారా అండాశయంలోని కొంత భాగంలోని కణజాలాలను తొలగించుట ద్వారా సరిచేయవచ్చును. శారీరక బరువు అధికంగా ఉన్న స్త్రీలల్లో అధిక బరువుని నియంత్రించటానికి ప్రాధాన్యతనివ్వాలి. బరువు తగ్గటం ద్వారా సగం సమస్య దూరమవుతుంది.

**రుతుశూల -నెలసరి సమయంలో కడుపునొప్పి:-** యుక్త వయస్సున్న పిల్లల్లో ఈ సమస్య అధికంగా ఉంటుంది. ఈ



సమస్య ఉన్నవారిలో గర్భసంచి యొక్క తీవ్ర సంకోచం వలన మరియు అధిక సంఖ్యలో సంకోచాలు రావటము వలన కడుపులో నొప్పి అధికంగా ఉంటుంది. ఈ వయస్సు వారిలో ఎక్కువగా ఉండే ఆందోళన, ఒత్తిడి, బలహీనత వంటి కారణాల వలన ఈ సమస్యలు ఇంకా ఎక్కువగా అనిపిస్తాయి. నెలసరి అయిన మొదటిరోజున పొత్తి కడుపులో విపరీతమైన నొప్పి, నడుము నొప్పి, కళ్ళు తిరగడము, కాళ్ళు లాగటము, వంటి లక్షణాలు ఉంటాయి. మొదటిరోజున నొప్పి తగ్గటానికి మందులు వేయటం వలన స్వాంతన కలుగుతుంది. కౌన్సిలింగ్ ద్వారా సమస్యను వివరించటము, మానసిక స్థైర్యాన్ని పెంపొందించటం ద్వారా కూడా ఈ సమస్యని అధిగమించవచ్చు. నొప్పి తీవ్రంగా ఉన్నవారిలో అవసరమైతే హార్మోను చికిత్స కూడా ఇవ్వవలసి వస్తుంది.



Polycystic Ovary



Normal Ovary

**ఫైబ్రాయిడ్ కణుతులు:-** గర్భసంచిలో గట్టిగా ఉండే ఫైబ్రస్ కణజాలంతో ఏర్పడే కణుతులను ఫైబ్రాయిడ్ కణుతులు అంటారు. ఇవి గర్భాశయం యొక్క మూడు పొరలలో ఎక్కడైనా రావచ్చు. కానీ అధికంగా లోపలి, మధ్య పొరలలో వస్తాయి. 30 నుండి 35 సంవత్సరాల వయస్సు దాటిన స్త్రీలలో అధికంగా వస్తాయి. సగటున 20 శాతం మంది స్త్రీలలో ఈ గడ్డలు కనబడతాయి. కాని చాలా కొద్దిమంది (మూడు శాతం మంది) స్త్రీలలోనే లక్షణాలు కనబడతాయి. ఇంగ్లాండ్ వంటి ఇతర దేశాలలో ఇవి ఇంకా ఎక్కువ శాతం ఉంటాయి. స్త్రీలు వేరే ఏదైనా సమస్యల కోసం వైద్యులను సంప్రదించినప్పుడు ఈ సమస్య బైటపడుతుంది. కార్పొరేట్ వైద్యులందరూ ఈ గడ్డలను క్యాన్సర్‌గా మారే ప్రమాదముందని చెప్పి అనవసరంగా అధిక సంఖ్యలో గర్భసంచిని తొలగించే ఆపరేషన్లు(హిస్టరెక్టమీ) చేస్తున్నారు. ఇటీవలే హైదరాబాద్‌లో జరిగిన ఒక అధ్యయనంలో తెలిసిందేమంటే ఈ ఆపరేషన్స్ అత్యధిక శాతం చిన్న వయస్సున్న స్త్రీలకు (35 సం॥రాల లోపు వారికి) కూడా అనవసరంగా చేస్తున్నారని, ఆరోగ్యశ్రీ వంటి పథకాల క్రింద డబ్బుకోసం ఇవి ఇంకా ఎక్కువయినాయని గమనించటమైంది. స్త్రీలలో గర్భసంచి కేవలం పునరుత్పత్తి కోసమే కాకుండా స్త్రీల ఆరోగ్యం కొరకు కూడా అవసరం.

ఈ కణుతులు సాధారణంగా 1 నుండి 10 సెంటీమీటర్ల వరకు, అరుదుగా 30 సెం.మీ వరకూ పెరుగుతాయి. లోపలి పొరలలో ఏర్పడే కణితుల వల్లనే నెలసరి సమయంలో అధిక రక్తస్రావం అవడం లాంటి సమస్యలు ఉంటాయి. వంధ్యత్వం ఉన్న స్త్రీలలోనూ ఈ కణితులు ఏర్పడతాయి. వీటి వృద్ధి అండాశయాల నుండి ఏర్పడే స్టిరాయిడ్ హార్మోనుల వలన జరుగుతుంది. ఈస్ట్రోజన్ అధికంగా ఉన్నకాలంలో అంటే చురుకైన పునరుత్పత్తి దశలో ఉన్నవాళ్ళలో, గర్భధారణ సమయంలో వీటివృద్ధి ఎక్కువగా ఉంటుంది. నెలసరి సమయంలో అధిక రక్తస్రావం కావటం, ఎక్కువ రోజులు కావడం, పొత్తి కడుపు నొప్పి మొదలైన లక్షణాలు ఉంటాయి. ప్రతినెలా అధిక మొత్తంలో రక్తస్రావం కావటం వలన రక్తహీనత కలుగుతుంది. గర్భసంచి లోపలి పొరల్లో వచ్చే ఫైబ్రాయిడ్స్‌లో నెలసరి సమయంలోనే కాకుండా ఎప్పుడైనా కూడా రక్తస్రావం కావచ్చు. కొంతమందిలో ముఖ్యంగా సన్నగా ఉన్నవాళ్ళలో కడుపులో క్రిందికి లాగినట్లు అనిపించటం, పొత్తికడుపు భాగంలో కణితి ఉన్నట్లు లేదా బరువుగా ఉన్నట్లు అనిపించటం ఉంటాయి.

**వ్యాధి నిర్ధారణ:-** కణితి పెద్దదిగా ఉంటే డాక్టరు గర్భసంచీని పరీక్షించినప్పుడు తెలిసిపోతుంది. అధిక రక్తస్రావం ఉండి, పరీక్షల్లో తెలియనప్పుడు స్కానింగ్ ద్వారా తెలుసుకోవచ్చును. బాగా పెద్దదిగా ఉన్న కేసులలో ఎంఆర్ఐ కూడా అవసరం పడవచ్చును.

**చికిత్స:-** గడ్డ సీడ్లింగ్ దశలో (2 సెం.మీ కన్నా తక్కువ పరిమాణం) ఉన్నప్పుడు ఎలాంటి లక్షణాలు లేనప్పుడు చికిత్స అవసరం ఉండదు. అధిక రక్తస్రావం, పొత్తి కడుపు నొప్పి లాంటి లక్షణాలు ఉన్నప్పుడు చికిత్స అవసరముంటుంది. అదికూడా మందులతో రక్తస్రావం, నొప్పి వంటి వాటిని నివారించవచ్చును.

కణితి రెండు సెం.మీ కన్నా ఎక్కువ సైజు ఉండి ఋతుస్రావం ఆగిపోయే దశలో (మెనోపాజ్) ఉన్నవారు క్రమ సమయంలో పరీక్షలు చేయించుకుంటూ ఉండాలి. మెనోపాజ్ వచ్చాక ఫైబ్రాయిడ్ కణితి క్రమంగా అదే క్షీణించిపోతుంది. ఫైబ్రాయిడ్ సైజు క్రమంగా పెరుగుతూపోతూ, మందులకు లొంగనంత తీవ్రంగా రక్తస్రావం అవుతున్న కేసులలో శస్త్రచికిత్స చేయవలసి వస్తుంది. అదికూడా కణితి వరకు తొలగించే ఆపరేషన్ (మయోమెక్టమి) చేయవచ్చును. లాపరొస్కోపిక్ సర్జరీ ద్వారా కణితిని మాత్రమే తొలగించే ఆపరేషన్ చేయవచ్చు.

కొనిసార్లు ఫైబ్రాయిడ్ గర్భసంచి లోపల చిన్నవిగా కాండంతో కూడి ఉంటాయి. ఇటువంటి వాటిని గర్భసంచి లోపల నుంచి హిస్టెరోస్కోపి ద్వారా తొలగించవచ్చును. ఫైబ్రాయిడ్ గడ్డలు ఎక్కువగా ఉన్న కేసులలో లేదా గడ్డ పెద్దదిగా ఉండి మూత్ర సంచికి లేదా ప్రేగులకు అతుక్కుని ఉండే కేసులలోను, నెలసరి రుతుస్రావం అధికంగా ఉండి అదుపు చేయలేనిస్థితిలో, లేదా తీవ్రమైన కడుపునొప్పి వస్తున్న కేసులలో గర్భసంచిని తొలగించే ఆపరేషన్ చేయవలసి వస్తుంది.

పశ్చిమ దేశాలలో అత్యధిక స్త్రీలు గర్భసంచి తొలగించుకోవటానికి ఇష్టపడటంలేదు. దానికి బదులుగా ప్రత్యామ్నాయ చికిత్సలతో సమస్య నుండి బైటపడాలని చూస్తున్నారు.

**మెనోపాజ్:**-స్త్రీలలో రుతుక్రమాలు (నెలసరి రుతుస్రావం) ఆగిపోవటాన్ని మెనోపాజ్ అంటారు. స్త్రీలలో 45 నుండి 50 సంవత్సరాల వయస్సు తరువాత నెలనెలా వచ్చే రుతుస్రావం ఆగిపోతుంది. అండాశయాలలో ఉండే ఫాలికిల్స్ నుంచి ప్రతినెల ఏదోఒకదాని నుండి ఒక్క అండం వృద్ధి జరుగుతుంది. తద్వారా ప్రతినెలా రుతుస్రావం కనబడుతుంది. అండాశయాలలోని ఫాలికిల్స్ పూర్తిగా అయిపోగానే అండకణం వృద్ధి ఆగిపోతుంది. తద్వారా ఈస్ట్రోజెన్, ప్రొజెస్టిరాన్ హార్మోనుల ఉత్పత్తి పూర్తిగా అయిపోయి మెనోపాజ్ వస్తుంది. మెనోపాజ్ రావటానికి ముందు సంవత్సరాలలోనే ఈ మార్పులన్నీ మెల్లగా జరుగుతూ వచ్చి అంతిమంగా రుతుస్రావాలు ఆగిపోతాయి. 45-55 సంవత్సరాల వయస్సున్న స్త్రీలలో ఆరు నెలల నుంచి ఒక సంవత్సరం వరకు నెలసరి రావటము ఆగిపోతే ఈ స్త్రీలో మెనోపాజ్ వచ్చినట్లు నిర్ధారించవచ్చు. గత శతాబ్దాలలో మెనోపాజ్ తరువాతి సమస్యలతో బాధపడే స్త్రీల శాతం తక్కువగా ఉండేది. కాని ఈ శతాబ్దంలో పెరుగుతున్న జీవిత కాలం వలన ఈ శాతం పెరిగింది.

మెనోపాజ్ దశకు చేరుకునే ముందు దశను పెరిమెనోపాజల్ దశ అంటారు. ఈ దశలో రుతుస్రావం తొందరగా రావటం లేదా లేటుగా రావటం ఉంటుంది. కొంతమందిలో అధిక రక్తస్రావం కావచ్చు. రుతుస్రావాలు ఇలా హెచ్చు తగ్గులుగా వచ్చి చివరికి ఆగిపోతాయి.

**మెనోపాజల్ సిండ్రోమ్:-** మెనోపాజ్ తరువాతి దశలో ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్ హార్మోనుల ఉత్పత్తి ఆగిపోవటం వలన అనేకమైన ఆరోగ్య సమస్యలు ఉత్పన్నమవుతాయి. స్త్రీ శరీర ధర్మ నిర్వహణలో ఈ రెండు హార్మోనులు చాలా కీలకమైనవి. ముఖ్యంగా స్త్రీలలో ఇవి గర్భధారణకి, ఎముకలు, కండరాల బలానికి, చర్మం, వెంట్రుకల రక్షణలో తోడ్పడతాయి. గుండెజబ్బులు, మెదడులో రక్తం గడ్డ కట్టడం, ఆస్టియోపోరోసిస్ (ఎముకలు పెళుసుబారటం) వంటి వ్యాధులు రాకుండా రక్షణ కల్పిస్తాయి.

మెనోపాజ్ స్వతఃసిద్ధంగానే కాదు కొన్ని ఆపరేషన్ల వలన కూడా వస్తుంది. పొత్తి కడుపుదగ్గర రేడియోథెరపి లాంటివి చేయటం, శస్త్ర చికిత్సలో రెండు అండకోశాలను తీసివేయటం వంటి వాటి వలన కూడా వస్తుంది. సహజ మెనోపాజ్ వచ్చే వయస్సుని పొగత్రాగటం, వంధ్యత్వం, అండాశయాల శస్త్ర చికిత్సలు, రేడియో లేదా కీమోథెరపి లాంటివి ప్రభావితం చేస్తాయి.

మెనోపాజ్ వచ్చిన మొదటి ఐదు సంవత్సరాలలో ఎక్కువగా శరీరంలోంచి వేడి ఆవిర్లు వచ్చినట్లు ఉండటం (3-5 నిమిషాల వరకు), ఉన్నట్టుండి చెమటలు పట్టటం లాంటి లక్షణాలు, రాత్రిపూట గుండెదడ, తొందరగా ఏడవటంలాంటివి ఎక్కువగా ఉంటాయి. మెనోపాజ్ వచ్చిన తరువాత దాదాపు 70 శాతం మంది మహిళల్లో ఇవి ఉంటాయి. కానీ లావుగా ఉన్న స్త్రీలలో ఈ లక్షణాలు అంతగా కనిపించవు.

తరువాత సంవత్సరాలలో జననేంద్రియ క్షీణత, ఇన్ఫెక్షన్లు, యోనిలో మంట పుట్టటం, దురదలు, అసౌకర్యంగా ఉండటం, సంభోగంలో పాల్గొన్నప్పుడు కష్టంగా ఉండటం, నిద్రపట్టకపోవటం, మానసిక ఆందోళన, వ్యాకులత చెందడము, నిరాశ (ఫ్రస్ట్రేషన్), శారీరక బలహీనత లాంటి లక్షణాలు కనబడుతాయి. జననేంద్రియాలతోపాటు మూత్రనాళం, మూత్రాశయాలలో కణజాల క్షీణతలాంటి మార్పులు రావటం వలన తరచుగా మూత్రనాళ ఇన్ఫెక్షన్లు, మూత్రంలో మంట, మూత్ర విసర్జన మీద నియంత్రణ లేకుండా బట్టల్లోనే మూత్రం పోవటం లాంటి లక్షణాలతో బాధపడతారు. కీళ్ళ నొప్పులు, కాళ్ళ నొప్పులు ఎక్కువవుతాయి.

మెనోపాజ్ తరువాత దశలో ఈ బాధలు పడేవాళ్ళు సుమారు 15 శాతం మందిలో చికిత్స అవసరమవుతుంది. మెనోపాజ్ వచ్చిన మహిళలు చురుకైన జీవన విధానాన్ని పాటించటము, యోగా, ధ్యానము, నడక వంటివి చేయటం క్రమంగా చేయాలి. అలాగే ఆహారంలో కొన్ని మార్పులు చేసుకోవటం, ఫైటో ఈస్ట్రోజన్స్ అధికంగా ఉన్న సోయాబీన్స్. నువ్వులు, ఓట్స్, పెసలు, బీన్స్, బార్లి వంటి గింజలు, ధాన్యాలు, ఆపిల్, దానిమ్మ, క్యారెట్ వంటి పళ్ళు, కూరగాయలను తీసుకోవాలి. వీటినుంచి లభించే ఫైటో ఈస్ట్రోజన్స్ వలన, కాల్షియం వలన సమస్యలను అధిగమించవచ్చును.

కాఫీ అధికంగా త్రాగటం తగ్గించాలి. కాఫీ అధికంగా త్రాగటం వలన ప్రేవులలో కాల్షియం గ్రాహక శక్తి తగ్గిపోతుంది. ఎముకలు బలంగా ఉండటానికి, రక్తప్రసరణ సాఫీగా జరగటానికి యోగా

లాంటి వ్యాయామాలు, నడక, చురుకైన దినచర్య సాగించటం ఉపయోగకరంగా ఉంటాయి.

మెనోపాజ్ వలన ఇబ్బందులు పడుతున్న స్త్రీలకు కుటుంబపరంగా మద్దతు అవసరం అవుతుంది. చీటికి మాటికి ఏడవకుండా డిప్రెషన్‌కి లోనవకుండా వారికి కౌన్సిలింగ్ ద్వారా మానసిక స్థైర్యాన్ని ఇవ్వడం చాలా అవసరం. మోకాళ్ళ నొప్పులు, కండరాల నొప్పులకు తగిన చికిత్స చేయించుకోవడం కూడా అవసరమవుతుంది. ఇవన్నీ చేసిన తరువాత కూడా మెనోపాజ్ సమస్యల వలన ఇబ్బంది పడుతుంటే మందులు తీసుకోవటం అనివార్యమవుతుంది.

ఇంతకుముందు మెనోపాజ్ సంబంధిత ప్రాబ్లమ్స్‌కి కేవలం హార్మోన్ రీప్లేస్‌మెంట్ చికిత్స ఉండేది. అయితే ఎక్కువ కాలం తీసుకుంటే గర్భాశయంలోపల గర్భాశయ ముఖద్వార క్యాన్సర్లకు దారితీసే అవకాశం ఉంది. అలాగే ఈస్ట్రోజన్స్ హార్మోన్, ప్రొజెస్టరాన్ హార్మోన్ ఉపయోగించటం వలన అప్పుడప్పుడు యోని నుంచి రక్తస్రావం లాంటి సైడ్ ఎఫెక్ట్స్ ఉంటాయి.

ఈ కండిషన్‌కు ప్రత్యామ్నాయ చికిత్సా పద్ధతులు అందుబాటులో ఉన్నాయి. ఈవినింగ్ ప్రిమ్‌రోస్ ఆయిల్, అశ్వగంధ, అతిమధురం, జింకోబైలోబా వంటి హెర్బల్ మెడిసిన్స్ వంటివి ఉపయుక్తం. హార్మోను చికిత్స కాకుండా ఇంకా సెరటోనిన్ రీ అప్టేక్ ఇనిహిబిటార్స్, ప్రొజెస్టోజెన్స్ లాంటివి కూడా ఉన్నాయి. అయితే ఇవన్నీ రోగి పరిస్థితిని, వ్యాధిని అంచనావేసుకుని వైద్యులు నిర్ణయించాల్సినవి.

**మెనోపాజ్ తరువాతి దశలో ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్ హార్మోనుల ఉత్పత్తి ఆగిపోవటం వలన అనేకమైన ఆరోగ్య సమస్యలు ఉత్పన్నమవుతాయి. స్త్రీ శరీర ధర్మ నిర్వహణలో ఈ రెండు హార్మోనులు చాలా కీలకమైనవి. ముఖ్యంగా స్త్రీలలో ఇవి గర్భధారణకి, ఎముకలు, కండరాల బలానికి, చర్మం, వెంట్రుకల రక్షణలో తోడ్పడతాయి. గుండెజబ్బులు, మెదడులో రక్తం గడ్డ కట్టడం, ఆస్టియోపోరోసిస్ (ఎముకలు పెళుసుబారటం) వంటి వ్యాధులు రాకుండా రక్షణ కల్పిస్తాయి.**

**నెలసరి అధిక రక్తస్రావం: (మెనోరీజియా)** నెలసరి సమయంలో అధికంగా రక్తస్రావం కావడం, లేదా ఎక్కువ రోజులు రక్తస్రావం కావటం లేదా గడ్డలుగా రక్తం పోవటంలాంటి సమస్యలుంటాయి. మహిళల్లో ఇలా నెలసరి అధిక రక్తస్రావం కావటానికి అనేక కారణాలున్నాయి. వాటిలో ముఖ్యమైనవి ఫైబ్రాయిడ్ గడ్డలు, ఎండోమెట్రియోసిస్, గర్భసంచీ లోపలి పొరలో వచ్చే పాలిప్, పొత్తికడుపు లోపల వచ్చే ఇన్ఫెక్షన్లు (పెల్విక్ ఇన్ఫ్లమేటరీ డిసీజ్) మొదలగునవి. కొన్నిసార్లు కాపర్-టీ లాంటి గర్భ నిరోధక సాధనాల వలన, రక్తం గడ్డకట్టకుండా ఉండటానికై వాడే మందుల వలన కూడా ఈ సమస్య ఉత్పన్నమవవచ్చును. అయితే అధిక రక్తస్రావం ఫిర్యాదు చేస్తున్న మహిళల్లో కేవలం 40 శాతం మందిలోనే ఈ అధిక రక్తస్రావం సమస్య ఉంటుంది. మిగిలిన వాళ్ళు సరైన అవగాహన లేకపోవడం వలన సాధారణ రక్తస్రావాన్నే అధిక రక్తస్రావం అనుకుంటారు.

కారణాన్ని నిర్ధారించిన తరువాతే సరైన చికిత్స చేయవచ్చు. అందువలన ఈ సమస్య ఉన్నవారిలో మొదట క్షుణ్ణంగా వారికి నెలసరి ఎన్ని రోజులకు వస్తుంది? ఎన్ని రోజుల వరకు రక్తస్రావం ఉంటుంది? రక్తం గడ్డలుగా పడుతుందా? ఏవైనా గర్భనిరోధక సాధనాలు వాడుతున్నారా? ఇంకా ఏవైనా మందులు వాడుతున్నారా? లాంటివి పరిశీలించాలి.

ఫైబ్రాయిడ్స్, పాలిప్ వంటివాటిని నిర్ధారించటానికి పొత్తికడుపు స్కానింగ్ అవసరమవుతుంది. గర్భసంచి లోపలిపొర మందం నిర్ధారించటం కూడా అవసరమవుతుంది. 40 సంవత్సరాల వయసు దాటిన, క్యాన్సర్ రిస్కు అధికంగా ఉన్నటువంటి స్థూలకాయం, మధుమేహం, బి.పి. లాంటి వ్యాధులున్న, సంతానం లేని స్త్రీలలో అవసరమైతే ఎండోమెట్రియల్ బయాప్సీ చేయించాలి. బయాప్సీలో తీసిన కణజాలాన్ని అధ్యయనం చేయటం ద్వారా క్యాన్సర్, ఎండోమెట్రియల్ హైపర్ ప్లేసియా వంటివాటిని నిర్ధారించవచ్చు. లాపరోస్కోపీ, హిస్టెరోస్కోపీ లాంటి పరీక్షలు అరుదుగా అవసరమవుతాయి.

**చికిత్స:-** ఇందులో తక్షణ చికిత్స రక్తస్రావాన్ని తగ్గించి, రక్తహీనత నుంచి కాపాడటానికై చేయాలి. గర్భసంచిలో గడ్డలు, పాలిప్ వంటి వాటిలో తప్ప శస్త్ర చికిత్స అవసరం పడదు. ఔషధాలతోనే అధిక శాతం రోగులకు ఉపశమనం కలిగించవచ్చు. ఈ ఔషధాలు ముఖ్యంగా రెండు రకాలు. హార్మోనులతో కూడినవి, హార్మోన్ రహితమైనవి.

హార్మోన్ రహితమైనవి నొప్పి నివారణా మందులు (మెఫనామిక్ ఆసిడ్, నాప్రాక్సిన్ మొ॥), యాంటీ ఫిబ్రినొలైటిక్ మందులు మొదలైనవి. హార్మోన్ మందులలో ప్రొజెస్టెరాన్ మరియు ఈస్ట్రోజెన్ కలసినవి, డానజోల్ మొదలగునవి ఉన్నాయి. వైద్యులు వ్యాధి కారణాన్ని బట్టి ఇందులో ఏ మందును ఇవ్వాలి అనేది నిర్ణయిస్తారు. ఈ ఔషధ చికిత్సలకు లొంగనప్పుడు ఎండోమెటిరియల్ అబ్లేషన్ (గర్భసంచీ లోపలి పొరని నాశనం చేయటం) చేయవచ్చును. అరుదుగా చికిత్సకు లొంగని కేసులలో గర్భసంచి తొలగించవలసి వస్తుంది. ★

లోకమందలి మంచి చెడ్డలు లోకులు ఎరుగరు.

తప్పులు ఎత్తి చూపెట్టి సవరించాలి. దిద్దుబాటు అవసరం.

ఈ పని చేయవలసింది స్త్రీలే! చేస్తున్నదీ స్త్రీలే!! ఎంచేతా అంటే ఆ తప్పుల వల్ల ఎక్కువకెక్కువ నష్టపోతున్నది స్త్రీలే! బాధలు పడుతున్నదీ స్త్రీలే.

పుత్తడి బొమ్మలు, చక్కని చుక్కలు, తల్లుల్ని కన్న తల్లులు, అమ్మల్ని కన్న అమ్మలు చుట్టూ జరుగుతున్న అమానుషపు కథలని, అవకతవకల కథల్ని, కన్నీటి కథల్ని వినాలి. దిద్దుబాటు చెయ్యాలి.

ఒక తల్లీ, ఒక అమ్మా కాదు, ఈ తరం తల్లులూ అమ్మలే కాదు! రాబోతున్న తరాల తల్లులూ అమ్మలు కూడా ఈ పనిని చేయాలి.

నలుగురు కూచుని నవ్వుకునే వేళల్లో ఈ కన్నీటి పేర్లని తలుచుకోవాలి. ముందు తరాల వారికి ఆ పేర్లని అందివ్వాలి.

మరవు పొరల్లోకి వీటిని పోనివ్వకుండా మళ్ళీ మళ్ళీ అలాంటి అవకతవకలు, మరో కొత్త రూపంలోకి మారి మళ్ళీ ముందుకు వచ్చే అమానుషాలు, పొరపాట్లు జరగకుండా చూడాలి. ఈ భూమే స్వర్గం అవ్వాలి.

సుఖమైన బతుక్కి రాజమార్గం వెయ్యాలి. గురజాడ అప్పారావు గారికి ఆ అమ్మాయిలు, ఆ తల్లులు, ఆ అమ్మలు ఆ స్త్రీలే అంతటా కనిపించారు. ఆ స్త్రీలు తమ పనిని మేము ఇది చేస్తున్నాం అని దండోరా వెయ్యకుండానే మొదలు పెట్టేశారు అని ఆయన గమనించారు. ఈ పని కుటుంబ పరిధి నుండి ప్రారంభం అయినట్టుగానూ ఆయన కనిపెట్టారు.

తర తమ భేదాలున్నప్పటికి అది నిరననగానో, ధిక్కారంగానో, చాకచక్యంగానో, బుద్ధికుశలతగానో, చదువు సంస్కారాల మేళవింపు తెలివిడిగానో, నిస్సహాయతలోని ఎదురు దాడిగానో, బతుకు నేర్పిన విజ్ఞతతో అణిగి మణిగి ఉంటున్నట్లే ఉంటూ సాఫల్యం చేసుకునే



# గురజాడ సృజించిన స్త్రీ

- చాగంటి తులసి



కార్యసాధనగానో స్త్రీల శీలస్వభావాలు ఆయన కళ్ళకి కట్టాయి. ఇది గురజాడకి ఎలా సంభవం అయిందీ అంటే జీవిత పరిశీలన చిన్నతనం నుండీ ఆయన నిత్యకృత్యం. "చిన్నతనంలో బొమ్మలాట నేర్పి ఉండుట చేత లోకమనే రంగంలో చిత్రకోటి రీతులలో ఆటాడే మనుషులనే పాత్రల సొగసును కనిపెట్టడం" ఆయన అలవాటు చీకటి వెలుగులు, నలుపు తెలుపులు రెండింటినీ చూడ్డమే కాదు చీకటి మీద నలుపు మీదా స్నేహమూ, ప్రేమ అనే తెల్లటి వెలుగులను ప్రసరింపజేసి వింత వింత సొగసులను బయల్పరచడం రచయిత పని అని ఆయనకు తెలుసు. మనసు కల్పించిన మాయా ప్రపంచంలోని పాత్రలతో కథలు అల్లడం లోకంలో లేని పాత్రలను కల్పించడం హానికరం. జీవితంలో నుండి పాత్రలను సృష్టించుకోవాలి అన్న విషయాలూ ఆయనకు తెలుసు. అందుకే సమకాలీన జీవితం లోంచి, యధార్థ జీవితంలోంచి పుట్టి రక్తమాంసాలతో సజీవంగా మన కట్టెదుట నిలబడి మన మధ్యనున్న వాళ్ళే వీళ్ళు అని అనిపించే పాత్ర సృజన విశ్వసనీయతని సంతరించుకుంది. ఆయన గమనంలోకి ఆయా పాత్రలు వచ్చి రూపుదిద్దుకున్నాయి. ఆయనని క్రాంత దర్శిని చేశాయి. ఆయనకి "బెదురు ఎరుగని బింకమెప్పిన నడక"తో భావితరాల స్త్రీ గోచరించింది. ఆధునిక స్త్రీ చరిత్రను పునర్లిఖిస్తూ సాక్షాత్కరించింది. భగవంతుడి సృష్టిలోకెల్లా విద్యనేర్చిన స్త్రీ

ఉత్కృష్టమైనదిగా ప్రత్యక్షమయింది. పాత కొత్తల మేలు కలయికగా ఇటు అర్థనారీశ్వరుడు, అటు ఇంగ్లీషువాడి బెటర్‌హాఫ్ కనిపించారు. మొగుడు దేవుడన్న మాట పాతమాట. మొగుడు స్నేహితుడు, ప్రాణ మిత్రుడు, సహచరుడు అయ్యాడు. డబ్బు, నగలు కన్నా ప్రేమ పెన్నిధి అయింది.

తల దించుకున్న స్త్రీ పాత్రలు ఆయన కలం నుండి వెలువడలేదు. తలెత్తుకున్న పాత్రలను సృష్టించడమే కాదు. ఆ స్త్రీ పాత్రలే ఆయా సమస్యా పరిష్కార మార్గాలతో ముందుకు అడుగు వేసినట్టు ఆయన రచనలన్నిటిలో చిత్రించడం జరిగింది. పూర్ణమ్మ పరిష్కార మార్గంగా నిరసనని ఎన్నుకుంది. కాసు కోసం ఎవరూ న్యాయాన్ని విడిచిపెట్టి ముసిలి మొగుడుకిచ్చి పెళ్ళి చేస్తే తల వొంచినట్టే వొంచి మీరు చేసింది అన్యాయం అని తెలియపరుస్తూ దుర్గలో కలిసిపోయింది. తల్లీదండ్రులకు, తోడబుట్టిన వాళ్ళకే కాదు మొత్తం సంఘానికి తన నిరసనని తెలియజేసింది. కంటతడి పెట్టినా ఆలోచించమంది. డబ్బూ, అధికారం చేతిలో ఉండి పట్టపగ్గాలు లేకుండా పట్టపగలు నట్టనడి వీధిని బలిమిని తనను పట్టబోయే రాజుకి ధిక్కారం తెలియజేస్తూ, "నీకు చేతనైతే నన్నిప్పుడు పట్టుకో" అంటూ అగ్నికి ఆహుతి అవుతుంది కన్యక. "నువ్వెంత? నీ అధికార మదమెంత? అని నిలదీస్తుంది. కాముకుడైన రాజునే కాదు వాడి దౌర్జన్యాన్ని అడ్డుకోలేని పెద్దలనీ నిలదీస్తుంది. కలిమి బలిమి ఉంటే చాలదు. విద్య కావాలి. బుద్ధి కావాలి. బుద్ధిబలం, బాహుబలం ఉండాలి. రాజుని ప్రతిఘటించలేకపోయిన కారణాలని ఏకరువు పెట్టి పరువు నిలుపుకోవడానికి పౌరుషం మీకెందుకు లేదు? అని గద్దిస్తుంది. ధిక్కారమే ఇక్కడ పరిష్కారం అయింది. చదువూ, తెలివితేటలు–సొగసూ, సంస్కారం ఉన్న స్త్రీ పాత్రలని సృష్టించి వారి వ్యక్తిత్వాలని చూసి గౌరవించి మెచ్చుకోవడమే కాదు మురిసిపోయాడు గురజాడ! తన చుట్టూ ఉన్న సమాజంలోనే ఆ స్త్రీ మూర్తులను ఆయన గమనిస్తూ వచ్చాడు. ఆయన మధురవాణి ఒక్కామె మాత్రమే అద్భుతమైన సృష్టి కాదు. ఆయన సృజించిన స్త్రీ మూర్తులందరిలో పరాకాష్ఠకు తీసుకెళ్ళిన పాత్రగా మధురవాణిని గుర్తించవలసిన అవసరం ఉంది.




దేవుళ్ళారా మీ పేరేమిటి? కథలోని నాంచారమ్మ చదువుకున్న స్త్రీ. సంస్కృతం తెలుగు భాషలు ఆవిడకు వచ్చు. గొంతెత్తి ఎంతోకమ్మగా పురాణాలు చెప్తుంది. అయ్యావార్లంగారింటికి వెలుగు ఆవిడే! ఇద్దరు పిల్లల తల్లి ఇటు రూపమూ అటు గుణమూ రెండింటి మేళవింపుతో దక్షతతో ఇంటిని, దేవాలయాన్ని నడుపుకుంటున్న దిట్ట. మొగుడు విశేష ప్రయోజకుడు కాకపోయినా, తాను ఆయన కన్నా గట్టిదే అయినా మొగుణ్ణి గౌరవించడంలోనూ ప్రేమను పంచి ఇవ్వడంలోనూ ఉత్తమ సంస్కారవంతురాలు. ఆవిడకి తెలివితేటలున్నాయి. సమయస్ఫూర్తి ఉంది. ఇబ్బందులు వచ్చినప్పుడు బెదరదు. నిబ్బరంతో చొరవ తీసుకోగలదు. సాహసించగలదు. మత మౌఢ్యంతోనూ స్వలాభాపేక్షతోనూ వైష్ణవులు శైవులని పరాభవించాలనుకుని తమకు తాము గుండం తొక్కాలన్న సమస్యని నెత్తికి ఎత్తుకుంటారు. పెద్ద అయ్యావార్ల చేత గుండం తొక్కించబోతారు. తన పెనిమిటి భయంతో అటకెక్కి దాక్కుంటే నాంచారమ్మ ఉగ్రరూపం దాల్చి రాత్రిపూట ఒక దీపం, రెండోచేత బాకు పట్టుకుని రంగంలోకి వస్తుంది. దుష్టులారా! ఈ పరమ పవిత్రమైన బ్రాహ్మణ్ణి వదుల్తారా! బాకుకి బలిచేద్దా? అని హుంకరిస్తుంది. హఠాత్ పరిణామానికి అందరూ భయంతో గజగజలాడతారు.

"నేను మా మామగారి పేరు స్మరిస్తూ గుండం తొక్కుతాను. నా వెంట రాగలిగిన వైష్ణవులెవరైనా ఉంటే ఎదుటికి రండి" అని సవాలు చేస్తుంది. తన యుక్తి ఉపాయంతో చక్రం అడ్డువేసి సమస్యను పరిష్కరిస్తుంది. పీరు సాయెబుతో గుండం తొక్కించి గండం నుండి గట్టెక్కిస్తుంది. పీరు శ్రీ స్వామి వారి తిరునామమే అని చెబుతుంది. ఈ వైష్ణవులు ఎవరు తురకలే అనీ చెప్తుంది. నాంచారమ్మ చాకచక్యం బుద్ధి కుశలతలు పరిష్కారాన్ని చూపెట్టాయి. మతాల గుట్టు రట్టు చేశాయి.

విద్యావతి, గుణవతి, వినయ సంపన్నురాలైన కమలిని మొగుడు పెడదారిన పడితే చదువూ సంస్కారాల మేళవింపు తెలివిడితో నౌకరు రాముడికి అందుకు తగిన శిక్షణనిచ్చి మొగుడు గోపాలరావు తప్పుని దిద్దుబాటు చేస్తుంది. సంస్కారవంతుడైన గోపాలరావు తన తప్పుని తెలుసుకుని పశ్చాత్తాపపడ్డం సమస్యకు పరిష్కారం జరగడం కమలిని వల్లే జరుగుతుంది. స్త్రీ తన సమస్యల్ని తాను పరిష్కరించుకోవడాన్ని ఇందులో చూస్తాం. దానికి కావాల్సిన చదువూ, స్వతంత్ర భావం, ఆలోచనా కమలినికి ఉన్నాయి. అందుకే ఆవిడ బెంబేలు పడే బేలలాగా కనిపించదు. మొగుడు పరాయి ఆడదాని కొంపకి పోతున్నాడని తనని నిర్లక్ష్యం చేస్తున్నాడని కంటతడి పెట్టదు. మొగుడితో పోట్లాడనూ పోట్లాడదు. వ్యంగ్యంగా రాసిన ఉత్తరంతో

రాముడి చేత వ్యంగ్యపు మాటలను పలికించడంతో కళ్ళు తెరుచుకునేట్లు చేస్తుంది. గోపాలరావు విద్యావంతుడు, సంస్కారవంతుడు. వ్యంగ్యాన్ని సరియైన పద్ధతిలో అర్థం చేసుకోగలిగాడు. అంచేత దిద్దుబాటు సాధ్యమైంది.

సంస్కారవంతుడు కాని మొగుణ్ణి మార్చడం చదువుకున్న యువతికీ సాధ్యం కాదు. మెటిల్డా, కమలిని బతుకుల్లోఉన్న పెద్ద తేడా ఇదే, మెటిల్డా సొగసరి. ఆమె చేవ్రాతా సొగసైనదే. ఆమె భర్త చదువుకున్నవాడే. పెద్ద విద్వాంసుడే. మూడు బీరువాలతో లైబ్రరీని పెట్టుకున్నవాడే! అందం, చక్కదనం పట్లా ఆసక్తి ఉన్నవాడే. ఎంతో సొగసుగా పువ్వుల తోట వేసుకున్నా ఇవన్నీ ఎన్ని ఉన్నా ఆయన సంస్కారహీనుడే. మెటిల్డాని కాయిదాలో పెట్టేవాడు. ఎదురింటి అబ్బాయిల వల్ల తన కాపురానికి ముప్పు రాబోతుందని తెలిసిన మెటిల్డా కార్యరంగంలోకి దిగుతుంది. ఇంత వరకూ మెటిల్డా భర్తని మార్చడానికి ప్రయత్నించదు. ఇందులో ఆవిడ వివేకమే కనపడుతుంది. భర్తలోని సంస్కారహీనతని ఆవిడ గుర్తించే ఉంది. పరాయి మొగవాడి ముందు అసభ్యంగా పిలిచే మొగుడు, ఎదురింటి అబ్బాయితో దీన్ని తీసుకుపోయి దానం చేశాను అని మొరటుగా చెప్పే మొగుడు, చదువుకున్న కుసంస్కారి మొగుడు. ఇక్కడ భర్తను తనకు తాను దిద్దే ప్రసక్తే లేదు. తన అందం వల్లా, భర్త సంస్కారహీనత వల్లా, బయట మగవాళ్ళకి తన పట్ల కలిగే ఆకర్షణ వల్లా తనకు కలుగుతున్న కష్టాన్నీ కన్నీటినీ సహిస్తూనే ఉంటుంది. ఈమెకు సాహసం ఉంది. ఎదురింటి అబ్బాయికి ఉత్తరం రాస్తుంది. దొంగచాటుగా వంటవాడి ద్వారా పంపే ధైర్యం చేస్తుంది. మొగుడికి చెప్పే కన్నా పైవాళ్ళకి చెపితేనే మొగుడు మారే అవకాశం ఉంది. కాపురం కూలదోసుకోవడానికి కాదు. కాపురం నిలుపుకోవడానికి సమస్యని పరిష్కరించుకోవడానికి ముందడుగు ఇదే. అట్నుంచి నరుక్కురావడం ఉత్తమం అనుకుంటుంది. భర్తలో మార్పుని ఒక్కొక్క మెట్టుగా రాబట్టుకోవాలని చూస్తుంది భార్య ఘుంచిదని, దాని చెర వదిలిందని, తన చెర వదిలిందని, ఎదురింటి యువకులతో స్నేహభావం పెంచుకోవడమే కాక తమతో కూచుని కాఫీ తాగమని భార్యకు చెప్పేంత మార్పు భర్తలో వస్తుంది. అయినా ఆవిడకి తెలుసు. అలా కూచుని తాగే స్థితి ఇంకా రాలేదు. పుస్తకాలు చదివించడం, భాష నేర్పడం మొదలు పెట్టిన మొగుడు ఆ స్థాయికి చేరుకోవచ్చు. తనని తీసుకుని బయటికి వెళ్ళి కులాసా చేసే స్థితికి వచ్చినా తనకి స్వేచ్ఛ ఇచ్చినా ఉపయోగించుకోకుండా భర్త ఇష్టానుసారం నడుస్తున్నట్టుగానే ఉంటుంది. ఇది బ్రతుకు నేర్పిన విజ్ఞత. అణిగి మణిగి ఉంటున్నట్టే ఉంటూ కార్యాన్ని సాధించుకునే స్వభావం. భార్యా భర్తల మధ్య ఉన్న వయసు తేడా, అందం అందవిహీనతల అంతరం మగవాడి ఎదగని మనస్సూ, ఆడదాని విజ్ఞతా, మగవాడి ఆధిపత్య జులుం ఈ కథలో కనపడతాయి.

సమాజం తమకు ప్రసాదించిన బతుకును యథాతథంగా స్వీకరించకుండా తమ జీవితేచ్ఛను తమదైన పద్ధతిలో అనుభవిస్తూ సమాజపు అవహేళనకు గురి అవుతున్న దానిని ఎదిరించడమే కాకుండా దానిని లెక్క చేయని గయ్యాళితనంలో బతుకు సమస్యని పరిష్కరించుకున్న స్త్రీలు గురజాడ పరిశీలనకు వచ్చారు. పెళ్ళి పీటలమీదే పుస్తె కట్టేడో లేదో తెలీని స్థితిలో ముసలి పెళ్ళి కొడుకు గుటుక్కుమంటే ఎటూ తెలీక అటూ కన్యాకాక, ఇటు విధవా కాక జీవన భృతి లేక పూటకూళ్ళమ్మగా మారిన స్త్రీ గయ్యాళి కాక ఏమిటవుతుంది? సంఘపు దృష్టిలో చెడు తిరుగుళ్ళు అయినా తన బతుక్కి కావాల్సిన సుఖాన్ని వెతుక్కోక ఏం చేస్తుంది? బాకీలు ఎగ్గొట్టే ధూర్తులను చీపురుకట్టతో కొట్టి తన శక్తిని నిరూపించుకోక ఏం చేస్తుంది? నిస్సహాయతలోంచి ఎదురు దాడి పరిష్కారం కాక ఏమవుతుంది?

గడసరితనం ఉన్నా రామప్పంతుల్లాంటి అయోగ్యుడితో కథ నడుపుకున్నా మీనాక్షికి ఏటేటా కడుపు అవకా మానదు, అయినప్పుడల్లా వొల్ల మాలిన అల్లరీ తప్పదు. ప్రాణభయం వరకూ ఒక్కొక్కసారి వెళ్ళకా తప్పదు. జీవితేచ్ఛని చాటుమాటుగా తీర్చుకున్నా తాను బతుకుతున్న బతుకు హీనమైనదని ఆమెకు తెలీదంటే తెలుసు. అందుకే తన బతుక్కి రామప్పంతులుతో పెళ్ళే పరిష్కారంగా అడుగు వేస్తుంది. మధురవాణికి నేస్తమూ అవుతుంది. మీనాక్షిని పెళ్ళాడితేనే గాని తలుపు తీయ్యననే మధురవాణి సమర్థననీ సాధిస్తుంది. తన బతుకులాంటి బతుకు ఏ ఆడపిల్లకీ రాకూడదని సుబ్బి పెళ్ళి సమస్యకి పరిష్కార మార్గం సుగమం చేస్తుంది.

సమాజపు కట్టుబాట్ల మధ్య, ఆ సమాజం తనకు ప్రసాదించిన బతుకు బతుకుతున్న బుచ్చమ్మ అమాయకురాలే కాని తెలివితక్కువది కాదు. వివేకం లేనిది కాదు. తన బతుక్కి ప్రత్యామ్నాయపు పరిష్కారం కోసం ఎప్పుడూ తల్లడిల్లకపోయినా, దొరికిన బతుకుని అమాయకంగా స్వీకరించినా తన చెల్లెలు సుబ్బి బతుకు తన బతుకులా కాకుండా తన డబ్బుతో తమ్ముడు పెళ్ళి చెయ్యమని, చెల్లి పెళ్ళి చెయ్యమని, చెల్లి గొంతు కొయ్యొద్దనీ చెప్పే సాహసం ఉన్న స్త్రీ. విధవా పునర్వివాహాల గురించిన పూర్తి వివరాలను జాగ్రత్తగా గ్రహించనూ గలిగింది. చెల్లి పెళ్ళి తప్పించడానికి లేచిపోయే సాహసాన్ని చేయగలిగింది.

సనాతన ఆచారాలతో అగ్గి రాముడైన భర్తతో, ఆడముండలతో ఆలోచన ఏమిటనుకునే మూర్ఖుడితో బతుకు ముడిపడి ఉన్నా తనకున్న భూమిని అమ్మేసి కుర్రాడికి చదువు చెప్పించాలని, చదువుల్లోనూ ఉద్యోగాల్లోనూ వస్తున్న మార్పుల్ని అర్థం చేసుకుంటూ ఆహ్వానించే వెంకమ్మకి బతుకు నేర్పిన విజ్ఞత పుష్కలంగానే ఉంది. సుబ్బి

**(మిగతా 40వ పేజీలో)**




-వేములపల్లి సత్యవతి

**ము**దితల్ నేర్వగరాని విద్యకలదే! ముదిమిన్" అని కవి రాసినట్లుగానే నేటి యువతులు, మహిళలు నింగి, నేల, నీరు అన్ని రంగాలలోను అప్రతిహతంగా ముందుకు దూసుకుపోతున్నారు. అంతరిక్షయానంలో విహరించి కీ.శే. కల్పనాచావ్లా, నేటి సునీతా విలియమ్స్ మన దేశఖ్యాతిని ఇనుమడింపజేశారు. క్రీడారంగంలో సైనా నెహ్వాల్, అంతర్జాతీయ క్రీడారంగంలో షీల్డ్ స్వంతం చేసుకుని దేశానికి గర్వకారణమయింది. గుత్తా జ్వాల రాష్ట్రపతి చేతుల మీదుగా 'అర్జున' అవార్డునందుకుని అందరిని ఆనందపరవశులను చేసింది. సానియామీర్జా, కరణం మల్లీశ్వరి, కోనేరు హంపి మొదలగు క్రీడాకారిణులు స్వర్ణ,రజత, కాంస్య పతకాలను సాధించారు. యుద్ధరంగంలోని త్రివిధ దళాలలోనూ మహిళలు ప్రవేశించి ప్రశంసా పాత్రులయ్యారు. మన మహిళా లోకానికి మరో కలికితురాయి లభించింది. ఆమే 'థెస్సీ థామస్' భారతీయ ప్రథమ మహిళా శాస్త్రవేత్త.

ఒక మహిళ శాస్త్రవేత్త నేతృత్వంలో ఏప్రియల్ 20, 2012న ఖండాంతర ఉపరితల క్షిపణి అగ్ని-5 విజయవంతంగా నింగికెగసింది. భారతదేశపు ప్రథమ క్షిపణి మహిళా శాస్త్రవేత్త థెస్సీథామస్. అందరూ 'అగ్నిపుత్రి' అని సగర్వంగా చెప్పుకునే ముద్దుపేరు. థెస్సీ జన్మస్థలం కేరళలోని అలెప్పీ. త్రిసూర్ కళాశాలలో బిటెక్ చదివారు. గైడెడ్ మిస్సైల్స్ కోర్సులో ఎంటెక్ పూర్తిచేశారు. రక్షణరంగ పరిశోధన ఎడల థెస్సీకి అమితమైన ఆసక్తి ఉండేది. ఆ కోరికతోనే డిఆర్‌డిఏలో అడుగుపెట్టారు. ఆమె ప్రవేశించిన డిఆర్‌డీఏలో మనదేశపు క్షిపణుల పితామహుడు, మాజీ రాష్ట్రపతి అబ్దుల్‌కలాం కూడా పనిచేస్తుండేవారు. పరిశోధనల్లో ఆమెకున్న అమితాసక్తిని, పట్టుదలను, శ్రమించే స్వభావాన్నీ, తెలివితేటలను అబ్దుల్‌కలాం గమనించారు. ఆమెకు అగ్ని ప్రాజెక్ట్ రూపకల్పన విభాగంలో అవకాశం కల్పించారు. దాన్ని ఆమె నూటికి నూరుపాళ్ళు సద్వినియోగం చేసుకున్నారు. 2009లో అగ్ని-4 రూపకల్పన ప్రాజెక్ట్ డైరెక్టర్‌గా ఎన్నుకోబడ్డారు. ఇప్పుడు అగ్ని-5 రూపకల్పన ప్రాజెక్ట్‌ను విజయవంతం చేసిన మహిళా శాస్త్రవేత్తగా చరిత్ర సృష్టించి అందరి మన్ననలకు పాత్రులయ్యారు. ఆమెతోపాటు నాలుగైదు వందలమంది శాస్త్రవేత్తలు రాత్రింపగళ్ళు శ్రమించి కృషి చేశారు. తనతోపాటు వారందరి కృషి ఇందులో సమ్మిళితమయి ఉందని టెస్సీ అన్నారు.

అంతరిక్షయానంలో విహరించి కీ.శే. కల్పనాచావ్లా, నేటి సునీతా విలియమ్స్ మన దేశఖ్యాతిని ఇనుమడింపజేశారు. క్రీడారంగంలో సైనా నెహ్వాల్, అంతర్జాతీయ క్రీడారంగంలో షీల్డ్ స్వంతం చేసుకుని దేశానికి గర్వకారణమయింది. గుత్తా జ్వాల రాష్ట్రపతి చేతుల మీదుగా 'అర్జున' అవార్డునందుకుని అందరిని ఆనందపరవశులను చేసింది. సానియామీర్జా, కరణం మల్లీశ్వరి, కోనేరు హంపి మొదలగు క్రీడాకారిణులు స్వర్ణ,రజత, కాంస్య పతకాలను సాధించారు. యుద్ధరంగంలోని త్రివిధ దళాలలోనూ మహిళలు ప్రవేశించి ప్రశంసా పాత్రులయ్యారు. మన మహిళా లోకానికి మరో కలికితురాయి లభించింది. ఆమే 'టెస్సీ థామస్' భారతీయ ప్రథమ మహిళా శాస్త్రవేత్త.

ఈ ప్రాజెక్టులో అత్యంత కీలకమైన 'రీ ఎంట్రీ వెహికల్' అనే వ్యవస్థ అభివృద్ధిలో థెస్సీ కీలకమైన పాత్ర పోషించారు. విశేషమైన కృషి సల్పారు. దీనినే 'ఆర్వీఎస్' అంటారు. ఆర్వీఎస్ అంటే ప్రయోగించిన క్షిపణి ఆకాశంలోనికి దూసుకువెళ్ళి తిరిగి భూకక్ష్యలోకి ప్రవేశించే సమయాన ఉత్పన్నమయ్యే మూడు వేల డిగ్రీల సెల్సియస్ వేడిని తట్టుకుని నియంత్రణ వ్యవస్థలు దెబ్బతినకుండా క్షిపణి క్షేమంగా భూకక్ష్యలోనికి ప్రవేశించే పరిజ్ఞానం, ఆమెకున్న ఆత్మవిశ్వాసం, ఉత్సుకత, అంకితభావంతో కష్టపడి పనిచేయటం థెస్సీ విజయానికి మార్గం సుగమం చేశాయి. డిఆర్‌డిఏలో చేరేటప్పుడు ఐదు సంవత్సరాలు మాత్రమే పనిచేయాలన్న తలంపుతో ప్రవేశించారు. కాని కలాం ఇచ్చిన ప్రోత్సహం మరియు 20 సంవత్సరాల అవిశ్రాంత కృషి వలన ఈ దశకు చేరుకున్నాను అన్నారామె. ఎన్నో అవార్డులందుకున్నారు. భారతీయులు హర్షాతిరేకంతో ప్రశంసల వర్షం కురిపించారు. అగ్నిపుత్రిక టెస్సీ ఇంకా ఉన్నత శిఖరాలదిరోహించాలని, మిగతా మహిళా శాస్త్రవేత్తలు టెస్సీలాగ అభివృద్ధి పథంలో పయనించాలని కోరుకుందాం. నిండు మనస్సుతో అగ్నిపుత్రికి హార్థికాభినందనలు అందచేద్దాము.



(38వ పేజీ తరువాయి)

పెళ్లి తప్పించడానికి ప్రయత్నించి నిస్సహాయతతో నూతిలో పడి నిరసనని తెలియజేస్తుంది. గిరీశాన్ని బతిమాలుకుంటుంది. అన్న కరటక శాస్త్రినీ ఈ సంబంధం తప్పించమని, సమస్య పరిష్కారానికి తన నిస్సహాయతలోనూ మార్గాలని వివిధ రకాలుగా అన్వేషిస్తుంది. వెంకమ్మ నిస్సహాయతలోనూ తలెత్తిన స్త్రీయే!

మధురవాణి బుద్ధిమంతురాలైన తల్లి శిక్షణ వల్ల మానవత్వానికి మంచి సంస్కారానికి మరొక రూపు అయింది. ఆవిడ విద్యావంతురాలు. దయాదాక్షిణ్యాలు ఉన్న మనిషి స్వాభిమానం, నైతికత, బుద్ధికుశలత, మాటకారితనం, ఎంతటి మగవాడినైనా తన సొగసు, హొయలతో, తన నవ్వుతో, మాటకారితనపు చమత్కారంతో కార్యసాధనకు వినియోగించుకోగలదు. మంచి నేర్పరి. జరుగుబాటు కోసం కులవృత్తిని నమ్ముకున్న తాను అందరి వంటి దానిని కానని ఆమెకు తెలుసు. విద్యవంటి వస్తువులేదని తెలుసు. విత్తం తేలేని విద్య దరిద్రహేతువనీ తెలుసు. ఆవిడ ఎవరిమీదా ఆధారపడదు. అందరి యోగక్షేమాలు చూస్తుంది. తనను ఎవరో చూడాలని అనుకోదు. తనను తాను చూసుకోగల చెక్కుచెదరని ఆత్మవిశ్వాసం ఆవిడ సొత్తు. ఆవిడ నిస్సహాయురాలు కాదు! ఇతరుల పరిస్థితులను చక్కబెట్టి సమస్యాపరిష్కారాలు చెయ్యడమే కాదు, తనకు కావలసిన పరిస్థితిని కల్పించుకోగలిగిన సమర్థురాలు. తన వృత్తిని మానివేయాలని నిశ్చయించుకుని తదనుగుణంగా అడుగువేస్తుంది.

గురజాడ స్త్రీ పాత్రలు కళ్ళకు వెలుగునిస్తాయి. బుద్ధికి పదునుపెడతాయి. మూర్ఖత్వాన్ని పోగొడతాయి. మారుతున్న, మారబోతున్న సమాజపు రూపాన్ని దర్శించడానికి కావలసిన సాధనాన్ని సమకూరుస్తాయి. ఆ పాత్రలు ఆనాటి స్త్రీల మనస్తత్వానికి భిన్నమైనవా అంటే కానేకావు. ఆనాటి బతుకులోంచి, ఆ విజ్ఞత లోంచి పుట్టిన వాస్తవ పాత్రలు. అందుకే ఇప్పటికీ, ఎప్పటికీ జీవించే ఉంటాయి.

**(ఆకాశవాణి ప్రసంగానికి సంక్షిప్త రూపం..)**

## స్త్రీ

తల్లి గర్భగుడిలో పిండం
వెలుతురు వాకిట వాలుతూ
కెవ్వున కేక పెట్టే క్షణం అమ్మయింది

ఉదయభానుడు నిట్టూర్చుతూ
పడమర దిక్కున జారుకున్న
గోధూళి వేళ
శాంతమూర్తి అయింది

అమావాస్య చీకటి రాతిరివేళ
వెలుతురు ప్రేమని పంచే
వెన్నెల చందమామయింది
అనురాగాల పల్లకిలో ఊరేగిన చెల్లైంది
అనుబంధాల వాకిట వేళ్ళూనుకున్న
వటవృక్షపు అత్తయింది

మెతుకు లేక బ్రతుకు కోసం
వెతుకులాడే అనాథలను
అక్కున చేర్చుకున్న
భూదేవికి బిడ్డయింది

ప్రణయంలో ప్రేమమూర్తయి
ప్రసవంలో మాతృమూర్తయి
ప్రళయంలో పరసువేదైంది

నింగిలో వెలిగే చుక్కల్లో సగం
పుడమి తల్లి కన్న బిడ్డల్లో సగం
అనంత విశ్వసృష్టికి
మూలమైన స్త్రీ......
నేడు అంగట్లో సరుకైంది
విఫణి వీధిలో విలువలు ఒదిలి
సరుకుల సంతలో కొలువుదీరిన
బొమ్మయింది

సీతా... శూర్పనఖ... చంద్రమతి
జెస్సికాలాల్.... శ్రీలక్ష్మి..... ప్రత్యూష
ఎవరి కథ విన్నా వ్యథాభరితమే
పూల పరిమళాలు దోచి
వాడిన వెంటనే విసిరేసినట్టు
కరివేపాకులా తీసిపారేసినట్టు
తరతరాలుగా.....
అదే వారసత్వం
అదే బానిసత్వం
అనాదిగా సాగిపోతున్న
బానిసత్వ సంకెళ్ళను
బద్దలు కొట్టాలి
కన్నీటి వారసత్వపు
వివక్షతా వట వృక్షాన్ని
కూకటి వేళ్ళతో పెకిలించాలి
అందుకే....
ఇప్పుడు సాధికారతకై
సాగుతున్న సమరంలో మెరుపవ్వాలి
రాజ్యాధికారంకై జరుగుతున్న
యుద్ధంలో గెలుపవ్వాలి
ఇదే నేటి మహిళా పిలుపవ్వాలి.

-నిశ

## మేలుకో-తెలుసుకో

**ఓ** మహిళా ఇకనైనా మేలుకో
నీ వ్యక్తిత్వాన్ని నిలుపుకో
అన్ని రంగాల్లో అడిగిడుతున్నావు
ఆకాశంలో సగమై మెరుస్తున్నావు
ఇంటికే నీవు పరిమితం కావు
ఈ లోకాన్నే జయించగలవు
ఉన్నత శిఖరం అధిరోహించగలవు
ఊతం కోసం ఎదురుచూడవు
ఎన్నో కష్టాలను భరించేవు
ఐకమత్యమునే కోరెదవు
ఒంటరితనాన్ని మరచెదవు
ఓర్మితో మసలుకొనేవు
ఔనత్యాన్ని చాటుకొనెదవు
అందరిలో మిన్న నీవు
ఆ నీకు సాటి నీవే నీవు...

-డా॥ విద్యాదేవి

# సుందరకాండ

(మానవి దశాబ్ది సంచికలో కథల పోటీలో రెండవ బహుమతి పొందిన కథ)

– కాళీపట్నం సీతా వసంత లక్ష్మి

సుందరి బ్యూటీ పార్లర్‌లో చేరినప్పటి నుంచీ రమామణి కళ్ళు నేలమీద నిలవటంలేదు. పదో తరగతి పాసయ్యాక తండ్రి ఇంక చదివించలేనంటే, ఏం చేద్దామా అనుకుంటుంటే ఈ చిన్న ఉద్యోగం దొరికింది. పార్లర్ చాలా పెద్దదే. వారంలో ఏడు రోజులూ వెళ్ళాలి. ఉదయం పది గంటల్నించి రాత్రి ఏడు దాకా పనిచేయాలి. ఏ పని చెప్తే అది చేయాలంది మేడమ్.

అసలు ఏవనీ రాని తనకు రెండువేల జీతం. ఎన్నిసార్లు కావాలంటే అన్నిసార్లు టీ లేదా కాఫీ,టిఫెను ఇస్తారట. మధ్యాహ్న భోజనం ఇంటినుండి తెప్పించుకోమంది. ప్రత్యేకించి మధ్యాహ్న భోజన సమయం అంటూ ఏమీ లేదు. ఎప్పుడు ఖాళీ దొరికితే అప్పుడే తినాలి. పార్లర్ స్త్రీలు, పురుషులు ఇద్దరికీను. ఎప్పుడూ జనాలతో కిటకిటలాడుతూ, కళకళలాడుతూ ఉంటుంది. కొంతమంది అబ్బాయిలు కూడా పనిచేస్తున్నారు. అంతా కలిపి ఒక పది పదిహేనుమంది ఉంటారు. అంతా కలివిడిగా ఉండి, సరదాగా అనిపించింది రమామణికి. హెయిర్ స్టైయిల్ చేశాక నేలమీద పడిన జుట్టు, కనుబొమ్మలు తీర్చిదిద్దాక క్రింద పడే దారం ముక్కలు, దూది ముక్కలు అన్నీ ఎప్పటికప్పుడు ఊడ్చి శుభ్రంగా ఉంచాలి. అబ్బాయిలు ఎవరూ ఈ పనిచేయరు. కానీ మంచి బట్టలు తొడుక్కోవటం, అందరికీ పార్లర్లో పనిచేస్తున్నాను అని గర్వంగా చెప్పుకోవటం రమామణికి ఎంతగానో నచ్చాయి. ఆ రోజు ఎక్కువమంది కస్టమర్లు లేరు. మగవాళ్ళ విభాగంలో మసాజ్ వాళ్ళు మాత్రమే బిజీగా ఉన్నారు. నవీన మసాజ్ సెక్షన్ లోనే పనిచేస్తుంది. మసాజ్ గదులు ఎప్పుడూ వేసే ఉంటాయి. తలుపు తట్టిగాని లోపలికి వెళ్ళవద్దని మేడం చెప్పింది. ఆ రోజు ఎందుకో నవీన రాలేదు. నవీన ఎక్కువగా మాట్లాడదు. తనపనేమిటో తానేమిటో అన్నట్లే ఉంటుంది. కానీ కళ్ళల్లో ఎప్పుడూ ఏదో ఉదాసీనత. భయమో, బెరుకో తెలీని ఒక విచిత్రమైన భావం కానవస్తుంది. నవీనకి జీతం కూడా మిగతా వాళ్ళకన్నా ఎక్కువే. నవీన అందగత్తె కాదుగానీ, చక్కటి ఆకృతి, నున్నని చర్మం. బ్యూటీ పార్లర్‌లో పనిచేసే అమ్మాయి అంటే ఇలా నున్నటి చేతులూ, బుగ్గలూ అచ్చం ఇలాగే ఉండాలి అనిపిస్తుంది. హెయిర్ స్టైయిల్ కాగానే జుట్టూ, వ్యాక్స్ స్ట్రిప్స్, దూదిపింజలు, దారం ముక్కలు అన్నీ శుభ్రంగా చెత్తబుట్టలో వేసింది రమామణి. ఇంతలో 'మేడమ్ రమ్మంటున్నారు' అంటూ కబురొచ్చింది.

మేడం గదిలోకి తుడుచుకుని వెళ్ళింది. " ఇదిగో నవీన రాలేదు. జాన్‌కి మసాజ్‌లో సహాయం కావాలట. నువ్వెళ్ళు'' అంటూ పురమాయించింది. అప్పుడు మూడయింది. ఇంకా తను అన్నం కూడా తినలేదు. కానీ ఏమీ ప్రశ్నలు వేయకూడదు. వెంటనే మసాజ్ గదిలోకి వెళ్ళింది. పరదాలు కొద్దిగా తొలగించి, లోనికి తొంగి చూసింది. ఒక లావాటి ఆసామి ఒక చిన్న తువ్వాలు కట్టుకుని ఎత్తుగా అమర్చిన ఆస్పత్రి బెడ్ లాంటిదానిమీద పడుకుని ఉన్నాడు. పక్కనే జాన్ నిలబడి ఏదో మంచి సువాసన గల తైలంతో ఆయన వీపుమీద మర్దన చేస్తున్నాడు. హాయికి తట్టుకోలేక ఆ లావాటి ఆసామీ ఆనందపు మూలుగులు వినిపిస్తున్నాయి. అక్కడే నిలబడి, జాన్ కావాలన్నప్పుడల్లా, అతడి చేతిలో నూనె పోస్తూ నిలబడింది. పావుగంట అయ్యేసరికి ఆసామి వెల్లకిల్లా పడుకున్నాడు.

అంతలో జాన్‌కి ఫోన్ వచ్చిందని చెప్పటంతో "ఇప్పుడే వస్తా కాస్త మసాజ్ చెయ్'' అంటూ పురమాయించాడు. సంకోచంగా, బిడియంగా కొద్దిగా నూనె చేతిలోకి తీసుకుని, మెల్లగా రుద్దటం ఆరంభించింది రమామణి. రెండు మూడు నిముషాలయ్యేసరికి ఆసామి రమామణి చెయ్యి పట్టుకుని, మీదికి లాక్కుని, ఒళ్ళు తడమటం ఆరంభించాడు. హడలిపోయి అనుకోని ఈ దాడికి కోలుకునేలోగా ఆసామి రమామణి చేతులను ఎక్కడెక్కడో తిప్పటం ఆరంభించాడు. పదిహేనేళ్ళ రమామణి కోలుకునేలోగా తృప్తిగా నిట్టూర్చి చేతిలో వందనోటుంచి గబగబా లేచి బాత్రూం వైపు నడిచి మాయం అయిపోయాడు.

కళ్ళల్లో నీళ్లుబుకుతుండగా పరుగులాంటి నడకతో రమామణి మేడం గదిలోకి వెళ్ళింది. ఎక్కిళ్ళ మధ్య జరిగిన విషయం ఎలాగో తెలియచేసింది. " ఇంతమాత్రానికే ఇంత ఏడపా. రెండువేలు ఊరికే గదులు ఊడ్చటానికనుకున్నావా? పైన బక్షీస్ ఇచ్చాడుగా. ఇంకెందుకు ఏడుపు? ఇక సంతోషించు, నీ టిప్పులో నేను భాగం అడగలేదు. ఎక్కడక్కడినుంచి వస్తారో ఉద్యోగాలకోసం". విసుగ్గా అంది.

మరునాడు పార్లర్ ఉద్యోగానికి హుషారుగా తయారవ్వకుండా ఇంట్లో తచ్చాడుతూన్న రమామణి అమ్మా నాన్నలకు ఏవంక చెప్పి ఉద్యోగం మానాలా అని తికమకపడుతోంది. పాపం ఆమెకేం తెలుసు, తమకంటూ ఒక యూనియన్ అనేది లేదనీ, ఉంటే ఈ విధమైన లైంగిక దోపిడీ జరగకుండా రక్షణ లభించేదనీ, రమామణి సంశయంలో పడింది. చివరకు తమవంటి ఉద్యోగుల కోసం కూడా ఒక యూనియన్ ఏర్పరచుకోవాలని, లైంగిక వేధింపులు మరియు దోపిడి నుండి రక్షణ పొందాలని స్థిరమైన నిర్ణయానికి వచ్చింది రమామణి.

# గురువులే కీచకులైన వేళ...

లైంగిక వేధింపులపై తమిళనాడు ఐద్వా కృషి



భారత దేశంలో తల్లిదండ్రుల తరువాత గౌరవస్థానం గురువుదే. 'ఆచార్య దేవోభవ' అని గురువుకు ఒక పవిత్ర స్థానం కల్పిస్తాము. సాధారణంగా పాఠశాలలను ఒక సురక్షిత ప్రదేశంగా, గురువులను పాఠశాలలో ఉన్నంతసేపూ పిల్లల సంరక్షకులుగా భావిస్తాము. కాని ప్రస్తుత కాలంలో ఆడపిల్లలపై స్కూళ్ళు, కాలేజీలలో కొంతమంది అధ్యాపకులు జరుపుతున్న అత్యాచారాలు, లైంగిక వేధింపులు సభ్య సమాజం తలదించుకులేలా ఉన్నాయి. తల్లిదండ్రులు బాలికలను స్కూళ్ళకు, కాలేజీలకు పంపాలంటే భయపడే సంఘటనలు జరుగుతున్నాయి. దేశవ్యాప్తంగా బాలికలపై జరుగుతున్న అనేక లైంగిక వేధింపుల కేసులలో ఐద్వా జోక్యం చేసుకుని పోరాడుతున్నది. ఇలాంటి కేసులలో ఐద్వా తమిళనాడు శాఖ చేసిన కృషిలో అనేక అనుభవాలు వెలుగు చూశాయి. 8 నెలలలో 8 కేసుల విషయంలో పోరాటం చేసింది.

మధురై జిల్లాలోని పొదుంబు గ్రామంలో ఒక పాఠశాల ప్రధానోపాధ్యాయుడు మూడు సంవత్సరాలుగా పిల్లలను వేధింపులకు గురిచేస్తున్నాడు. కడలూరు జిల్లా సంగలికుప్పంలోని ఒక పాఠశాలలో ఒక ఉపాధ్యాయుడు తన సెల్‌ఫోన్‌లో అశ్లీల చిత్రాలను లోడ్ చేసుకుని వాటిని చూడమని 8వ తరగతి చదువుతున్న బాల బాలికలను ఒత్తిడి చేసేవాడు. విరుధ్‌నగర్ జిల్లాలోని ఒక స్కూలు ప్రధానోపాధ్యాయుడికి ఆడపిల్లలపై లైంగిక వేధింపులకు పాల్పడడం ఒక అలవాటుగా మారింది. అదే జిల్లాలోని ఒక సోషల్ టీచర్ ఆడపిల్లలపై అనేకసార్లు అత్యాచారాలకు పాల్పడేవాడు. నాగపట్నం జిల్లాలోని సెంబనార్‌కోయిల్ అనే గ్రామంలో ఒక అధ్యాపకుడు ఒక బాలికపై అత్యాచారానికి పాల్పడగా బాలిక కొన్నిరోజులపాటు స్పృహ కోల్పోయింది. ఇలాంటి అనేక వికృత సంఘటనలు సభ్య సమాజానికి గగుర్పాటు కలిగించేవిగా వున్నాయి.

ఇటువంటి సంఘటనలలో పోలీసులను సంప్రదిస్తే సాధారణంగా వారి స్పందన తల్లిదండ్రులను నిరాశ పరిచేదిగా ఉంటున్నది. నిందితుడు బదిలీ అయ్యేలా చూస్తామనీ, కేసు పెడితే బాలిక భవిష్యత్తు నాశనమవుతుందనీ నచ్చచెప్ప చూస్తున్నారు. ఒక జరగరాని సంఘటన జరిగిన తరువాత బాలిక తన జీవితంలో అనేక నష్టాలు చవి చూస్తుండగా బాలిక భవిష్యత్తు బాగుపడడం కోసం కేసు పెట్టవద్దని పోలీసులు వాదించడం ఎంత వరకూ సబబని ఐద్వా ప్రశ్నిస్తుంది. కొన్ని సంఘటనలు జరిగినపుడు బాలిక శాశ్వతంగా బడికి దూరమవుతుంది. కొన్ని సంఘటనలలో బాలికలు జీవితాం

భారత దేశంలో తల్లిదండ్రుల తరువాత గౌరవస్థానం గురువుదే. 'ఆచార్య దేవోభవ' అని గురువుకు ఒక పవిత్ర స్థానం కల్పిస్తాము. సాధారణంగా పాఠశాలలను ఒక సురక్షిత ప్రదేశంగా, గురువులను పాఠశాలలో ఉన్నంతసేపూ పిల్లల సంరక్షకులుగా భావిస్తాము.

పేద వర్గాలకు చెందిన బాలికలు జీవితంలో అనేక ఆశలతో ఎన్నో ప్రయాసలకోర్చి తమ చదువును సాగిస్తూ ఉంటారు. ఇలాంటి లైంగిక వేధింపుల వలన ఎంతోమంది బాలికలు తీరని మానసిక వేదన అనుభవిస్తుండగా, మరెంతో మంది తమ చదువును మధ్యలోనే ఆపేస్తున్నారు. జిల్లా విద్యా శాఖ కూడా ఇలాంటి కేసులలో ఎంతో ఉదాశీనంగా ఉంటుంది.

షాక్‌లోనే ఉంటున్నారు. కొంతమంది బాలికలకు మానసిక సమస్యలు వస్తున్నాయి. ఏ తల్లిదండ్రులూ తమ పిల్లలకు ఇలాంటి బాధాకరమైన జీవితం కోరుకోరు. కనుక ఇలాంటి సంఘటనలు జరిగినపుడు పోలీసులు ఖచ్చితంగా కేసులు నమోదు చేసి నిందితులను కఠినంగా శిక్షించాలనీ ఇలాంటి సంఘటనలు పునరావృతం కాకుండా చూడాలనీ ఐద్వా పోరాడుతుంది.

పైన పేర్కొన్న అన్ని కేసులలోనూ పోలీసులు అంత తేలికగా ఎఫ్ఐఆర్‌లు పెట్టలేదు. ఐద్వా దాని కోసం పోరాడాల్సి వచ్చింది. పొదుంబు మరియు సెంబనార్‌కోయిల్‌లలో పోరాడి కేసులు పెట్టించాము. సత్తూరు, సంగలికుప్పంలలో తల్లిదండ్రులను కేసులు పెట్టవద్దని ఒప్పించారు. ఇది ఐద్వా దృష్టికి వచ్చి ఐద్వా కేసు పెట్టిన తరువాత మాత్రమే సత్తూరులో ఎఫ్ఐఆర్ పెట్టారు. కాని సంగలికుప్పంలో కేసు వాపసు తీసుకోమని పోలీసులు ఐద్వాను కోరారు. పోలీసులు తాము కేసు విషయంలో పరిశోధన చేశామని అక్కడ ఎటువంటి లైంగిక వేధింపులు జరగలేదని తెలిసిందనీ చెప్పారు. కానీ ఐద్వా వారి మాటలు వినలేదు. సంఘటనలేమీ జరగనపుడు కేసు దానంతట అదే పూర్తవుతుంది. కానీ ముందుగానే కేసు రద్దు చేసుకోమని ...డమేమిటని ఐద్వా పోలీసులను ...చింది. ఎఫ్ ఐ ఆర్ నమోదయిన తరువాత పరిశోధన ఎలా జరగాలనే దానిపై కోర్టులు, అనేక మార్గదర్శకాలు పెట్టాయి. చట్టబద్ధమైన జాతీయ బాలల హక్కుల కమిషన్ లాంటివి ఉన్నాయి. కానీ పోలీసులు మాత్రం వారికి తోచిన పద్ధతులనే పాటిస్తారు.

పొదుంబు కేసు విషయంలో అక్కడి పోలీసు ఆఫీసరుగా ఉన్న ఒక మహిళా ఇన్‌స్పెక్టర్ కరెంటులేని రాత్రి సమయంలో ఆ ప్రాంతానికి వెళ్ళి బాధితులను పరిశోధన పేరుతో రోడ్డుపైకి రావాలని కోరింది. దానికి ఐద్వా నిరసన తెలిపిన తరువాత ఆమెను ఆ కేసు నుండి తొలగించారు. పొదుంబు కేసు విషయంలోనే నిందితుడైన ప్రధానోపాధ్యాయుడి స్నేహితులు, బంధువులు ఆ స్కూలులో పనిచేస్తున్న ఆయాను వత్తిడి చేసి ఆ కేసు విషయంలో పోరాటంలో ముందున్నవారిపై తప్పుడు కేసులు పెట్టించారు. ఆయాపై వారు లైంగికవేధింపులకు పాల్పడ్డారని తప్పుడు కేసులు బనాయించారు. పోలీసులు వెంటనే వారిపై కేసులు పెట్టి అర్ధరాత్రి వారి ఇళ్ళకు వెళ్ళి వారి కుటుంబాలను బెదిరించారు. ఆ ఊరిలో పోరాడుతున్న ఐద్వాపై బురద జల్లడం మొదలుపెట్టారు. ఐద్వా పోస్టర్లను చించివేశారు. పోస్టర్లు వేసిన వారిపై కేసులు పెట్టారు. ఐద్వా పోలీసు స్టేషన్‌ను ముట్టడించిన తరువాతనే పారిపోయిన నిందితుడు వచ్చి కోర్టులో లొంగిపోయాడు. పేద వర్గాలకు చెందిన బాలికలు జీవితంలో అనేక ఆశలతో ఎన్నో ప్రయాసలకోర్చి తమ చదువును సాగిస్తూ ఉంటారు. ఇలాంటి లైంగిక వేధింపుల వలన ఎంతోమంది బాలికలు తీరని మానసిక వేదన అనుభవిస్తుండగా, మరెంతో మంది తమ చదువును మధ్యలోనే ఆపేస్తున్నారు. జిల్లా విద్యా శాఖ కూడా ఇలాంటి కేసులలో ఎంతో ఉదాశీనంగా ఉంటుంది. తిరుతంగల్ కేసు విషయంలో నిందితుడిని శిక్షించే బదులుగా అతనికి విద్యా శాఖ ప్రమోషన్ ఇచ్చి అతడిని వేరే స్కూలులో చేర్చి తరువాత మెడికల్ సెలవులో వెళ్ళే ఏర్పాటు చేసింది. ఐద్వా ఈ కేసు విషయంలో పట్టుదలగా పోరాడింది. ఉపాధ్యాయుడు ఏ స్కూలులో చేరడానికి ప్రయత్నిస్తే ఐద్వా సభ్యులు ఆ స్కూలుకు వెళ్ళి నిరసన తెలిపారు. ఐద్వా కోర్టుకు వెళ్ళి అతని ప్రమోషన్ రద్దయ్యేలా మధ్యంతర ఉత్తర్వులు సాధించింది. అంతేకాక చట్ట ప్రకారం సస్పెన్షన్ కాలం తరువాత కూడా ఆ ఉపాధ్యాయుడిని బాలికలతో ప్రత్యక్ష సంబంధం వున్న ఏశాఖలోనూ నియమించరాదని విద్యా శాఖను హెచ్చరించింది.

సాధారణంగా ఇలాంటి సంఘటనలలో బాలికలు తమ తల్లిదండ్రులకు వెంటనే సమాచారం ఎందుకు తెలపడం లేదనే ప్రశ్న వస్తుంది. ఆడపిల్లలు తమ చదువు ఆగిపోతుందని భయపడుతున్నారు. తల్లిదండ్రులు తమను వెంటనే బడి మాన్పించేస్తారనో లేక తమనే తమ ప్రవర్తన బాగా లేదని తల్లిదండ్రులు తిడతారేమోననీ బాలికలు భయపడుతున్నారు. కనీసం స్కూలులోని ఇతర టీచర్ల వద్ద ఈ విషయాలు ప్రస్తావించినా ఏమీ

బాలికలు తమ తల్లిదండ్రులకు వెంటనే సమాచారం ఎందుకు తెలపడం లేదనే ప్రశ్న వస్తుంది. ఆడపిల్లలు తమ చదువు ఆగిపోతుందని భయపడుతున్నారు. తల్లిదండ్రులు తమను వెంటనే బడి మాన్పించేస్తారనో లేక తమనే తమ ప్రవర్తన బాగా లేదని తల్లిదండ్రులు తిడతారేమోననీ బాలికలు భయపడుతున్నారు. కనీసం స్కూలులోని ఇతర టీచర్ల వద్ద ఈ విషయాలు ప్రస్తావించినా ఏమీ ప్రయోజనం లేదని బాలికలు చెబుతున్నారు.

**భారతి అనే ఒక ప్రసిద్ధ కవి పిల్లలను ఉద్దేశించి మాట్లాడుతూ ఇలా అన్నారు "మీకు ఎదుటివారికి అన్యాయం చేస్తున్నవారు ఎవరైనా తారసపడితే మీరు వారిని చూసి భయపడవద్దు. వారిపై ఉమ్మివేసి వారిపై యుద్ధం మొదలు పెట్టండి". బహుశా ఆయనకు మన పోలీసులు, చట్టాలు వాటి పనితీరుపై అసంతృప్తి, అపనమ్మకం ఉండడం వలననే చట్టం ద్వారా ప్రయత్నించే బదులు పిల్లలు తమ రక్షణకు తామే నడుం బిగించాలని చెప్పి ఉండవచ్చు.**

ప్రయోజనం లేదని బాలికలు చెబుతున్నారు.

భారతదేశంలో బాధితులకు గానీ, సాక్షులకు గానీ ఏమాత్రం రక్షణ వ్యవస్థలేని లోపం ఈ కేసుల విషయంలో మనకు కనిపిస్తుంది. కేసుల విషయంలో స్కూలు యాజమాన్యాలే నేరుగా పోలీసులకు ఫిర్యాదు చేసే వ్యవస్థ లేదు. పోలీసులు కూడా ఎటువంటి అభ్యంతరాలు లేకుండా ఎఫ్.ఆర్.ఐ నమోదు చేసి నిందితులను అరెస్టు చేసే పరిస్థితులు లేవు. పిల్లలు అనుభవిస్తున్న మానసిక వేదనను దూరం చేసే యంత్రాంగం కానీ తల్లిదండ్రులకు తప్పనిసరిగా ఇవ్వాల్సిన కౌన్సిలింగ్ సదుపాయాలు కానీ లేవు. కోర్టులు బాధితులను తమ స్థానాల నుండే వీడియో కాన్ఫరెన్సుల ద్వారా విచారించాలనే నిబంధనలు ఉన్నాయి. కానీ కోర్టులు వాటిని పాటించకపోగా పదేపదే బాధితులను కోర్టులకు హాజరు పరుస్తున్నారు. బాధితుల గుర్తింపును ఇలాంటి కేసులలో రహస్యంగా ఉంచాలనే ప్రెస్ కౌన్సిల్ నిబంధనలను కూడా మీడియా పాటించటంలేదు. బాధితుల మరియు సాక్షుల రక్షణకు సంబంధించిన ఒక సమగ్ర చట్టం రూపొందించాల్సిన అవసరం ఉంది.

ప్రస్తుత లైంగిక వేధింపుల నివారణ చట్టం విద్యా సంస్థలకు కూడా వర్తింప చేయాలని ఐద్వా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది. స్కూళ్ళలో ఒక కౌన్సిలర్‌ను తప్పనిసరిగా నియమించాలి. కంప్లయింట్ బాక్సులను ఏర్పాటు చేయాలి. ఇలాంటి సంఘటనల పట్ల తల్లిదండ్రులు మరియు ఉపాధ్యాయ సంఘాలు అప్రమత్తంగా ఉండాలి. సంఘటనలు జరగకుండా తగిన ఇన్‌స్పెక్షన్ జరుగుతుండాలి. కాంపౌండ్‌వాల్ మరియు మరుగుదొడ్లు సరిగా ఉండేలా చూడాలి. లింగ సమానత్వంపై అవగాహన కలిగించే బోధనలు ఉండేలా చూడాలి. పాఠ్య పుస్తకాలలో మహిళలపై లైంగిక వేధింపుల నివారణకు సంబంధించిన చట్టాలపై పాఠ్యాంశాలు ఉండాలి. మీడియాలో కూడా ఇలాంటి అంశాలకు చోటు కల్పించాలి.

భారతి అనే ఒక ప్రసిద్ధ కవి పిల్లలను ఉద్దేశించి మాట్లాడుతూ ఇలా అన్నారు "మీకు ఎదుటి వారికి అన్యాయం చేస్తున్నవారు ఎవరైనా తారసపడితే మీరు వారిని చూసి భయపడవద్దు. వారిపై ఉమ్మివేసి వారిపై యుద్ధం మొదలు పెట్టండి". బహుశా ఆయనకు మన పోలీసులు, చట్టాలు వాటి పనితీరుపై అసంతృప్తి, అపనమ్మకం ఉండడం వలననే చట్టం ద్వారా ప్రయత్నించే బదులు పిల్లలు తమ రక్షణకు తామే నడుం బిగించాలని చెప్పి ఉండవచ్చు.

**ప్రభుత్వం నిర్వహించాల్సిన విధులు:**

1. ఒక రాష్ట్ర స్థాయి కమిషన్‌ను ప్రతి రాష్ట్రంలోనూ ఏర్పాటు చేసి బాలల హక్కుల రక్షణ కోసం దానికి చట్టబద్ధమైన అధికారాలు కల్పించాలి.
2. లైంగిక వేధింపుల నిరోధక చట్టాన్ని విద్యా సంస్థలకు కూడా వర్తింపచేయాలి.
3. స్కూళ్ళలో ఫిర్యాదు బాక్సులను ఏర్పాటు చేయాలి.
4. ఉపాధ్యాయుడు పిల్లలపై లైంగిక వేధింపులకు పాల్పడితే విద్యాశాఖ మరియు స్కూలు యాజమాన్యం ఖచ్చితంగా నేరుగా పోలీసులకు ఫిర్యాదు చేయాలనే నిబంధన విధించాలి. పోలీసులకు వారు ఫిర్యాదు చేయకపోయినా, కేసును నిర్వీర్యం చేయడానికి ప్రయత్నించినా దానిని నేరంగా పరిగణించాలి.
5. అనాథాశ్రమాలు మరియు రక్షణ గృహాల్లో సరైన అజమాయిషీ నిర్వహించే విధంగా ప్రత్యేక యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలి.

తమిళనాడులోని విద్యాశాఖ ఈ మధ్యకాలంలో ఒక క్రొత్త జీవో జారీ చేసింది. దాని ప్రకారం విద్యార్థులపై లైంగిక వేధింపులకు పాల్పడే ఉపాధ్యాయులను కఠినంగా శిక్షిస్తారు. ఈ జీవో ప్రకారం ఆ ఉపాధ్యాయుడిని ఉద్యోగం నుండి తొలగించడమే కాక అతని విద్యా సర్టిఫికెట్‌ను కూడా రద్దు చేస్తారు. దానితో అతనికి ఎక్కడా ఉపాధ్యాయుడిగా పనిచేసే అవకాశం లేకుండా చేస్తారు. విపత్కర పరిస్థితులలో ఎలా మసలు కోవాలో విద్యార్థులకు అవగాహన కల్పిస్తారు. పాఠశాలలో మొబైల్ కౌన్సిలింగ్ సదుపాయాలు కల్పిస్తారు. తమిళనాడులో ఈమధ్య కాలంలో లైంగిక వేధింపులపై ఐద్వా చేసిన పోరాటాల ఫలితంగానే ఈ జీవో వెలువడింది.

**స్వేచ్ఛానువాదం: కె. నా**

u5A

# గిర గిర తిరిగే

# గందర గోళం-భూగోళం

- డా॥ డి.ఎల్.విద్య

**ఇలకూ, ఇనునకు మధ్యన సాగే ప్రణయ గాథ ఇది.**

**ప్రణయ జీవులకు ప్రళయం చూపిన పుత్రుల తలచీ,**

**పుడమీ, మిత్రులు వగచే కథ ఇది.**

అనగా అనగా.... వందల కోట్ల వత్సరాలుగా, ఐదు వందల కోట్ల వత్సరాలుగా

విరామ మెరుగక తిరుగుతు ఉంది.

భూగ్రహమెప్పుడు ఆగక తిరుగుతు ఉంది.

భాస్కరు తిప్పగ తిరుగుతు ఉంది.

అందాలొలికే అర్కుడె, తనను ఆకర్షింపగ తిరుగుతు ఉంది.

నిశిరాత్తిరినే నిండుగ చూపి, పట్ట పగలుతో పండగ చేసి,

తనలో తానే తిరుగుతు ఉండి, తపనుని చుట్టూ తిరిగింది.

చీకటి వెలుగుల సంధ్యలలోనూ, వెచ్చని ప్రభాత వేళలలోనూ,

చిచ్చుల చంద్ర తీవ్రత వేళా, మార్తాండుని చుట్టూ తిరిగింది.

చల్లని, తెల్లని తమ్ముని, తన తమ్ముని

చందమామని, తిప్పుతు సూర్యుని చుట్టూ తిరిగింది.

చల్లని వెన్నెల రాత్రులలోనూ, చిక్కని చిమ్మ చీకటిలోనూ,

తారల జిలుగుల వెలుగులలోనూ తరణిని విడువక తిరిగింది.

చంద్ర కళలనూ చూసింది, గ్రహణాలెన్నో కాంచింది.

ఒకపరి దగ్గర, ఒకపరి దూరం

పక్కకు ఒరిగి, ఒయ్యారంగా

దినకరు చుట్టూ తిరిగింది.

సూటిగ చూసే సూర్యుని చూపుకు

వేసవి తాపం కలిగింది.

ఓరగ తననే చూస్తూ ఉంటే

శీతల విరహం పెరిగింది.

విరహ తాపాలను భరిస్తూ, జపిస్తు, తపిస్తు తిరిగింది.

కొండలనన్నీ, కోనలనన్నీ నడుముకు చుట్టుకు తిరిగింది.

జీవులు లేక, మనుషులు లేక తిరుగుతు ఉంది, వ్యాకుల పడుతూ తిరుగుతూ ఉంది.

గిర, గిర, గిర, గిర తిరుగుతు ఉంది.

చల్లని గాలులు రివ్వున వీచగ, సన్నని వర్షపు ధారల తడిసి, సంతోషంగా తిరిగింది.

చెంగున దూకే జలపాతాలతో, చక చక పారే సెలయేరులతో,

పక, పక, పక, పక నవ్విందీ, గిర, గిర, గిర, గిర తిరిగింది.

చిట్టడవులతో, కారడవులతో, పచ్చని పచ్చిక బయళ్ళు చుట్టుకు,

ఆరు ఋతువుల హారం వేసుకు,

చెట్టులో, పుట్టలో, సంద్రం లోపల, ఇక్కడ అక్కడ, ఎక్కడ పడితే అక్కడ

ఇబ్బడి ముబ్బడి జీవరాశులతో మురిసింది.

మనుషులు లేకనె తిరుగుతు ఉంది.

వందల కోట్ల వత్సరాలుగా, మనుషులు లేకనె తిరుగుతు ఉంది.

పాతిక లక్షల ఏళ్ళ క్రిందటే, నరవానరులను కన్నాది.

అక్కున చేర్చుకు, ముద్దులు పెట్టుకు నయగారంగా నవ్వింది.

అదిగో! అదిగో! 'నాన్న'ని, అరుణుని చూపి, నవ్వింది,

తెల్లని, చల్లని మావని, చందమామని చూపి నవ్వింది.

గిర, గిర, గిర, గిర తిరిగింది.

ముద్దు బిడ్డలు, బుద్ధిని పెంచుకు, సొంత తెలివితో సంస్కృతి అందుకు,

ఎదుగుతు ఉంటే సంతసమంది, సప్త స్వరములు గళమున నింపి,

కిల, కిల, కిల, కిల నవ్వింది, గిర, గిర, గిర, గిర తిరిగింది.

మానవులందున కొందరు మారి, మాత్సర్యమునే మదిలోనింపి,

ధనతత్వమునే దండిగ ఎంచి, దోపిడి చేయగ చూసింది.

గందర గోళం భూగోళం అని, భాస్కరుతో తలపోసింది.

"ప్రణయం ఫలితం ప్రళయమ్మా?! " అని,

"వలచుట చివరకు వగచుటకా?! " అని ఇద్దరు కలిసీ వ్యాకుల పడిరి

ఆగలేకనే తిరుగుతు ఉంది, భూగోళం ఇంకా తిరుగుతు ఉంది,

గిర, గిర, గిర, గిర తిరుగుతు ఉంది. ★ ★ ★




బాస్ రూమ్‌లో నుండి గట్టిగా మాటలు వినిపిస్తూ ఉండటంతో "ఈరోజు ఎవరికో మూడింది. ఎవరో ఆ బాధితులు" అనుకుంటూ కంప్యూటర్‌లోకి తలదూర్చింది అవని. "హాయ్ అవని" అంటూ నీరసంగా పలకరిస్తూ తన సీట్లో కూర్చుంది సహోద్యోగి సరిత.

"హాయ్, నువ్వేంటి బాస్ రూమ్‌లో నుండి వస్తున్నావ్, కొంపతీసి నువ్వేనా ఈ పూట బాధితురాలు" అంటూ ఆరా తీసింది అవని. ''అవునే తల్లీ, మనకిదేమీ కొత్తకాదుగా, కానీ విషయమే కొత్తది. లంచ్‌టైమ్‌లో చెప్తాలే" అంటూ పనిలో పడింది సరిత.

అవని, సరిత ఈ ఆఫీసులోకి వచ్చాకే స్నేహితులయ్యారు. హోదాల్లో తేడాలున్నా ఇద్దరూ బాగా కలిసిపోయారు. "ఏంటి తల్లీ నీకింకా టైమ్ కాలేదా! పద తిందాం" అంటూ సరితని బయల్దేరదీసింది అవని. ఇద్దరూ కలిసి క్యాంటిన్‌కి వెళ్ళారు. తింటుండగా "ఏదో చెప్తానన్నావ్, నిన్న కూడా ఆఫీస్‌కు రాలేదు. ఏంటి సంగతి ఏమన్నా విశేషమా?" అంటూ కొంటెగా అడిగింది అవని.

''నా జీవితానికి విశేషాలు కూడానా! ఇంటి దగ్గర బాధలకు తోడు మన బాన్ వెగటు మాటలు భరించలేకపోతున్నాను. ఏం చేయాలో'' లంచ్‌బాక్సు మూసేస్తూ విరక్తిగా అంది సరిత.''అసలేం జరిగిందే? ఎనీథింగ్ రాంగ్?" అంటూ చేతులు తుడుచుకుంటూ వచ్చి సరిత పక్కన కూర్చుంది అవని.

"నీకు తెలియనిదేముంది అవనీ. మాకు పెళ్ళయి పదేళ్ళయినా పిల్లలు పుట్టలేదని, ఇంట్లో సాధింపులు ఎక్కువయ్యాయి. నిన్న కూడా వేరే ఏదో హాస్పిటల్‌కి టెస్ట్‌ల కోసం అని ఇద్దరం వెళ్ళాం. బాస్‌కి ఫోన్ చేసి విషయం చెప్పానే, అయినా విన్నావుగా, ఉదయం రాగానే ఈ గొడవ. చంపేస్తున్నాడు వెధవ" అంటూ కసిగా తిట్టింది సరిత.

"పోనీలేవే, బాస్ సంగతి వదిలెయ్. ఇంతకీ డాక్టర్ ఏమన్నారు?" ఆతృతగా అడిగింది అవని.

"ఏముంది, అవకాశాలున్నాయి. కానీ ఇంకా కొన్ని పరీక్షలు చేయాలి, ఖరీదైన మందులు వాడాలన్నారు. ఇప్పటి వరకు పిల్లలు పుడతారన్న ఆశన్నా ఉండేది. ఇప్పుడది కూడా పోయిందే'' కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది సరిత."అంతేకదా, దానికే ఏడ్వాలా, మందులు వాడితే సరి" అంటూ సరిత చెయ్యి పట్టుకుంది అవని.

" అదికాదే! ఇప్పటికే చాలా ఖర్చయింది. ఎంత వరకని పెడతాం? పెట్టినా నమ్మకం లేదని, ఇంట్లో అందరూ ఆయనకు రెండో పెళ్ళి చేయాలని నిర్ణయించారు. రాత్రంతా అదే గొడవ. రెండోపెళ్ళి కూడా మా చెల్లితోనే. అమ్మావాళ్ళు కూడా ఒప్పుకున్నారు. ఒప్పించారు" అంటూ బేలగా అవనివైపు చూసింది సరిత. అవని ఏదో చెప్పేలోపునే బాస్ అటుగా రావడంతో మాటలాపి తమ కుర్చీల వద్దకు వెళ్ళిపోయారిద్దరూ.

కంప్యూటర్ కీబోర్డుపై చేతులు కదులుతున్నా, మనసు మాత్రం సరిత చెప్పినదానిపైనే ఉంది అవనికి. "అదేంటి సరితకేమీ వయసయిపోలేదే, సరిత చెల్లి ఇంకా చిన్నదేనే, ఎందుకిలా చేస్తున్నారు? పిల్లల కోసమని ఇద్దరి జీవితాలను ఎందుకిలా నాశనం చేస్తున్నారు? సరిత సమస్యకు వేరే పరిష్కారమే లేదా? అనుకుంటూ ఆలోచనలో పడింది.

కొన్నిరోజులకు అవని భర్త కమల్‌కు వేరే ప్రాంతానికి బదిలీ కావడంతో తను కూడా బదిలీ కోసం అర్జీ పెట్టుకుంది. కొత్త ప్రాంతం అవనికి త్వరగానే అలవాటయిపోయింది. తాను పనిచేయాల్సిన ఆఫీసుకు ఇల్లు దగ్గర కావడంతో తేలిగ్గానే ఉంది. అందులోనూ అత్తయ్య తమతోనే ఉండడంతో ఇంటిపనీ పెద్దగా సమస్య కాలేదు అవనికి. అప్పుడప్పుడూ ఫోన్, ఉత్తరాల ద్వారా సరితను పలకరిస్తూనే ఉంది. సరిత భర్తకు రెండోపెళ్ళి జరిగిపోయిందని, సరిత చెల్లికి ఇప్పటికే రెండుసార్లు అబార్షన్ అయిందని తెలుసుకుంది. "అయ్యో! సరిత చెల్లికి ఇంకా 18 ఏళ్ళుకూడా నిండలేదు కదా! ఎందుకు ఆ అమ్మాయి ఆరోగ్యం గురించి ఆలోచించరు? పిల్లల కోసం ఎందుకంత తొందరపడతారో"? అనుకుని బాధపడింది.

కాలం గడిచిపోతోంది. అవని, కమల్ ఎవరి ఆఫీసు పనుల్లో వారు బిజీగా ఉంటున్నారు. మధ్య మధ్యలో కమల్

వాళ్ళమ్మ పిల్లల గురించి ఏదోక రూపంలో అడుగుతూనే ఉంది. "అప్పుడే పిల్లలేంటమ్మా" అంటూ కమల్ పెద్దగా ఆమెను పట్టించుకునేవాడు కాదు. కానీ అవనికి ఈ మధ్య అత్తయ్య ప్రవర్తనలో తేడా కన్పిస్తోంది. చీటికీ మాటికీ తనను విసుక్కుంటోంది. తనకి నెలసరి వచ్చినప్పుడల్లా మరింత బాధపెడుతోంది. సూటిపోటి మాటలంటోంది. "మీతోటి పెళ్ళయినవాళ్ళందరూ ఇద్దరేసి పిల్లలతోటి హాయిగా ఉంటున్నారు. నీకసలు పిల్లల్ని కనే ఉద్దేశ్యం లేదా?"అంటూ ఓరోజు అవనినే సూటిగా ప్రశ్నించింది.

ఈ గొడవంతా భరించలేక ఇద్దరూ ఒకరోజు తెలిసిన డాక్టర్ దగ్గరకు వెళ్ళారు. అన్ని పరీక్షలయ్యాక, అవనికి పిల్లలు పుట్టే అవకాశం లేదని రిపోర్టులో తెలిసింది. అవనికి ఏడుపొస్తోంది. "ఏంటి కమల్ ఇదంతా, ఎన్ని కలలు కన్నాం, పిల్లల కోసం'' అంటూ కమల్‌ని పట్టుకుని ఏడ్చేసింది. కమల్ నుండి ఏ సమాధానం రాలేదు. కనీసం ఓదార్చలేదు. దాంతో అవనికి మరింత భయం వేసింది. సరిత జీవితం కళ్ళముందు కదిలింది.

ఇంటికెళ్ళిన దగ్గర్నుండి అత్తయ్య గొడవ చేస్తూనే ఉంది. ఏడుస్తూ తిడుతూ ఉంటే " ఏంటమ్మా ఇదంతా, ఇప్పుడేం జరిగింది. మరో పెద్ద హాస్పిటల్‌లో చెక్ చేయించుకుని, మందులు వాడుకుంటే సరిపోతుంది. నువ్వు రాద్ధాంతం చేయకమ్మా" అని కమల్ గట్టిగా చెప్పాడు.

గదిలో ఏడుస్తూ కూర్చున్న అవనికి ఇదంతా విన్పిస్తూనే ఉంది. హాస్పిటల్‌లో కనీసం ఓదార్చని మనిషి, ఇప్పుడు వాళ్ళమ్మతో అలా మాట్లాడంతో కొంచెం ధైర్యం వచ్చింది. తరువాత వారం రోజుల్లో నాలుగైదు హాస్పిటల్స్‌కి వెళ్ళి వచ్చారు. అక్కడ కూడా అవనికి పిల్లలు పుట్టే అవకాశం లేదని చెప్పేసరికి, ఇంట్లో ఇక యుద్ధకాండ మొదలైంది. అవని అమ్మా, నాన్న, కమల్ దగ్గర బంధువులు వచ్చారు. తలా ఒకమాట చెప్తున్నారు. కమల్ ఆఫీస్‌కి వెళ్ళిపోయాడు. అవనికి ఏం చెయ్యాలో అర్థం కావడంలేదు. 'నా జీవితం కూడా సరిత జీవితంలాగా కావాల్సిందేనా? కమల్ రెండోపెళ్ళి చేసుకుంటాడా? నన్ను వదిలేస్తాడా?' ఇలా ఎన్నో ఆలోచనలు అవనిని చుట్టేస్తున్నాయి. బంధువులు, అత్తయ్య అంటున్న మాటలు శూలాల్లా గుచ్చుతున్నాయి. అంతా చీకటిగా ఉంది అవనికి. 'కమల్ నిర్ణయం ఏమిటో? నాకిక చావే దిక్కా?' అనుకుంటూ, ఏడుస్తూ తన గదిలోనే సాయంత్రం వరకు ఉండిపోయింది. "అవనీ, ఏం చేస్తున్నావ్?" అంటున్న కమల్ పిలుపుతో ఈలోకంలోకి వచ్చింది. కళ్ళు తుడుచుకుంటూ లేచి హాల్లోకి వచ్చింది. అందరూ ముభావంగా ఉన్నారు. అంతమంది ఉన్నా ఇల్లు, వలసలతో ఖాళీ అయిన పల్లెటూరులా నిర్జీవంగా ఉంది. అవనికి అక్కడ ముళ్ళమీద ఉన్నట్టుంది. తన పనులు ముగించుకుని గదిలోకి వెళ్ళిపోయింది. రాత్రంతా ఆలోచిస్తూనే ఉంది. తనకేదారీ లేదా? అని.

మరునాడు కమల్ లేవగానే తన నిర్ణయం చెప్పింది. కమల్‌ని ఒప్పించి తనతో బయల్దేరదీసింది. వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో, ఏం చేయబోతున్నారో ఇంట్లో వాళ్ళకు అర్థం కాలేదు. భోజనాల సమయానికి ఇద్దరూ నవ్వుతూ ఇంట్లోకి అడుగుపెట్టారు చేతుల్లో ఏవో కాగితాలతో. అందరి ప్రశ్నల వర్షం వెలిశాక అవని చెప్పడం మొదలుపెట్టింది. " అత్తయ్యా, అమ్మా, అందరూ వినండి. మేమిద్దరం ఒక నిర్ణయం తీసుకున్నాం. పిల్లలు పుట్టే అవకాశం లేదని తెలిసినప్పటి నుండీ చాలా చాలా ఏడ్చాను. ఆలోచించాను, ఆ ఒక్క కారణం వల్ల హాయిగా సాగుతున్న మా ఇద్దరి బంధం ముక్కలవడం నాకూ, కమల్‌కి కూడా ఇష్టం లేదు. అందుకే ఒక పాపని దత్తత తీసుకుందామనుకున్నాం. అందుకు సంబంధించిన వివరాలు తెలుసుకోవటానికే మహిళా శిశు సంక్షేమ ఆఫీస్‌కి వెళ్ళాం" అని కమల్‌వైపు చూసింది.

"ఏమిటీ, దత్తతా? అందులోనూ అమ్మాయినా? ఎవర్నడిగి వెళ్ళారు మీరు? అంతా మీ ఇష్టమేనా?" అంటూ అవని అత్తగారు కోపంగా అరిచింది. "ఎందుకమ్మా అరుస్తావ్, మేం చేసినదాంట్లో తప్పేముంది. మేం మంచిపనే చేస్తున్నాం. మాకు పిల్లలు కలగరనే కదా నువ్వు బాధపడుతున్నావు. ఈ దత్తతతో ఈ సమస్య తీరిపోతుంది. మరో నాలుగు రోజుల్లో పాపని తీసుకొస్తాం. చిన్న ఫంక్షన్ చేద్దాం. అత్తయ్యా, మామయ్యా మీరందరూ కూడా అప్పటి వరకు ఇక్కడే ఉండండి" అంటూ దత్తత పత్రాలు వారికి చూపించాడు. కొన్ని రోజులు అవని అత్తయ్య ముభావంగానే ఉంది. అయినా కొడుకు మాటకి ఎదురు చెప్పలేకపోయింది. ఎలాగోలా ఫంక్షన్ జరిగిపోయింది. దగ్గర బంధువులు, స్నేహితులు వచ్చారు. కొంతమంది ఇదేంపని అంటే, మరికొంతమంది 'శెభాష్' అంటూ అవని, కమల్‌లను అభినందించారు. వారి జీవితాల్లో కొత్త వెలుగు నింపిన పాపకు "ఉదయ" అని పేరు పెట్టుకున్నారు.

కాలం గడిచేకొద్దీ అవని అత్తయ్యలో మార్పు వచ్చింది. మొదట్లో ఈసడించుకున్నా క్రమంగా 'ఉదయ'ని దగ్గరకు తీసింది. తన ముద్దు ముద్దు మాటలను, చేతలను చూసి మురిసిపోతోంది. ఉదయకు నాల్గవ పుట్టినరోజును కూడా బాగా చేశారు. అవని, కమల్ సంతోషంగా ఉన్నారు. ఈ మూడు సంవత్సరాలు తమలా పిల్లలు కలగని వాళ్ళకు సలహాలిచ్చి, ధైర్యం చెప్పడం చేస్తున్నా, ఇంకా ఏదో చేయాలన్పించింది అవనికి. ఉదయ ఎదిగేకొద్దీ తనకీ కొంత సమయం అదనంగా ఉంటోంది. ఒంటరిగా కాకుండా ఏదో ఒక సంస్థద్వారా తనలాంటి, సరితలాంటి వాళ్ళకు సహాయపడాలని, అన్యాయం జరగకుండా చూడాలని నిర్ణయించుకుంది. పిల్లలు కలగని కుటుంబాల్లో, ఆడవాళ్ళనే బలిపశువుల్ని చేయడం తన అనుభవంలో చూసింది. ఏదారీ లేదనుకునే వాళ్ళకు దారి చూపించేందుకు, ముఖ్యంగా మహిళలకు ధైర్యమిచ్చేందుకు సిద్ధమైంది. తన కూతురు పేరుతోనే "ఉదయ న్యాయ సలహా కేంద్రం"ద్వారా ప్రయత్నం మొదలు పెట్టింది అవని. ●

# ప్రపంచ ఆర్థిక సంక్షోభం-భారత మహిళలపై ప్రభావం

## (ఐద్వా జాతీయ మహాసభల్లో ప్రవేశపెట్టిన కమిషన్ పేపర్)

చాలా దేశాలలో కార్మిక వర్గంలో ఎక్కువ శాతం మంది అసంఘటిత రంగంలోనూ, స్వయం ఉపాధి కార్మికులుగానూ, అస్థిరమైన పనులలోనూ ఉన్నారు. శ్రామిక మహిళలలో ఈ భాగం ఇంకా ఎక్కువగా ఉంది. భారతదేశంలోని సామాజిక పరిస్థితులపై ఆర్థిక సంక్షోభ ప్రభావం లెక్కల్లో చూపిన దానికంటే తీవ్రంగానే ఉంది. కనుక సంక్షోభ ప్రభావం మహిళల సామాజిక, ఆర్థిక జీవనంపై ప్రత్యక్షంగా, పరోక్షంగా తీవ్ర ప్రభావం చూపుతుంది. మహిళలు సంఘటితమై యూనియన్లు ఏర్పరచుకోవడం తక్కువ కనుక వారు సులభంగా ఉద్యోగాల నుండి తొలగించబడుతున్నారు. సంక్షోభ ప్రభావం శ్రామిక మహిళలపైనే కాక ఏ వేతనం లేకుండా ఇంటి పనులు చేసే మహిళలపై కూడా మరింత భారం మోపుతుంది.

పెరుగుతున్న ధరలతో పోటీ పడలేక మహిళలు తాము తీసుకొనే ఆహారంలో కొంత త్యాగం చేసి కుటుంబ సభ్యులకు పెడుతున్నారు. అసంఘటిత రంగంలో చెత్త సేకరణదారులపై సైతం ప్రపంచ మార్కెట్ సంక్షోభ ప్రభావం పడుతుందంటే విస్మయం కలుగక మానదు. కుటుంబ భారం మోసే కొంతమంది మహిళలు సంక్షోభ ఫలితంగా తమ శరీరాలను వైద్య ప్రయోగాలకు అమ్ముకునే దుస్థితి ఏర్పడింది. ఇంతేకాక ఆర్థిక సమస్యలు, ఉపాధి కోల్పోవడం, అభద్రతా భావం పెరగడంతో అసహాయ స్థితిలో ఉన్న పురుషులు తమ కోపాన్నీ, ఆగ్రహాన్ని కుటుంబంలోని మహిళలపై ప్రదర్శించడంతో రకరకాల పద్ధతులలో లైంగిక వేధింపులు, హింస పెరుగుతున్నాయి. దీనితో మహిళలలో ఒత్తిడి పెరిగి మానసిక సమస్యలు కూడా పెరుగుతున్నాయి.

భారతదేశంలోని వివిధ రంగాల మహిళలపై ఈ సంక్షోభ ప్రభావం ఏవిధంగా ఉందో అధ్యయనం చేసి ఐద్వా సమర్పించిన నివేదిక పత్రం

2008-09 సం॥లలోని ప్రపంచ ఆర్థిక మాంద్యాన్ని భారతదేశంలోని విధాన నిర్ణేతలు తక్కువ అంచనా వేస్తున్నారు. ఒక బలమైన ఆర్థిక వ్యవస్థ ఏర్పడే అభివృద్ధి క్రమంలో అది ఒక చిన్న అంతరాయం మాత్రమేనని వారు భావిస్తున్నారు. స్థూల జాతీయోత్పత్తి విషయంలో (జిడిపి) ఆసియాలోని కొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలతోపాటుగా భారతదేశం ముందుగా సంక్షోభం నుండి బయట పడింది. నిజానికి ఇతర అనేక దేశాలలో మాదిరిగా జిడిపి అభివృద్ధి ఎప్పుడూ పడిపోలేదు. వేగంలో మాత్రం తగ్గుదల కనిపించింది. ప్రస్తుతం ఇతర అనేక ప్రాంతాలు కూడా కొంత కోలుకుని అభివృద్ధిలో పురోగమనంలో ఉన్నాయి. దీనితో ప్రపంచ ఆర్థిక వ్యవస్థ సంక్షోభం నుండి బయటపడినట్లేననీ, ఇంతకు ముందులాగే అభివృద్ధి కొనసాగుతుందనే ఆలోచనలు ఏర్పడుతున్నాయి.

> కుటుంబ భారం మోసే కొంతమంది మహిళలు సంక్షోభ ఫలితంగా తమ శరీరాలను వైద్య ప్రయోగాలకు అమ్ముకునే దుస్థితి ఏర్పడింది. ఇంతేకాక ఆర్థిక సమస్యలు, ఉపాధి కోల్పోవడం, అభద్రతా భావం పెరగడంతో అసహాయ స్థితిలో ఉన్న పురుషులు తమ కోపాన్నీ, ఆగ్రహాన్ని కుటుంబంలోని మహిళలపై ప్రదర్శించడంతో రకరకాల పద్ధతులలో లైంగిక వేధింపులు, హింస పెరుగుతున్నాయి. దీనితో మహిళలలో ఒత్తిడి పెరిగి మానసిక సమస్యలు కూడా పెరుగుతున్నాయి.

కానీ ఈ సంక్షోభం నుండి బయట పడటం తాత్కాలికం మాత్రమే. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ తిరిగి సంక్షోభంలోకి నెట్టబడే ప్రమాదం రోజు రోజుకూ పెరుగుతుంది. ప్రస్తుతం ఆర్థిక మార్కెట్లకు సంబంధించిన ముఖ్యమైన అంశాలు పెరుగుతున్న ప్రభుత్వ అప్పు సమస్యతో ముడిపడి ఉన్నాయి.

పెద్ద పెద్ద బ్యాంకులు, సంస్థలు తమ తమ వ్యాపారాలలో దెబ్బతిని సంక్షోభంలో కూరుకుపోయినప్పుడు చాలా దేశాలలో ప్రభుత్వాలు వాటికి బెయిల్ అవుట్ (ఉద్దీపన) ప్యాకేజీల ద్వారా ప్రభుత్వ ఖజానా నుండి పెద్ద మొత్తాలు వాటికి కేటాయించాయి. దీనితో ప్రభుత్వ అప్పు పెరిగింది.

దీనితో ప్రభుత్వం నుండి భద్రతను ఆశించే ఆర్థిక శక్తులు ప్రజాసంక్షేమానికి ప్రభుత్వాలు పెట్టే ఖర్చును తగ్గించుకోవాలని ప్రభుత్వాన్ని ఒత్తిడి చేస్తున్నాయి. దీనితో ప్రతిచోటా ఎంతో ముఖ్యమైన సామాజిక అవసరాలు ఉన్నా కూడా ప్రభుత్వాలు పెట్టాల్సిన ద్రవ్య పెట్టుబడులను పొదుపు చర్యల ద్వారా తగ్గించుకుంటున్నాయి. ఇటువంటి పొదుపు చర్యలు అవసరం లేని దేశాలు కూడా అదే పద్ధతులు పాటించడంతో పరిస్థితులు మరింత దిగజారుతున్నాయి.

**సంక్షోభం తగ్గుముఖం పట్టినట్లు పైకి కనిపించినా, ఈ సమస్యల తీవ్రత మరింత పెరిగిందేకాని తగ్గడంలేదు. ఉపాధి అవకాశాల మెరుగుదల విషయంలో కానీ, వేతనాల విషయంలోకానీ, స్వయం ఉపాధి కార్మికుల జీవన ప్రమాణాల మెరుగుదలలోకానీ అభివృద్ధి కనపడటంలేదు. ఇంతేకాక ఇంకొన్ని ప్రతికూల పరిస్థితులు కూడా ఏర్పడుతున్నాయి.**

అంతర్జాతీయంగా పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభానికి కారణమైన మూడు ముఖ్యమైన అంశాలు ఇప్పటికీ పరిష్కారం కాలేదు.

**మొదటిది:** ఫైనాన్స్ పెట్టుబడికీ నిజ ఆర్థిక వ్యవస్థకు మధ్య అసమతుల్యం ఏర్పడింది. దీనితో వాస్తవానికి ఉత్పత్తి కార్యకలాపాలతో సంబంధం లేకుండానే అన్ని దేశాలలోనూ ఆర్థిక రంగంలో పెద్ద ఎత్తున అభివృద్ధి కనిపించింది. ఈ పెరుగుదల వలన రాజకీయంగా కూడా ఆర్థిక రంగం బలం పెరిగింది. దీనితో సాధారణంగానే ఈ రంగం ప్రభుత్వంపై ఒత్తిడి పెంచి ఆర్థిక శక్తుల బలం మరింత పెరగడానికి దోహదపడే విధానాలను అవలంబించేలా చేస్తుంది. అందువలననే ఈ మధ్య ఏర్పడిన ప్రపంచ సంక్షోభానికి ఫైనాన్సే కారణమైనప్పటికీ అది ఏమాత్రం నష్టపోకుండా సంక్షోభం నుండి బయటపడి తిరిగి ఎప్పటిలాగే శక్తిని సంతరించుకుంది. కానీ వేరొకవైపు ఈ సంక్షోభం వలన కార్మికులు మూల్యం చెల్లించుకోవలసి వస్తుంది. కార్మికులు తమ ఉద్యోగాలు కోల్పోవడం, వేతనాలలో కోతలు మరియు ప్రభుత్వ సేవల కుదింపులతో అనేక విధాలుగా నష్టపోయారు.

**రెండవది:**

అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలో కీలక పాత్ర పోషించే అతి పెద్ద శక్తుల మధ్య ఏర్పడిన ఆర్థిక అసమతుల్యత. అభివృద్ధి వేగంగా ఉన్న కాలంలో ప్రపంచానికి అమెరికా సారధిలా పనిచేసింది. అప్పుడు మిగిలిన అన్ని దేశాలూ అక్కడికి తమ ఎగుమతులు పంపడానికి పోటీ పడ్డాయి. అందువలన అమెరికాలోనే అధికంగా వాణిజ్య లోటు ఏర్పడింది. అందువలన ప్రపంచంలోని అన్ని ప్రాంతాల నుండి అతి పేదదేశాలతోసహా అమెరికాకు ద్రవ్య పెట్టుబడులు సమకూర్చాల్సి వస్తుంది. నిజానికి ఆసియాలోని అభివృద్ధి చెందుతున్న దేశాలు భారతదేశంతో సహా అమెరికా వాణిజ్య లోటును పూడ్చడానికి పెద్ద ఎత్తున ఆర్థిక సహకారం అందించాల్సి వచ్చింది. అవి అమెరికా ప్రభుత్వ బాండ్లలో తమ విదేశీ మారక ద్రవ్యనిల్వలను ఉంచడం ద్వారా ఈ సహకారం అందించాయి. భారతదేశం, చైనా మరియు ఇతర అనేక పేద దేశాల ప్రజలు అమెరికా ప్రభుత్వం పెడుతున్న ఖర్చులకు, అది చేసే యుద్ధ ఖర్చులకు కూడా ద్రవ్య పెట్టుబడులు సమకూర్చాల్సి వస్తుంది. ఈ పరిస్థితులలో ఇప్పుడే మార్పు ఏమీ కనిపించడంలేదు. దీనివలన నిజానికి అమెరికాలో ఇప్పటికే వాణిజ్య లోటు తగ్గుముఖం పట్టింది. అందువలన ప్రపంచాన్ని ప్రస్తుతానికి అభివృద్ధి పథంలో నడిపే ప్రత్యామ్నాయ శక్తి కనిపించడంలేదు. కరెన్సీ రేట్లలో వివాదాలు, వాణిజ్య లావా దేవీలలో వివాదాలు పెరగడానికి ఇదికూడా ఒక కారణం.

**మూడవది:**

ఒక క్రమ పద్ధతిలో లేని అభివృద్ధి వలన పర్యావరణ అసమతుల్యత ఏర్పడింది. దీనితో కాలుష్యం పెరగడంతోపాటు వాతావరణ మార్పులు కూడా సంభవించాయి. ఇవి భవిష్యత్ అభివృద్ధికి ప్రతిబంధకాలుగా మారుతున్నాయి. వాతావరణ మార్పులే కాక ఇతర పర్యావరణ సమస్యలు కూడా అభివృద్ధికి ఆటంకాలుగా మారే పరిస్థితులు పెరుగుతున్నాయి.

ఈ సమస్యలను పరిష్కరించకుండా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో నిలకడైన అభివృద్ధిని సాధించడం సాధ్యంకాదు. ఈ ప్రతికూల వాతావరణం నుండి భారతదేశానికి మినహాయింపు ఉంటుందని ఆశించలేము. అంతేకాక ఈ సమస్యల పరిష్కారం వివిధ దేశాలలోని సంక్షోభ తీవ్రత మరియు ఆ సంక్షోభ కాలపరిమితులపై ఆధారపడి ఉంటుంది. సంక్షోభం తగ్గుముఖం పట్టినట్లు పైకి కనిపించినా, ఈ సమస్యల తీవ్రత మరింత పెరిగిందేకాని తగ్గడంలేదు. ఉపాధి అవకాశాల మెరుగుదల విషయంలో కానీ, వేతనాల విషయంలోకానీ, స్వయం ఉపాధి కార్మికుల జీవన ప్రమాణాల మెరుగుదలలోకానీ అభివృద్ధి కనపడటంలేదు. ఇంతేకాక ఇంకొన్ని ప్రతికూల పరిస్థితులు కూడా ఏర్పడుతున్నాయి.

ఏది ఏమైనప్పటికీ భారతదేశ సామాజిక పరిస్థితులపై ఈ ఆర్థిక సంక్షోభం తీవ్రత లెక్కలలో చూపిన దానికంటే చాలా తీవ్రంగా ఉంది. ఎగుమతులలో నెలకొన్న అనిశ్చిత

**సంక్షోభ ప్రభావం కూడా ప్రజలందరిపై ఒకే విధంగా లేదు. బాలికలు, మహిళలపై ఈ ప్రభావం ఎక్కువగా ఉంది. ఆర్థిక రంగం అభివృద్ధి పథంలో ఉన్నప్పుడు దాని ఫలితాలను చివరి వరుసలో అందుకునే అణగారిన వర్గాలు అది సంక్షోభంలో ఉన్నప్పుడు మాత్రం తీవ్రమైన దాని చేదు ఫలితాలను ముందుగా చవిచూడాల్సి వస్తుంది. వేతనాలలో కోతలు, ఉపాధి అవకాశాలు లేకపోవటం, ప్రభుత్వం నుండి పొందాల్సిన నిత్యావసర వస్తువుల సరఫరా, సేవలు కోల్పోవడం వంటి సమస్యలను వారు ఎదుర్కొంటున్నారు**

పరిస్థితులు ఉపాధిపై ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాలు కలిగిస్తున్నాయి. దేశం లోని జనాభాలో అతి పెద్ద భాగం ఇంకా కడు పేదలుగానే ఉన్నారు. కొన్ని దేశాలు మినహాయించి చాలా దేశాలలో కార్మిక వర్గంలో ఎక్కువ భాగం అసంఘటిత రంగంలోనూ, స్వయం ఉపాధి కార్మికులుగానూ, అస్థిరమైన ఉపాధి పనులలోనూ ఉన్నారు. శ్రామిక మహిళలలో ఈ భాగం ఇంకా అధికంగా ఉంది. చాలా ప్రాంతాలలో వ్యవసాయం గడ్డు పరిస్థితులలో ఉంది. అయినా కూడా వ్యవసాయ రంగంలోనే ఎక్కువగా పని చేస్తున్నారు. అందులో పనిచేస్తున్న మహిళల శాతం కూడా ఎక్కువగా ఉంది. వ్యవసాయ సంక్షోభం ఆహార సంక్షోభంతో ముడిపడి ఉంది. దీని ప్రభావంతో చాలా దేశాలు ఆహారం విషయంలో స్వయం సమృద్ధిగా లేకపోవడమే కాక ధరల పెరుగుదల కూడా అధికంగా ఉంది. సహజంగానే ఈ విధానాల దుష్ప్రభావాలు ఆయా దేశాలలో ప్రజలపై, ముఖ్యంగా శ్రామికులపై పడుతున్నాయి. అవి ఉపాధి అవకాశాలు దెబ్బతినడం, నిజ వేతనాలు పడిపోవడం, స్వయం ఉపాధి పనులలో ఆదాయాలు తగ్గిపోవడం, వలన విధానాలలో మార్పులు రావడం, ఆహార ధరల పెరుగుదల వలన ఆహార వినియోగం తగ్గడం, ఆరోగ్య సదుపాయాలు పొందలేకపోవడం, విద్య అందుబాటులో లేకపోవడం, సామాజిక ఒత్తిడిలు పెరగడంతో రకరకాల పద్ధతులలో హింస పెరగడం, మొదలైన దుష్ప్రభావాలు పడుతున్నాయి.

ఈ సంక్షోభ ప్రభావం కూడా ప్రజలందరిపై ఒకే విధంగా లేదు. బాలికలు, మహిళలపై ఈ ప్రభావం ఎక్కువగా ఉంది. ఆర్థిక రంగం అభివృద్ధి పథంలో ఉన్నప్పుడు దాని ఫలితాలను చివరి వరుసలో అందుకునే అణగారిన వర్గాలు అది సంక్షోభంలో ఉన్నప్పుడు మాత్రం తీవ్రమైన దాని చేదు ఫలితాలను ముందుగా చవిచూడాల్సి వస్తుంది. వేతనాలలో కోతలు, ఉపాధి అవకాశాలు లేకపోవటం, ప్రభుత్వం నుండి పొందాల్సిన నిత్యావసర వస్తువుల సరఫరా, సేవలు కోల్పోవడం వంటి సమస్యలను వారు ఎదుర్కొంటున్నారు. ఇది సమాజంలోని ఆర్థిక జీవనంలో ప్రతినిత్యం ఎదురవుతున్న విచారకరమైన అంశం.

**ఉపాధి అవకాశాలు తగ్గిపోవడంతో మహిళలు ఉప కాంట్రాక్టుల ద్వారా నడిచే గృహ పరిశ్రమలవైపు కానీ లేక చిన్న చిన్న యూనిట్లుగా ఉన్న కంపెనీలలో కానీ పనిచేస్తున్నారు. సాధారణంగా వీరికి పీస్‌రేట్ పద్ధతిలో కానీ లేక అతి తక్కువ వేతనాలు చెల్లిస్తున్నారు. వీరికి అదనపు సౌకర్యాలేవీ అందుబాటులోఉండవు.**

ఇతర సామాజిక, ఆర్థిక అంశాలకు లింగ వివక్ష కూడా తోడవడంతో ఆయా ప్రాంతాలు, వర్గాలు, సాంఘిక పరిస్థితులు, వృత్తులను బట్టికూడా మహిళలు, బాలికలను నిర్లక్ష్యం చేయడం జరుగుతుంది, సంక్షోభ తీవ్రతకూడా పురుషుల కంటే మహిళలపై ఎక్కువ ప్రభావం చూపిస్తుంది. సాంఘికంగా మహిళలకున్న పునరుత్పత్తి బాధ్యతల రీత్యా వారు అత్యంత అభద్రత ఉన్న ఉపాధి పనులలో భాగస్వాములవుతున్నారు. సంక్షోభం తలెత్తి రెండు సంవత్సరాలు పైబడింది. ఈ సందర్భంలో మహిళలపై సంక్షోభ ప్రభావం వివిధ రీతుల్లో ఒకదానిపై ఒకటి వరుసగా ఎలాంటి ప్రభావాలు చూపెడుతున్నాయో పరిశీలించాలి. శ్రామిక మహిళలుగా, స్వయం ఉపాధి మహిళలుగా, వేతనాలు లేని కార్మికులుగా, కుటుంబ సభ్యులుగా, హక్కులున్న కార్మికులుగా, అవసరాలు, ఆశయాలు, కోరికలు ఉన్న వ్యక్తులుగా మహిళలు ఏవిధమైన పరిస్థితులెదుర్కొంటున్నారో పరిశీలించాలి.

**శ్రామిక మహిళలుగా:**

తయారీ రంగంలో పనిచేస్తున్న శ్రామిక మహిళలు తోటి పురుషులకంటే ఎక్కువగా నష్టపోవాల్సి వస్తున్నది. మహిళలు పనులు కోల్పోవడం, వేతనాలలో కోతలు లాంటి సమస్యలెదుర్కొంటున్నారు. మహిళలెక్కువగా పనిచేస్తున్న టెక్స్‌టైల్స్ పరిశ్రమలలో రెడీమేడ్ దుస్తుల పరిశ్రమలలో ఈ సంక్షోభ ప్రభావం తీవ్రంగా ఉంది. ఉత్పత్తిలో కొంత మెరుగుదల కనిపించిన తరువాత కూడా ఉపాధి అవకాశాలు పూర్వ స్థాయికి రాలేదు. ప్రతికూల పరిస్థితుల వలన వ్యాపార పోటీలో యజమానులపై మరింత ఒత్తిడి పెరిగింది. దీనితో యజమానులు కార్మికులకు వేతనాలు తగ్గించడం ద్వారా ఖర్చులు తగ్గించుకోవడం, కార్మికుల సంఖ్యను కుదించడం, మిగిలిన కార్మికులను తక్కువ వేతనాలతో ఎక్కువ పని గంటలు పనిచేయించడం లాంటి చర్యలకు పాల్పడుతున్నారు.

**ఈ విషయాలు "ప్రపంచ ఆర్థిక సంక్షోభం- పేదలపై ప్రభావం" అనే అంశంపై 2009 నవంబరులో ఢిల్లీ నుండి వెలువడిన యుఎన్‌డిపిలోని 26వ పేజీ నుండి సంగ్రహించబడినవి.**

ఏది ఏమైనప్పటికీ మహిళలు సంఘటితంగా యూనియన్లు ఏర్పర్చుకోవడం తక్కువ. కనుక వారు సులభంగా ఉద్యోగాల నుండి తొలగింపబడుతున్నారు. తక్కువ వేతనాలు లభించే పనులలోనే నియమించ బడుతున్నారు. అంతేకాక పురుషుల వలె విస్తృత ఉపాధి అవకాశాలుకానీ, భద్రత కలిగిన పని పరిస్థితులు కానీ మహిళలకు ఉండడం లేదు. మహిళలు ఉపాధి అవకాశాలు కోల్పోవడం కుటుంబ ఆదాయాలపైననే కాక ఇంటా, బయటా

# EMMANUEL MINISTRIES ASSOCIATION

Kondala Agraharam, Makavarapalem Mandal, Visakhapatnam District-531113

# ADMISSIONS NOTIFICATION

## EMMANUEL VOCATIONAL JUNIOR COLLEGE. Tamaram




(Recognised by-Board of Intermediate)



Eligibility: 10th Pass

Courses :

MLT- Medical Lab Technician

MPHW(f) - Multy Purpose Health Worker (Female)

P.S.T.T - Pre-school Teacher Training

P.T. - Physiotherapy

Applications are invited for Admission

Principal,
Emmanuel vocational Junior College
Contact: Phone No: 222643

## EMMANUEL SCHOOL OF NURSING




(Recognised by-APNMC and INC New Delhi. General Nursing and Midwifery Course)

Kondala Agraharam



Eligibility:
Intermediate pass with any group

Course : GNM 3 1/2 Years

Age Limit:
17-35 years (only for Girls) Hostel facility availble.

Applications are invited for Admission

**Principal,**
**Emmanuel School of Nursing**
**Kondala Agraharam**
**Contact: Phone No: 222001**

చైతన్య మానవి దశాబ్ది పూర్తి చేసుకున్న
సందర్భంగా శుభాకాంక్షలతో...



కె.వి. రాంనర్సింహారెడ్డి

అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ పోలీస్
సెంట్రల్ పోలీస్ స్టేషన్, హైదరాబాద్

మహిళా ఉద్యమ కరదీపిక చైతన్య మానవి

10 సం॥ పూర్తి అయిన సందర్భంగా ప్రత్యేక శుభాకాంక్షలు



**రఘువీరా**

ఎ.ఎస్.ఓ, కర్నూలు

చైతన్య మానవి దశాబ్ది పూర్తి చేసుకున్న
సందర్భంగా శుభాకాంక్షలతో...





**శ్రీమతి జి. రాజేశ్వరి**
**శ్రీ జి.సుబ్రమణ్యం**

క్రిష్ణానగర్, కర్నూలు.

# చైతన్య మానవి

ప్రత్యేక సంచికకు శుభాకాంక్షలతో...



శ్రీ పినిపే విశ్వరూప్
రాష్ట్ర పశుసంవర్ధక శాఖా మాత్యులు



శ్రీ జి.వి. హర్షకుమార్
ఎం.పి. అమలాపురం



శ్రీ యాళ్ళ దొరబాబు
ఆల్డా ఛైర్మన్

## మండల ప్రజాపరిషత్ కార్యాలయం



అల్లవరం మండలం. తూ॥గో॥జిల్లా.

శ్రీ ఎస్. ధనరాజ్
ప్రత్యేక అధికారి



శ్రీ కె.సిహెచ్. అప్పారావు
ఎం.పి.డి.ఓ. అల్లవరం.

## కొమరగిరిపట్నం గ్రామ పంచాయితీ

శ్రీ కె.సిహెచ్. అప్పారావు
ప్రత్యేక అధికారి

శ్రీ పూటి వెంకట్రావు
పంచాయితీ కార్యదర్శి

## ఓడలరేవు గ్రామ పంచాయితీ

శ్రీ కె.సిహెచ్. అప్పారావు
ప్రత్యేక అధికారి

శ్రీ పూటి వెంకట్రావు
పంచాయితీ కార్యదర్శి

## తుమ్మలపల్లి గ్రామ పంచాయితీ

శ్రీ కె.సిహెచ్. అప్పారావు, ప్రత్యేక అధికారి

శ్రీ పి. గోవర్ధనరావు, పంచాయితీ కార్యదర్శి

# చైతన్య మానవి ప్రత్యేక సంచికకు శుభాకాంక్షలతో...



శ్రీమతి బి. బేబీ జ్ఞానాంబ, ఎం.ఎ.,
తహశీల్దార్, అల్లవరం. తూ॥గో॥జిల్లా.



శ్రీ జె. సింహాద్రి,
తహశీల్దార్, ఉప్పలగుప్తం. తూ॥గో॥జిల్లా.
మరియు పంచాయితీల ప్రత్యేక అధికారి

## అల్లవరం గ్రామ పంచాయితీ

శ్రీమతి బి. బేబీ జ్ఞానాంబ, ప్రత్యేక అధికారి

శ్రీ పి. వెంకట్రావు, పంచాయితీ కార్యదర్శి

## కోడూరుపాడు గ్రామ పంచాయితీ

శ్రీమతి బి. బేబీ జ్ఞానాంబ, ప్రత్యేక అధికారి

శ్రీ జి. సుబ్బారావు, పంచాయితీ కార్యదర్శి

## గూడాల గ్రామ పంచాయితీ

శ్రీమతి బి. బేబీ జ్ఞానాంబ, ప్రత్యేక అధికారి

శ్రీ ఎమ్. రాంబాబు, పంచాయితీ కార్యదర్శి

## భీమనపల్లి గ్రామ పంచాయితీ

శ్రీ చిక్కం శ్రీనివాసరావు, పంచాయితీ కార్యదర్శి

## విలసవిల్లి గ్రామ పంచాయితీ

శ్రీ సత్యనారాయణ, పంచాయితీ కార్యదర్శి

## సన్నవిల్లి గ్రామ పంచాయితీ

శ్రీ జి. అబ్బులు, పంచాయితీ కార్యదర్శి

## నంగవరం గ్రామ పంచాయితీ

శ్రీ జి. అబ్బులు, పంచాయితీ కార్యదర్శి

## మునిపల్లి గ్రామ పంచాయితీ

కె. రజని, పంచాయితీ కార్యదర్శి

ఒలింపిక్స్ బ్యాడ్మింటన్‌లో మెరిసిన తార

# శభాష్ సైనా



లండన్ ఒలింపిక్స్ మహిళల సింగిల్స్ బ్యాడ్మింటన్‌లో కాంస్యపతకం సాధించిన సైనా నెహ్వాల్‌కు మానవి అభినందనలు తెలుపుతోంది. ఒలింపిక్స్ బ్యాడ్మింటన్ విభాగంలో ఒక పతకం లభించడం భారత బ్యాడ్మింటన్ చరిత్రలో ఇదే ప్రప్రథమం. ఈ ఘనత సైనాకే దక్కింది. సాధారణ మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన సైనా 18 సంవత్సరాలకే అర్జున, 19 సం॥లకు పద్మశ్రీ పురస్కారం, 20 సం॥లకే క్రీడా రంగంలో అత్యున్నత పురస్కారమైన రాజీవ్ ఖేల్‌రత్న అవార్డులు ఆమె ప్రతిభకు తార్కాణం.

2010లో ఇండియా ఓపెన్, సింగపూర్, ఇండోనేషియా సూపర్ సిరీస్ టైటిల్స్, కామన్వెల్త్ క్రీడల్లో 'స్వర్ణం' ప్రపంచ బాడ్మింటన్ ర్యాంకింగ్స్‌లో రెండోస్థానం సాధించింది. ఇదే స్ఫూర్తితో రాబోయే రియో ఒలింపిక్స్‌లో రాణించి భరతమాత మెడలో స్వర్ణాన్ని అలంకరించాలని ఆకాంక్షిద్దాం.

భారత బాక్సింగ్ ఐకాన్

# మేరీ కోమ్



ఆధునిక యుగంలో మహిళలు ఎన్నో రంగాల్లో తమ ప్రతిభను చాటుకుంటున్నారు. ఐ.ఎ.ఎస్.లుగా, ఐ.పి.ఎస్.లుగానే కాకుండా వినీలాకాశంలో వ్యోమగాములుగా జయకేతనాలనూ ఎగురవేస్తున్నారు. రాకెట్‌ల తయారీ రంగంలో కూడా తమ సామర్థ్యం నిరూపించుకుంటున్నారు. అంతేకాదు అత్యంత ప్రమాదకర క్రీడైన బాక్సింగ్‌ని కెరీర్‌గా ఎంచుకుని అందులోనూ తమకు ఎదురులేదని చాటుతున్నారు. మణిపూర్ మణిపూస మేరీకోమ్ ఇందుకు ఒక చక్కటి ఉదాహరణ. ఐదు సార్లు ప్రపంచ ఛాంపియన్‌గా నిలవటమే గాక అర్జున, పద్మశ్రీ, రాజీవ్ ఖేల్‌రత్న వంటి అవార్డులతో సహా ఎన్నో, ఎనెన్నో పతకాలను తన ఖాతాలో జమచేసుకున్న మేరీకోమ్ లండన్ ఒలింపిక్స్‌లో రజత పతకాన్ని సాధించింది. ఒలింపిక్స్‌లో స్వర్ణాన్ని తేలేకపోయాను, నన్ను క్షమించండి ! అని నిజాయితీగా మన్ననలు కోరిన ధీరవనిత మేరీకోమ్.

ఈశాన్య భారతదేశంలో మణపూర్‌లతో సహా రాష్ట్రంలో మారుమూల కొండల్లో మెరిసిన విద్యుల్లత మేరీకోమ్. ఎటువంటి మౌలిక వసతులు లేని కొండ ప్రాంతంలో పట్టుదల, దీక్ష, కృషి, ఆత్మవిశ్వాసాలనే నమ్ముకుని ఒలింపిక్స్‌లో కాంస్య పతకాన్నిసాధించిన మేరో కోమ్ జీవితంలో ఎన్నో సంచలనాలు. సాధారణంగా మహిళలు వివాహానంతరంగానీ, తల్లి అయిన తరువాతగానీ క్రీడలకు దూరమవుతారు. ఎన్నో ప్రత్యేకతలున్న విభిన్నమైన వ్యక్తి మేరీకోమ్. ఇద్దరు కవల పిల్లలకు తల్లి అయిన 8 నెలలకే ప్రపంచ ఛాంపియన్‌షిప్ పోటీలో గెలిచింది. ఇది సాధారణమైన విషయంకాదు. తల్లైన తరువాత స్త్రీలకు శారీరకంగా ఎన్నో సమస్యలుంటాయి. వాటినన్నింటినీ సమర్థవంతంగా ఎదుర్కొని విపత్కర పరిస్థితులను కూడా తనకు అనుగుణంగా మార్చుకుని విజయం సాధించటంలో ముందుంటానని తన 'పంచ్'లతో చాటిచెప్పిన మేరీ కోమ్‌కు "చైతన్య మానవి" హృదయపూర్వక అభినందనలు తెలుపుతోంది.

వారి సంబంధాలపై కూడా ప్రభావం చూపిస్తుందనేది ఒక ముఖ్యమైన అంశం.

**స్వయం ఉపాధి రంగంలో మహిళలు:**

వేతనాలు పొందే ఉపాధి అవకాశాలు తగ్గిపోవడంతో మహిళలు ఉప కాంట్రాక్టుల ద్వారా నడిచే గృహ పరిశ్రమలవైపు కానీ లేక చిన్న చిన్న యూనిట్లుగా ఉన్న కంపెనీలలో కానీ పనిచేస్తున్నారు. సాధారణంగా వీరికి పీస్‌రేట్ పద్ధతిలో కానీ లేక అతి తక్కువ వేతనాలు చెల్లిస్తున్నారు. వీరికి అదనపు సౌకర్యాలేవీ అందుబాటులోఉండవు.

**దేశంలోని సాంప్రదాయ చేనేత కార్మికుల సమస్యలు:**

చికన్ ఎంబ్రాయిడరీ పని అనేది దేశంలోని ఒక ప్రత్యేక నైపుణ్యం కలిగిన మంచి సాంప్రదాయ వృత్తి. దీనికి దేశంలోనూ అంతర్జాతీయంగానూ మంచి డిమాండ్ ఉంది. మన దేశంలోని లక్నోలో నివసిస్తున్న కమ్ము అనే మహిళ తన భర్త జీవించి ఉన్నపుడు ఆయనతో కలిసి అనేక దశాబ్దాలపాటు ఈ పనిచేసింది. ప్రత్యేక ఆర్డర్లపై వారు పనిచేసేవారు. ఆమె ఇప్పటికీ తనకు కావలసిన వస్తువులు, బట్టలు తానే కొనుగోలు చేస్తుంది. వాటిని తన కూతురు సాయంతో కత్తిరిస్తుంది. వాటిపై ఎంబ్రాయిడరీ పని చేస్తుంది. వాటితో దుస్తులు తయారుచేస్తుంది. ఆమె ఎంతో నైపుణ్యం కలిగిన పనితనం కలిగి వున్నా, ఇప్పటికీ ఆమెకు పక్కా ఇల్లు లేదు. కురుస్తున్న పైకప్పు ఉన్న ఇంట్లో నివసిస్తుంది. ఆమెకు ఒక వికలాంగుడైన కుమారుడున్నాడు. అతనికి వైద్యం చేయించడానికి ఆమె ఎంతో కష్టపడాల్సి వస్తుంది.

చికన్ వర్క్ ఎంబ్రాయిడరీ కోసం వెచ్చించే శ్రమ, నైపుణ్యాలకు తగ్గ ఫలితం అందులో దక్కడంలేదని కమ్ము చెబుతుంది. ఎంతో నైపుణ్యం కలిగిన కార్మికునికైనా రోజుకు 50 రూపాయలు మాత్రమే లభిస్తుంది. ఇక మామూలు కార్మికునికి రోజుకు 8 నుండి 20 రూపాయలు మాత్రమే దక్కుతుంది. సంక్షోభంతో పరిస్థితులు మరింత దిగజారాయి. ఇంతకు ముందు కంటే చాలా తక్కువ వేతనం పొందుతున్నట్లు కమ్ము చెబుతుంది. ప్రస్తుత సంక్షోభ పరిస్థితులలో కూడా చికన్ వర్కర్ల కోసం ప్రభుత్వం ఏమీ చేయడంలేదని కమ్ము చెబుతుంది.

వయసు పెరుగుతున్న కొలదీ ఆమెకు రోజు రోజుకు ఐదు లేక ఆరు గంటల కంటే ఎక్కువ పనిచేయడం సాధ్యం కావడంలేదు. ముఖ్యంగా నైపుణ్యంతో చేయాల్సిన ఎంబ్రాయిడరీ పని మరింత కష్టతరంగా ఉంది. కనుక ఆమె సంపాదన మరింత పడిపోయింది. రాను రాను ఆమె ఆరోగ్యం దెబ్బతింది. కంటిచూపు తగ్గింది. ఆమె దీర్ఘకాలంగా తలనొప్పి, వెన్నునొప్పి, మెడనొప్పులతో బాధపడుతోంది. చికన్ వర్క్ చేసి చేసి చేతి వ్రేళ్ళ నొప్పులతో ఆమె బాధపడుతోంది. ఆమెకు భవిష్యత్తుపై అంతగా ఆశలేదు. ఈ విషయాలు "ప్రపంచ ఆర్థిక సంక్షోభం- పేదలపై ప్రభావం" అనే అంశంపై 2009 నవంబరులో ఢిల్లీ నుండి వెలువడిన యుఎన్‌డిపిలోని 26వ పేజీ నుండి సంగ్రహించబడినవి.

**దేశంలోని వ్యర్థ పదార్థాల సేకరణ దారులు:**

**ఇది ఒక రతన్‌బెన్ కథ:**

"నా పేరు రతన్‌బెన్. నేను గోమతిపూర్‌లో నివసిస్తున్నాను. (గోమతిపూర్ అహ్మదాబాద్‌లోని ఒక మురికివాడ) నా వయస్సు 50 సంవత్సరాలు. నేను గత 30 సంవత్సరాల నుండి వ్యర్థ పదార్థాలను సేకరిస్తున్నాను. నాకు ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు. నాకు 25 సంవత్సరాల వయస్సులో నా భర్త చనిపోయాడు. అప్పటి నుండి నేను చెత్త సేకరణ ద్వారా వచ్చిన ఆదాయంతో నా కుటుంబాన్ని పోషిస్తున్నాను. నా కొడుకులు చిన్న చిన్న కార్ఖానాల్లో అప్పుడప్పుడూ పనిదొరికినప్పుడు తాత్కాలికంగా పనిచేస్తుంటారు. ప్రతిరోజూ ఉదయం ఐదు గంటలకు నా దినచర్య మొదలవుతుంది. ఇంట్లోని పనులన్నీ పూర్తి చేసుకుని ఉదయం ఆరు గంటలకు నేను చెత్త సేకరణ పని మొదలుపెట్టి మధ్యాహ్నం వరకూ పనిచేస్తాను. మధ్యాహ్నం ఆ చెత్తను కట్టలుగా కడతాను. మళ్ళీ రెండోపూట నాలుగు గంటలకు వెళ్ళి రాత్రి ఎనిమిది గంటలకు తిరిగి వస్తాను. అదికూడా నేను సేకరించే చెత్తను బట్టి తిరిగి వస్తాను. అలా రెండు రోజులు చెత్త సేకరించి మూడవరోజు చెత్తకట్టలను షాపులో అమ్ముతాను. నేను పేపరు, ప్లాస్టిక్, ఇనుప సామాను, బట్టలు, విరిగిన బొమ్మలు, ప్లాస్టిక్ సంచులు, జుట్టు, తెలుపు మరియు రంగు పేపర్లు మొదలైనవి సేకరిస్తుంటాను. నేను సేకరించిన మొత్తం చెత్తకు గాను నాకు సుమారుగా 50 రూపాయలు వస్తాయి."

కాని ఆకస్మాత్తుగా గత అక్టోబరు నెల దీపావళి తరువాత షాపు యజమాని నాకు తక్కువ డబ్బు ఇవ్వడం మొదలుపెట్టాడు. నేను అతనితో ఈ విషయంపై గొడవ పడ్డాను. కానీ నాకు అతను ఇచ్చే డబ్బు తీసుకోవటం తప్ప వేరే మార్గం లేదు. అసలు సమస్య ఏమీటో నాకు అర్థం కాలేదు.

తరువాత ఒక సాయంత్రం నేను నా గుడిసె ముందు కూర్చొని ఉండగా ఇతర చెత్త సేకరణదారులు కూడా ఇదే సమస్యపై నాతో మాట్లాడారు. తరువాత ఒకసారి నేను చెత్త అమ్మడానికి షాపుకు వెళ్ళగా యజమాని నా చెత్తను కొనడానికి నిరాకరించడంతో పరిస్థితులు మరింత దిగజారాయి. మార్కెట్ కుదించుకుపోవడంతో చెత్త అమ్ముడు పోక షాపులో పోగుపడిపోతుందని అతను చెప్పాడు. కనుక ఇతర చెత్త

సేకరణదారులకు కూడా ఇదే పరిస్థితి తలెత్తింది. తరువాత చుట్ట పక్కల ప్రాంతాల్లోని స్క్రాప్ షాపులన్నీ మూతపడుతున్నాయనే విచారకరమైన వార్త వచ్చింది. చెత్తకు ధర తగ్గడంలో యజమాని తప్పేమీ లేదు. అంతర్జాతీయ మార్కెట్‌లో చెత్తకు ధరలు పడిపోయాయని తెలిసింది. ఇది నాపై తీవ్ర ప్రభావం చూపింది. ఆర్థిక సంక్షోభంతో చిన్న చిన్న ఫ్యాక్టరీలు మూతబడడం వలన నా కొడుకులు కూడా పనులు పోగొట్టుకున్నారు. మా ఇంటిలో తినడానికి తిండికూడా లేని పరిస్థితులు ఏర్పడ్డాయి. మాకు కనీసం కూరగాయలు కూడా కొనుక్కోలేని పరిస్థితులేర్పడ్డాయి. నా మనవళ్ళ చదువుకు నేను డబ్బు వెచ్చించలేకపోవడంతో వారు కూడా నాతోపాటు చెత్త ఏరే పనికి వచ్చి ఆదాయం సర్దుబాటుచేసే పనిలో పడ్డారు. నా ఇరుగు పొరుగువారు కూడా ఎన్నో ఇబ్బందులు పడడం నేను చూశాను. నా పొరుగున నివసించే ఏసిబిన్ అనే మహిళ తన శరీరాన్ని వైద్య ప్రయోగాలకు అమ్మివేసింది. మనందరికీ అది ప్రమాదకరమని తెలుసు. కానీ దానికి అధిక మొత్తాలు చెల్లిస్తారు. ప్రజల డబ్బంతా ఎక్కడికి పోతుందని నా ప్రశ్న. పేద ప్రజలే ఎందుకు ఇబ్బందులు పడాలి. పెద్ద పెద్ద పరిశ్రమలను కాపాడటానికి ప్రభుత్వం ఎన్నో పథకాలు పెడుతుందని నేను వార్తలలో తెలుసుకున్నాను. మరి మా సంగతేమిటి? వారు మాగురించి ఏమైనా ఆలోచిస్తున్నారా?

స్వయం ఉపాధి మహిళలకు అప్పు దొరకడమే కష్టతరంగా ఉంది. మైక్రోఫైనాన్స్ సంస్థలకు వాణిజ్య బ్యాంకుల నుండి పెద్ద ఎత్తున నిధులు, సహాయం అందేది. కానీ తరువాత కాలంలో వాణిజ్య బ్యాంకులు నిధులు ఇవ్వడం తగ్గించాయి. దీని ప్రభావం మైక్రోఫైనాన్స్ సంస్థలపై పడింది. దీనితో స్వయం ఉపాధి గ్రూపుల మహిళలకు ఈ రుణాలు కూడా అందడంలేదు.

దేశంలోని రైతులు వ్యవసాయం ఖర్చులు పెరిగిపోవడం, పంటరేట్లు స్థిరంగా లేకపోవడం మరియు ప్రభుత్వ సహకారం లేకపోవడం వంటి సమస్యలతో తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. మహిళా రైతులకు భూమి పట్టాలు లేకపోవడం, గుర్తింపు లేకపోవడం మొదలైన వాటితో వారు మరింత ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వారికి వ్యవసాయ సబ్సిడీలు కానీ సంస్థాగత రుణాలు కానీ సంక్షోభ నివారణకు సంబంధించిన సదుపాయాలు కానీ ఏవీ అందుబాటులో ఉండడంలేదు.

**వలస కార్మికులు:** సంక్షోభం యొక్క ప్రత్యక్ష ప్రభావం పురుష వలస కార్మికులకంటే మహిళా వలస కార్మికులపై కొంత తక్కువగానే ఉందని చెప్పవచ్చు. కాని దుష్ప్రభావం లేదని చెప్పలేము. ఆసియాలోని వలసలలో ముఖ్యంగా సరిహద్దులు దాటుతున్న వలసలలో పురుషులు తయారీరంగంలోనూ, నిర్మాణ రంగంలోనూ పనిచేస్తున్నారు. మహిళా వలస కార్మికులు సంరక్షణ రంగంలోనూ, వినోదానికి సంబంధించిన పనులలోనూ ఉన్నారు. (ఉదా: నర్సింగ్ మరియు ఇంటిపని) ఈ సంరక్షణకు సంబంధించిన పనులు వాణిజ్య రంగంపై తక్కువ ప్రభావం చూపిస్తున్నాయి. కానీ జనాభాకు సంబంధించిన విషయాలపైనా, సంస్థాగత విషయాలపైనా మరియు ఆయా దేశాల్లోని మహిళలు ఇంట బయట చేసే పనులపైనా ఎక్కువ ప్రభావం చూపిస్తాయి. కనుక మహిళా వలస కార్మికుల వేతనాలు కొంత స్థిరత్వం కలిగి ఉన్నాయి. పురుషులకు తగ్గిపోయినంతగా తగ్గలేదు.

ఏది ఏమైనా ఇక్కడ ఉన్న తక్కువ ఉపాధి అవకాశాల వలన దేశీయ వలసలపై సంక్షోభ ప్రభావం ఉంది. వలస కార్మికులు, ముఖ్యంగా అట్టడుగు వర్గాల మహిళా కార్మికులు ఎక్కువగా ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఉపాధి అవకాశాలు అసలే తక్కువగా ఉన్న పరిస్థితుల్లో వలస కార్మికులు వచ్చి తమ ఉపాధి అవకాశాలపై దెబ్బ కొడుతున్నారని స్థానికులు భావిస్తున్నారు.

వలన మహిళలకు అందే హెచ్ఐవి సర్వీసులపై సంక్షోభ ప్రభావం తీవ్రంగా ఉన్నదనేది మాత్రం సరిగా గుర్తించని ఒక ముఖ్యమైన అంశం.

**మహిళలు చేసే వేతనం లేని పని:**

మహిళలు చేసే వేతనం లేని పనులపై సంక్షోభం ప్రత్యక్ష, పరోక్ష ప్రభావం చూపుతుంది. కుటుంబ ఆదాయాలు పడిపోయినపుడు కుటుంబాలు అనేక పద్ధతుల ద్వారా జీవనం సాగించే ప్రయత్నం చేస్తుంటాయి. అందులో భాగంగానే తమ నిత్యావసరాల ఖర్చులు తగ్గించుకుని వినియోగంపెంచుకునే ప్రయత్నం చేస్తారు. తమ అవసరాల కోసం బయటి వారితో పనిచేయించుకునే బదులుగా కుటుంబ సభ్యులతోనే పనిచేయించుకునే ప్రయత్నం చేస్తారు. పలు రంగాలలో ప్రభుత్వం తన సర్వీసులను ఉపసంహరించుకోవడమే కాక ఆరోగ్యం, పారిశుధ్యం లాంటి వాటిపై అధిక మొత్తాల్లో యూజర్ చార్జీలను వసూలు చేస్తుంది. దీనితో కుటుంబంలో ఎలాంటి వేతనం లేకుండా పనిచేసే సభ్యులపై ముఖ్యంగా పనులు నిర్వహించే మహిళలపై అధిక భారం పడుతుంది.

**సంక్షోభం తరువాత మహిళలు చేసే వేతనం లేని పని పెరిగిందని అనేక సర్వేలలో రుజువయ్యింది. ఇంటికి సంబంధించిన పనులను శుభ్రం చేయడం, ఊడ్వడం, ఉతకడం లాంటివి ఇళ్ళలో పనిచేసేవారిని తొలగించి మహిళలే చేయాల్సివస్తుంది.** అనారోగ్యానికి గురైనవారినీ, పిల్లలనూ మహిళలే చూసుకోవాల్సి వస్తుంది. అంతేకాక

పొలాల నుండి కూరగాయలు, పండ్లు, ఆకుకూరలు తెచ్చే పనికూడా మహిళలే చేస్తున్నారు. ఇవన్నీ వేతనం లేని పనులే. ఈ విధంగా ఇళ్ళలో చేసే వేతనం లేని పని మహిళలకు మూడింతలు పెరిగిందని ప్రభుత్వ శాంపిల్ సర్వేలో తేలింది. యుఎన్‌డిపి నివేదిక 33వ పేజీలో కూడా ఇవే అంశాలు వెల్లడించారు. గృహ సంబంధిత పనులను మొత్తంగా మహిళలే వేతనం లేకుండా నిర్వహించడం, వేతనం ఇచ్చి చేయించుకునే ఆరోగ్య సేవలను వేతనం లేని సేవలుగా మార్చడం, గ్రామీణ ప్రాంతాల్లో మహిళలు ఉచితంగా దొరికే కూరగాయలు, పండ్లు, ఆకులు, గడ్డిలాంటివి సేకరించే పనులు పెరగడం వలన ఈ వేతనం లేని పనులు పెరిగాయని చెప్పవచ్చని నివేదికలో పేర్కొన్నారు.

**ప్రాథమిక హక్కులు, అవసరాలపై దుష్ప్రభావం:**

ఆదాయాలు పడిపోవడంతో ఆహారం అందుబాటులో లేకుండా పోయింది. కుటుంబాలలో ముఖ్యంగా మహిళలు, ఆడపిల్లలు ఆహార కొరతను ఎదుర్కోవలసి వస్తుంది. ప్రపంచవ్యాప్తంగా ఇంధనం, ఆహార ధరలలో స్థిరత్వం లేకపోవడంతో చాలా దేశాలలో ఆహార ధరలు కూడా పెరుగుతున్నాయి. చాలా కుటుంబాలు అప్పులు చేసి ఆహార పదార్థాలు కొనుగోలు చేయాల్సి రావడంతో తక్కువ ఖరీదుగల ఆహార పదార్థాలను కొనుగోలు చేయడం, తక్కువ వినియోగించడం లాంటి పద్ధతులు అవలంభిస్తున్నారని అనేక సర్వేలలో తేలింది. చాలా కుటుంబాలలో మహిళలు, ఆడపిల్లలే ఆహార కొరత సమస్య ఎదుర్కొంటున్నారనీ, కుటుంబాలలోని తల్లులూ, అక్కలూ తాము తీసుకునే ఆహారాన్ని త్యాగం చేసి మిగిలిన కుటుంబ సభ్యులకు పెడుతున్నారనీ యుఎన్‌డిపి 2009 నివేదికలో కూడా తెలిపారు.

మహిళలు, ఆడపిల్లలకు సంబంధించిన పౌష్టికాహారం, ఆరోగ్యం విషయంలో ప్రపంచ దేశాలలో భారతదేశం చాలా వెనుకబడి వున్న విషయం కూడా ఈ సందర్భంగా గుర్తించాలి. 2005-06 సంవత్సరాలలో జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే (ఎన్ఎఫ్‌హెచ్ఎస్)నిర్వహించిన సర్వేలో అనేక అంశాలు వెలుగుచూశాయి.

**వివరాలు:**

**1. 3సం॥లలోపు పిల్లలలో 46 శాతం మంది బరువు తక్కువ వున్నారు.**

**2. బాడీ మాస్ ఇండెక్స్ (బిఎంఐ) సాధారణ స్థాయికంటే తక్కువగా వున్న మహిళలు 33శాతం ఉండగా పురుషులు 28 శాతం ఉన్నారు.**

**3. 6నుండి 35 నెలల లోపు వున్న పిల్లలలో 79 శాతం మంది రక్తహీనతతో ఉన్నారు. 15 నుండి 49సం॥లలోపు వున్న అవివాహిత మహిళలలో 56 శాతం మందిలో రక్తహీనత వుండగా గర్భిణీ స్త్రీలలో 58 శాతం మందిలో రక్తహీనత వుంది. గ్రామీణ ప్రాంతాలలో ఈ పరిస్థితి తీవ్రత ఇంకా ఎక్కువగా ఉంది.**

ఆహార ధరల పెరుగుదల విపరీతంగా వున్న గత 4 సం॥ల ముందు కాలంలో కూడా పౌష్టికాహార వినియోగంలో తగ్గుదల కనిపిస్తుంది. కేలరీల వినియోగం ఇంకా తక్కువగా ఉంది. 2004-05 సం॥లలో నేషనల్ శాంపిల్ సర్వే సంస్థ(ఎన్.ఎస్.ఎస్.ఒ.) నిర్వహించిన ఒక పెద్ద సర్వే నివేదిక పరిశీలిస్తే గ్రామీణ ప్రాంతాలలో సరాసరి కేలరీల వినియోగం 1993-94 సం॥లలో 2153 కిలో కేలరీలు వుండగా 2004-05 సం॥లలో 2047 కిలో కేలరీలకు పడిపోయింది. అంటే 106 కిలో కేలరీల వినియోగం తగ్గిపోయింది. (ఇది 4.9 శాతం తగ్గుదల)

పట్టణ ప్రాంతాలలో 2071 కిలో కేలరీల నుండి 2020 కిలో కేలరీలకు తగ్గింది. అంటే 51 కిలో కేలరీలు తగ్గింది. (ఇది 2.5 శాతం)

1993-94 సం॥ నుండి 2004-05 సం॥ల మధ్యలో గ్రామీణ ప్రాంతాల్లో ప్రొటీన్ల వినియోగం 60,2 గ్రాముల నుండి 57 గ్రాములకు తగ్గిపోయింది. అదే కాలంలో పట్టణ ప్రాంతాల్లో ఇది 57 గ్రాములుగా స్థిరంగా ఉంది.

విద్య, ఆరోగ్య రంగాలలో విధిస్తున్న అధిక యూజర్ చార్జీల వలన మహిళలు, ఆడపిల్లలు ఎక్కువగా నష్టపోతున్నారు. ఆడపిల్లలను చదువు మాన్పించడం, గర్భవతులైనపుడు మహిళలకు కూడా ఆరోగ్య సదుపాయాలు అందుబాటులో లేకపోవడం వంటివి అనేక నివేదికలలో వెల్లడయ్యాయి. ఆర్థిక పరిస్థితులు దిగజారడంతో పురుషులు అసహాయ పరిస్థితులెదుర్కొనడం, తమ ఆగ్రహాన్ని ఏదో రూపంలో వెల్లడించాలని చూడడం లాంటి వాటి వలన లింగ వివక్షకు, హింసకు, గృహ హింసకు పాల్పడడం పెరిగింది. మహిళలపైన ఇంటా, బయటా హింస పెరిగిందని అనేక నివేదికలు చెబుతున్నాయి. దీనితోపాటు బహిరంగ ప్రదేశాల్లో మహిళలకు అభద్రత పెరిగింది. ఆర్థిక సమస్యలు, ఉపాధి కోల్పోవడం, అభద్రతాభావం మొదలైన వాటితో మహిళల్లో మానసిక సమస్యలు కూడా పెరుగుతున్నాయి. ఇది అంతగా గుర్తింపుకు నోచుకోని అంశంగా వుంది.

**సంక్షోభ సమస్యలతోపాటు లైంగిక సమస్యలపై కూడా దృష్టి సారించాలి:**

భారతదేశంలో సామాజిక భద్రత చాలా తక్కువ. కనుక ఈ పరిస్థితి త్వరితంగా మారాలి. నగదు బదిలీ, నిరుద్యోగ భృతి, నష్టపరిహారం మొత్తాలు అందజేసేటపుడు కుటుంబాలలో పురుషులనే పరిగణనలోకి తీసుకోవడంతో మహిళలు నష్టపోతున్నారు. మహిళల

ఉపాధికి సంబంధించిన హక్కును, అవసరాన్ని గుర్తించిన కొన్ని పథకాలు. ఉదాహరణకు గ్రామీణ ఉపాధి హామీ పథకం లాంటివాటి వలన మహిళలకు ఎంతో మేలు జరిగింది. సంక్షోభ సమయంలో వారికి కొంత ఆదాయం సమకూరడమే కాక నగదు ఆదాయం వలన గృహ సంబంధిత ఖర్చులపై వారికి మంచి అదుపు ఏర్పడింది. చిన్నచిన్న మహిళా పారిశ్రామిక వేత్తలను గుర్తించి వారికి రుణ సౌకర్యాలు, మార్కెట్ సౌకర్యాలు కల్పించాలి తద్వారా వారు మైక్రోఫైనాన్స్ సంస్థల బారిన పడకుండా చూడాలి. దీనితోపాటు మహిళలపై పెరుగుతున్న వేతనం లేని పని భారాన్ని తగ్గించాలి. ఇది అతి ముఖ్యమైన అంశంగా గుర్తించాలి. ప్రభుత్వం జవాబుదారీతనంతో పాటు, బడ్జెట్ కేటాయింపులు పెంచి ప్రజలకు సేవలందించడం ద్వారా మాత్రమే ఇది సాధ్యమవుతుంది. అధిక బడ్జెట్‌లు కలిగి ఉండి, జవాబుదారీగావున్న ప్రభుత్వ సేవల ద్వారా ప్రజలకు సౌకర్యాలు కలిగించినపుడే ఇది సాధ్యపడుతుంది.

అనువాదం: కె. నాగలక్ష్మి

# తల్లిదండ్రులూ! ఆలోచించండి!!

– వైవిఎస్ కామేశ్వరి

'ఇంత మంచి మనసు నీది, ఇంత చక్కటి వ్యక్తిత్వం నీది, ఇలాంటిపనులు ఎందుకు చేస్తున్నావు నాన్నా నీవు?" ఆవేదనగా ప్రశ్నించాను నేను. బస్సు ప్రయాణంలో పరిచయమైన ప్రవీణ్‌ని. నేను ఖమ్మంలో హైదరాబాద్ బస్ కోసం ఎదురు చూస్తుంటే పరిచయమయ్యాడు ప్రవీణ్. ఆంటీ మీకు టీ కావాలా అంటూ తెచ్చిపెట్టాడు. నేను మోకాలి నొప్పితో నడవలేకపోతుంటే నా బ్యాగ్ కూడా తెచ్చి బస్సులో పెట్టాడు. తను బిస్కట్స్ తింటూ ప్రక్కన ఉన్న పేద పిల్లలకు కూడా ఇచ్చాడు. ఇవన్నీ గమనించిన నాకు ప్రవీణ్ గురించి తెలుసుకోవాలని అనిపించింది.

'ఒక్కడివే వెళ్తున్నావా?' అంటూ మాట కలిపాను. 'మీరు మా అత్త లాగానే ఉన్నారు ఆంటీ' అన్నాడు. 'ఎందుకంత దల్‌గా ఉన్నావు'? అని అడిగాను. నేను మూడు నెలలు శిక్ష అనుభవించి వస్తున్నాను దొంగతనం నేరం మీద అని చాలా ఫ్రాంక్‌గా చెప్పాడు. 'స్నేహితుల ప్రోద్బలమా'? అని అడిగాను. లేదాంటీ, నేనే చేసాను అన్నాడు నిజాయితీగా. చాలా ఆశ్చర్య పోయాను. తను చేసిన నేరానికి, తన అపజయాలకీ కారణాలు ఇతరుల మీదకి తోస్తారు సామాన్యంగా. మన చేతకాని తనానికీ, అసమర్థతకీ, బద్ధకానికీ, అపజయాలకీ మనమెప్పుడూ ఇతరుల వైపే వేలు చూపిస్తూ ఉంటాము. కానీ బాధ్యతనంతా తనమీదనే వేసుకున్నాడే చిట్టితండ్రి. నాకు ఆ పిల్లవానిపై మరింత ఆసక్తి పెరిగింది.

'కారణమేమిటి?' అని అడిగాను. "మా నాన్న రోజూ ఖర్చు పెట్టుకోవడానికి 50 లేక 100రూపాయలు ఇచ్చేవాడు. సడన్‌గా ఇవ్వడం మానేసాడు. ఏం చెయ్యాలో తోచలేదు. సినిమాకి డబ్బులు లేక అలా వెళ్తుంటే తాళం వేసిన ఇల్లు కనిపించింది. చుట్టూ ఎవరూ లేరు. గట్టిగా లాగితే తాళం ఊడొచ్చింది. గదిలో బీరువా తాళాలు దిండు క్రింద పెట్టి ఉన్నాయి. మా అమ్మ అలవాటుగా పెట్టినట్లే. అదే నా మొదటి దొంగతనం" అన్నాడు. ఆ అబ్బాయి చక్కగా బొమ్మలేస్తాడట, ఆపదలో ఉన్న వారికి అండగా నిలుస్తాడు, ఎవరి మీదా ఫిర్యాదులుండవు. అన్నీమంచి గుణాలే. చంద్రునిలో మచ్చలాగా. ఇదొక్కటి తప్పు. పిల్లలకు కావలసింది డబ్బు మాత్రమే కాదు. ప్రేమనిద్దాం, సమయాన్నిద్దాం. తల్లిదండ్రులుగా ఇవ్వగలిగిన ఇవి డబ్బుతో సమానం కావు. అవసరానికి మించి డబ్బు ఇవ్వటం అలవాటైతే ఇలాంటి పరిస్థితి మన పిల్లలకూ రావచ్చు. తస్మాత్ జాగ్రత్త!

★

# హైకూలు

పక్షుల భాష
అర్థం కాలేదా?
చెట్టు నాటినందుకు
ప్రశంసలవి

రాతి గోడలకు
బంగారు తొడుగా?
దాచేస్తే దాగదు
చరిత్ర

చంపడానికి
ఆయుధాలెందుకు?
ఒక్కమాట చాలు
ప్రాణం తీయడానికి

నోరున్న మూగవాళ్ళు
ఎవరో తెలుసా?
ఎస్ఎంఎస్‌లు
నొక్కే వాళ్ళు

నీ అవయవాలన్నీ
పనిచేస్తున్నాయిగా
మరి నువ్వెందుకు
చెయ్యవు?

– డా॥ ఇ.విష్ణువందనాదేవి

## మానవి దశాబ్ది ప్రస్థానం సందర్భంగా హృదయ పూర్వక శుభాకాంక్షలు

| | |
|---|---|
| ఐద్వా కమిటీ, ప్రగతినగర్ | దుర్గాబాయి దేశ్‌ముఖ్ పొదుపు సంఘం |
| సూర్యచంద్ర పొదుపు సంఘం | ప్రియదర్శిని పొదుపు సంఘం |
| వినాయక పొదుపు సంఘం | మదర్‌థెరిస్సా పొదుపు సంఘం |
| శ్రీగౌతమి పొదుపు సంఘం | ఝాన్సీ లక్ష్మీబాయి పొదుపు సంఘం |
| శ్రీసాయి ప్రియ పొదుపు సంఘం | గాంధీజీ పొదుపు సంఘం |
| లీలమ్మ పొదుపు సంఘం | సరోజిని నాయుడు పొదుపు సంఘం |
| శాంతి స్వరూప్ పొదుపు సంఘం | ద్వారకా పొదుపు సంఘం |
| స్త్రీ శక్తి పొదుపు సంఘం | అంబేడ్కర్ పొదుపు సంఘం |
| శ్రీరామ్ పొదుపు సంఘం | సూర్యావతి పొదుపు సంఘం |
| సంజీవ పొదుపు సంఘం | రమ రామక్రిష్ణ శ్రేయోభిలాషి |

**ప్రగతినగర్ ఐద్వా కమిటి మరియు స్వయం సహాయక సంఘాలు**

కుత్బుల్లాపూర్ మండలం, రంగారెడ్డి జిల్లా

# నగదు బదిలీ వద్దు - సరుకులు కావాలి

నేడు దేశం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యల్లో ఆహార భద్రత ఒకటి. ప్రపంచ ఆకలి సూచి లెక్కింపులో 88 వర్ధమాన దేశాల్లో భారత్ 66వ స్థానంలో ఉంది. దేశ జనాభాలో 76 శాతం మంది

**దేశ జనాభాలో 76 శాతం మంది సరిపడా కాలరీలు, ఆహార వినియోగం లేక బాధపడుతున్నారు. దాదాపు సగం మందికి పైగా భారతీయ మహిళలు రక్తహీనతతో ఉన్నట్లు జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే 3 సూచించింది.**

సరిపడా కాలరీలు, ఆహార వినియోగం లేక బాధపడుతున్నారు. దాదాపు సగం మందికి పైగా భారతీయ మహిళలు రక్తహీనతతో ఉన్నట్లు జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే 3 సూచించింది. పెరుగుతున్న ధరలను నియంత్రించి ప్రజలందరికీ ఆహార భద్రతను పటిష్ట పరచాల్సిన ప్రభుత్వాలు ఆహార వస్తువులపై యిచ్చే సబ్సిడీలను మరింత తగ్గించే ప్రయత్నాలు చేస్తున్నారు.

2011 జాతీయ ఆహార భద్రత బిల్లు ప్రస్తుతమున్న హక్కులను హరించే ప్రతిపాదనలు తీసుకువచ్చింది. ప్రపంచ బ్యాంకు ఆదేశిత విధానాలకు అనుగుణంగా ఆహార పదార్థాలకు బదులు నగదు బదిలీని చేపట్టాలని ఈ బిల్లు ప్రతిపాదిస్తోంది. దేని కోసమైతే డబ్బు చెల్లిస్తారో అదే వస్తువు కొనుగోలుకు ఉపయోగిస్తారనే గ్యారంటీ లేదు. ప్రస్తుత పురుషాధిక్య సమాజంలో నగదు బదిలీ ద్వారావచ్చే డబ్బును ఇతర అవసరాలకు ఉపయోగించే అవకాశం ఉంది. మన దేశంలో శ్రామిక మహిళల్లో తమ ఆదాయాన్ని తమ ఇష్టానుసారంగా ఖర్చుపెట్టుకునే పరిస్థితి లేదు. భర్త వ్యసన పరుడైతే ఆ డబ్బు మద్యం దుకాణానికి వెళుతుంది. నగదు బదిలీ వలన మహిళల, పిల్లల ఆహార లభ్యత మరింత ప్రమాదంలో పడుతుందని, దీనిని వెనక్కి తీసుకోవాలని ఐద్వా కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.



మొట్టమొదటగా కేంద్ర ప్రభుత్వం కిరోసిన్‌కు బదులుగా నగదు ఇవ్వాలని నిర్ణయించింది. మన రాష్ట్రంలో ఈ పథకాన్ని అమలు చేసేందుకు తూర్పుగోదావరి, చిత్తూరు, అనంతపురం, హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాలలను పైలట్ ప్రోగ్రాంగా ఎంపిక చేసి మహిళల పేరుతో బ్యాంక్ అకౌంట్ తెరవమని చెబుతుంది. ప్రభుత్వం కిరోసిన్‌కిచ్చే సబ్సిడీ మొత్తాన్ని లబ్ధిదారుల అకౌంట్‌లకు నేరుగా జమ చేస్తారు. బహిరంగ మార్కెట్‌లో ధరల పెరుగుదలకు అనుగుణంగా ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీ పెరగదు. రేషన్ సరుకులపై ఆధారపడిన పేదలను బహిరంగ మార్కెట్‌కు అనుసంధానం చేసే కుట్రలో భాగంగానే ప్రభుత్వం నగదు బదిలీ ముసుగులో పేదల పొట్టకొట్టే చర్యలకు పాల్పడుతున్నది. మొదట కిరోసిన్‌తో ప్రారంభించి బియ్యం, గోధుమలు, పంచదార, పప్పులు, వంటగ్యాస్‌లతోపాటు రైతులకు ఇచ్చే ఎరువులు, ఇంధనం వంటి వాటిపై నగదు బదిలీ వర్తింప చేస్తారు.

నగదు బదిలీ అమలైతే రేషన్ షాపుల నిర్వహణలో ఉపాధి పొందుతున్న వేలాది మంది డీలర్లు ఉపాధి కోల్పోతారు. మరోవైపు రైతుల వద్ద కొనుగోలు చేసే లెవీ ధాన్యం కొనుగోలు చేయదు. ఎఫ్.సి.ఐ. గోడౌన్లు ఇప్పటికే ప్రైవేట్ వ్యాపారుల హస్తగతమవుతున్నాయి. రైతాంగానికి గిట్టుబాటు ధర లభించదు. ఇప్పటికే రైతులకు పంటల గిట్టుబాటు లేక ఖర్చులు పెరిగి అప్పులతో రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

ప్రణాళికాసంఘం పట్టణాలలో 32రూ॥లు, గ్రామాల్లో 26 రూ॥లు ఆదాయం దాటిన వారు దారిద్ర్య రేఖకు ఎగువన ఉన్న వారిగా లెక్కలు గట్టి వీరందరికీ ప్రభుత్వం సబ్సిడీలు మినహాయించే ప్రయత్నాలు చేస్తోంది. బోగస్ కార్డుల ఏరివేతతో అనేక మంది అర్హులు కూడా రేషన్ కార్డులు కోల్పోయారు. ప్రస్తుతం అవినీతి పేరుతో రేషన్ దుకాణాలను రద్దు చేసి నగదు బదిలీకి పూనుకొంటున్నారు. ప్రజలందరికీ ఆహార భద్రతను కల్పించాల్సిన ప్రభుత్వం తన బాధ్యత నుండి తప్పుకునేందుకు జిమ్మిక్కులు చేస్తుంది. పేద వర్గాల మహిళలకు, పిల్లలకు మరింతగా నష్టం కలిగించే నగదు బదిలీ పేరుతో ప్రజాపంపిణీని నాశనం చేసే ప్రభుత్వ చర్యలను ఐద్వా తీవ్రంగా వ్యతిరేకిస్తుంది. ప్రజాపంపిణీని సార్వజనీనం చేసి 14 రకాల నిత్యావసర సరుకులను రేషన్ షాపుల ద్వారా ప్రజలకు అందించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నాం.

- ఐద్వా రాష్ట్ర కమిటీ ★

# హింసకు మూలమవుతున్న మద్యం

మల్లు స్వరాజ్యం

దేశంలో రాష్ట్రంలో స్త్రీలపై హింస రోజు రోజుకూ పెచ్చరిల్లుచున్నది. ప్రతిరోజు పేపర్లలో సభ్య సమాజం తలవంచుకునే విధంగా ఘోరమైన సంఘటనలు చూస్తున్నాం, వీటిపై మహిళా సంఘాలు, ప్రజలు ఖండిస్తూ ఆందోళనలు చేస్తున్నారు. ఐద్వాతో పాటు మహిళా సంఘాలు ప్రభుత్వం దృష్టికి తీసుకురావడానికి, మెమోరాండాలు ఇస్తున్నారు. మహిళలు ఇంటా బయటా ప్రతిఘటించే ప్రయత్నాలు చేస్తున్నారు. కొన్నిచోట్ల మహిళలపై కేసులు పెడుతున్నారు. అయినా ప్రభుత్వం, స్పందించి తగిన చర్యలు తీసుకుంటున్న దాఖలాలుగాని ప్రభుత్వ వద్దతుగాని కనిపించటంలేదు. పైగా ప్రభుత్వ విధానాలే ఇందుకు కారణం అన్నట్లు మద్యం పాలసీలు, పబ్‌లు, క్లబ్బులు యధారాజ తధా సమాజంలా తయారై సమాజం కుళ్ళిపోతున్నది. మాఫియాలు, రౌడీలు, వీటితో ప్రభుత్వ రాజకీయ నాయకులకు సంబంధాలు, అవినీతి దాఖలాలుగా నిలిచినవి. ఇందువల్ల పాలకుల బాధ్యతారహిత వైఖరి వల్ల స్త్రీలు, ప్రజలు ప్రభుత్వంపై నమ్మకంపోయి దిక్కుతోచని స్థితిలో రక్షణ కరువైంది. స్త్రీలకు ఎదురౌస్తున్న అనేక సమస్యలకు పరిష్కారం దొరకటం లేదు. స్త్రీలు అదనపు హింసకు గురై మానసిక వేదనకు గురై అనారోగ్యం పాలై ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. దేవుని గుళ్ళు, పూజలు, జ్యోతిష్యాలు మొదలగు మూఢ విశ్వాసాలకు లోనవుతున్నారు.

నాటి భూస్వామ్య సమాజంలో ఉన్న స్త్రీలకు కనీస రక్షణ ఉంది. పరాయి ఆడదానిపై కన్నేస్తే శిక్షలున్నవి. సమాజం తప్పుపట్టింది. సామాజిక రక్షణ ఉంది. నేటి ప్రభుత్వాలు, చూసి చూడనట్లు వదిలేస్తున్నారు. ఐద్వా మొదలుకొని అనేక మహిళా సంఘాలు, వ్యయప్రయాసలకోర్చి ప్రజల మద్దతుతో పోరాడి సాధించుకున్న హక్కులూ ఇచ్చిన మోమోరాండాలను, సూచనలను, చట్టాలను బుట్టదాఖలు చేసి ఏ ఒక చట్టాన్ని అమలు చెయ్యకుండా మహిళల ఎడలనేకాదు, మానవ సమాజం ఎడల నేరస్తులుగా మిగిలిపోతున్నారు. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్, మద్యనిషేధ ఉద్యమమే సాక్ష్యంగా ఉంది. రెండు సంవత్సరాలుపాటు మద్యనిషేదం అమలయినప్పుడు స్త్రీలపై హింస తగ్గింది. పల్లెలు పట్టణాలు ప్రశాంతంగా ఉన్నవి. హత్యలు తగ్గినవి. కుటుంబాలు ప్రశాంతంగా ఉన్నవి. దీనికి పోలీసు శాఖ రిపోర్టు సాక్ష్యం. నేటి ప్రభుత్వం మద్యం అమ్ముకుని ప్రజలచే తాగించి ఖజానాను నింపుకునే పనిలో ఉంది. కుటుంబాలను ఆర్థికంగా కుంగదీసి, మహిళలపై హింస పెరిగి తద్వారా సమాజంలో హింస పెరగడానికి దోహదం చేయడం నేరం కాదా?

ఐద్వా కార్యక్రమంలో భాగంగా మోటూరు ఉదయం ట్రస్టు కుటుంబ న్యాయ సలహా కేంద్రాలను నిర్వహిస్తోంది. జిల్లాల్లో వందల వేల కేసులు పరిష్కారమై కుటుంబాలు కుదుటపడుతున్నవి. మోటూరు ఉదయం ట్రస్టు కరాటే, (ఆత్మరక్షణా శిక్షణా కేంద్రాలు) శిక్షణా కేంద్రాల్లో యువతుల్లో ఆత్మవిశ్వాసం కలిగిస్తుంది. మంచి స్పందన వస్తున్నది. ఇంకా కొన్ని మహిళా సంఘాలు కూడా ఇలాంటి కార్యక్రమాలు చేస్తున్నవి. ఏమాత్రం చిత్తశుద్ధి ఉంటే ప్రభుత్వం ఈమాత్రం చెయ్యలేదా? చెయ్యలేని ప్రభుత్వాన్ని ఏమనాలో, ప్రజలు వివిధ భావాలుగల పెద్దలు చెప్పాలి. ఇప్పటికైనా ప్రభుత్వ చిత్తశుద్ధితో ఈ సమాజానికి బాధ్యత వహించి, మహిళలకు రక్షణ కల్పించడానికి తగిన చర్యలు చేపట్టాలి. ఇది ఇస్తాం అది ఇస్తాం అంటూ మహిళలను మభ్యపెట్టడం మాని ఉన్న చట్టాలను అమలుకు పూనుకుని, అవసరమైన తక్షణ చర్యలు తీసుకోవాలి. స్త్రీలపై జరిగే హింస రూపంలో ప్రతి సంఘటనల్లో దోషులపై కఠిన చర్యలు తీసుకోవాలి. మహిళా ఉద్యమాలు నడుపుతున్న సంఘాలను గుర్తింపులోకి తీసుకుని చట్టాల అమలులో పాత్రను ఉపయోగించుకోవాలి.

**తక్షణం ఈ క్రింద చర్యలు చేపట్టాలి:**

- ★ మద్యం అమ్మకాలను నియంత్రించాలి. క్రమంగా మద్యనిషేధం అమలుకు ప్రయత్నించాలి. మద్యాన్ని నియంత్రించాలంటే ప్రభుత్వ యంత్రాంగాన్ని తాగుడు అలవాట్లు మాన్పించాలి. ఉద్యోగాల్లోనే తాగకూడదని నియమం ఉండాలి.
- ★ తాగుడు మానలేని వారిని డీ ఎడిక్షన్ క్యాంపుల్లో పెట్టాలి.
- ★ ప్రాథమిక హాస్పిటల్లో డి ఎడిక్షన్ క్యాంపులు ఏర్పాటు చేయాలి.
- ★ సిటీల్లోను, నగరాల్లోను క్లబ్బులు, పబ్‌లను పరిమితం చేయాలి. మద్యం మానండి అని ప్రజల్లో ప్రచారం చేయాలి.
- ★ శ్రీయుత ముఖ్యమంత్రితో సహా మంత్రులందరూ, ప్రజల వద్దకు వెళ్ళినప్పుడు మద్యం మానండి అని ప్రజలకు బహిరంగంగా ప్రకటించాలి.
- ★ కుటుంబ హింసను అరికట్టాలి అంటే కుటుంబ న్యాయసలహా కేంద్రాలను ప్రభుత్వమే విరివిగా నిర్వహించాలి. ఇందులో మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థల సహాయం తీసుకోవాలి.
- ★ గుడులు, బడులు, జనసమూహం ఉన్న ప్రదేశాలలో పోలీసు రక్షణ కల్పించాలి. 7వ తరగతి నుండి ఆడపిల్లలకు ప్రభుత్వ, ప్రైవేటు స్కూళ్ళలో కాలేజీలలో ఆత్మరక్షణా శిక్షణ (కరాటే) నేర్పించాలనే నియమాన్ని పెట్టాలి,అమలు చేయాలి.
- ★ శిశు సంక్షేమ శాఖ, మరియు జిల్లా మహిళా ప్రాంగణాలను మెరుగుపరచాలి. వీటిలోని ఉద్యోగ ఖాళీలన్నీ భర్తీ చేయాలి. ఈ సంస్థలకు నిధులిచ్చి అందులో యువతులకు ఉపాధి శిక్షణ మరియు ఆత్మరక్షణ శిక్షణ జరపాలి.
- ★ ప్రభుత్వం, ప్రజలు కలిసి ప్రస్తుత భయంకర పరిస్థితినుండి మహిళలకు కనీస రక్షణనైనా కల్పిస్తారని ఆశిస్తున్నా.

★

-జి. వెంకటకృష్ణ.

'ముంపు బాధితులకిచ్చిన హామీలను నెరవేర్చండి' అని రాసున్న ప్లకార్డు పట్టుకొని, ఆమె హఠాత్తుగా కనిపించింది.

కలెక్టరేట్‌లోకి వెళ్తుంటే గేటుముందు ధర్నా చేస్తున్న ఆడవాళ్ళల్లో నిలబడి ఆమె అరుస్తున్నది.

ఆమెను చూస్తూ ధర్నాలూ, నిరసనలూ లేని దినముంటుందా ఈ గేటు ముందు, అని ఆలోచినస్తూ, సమాచార్ భవన్‌లోకి వెళ్ళి బైక్‌స్టాండ్ వేసి, తిరిగొచ్చి ధర్నా ముందు నిలబడ్డాను.

కలెక్టరేట్‌లోని ఆఫీసుల సిబ్బంది ఒక్కొక్కరూ ధర్నాను నిరాసక్తంగా చూస్తూ దాటిపోతున్నారు. వీళ్ళంతా తమ సీట్లకింద, టేబుల్ మీద వేసుకున్న వేలాది ఫైళ్ళలోని అభ్యర్థనలే- గేటుముందు ఆర్తనాదాలై, నిరసనలై, ధర్నాలై, ఆత్మహత్యాయత్నాలై, పోలీసు లాఠీ చార్జీలై వర్తమాన చరిత్ర దృశ్యాలు అవుతున్నాయని వీళ్ళకు తెలుసా?

అంతలో దూరంగా పోలీసులు ధర్నావైపు వస్తూ కన్పించారు.

నిన్న సరిగ్గా ఈ సమయానికి, చాలామంది యువకులు, ముంపు గ్రామాల్లో భూమి కోల్పోయిన కుటుంబాల నుండి ఉద్యోగాన్ని హామీగా పొందినవాళ్ళు, యేళ్ళ తరబడి హామీ నెరవేరక, నిరసనలూ, ధర్నాలూ చేస్తున్నవాళ్ళు, అర్థనగ్నంగా ఊరేగింపు జరిపి, కలెక్టరేట్ ముందు ధర్నా చేస్తూ, కలెక్టర్ కారు అడ్డుకున్నందుకు అరెస్టయ్యారు. ఇప్పుడు ఈ కొడుకుల కోసం, తల్లులు రంగంలోకి దిగినట్టున్నారు.



# మూడు దృశ్యాలు

ఆ తల్లిని ఇంతకు మునుపు రెండు సందర్భాల్లో చూసిన గుర్తు. శ్రీశైలం ప్రాజెక్టు ముంపు గ్రామాలను చూడాలని వెళ్ళినప్పటి జ్ఞాపకాలలో ఆ తల్లి నన్నెడూ వెంటాడుతూనే ఉంటుంది.

మొదటిసారి ఆమె కన్పించిన సన్నివేశం గుర్తు చేసుకుంటే నా ఒళ్ళు జలదరిస్తుంది. అవి జులై నెల ఆఖరి దినాలు. వరుసగా వర్షాలు కురవని మూడో సీజన్. జులై

చాలామంది యువకులు, ముంపు గ్రామాల్లో భూమి కోల్పోయిన కుటుంబాల నుండి ఉద్యోగాన్ని హామీగా పొందినవాళ్ళు, యేళ్ళ తరబడి హామీ నెరవేరక, నిరసనలూ, ధర్నాలూ చేస్తున్నవాళ్ళు, అర్థనగ్నంగా ఊరేగింపు జరిపి, కలెక్టరేట్ ముందు ధర్నా చేస్తూ, కలెక్టర్ కారు అడ్డుకున్నందుకు అరెస్టయ్యారు. ఇప్పుడు ఈ కొడుకుల కోసం, తల్లులు రంగంలోకి దిగినట్టున్నారు.

చేస్తున్న జుడాస్ ద్రోహంతో, క్రీస్తు ఆచూకీ దొరికినట్టు శ్రీశైలం ప్రాజెక్టు నీళ్ళమట్టం తగ్గీ, తగ్గీ ముంపు భూములు ఒక్కొక్కటీ బయల్పడుతూంటే అలా బయటపడ్డ ఒక పెద్ద గుడిని చూద్దామని ఒక మిత్రుడితోపాటు ఆ బుగుజు నేలల్లోకి నడిచి వెళ్ళాను.

నీటి మునిగిన నేల తేలీ, ఎండీ, మానవ పాదాలనూ, వాళ్ళ శ్వాసలనూ స్వప్నిస్తోంది. ఈ స్వప్నాలను సాకారం చేయడానికన్నట్లు మా నడక. ఆ బుగుజులో, ఆ పూడికలో కాలుపెడితే పాదాలు కూరుకుపోతున్న వదులు మట్టిలో, అట్లాంటి నిర్జన ప్రదేశంలో కొన్ని శిథిలాల మధ్య ఆమె కన్పించింది. ఏదో శిల్పమైపోయిన, మట్టి పేరుకుపోయిన దిబ్బను తడుముతూ ఏడుస్తూ ఉంది. ఒక్కక్షణం స్థాణువునై, భయంతో ఒక్కడుగు వెనక్కువేసీ, ఆ ఏడ్పు మనిషిదేనని నా మితుడు నిర్ధారణ చూపాకా.

'ఎందుకమ్మా ఇక్కడున్నావని' అడిగితే,

'కాస్త దూరంగా కన్పిస్తున్న శిథిలాలు తమ ఊరివనీ, ఆమె నిల్చున్న ప్రదేశంలో తన భర్త సమాధి ఉండాలనీ ' చెప్పింది.

దూరంగా కన్పిస్తున్న బయల్పడిన నల్లని గుడీ, ఎన్నో యేళ్ళు నీళ్ళలో నానీ, నానీ కూడా చెక్కు చెదరని దాని శిఖరంలా, నల్లని ఈ ఆడమనిషిలో భర్త మరణం పట్ల చెక్కు చెదరని దుఃఖం, నేలతల్లి కన్నీళ్ళతో మునిగిపోయే ఆమె నిల్చున్న నేలలా ఎంత పురాతనమైందో అర్థమైంది. మునిగిన ఊర్లు, మునిగిన పొలాలూ, మునిగిన మనుషులూ, మునిగిన గుడీ, సమాధులూ అన్నీ తేలీ, ఎండా వానలతో స్వగతంలో మాట్లాడుతున్న సవ్వడి, ఆమె ఏడ్పులో వినిపించి, అంత దుఃఖాన్ని మోస్తున్న ఆమె దైన్యపు చిత్రం ఇప్పటికీ అలానే నా మనసులో నిలబడిపోయింది.

ధర్నా ముందు పోగుబడుతున్న గుంపును చెదరగొట్టడానికి, పోలీసులు ఆ ప్రాంగణంలో చొరబడ్డారు. చూస్తుండగానే ధర్నా చుట్టూ పోలీసులు ధర్నా చేస్తున్న స్త్రీలను ఒకవైపు తోసేన్తూ. ఆ తోపులాటతో, ఆ స్త్రీలు ఇస్తున్న నినాదాలతో, అరుపులతో ఆ ప్రాంతమంతా అలజడిగా మారుతోంది. అంతే అలజడిని ఆమె ముఖంలో, ఆమెను రెండోసారి వాళ్ళూరిలో చూసినప్పుడే గమనించాను. మా డెస్కుకు కొత్తగా వచ్చిన బాస్‌తోపాటు, ఒకరోజు వరల్డు బ్యాంకు నిధులతో జరుగుతున్న పునరావాస కార్యక్రమాల గురించి, రిపోర్టింగ్ చేద్దామని ఆ ఊరెళ్ళాను.

ముంపులో మునిగిపోయిన ఊరును, అదే పేరుతో కొత్తగా నిర్మించుకున్నారు. ఊర్లోకి అడుగు పెట్టినప్పటి నుండీ ఏదో తెలియని కృత్రిమత్వం ఆ పరిసరాల్లో కన్పిస్తోంది. వీధులన్నీ నల్లమట్టితో, బురదతో, చేలల్లో తిరిగినట్టుంది. ఒక వీధి మలుపులో ఒక చిన్న మిద్దె. బయటి గోడలమీద చుట్టూ ఎర్రమట్టి పట్టీలు పూశారు. తీరా చూస్తే అది గుడి! మేం తిరుగుతూంటే ఆడా, మగా నిరాసక్తంగా మావైపు చూస్తున్నారు. పిల్లలూ, అక్కడక్కడా ముసలివాళ్ళు మా గురించి అడుగుతున్నారు. ఊరంతా ఒకసారి కలియతిరిగి ఒక చెట్టుకింద అరుగుమీద కూర్చున్నాము. మా చుట్టూ చేరుతున్న వాళ్ళను, ఆ ఊరివాళ్ళు ఏఏ స్కీముల కింద లబ్ధిదారులయ్యారో అడుగుతుంటే ఒకామె,

'యా స్కీములో యామిచ్చినా కమీషన్లు తీసుకోకుండా యేమన్నా ఇస్తిరా నాయనా, యా దానికీ లంచాలే, ఆఫీసర్లకీ మధ్యన పైపైన తిరిగే మధ్య మనుషులకీ మాకొచ్చిందాంట్లో సగం కరిగిపాయనె".

''వీళ్ళా, వాళ్ళు కాదంటలే, పేపరోల్లంటలే జేజీ" ఒకమ్మాయి సర్ది చెప్తుంటే.

"యెవురైనా వొగటేలే, యియన్నీ యినిపోయి, వాళ్ళను బెదిరిచ్చుకోని దుడ్లు గుంజనీ వీళ్ళొచ్చిండేది" అంది.

దానికి స్పందిస్తూ మా బాస్,

"అది కాదవ్వా, ఆ ప్రాజెక్టు వచ్చినాక, మీకేమన్నా మేలు జరిగిందా, పాత ఊరు మునిగింది కదా. కొత్త ఊర్లో యేమనిపిస్తోంది. ఇట్లాంటివి తెలుసుకుందామని వేమొచ్చింది'' అన్నాడు.

"ఈ ప్రాజెక్టు వచ్చి మాకు మేలు జరిగిందంటావా, ఆ మాటనేకి నీకు నోరెట్లా వచ్చింది సారూ, మమ్మల్ని చూసే పచ్చగా బతుకుతాన్నెట్లు ఆగుపిస్తాందా, పచ్చని చెట్టును వేర్లతోపాటు గుంజుకొచ్చి పాతితే దానికి ఎంతవమాత్రం పాణముంటుందో, అంతమాత్రవే పాణంతో ఉండామయ్యా ఈ కొత్తూర్లో, ఈ ప్రాజెక్టు వచ్చి మా భూముల్ని ముంచింది. ఊరినీ ముంచింది. మమ్మల్నే ముంచింది సారూ.....'

ఎంతో ఆవేశంతో ఒక ఆడగొంతు మమ్మల్ని నిలదీస్తుంటే అటువైపు చూశాము. నన్ను ఆశ్చర్యపరుస్తూ ఆమె! ఆరోజు శిథిలాల మధ్యన కన్పించిన ఆడమనిషి!

అంతలో ఇంకో ఆయన. కాస్త చదువుకున్నవాడిలా కన్పిస్తున్నవాడు అంటున్నాడూ,

"అది గూడా కాద్సార్. భూములు పోయినవాళ్ళకీ, ఇండ్లు పోయిన వాళ్ళకీ అంతో ఇంతో కాంపన్సేషన్ ఇచ్చినారు. ఇయితే యేమీ లేనివాళ్ళకు ఏమిచ్చినారు. పాత ఊర్లో బతకడానికుండే వెసులుబాటు కొత్తూర్లో దొరక్క ఎంతోమంది చెల్లాచెదురైనారు".

ఆయన మాటల్లో ఎంతో వాస్తవముంది. ఇంతలో ఇంకో ముసలామె.

"కాదు నాయనా మా ఆయన ఇంటి ముందట అరుగుమీదనే కూర్చుంటుండా, ఆడ్నే ప్రాణమిడిసిండా. ఆ బండ దగ్గర కూర్చుంటే మా ఆయన్తో మాట్లాడినట్లే అనిపిస్తాండా, ఆ బండ ఈ కొత్తూర్లో ఉందా, అది కావల్ల మల్లా, దాన్నిస్తుందా మీ గోర్నమెంటు".

**"ఈ ప్రాజెక్టు వచ్చి మాకు మేలు జరిగిందంటావా, ఆ మాటనేకి నీకు నోరెట్లా వచ్చింది సారూ, మమ్మల్ని చూసే పచ్చగా బతుకుతాన్నెట్లు ఆగుపిస్తాందా, పచ్చని చెట్టును వేర్లతోపాటు గుంజుకొచ్చి పాతితే దానికి ఎంతవమాత్రం పాణముంటుందో, అంతమాత్రవే పాణంతో ఉండామయ్యా ఈ కొత్తూర్లో, ఈ ప్రాజెక్టు వచ్చి మా భూముల్ని ముంచింది. ఊరినీ ముంచింది. మమ్మల్నే ముంచింది సారూ.....'**

"సార్, మా పాతూర్లో ఎంత మంచి గుడి ఉండా, పాతకాలం గుడి దాంట్ల కూచ్చుంటే సల్లగా ఉంటుందా, ఎప్పుడో మా తాతల కాలంలో కట్టింద్రంటా దాన్ని. వాళ్ళ చేతుల కష్టం నీళ్ళపాలాయా" అని ఒక మధ్య వయస్కుడు అంటున్నాడు.

"సార్ నాకు నా మొగుడి సమాధి కావల్ల సార్, నాకే కాద్సార్, మా వూర్లో వాళ్ళందరికీ వాళ్ళ పెద్దల సమాధులు కన్పించొద్దా సార్, ఆ బండ్లను చూస్తా వాళ్ళను తలుచుకుంటా వేము బతుకుతుంటిమి గదా, అవి లేకుండా జేస్తిరి గదా సార్, మాకు మా సమాధుల్ని ఇప్పీమని, గోర్నమెంటుకు చెప్పండి సార్..." అలా అడుగుతుంటే నేను ఉక్కిరి బిక్కిరి అయిపోయాను. ఎన్నో ప్రశ్నలతో ఊరిపేరు అదే అయినా, పాత ఊరి జ్ఞాపకాలు అవిచ్చే అనుభూతులూ కొత్తగా వెలిసిన ఊర్లో దొరుకుతాయా? భౌతికంగా ఊరు వెలిసినా ఆత్మ ఆవిష్కరింపబడిందా? మనుషుల ఆత్మీయ అనుభూతులు వాటి గుర్తులూ, వాళ్ళ మనస్సుల్లో కొన్ని స్థలాల్లో వాళ్లు ముద్రించుకున్న చిత్రాలూ యధాతథంగా కొత్తవూర్లో దొరుకుతాయా? ఇట్లాంటి ప్రశ్నలకు సమాధానం చెప్పలేని పునరావాస కార్యక్రమాలు ఎంత భౌతికమైనవో, యెంత శుష్కమైనవో కదా! అనిపించింది.

" ఇంతకీ నీ మొగుడెవరమ్మా....' ఆయనంత గొప్పవాడా అన్న ధ్వనితో అడిగాడు మా బాస్.

ఆమాటకు ఒకాయన అందుకొని, "వాడాల వెంకట్రాముడు సార్"అన్నాడు. 'కలెక్టరాఫీసు ముందు ధర్నా చేస్తుంటే పోలీసాయన విసిరిన లాఠీ దెబ్బకు గాయపడి మరణించిన వెంకట్రాముడా" ఆశ్చర్యంగా అడిగాను.

"అవుసార్ వాడే ఆయమ్మ మొగుడు, వాడు పోయినప్పట్నుంచీ ఈమె పరిస్థితి బాగోలేదు".

''ఇంతకీ ఈమె కొడుక్కి ఉద్యోగమివ్వలేదా...'' అప్పట్లో గవర్నమెంటు హామీ ఇచ్చింది గుర్తొచ్చి అడిగాను.

"యాదీ ఈలాసార్, ఈయమ్మ కొడుకు ఒక్కనికే కాదు, ఈ చుట్టుపక్కల ముంపులో భూములు పోయిన ప్రతి ఇంటికీ ఒక ఉద్యోగమిస్తామని చెప్పిరి, అన్నీ ఉత్తమాటలే"

"పేదోళ్ళ కడుపు కొడితే కొట్టినోళ్ళు నాశనమైపోతారు, మన భూముల్ని ముంచినోళ్ళ కొంపలు పాములూ, తేళ్ళపాలవుతాయి..."

నెర్రులు చీలిన రేగడి నేలలాంటి ముఖంలో అలజడితో పెదవులు అదురుతుండగా ఆ తల్లి గట్టిగా వదరడం ప్రారంభించింది. నేనూ, మా బాసూ బిత్తరపోతుండగా, గట్టిగా ఏడుస్తూ వొదురుతూ చరచరా వెళ్ళిపోతోంది.

"ఈమె మొగుడు చిన్నప్పట్నుంచీ ఇంతేసా. అప్పుడప్పుడూ ఇట్లా మెంటల్దాని మాదిరిగా వొదురుతుంటుంది.
ఎక్కడెక్కడో
తిరుగులాడుతుంటుంది.....'ఒకతనంటున్నాడు.

మళ్ళీ వర్తమానంలోకొస్తే....

" మీ ఊర్లు పాడుబడా, మీ కొంపలు మునగా, మీ యిండ్ల పాములూ, తేళ్ళూ తిరగా...."

అంతే అలజడితో వేసవికాలంలో పగుళ్ళుబారే రేగడినేలలాంటి ముఖంతో ఆ తల్లి అరుస్తోంది....

తన భర్తను బలితీసుకున్న పోలీసుల్నీ, తన కొడుక్కు ఉద్యోగమివ్వని ప్రభుత్వాన్నీ శపిస్తూ తనను నియంత్రించాలని చూస్తున్న పోలీసు చేతుల్ని విసిరిసిరి కొడుతోంది. అంతశక్తీ, అంత తెగింపూ ఆమెకెక్కడిదో! వున్న వూరిని ముంచేసీ గట్టువీద ఇంకో వూరిని కట్టుకోమంటే, ఉన్న కాసింత భూమినీ మింగేసి పరిహారంగా నాలుగు రూకల్నే నాలుగుసార్లు భిక్షంగా వడేస్తే, పునరావాసపు ధర్నాలో పాల్గొన్నందుకు పోలీసు లాఠీ సంసారానికి దిక్కైన మొగుణ్ణి బలి తీసుకుంటే, పరిహారంగా కొడుక్కు ఉద్యోగమిస్తామని పెట్టిన ఆశ యేళ్ళ తరబడి శుష్కంగా మిగిలిపోతే సర్వం కోల్పోయినా ఆమెకూ, ఆమెలాంటి వాళ్ళకూ అంత తెగింపు ఎక్కడ్నుంచీ వస్తుందో?!

**"...ఏమడుగుతున్నామని మమ్మల్నిట్లా సంపుతున్నారయ్యా...ఇంటి కొగ ఉద్యోగమిస్తామంట్రి, భూములు పోయినోళ్ళకు భూములూ, ఇండ్లు పోయినోళ్ళకు ఇండ్లూ, వోయబ్బా ఒకటిగాదు, ఊర్లు ఖాళీ చేసేవరకూ ఎంటబడి అరచేతిలో సొర్గం చూపితిరి, ఊర్లు మునిగిన తర్వాతా మీ చుట్టూతా మేము తిరుగుతున్నాం. ఆఫీసర్లు ఒగరిమిందొగరు చెప్పుకుంటూ తిప్పుతుంట్రి. ఆ దుద్దన్నా అన్నీ ఒగసారిస్తిరా, కంతులు కంతులు, కోర్టుల చుట్టూ తిప్పుకొని, యిప్పటికీ పూర్తిఈలా. మమ్మల్ని బజార్లపాలుజేస్తిరి.**

**ఆమె నుదుటినుంచీ బొట బొటా కారుతున్న రక్త స్పర్శతో ఆమె వొరిగిన రేగడినేల, ఆమె చుట్టూ నిలబడ్డ తల్లుల మనసులాగే కుతకుతమని ఉడుకుతోంది. ఇరవై యేళ్ళకుపైగా ముంపులో బతుకులు మునిగి నేలకూ, నీళ్ళకూ మధ్యా పడుబాట్లు పడుతున్న జనం ప్రశ్నలకు జవాబుల్లేక అందరి మనసుల్లాగే (చూస్తున్నవాళ్ళ) గాలీ బరువెక్కింది.**

ఇద్దరు పోలీసుల్నే తోసేస్తూ నోటికొచ్చినట్లు అరుస్తున్న ఆమెను చూసి పిచ్చి కోపం తెచ్చుకున్న ఎస్సై ఆమె జుట్టుపట్టి ఈడ్చి డొక్కలో తన్నాడు. విసురుగా పడ్డ ఆమెమీద లాఠీ ఝుళిపించాడు.

ఆ దెబ్బలకు ఆమె మరింత గట్టిగా అడుగుతోంది.

"...ఏమడుగుతున్నామని మమ్మల్నిట్లా సంపుతున్నారయ్యా... ఇంటికొగ ఉద్యోగమిస్తామంట్రి, భూములు పోయినోళ్ళకు భూములూ, ఇండ్లు పోయినోళ్ళకు ఇండ్లూ, వోయబ్బా ఒకటిగాదు, ఊర్లు ఖాళీ చేసేవరకూ ఎంటబడి అరచేతిలో సొర్గం చూపితిరి, ఊర్లు మునిగిన తర్వాతా మీ చుట్టూతా మేము తిరుగుతున్నాం. ఆఫీసర్లు ఒగరిమిందొగరు చెప్పుకుంటూ తిప్పుతుంట్రి. ఆ దుడ్లన్నా అన్నీ ఒగసారిస్తిరా, కంతులు కంతులు, కోర్టుల చుట్టూ తిప్పుకొని, యిప్పటికీ పూర్తిఈలా. మమ్మల్ని బజార్లపాలుజేస్తిరి. మీ ఊర్లు ముంపులో మునిగితే తెలుస్తుందయ్యా, మీ పొలాలు పోతే తెలుస్తుందయ్యా. ముంపు పక్కన ఊర్లు ఎత్తి కట్టుకుంటే మీ కొంపల్లోకి పాములూ, తేళ్లూ జొరబడితే తెలుస్తుందయ్యా. మీ బిడ్డల్నీ, మీ ముసిలోల్లనీ పాములూ, తేళ్ళూ పెరికితే తెలుస్తుందయ్యా. అయినా ఇప్పుడు ఏమడుగుతున్నామయ్యా నా మొగుణ్ణి మింగితిరి, వాయన్ని బతికియ్యమని అడగడంలా, వాయన సమాధి కావాలంటున్నా, అంతేనయ్యా అదియ్యండి నాకు...(గట్టిగా ఏడుస్తూ...)...ఏం రాజ్జమయ్యాయిది దీనికి గత్తర దగలా...." హిస్టరీక్‌గా అరుస్తూ, ఏడుస్తూ ఆమె స్పృహ తప్పి పడిపోయింది.

"మొగుడి సమాధి కావాలంట్నా...సమాధి...పిచ్చిముండకి..." ఎస్సై ఆమెను చూస్తూ వెర్రిగా నవ్వుకుంటూ వెళుతున్నాడు.

గుంపులోంచీ ఎవరో "మంచినీళ్ళు, మంచినీళ్ళు...." అంటున్నారు.

ఆమె నుదుటినుంచీ బొట బొటా కారుతున్న రక్త స్పర్శతో ఆమె వొరిగిన రేగడినేల, ఆమె చుట్టూ నిలబడ్డ తల్లుల మనసులాగే కుతకుతమని ఉడుకుతోంది. ఇరవై యేళ్ళకుపైగా ముంపులో బతుకులు మునిగి నేలకూ, నీళ్ళకూ మధ్యా పడుబాట్లు పడుతున్న జనం ప్రశ్నలకు జవాబుల్లేక అందరి మనసుల్లాగే (చూస్తున్నవాళ్ళ) గాలీ బరువెక్కింది.

పులిచింతలా, పోలవరం ఇంకా ఇట్లాంటివెన్నో జలయజ్ఞాల్లో సమిధలు కాబోతున్న ఇలాంటి ఎందరో తల్లుల్ని తలుచుకుంటూ నా గుండె అలజడితో నిండిపోయింది.



# భవిష్యద్దర్శనం

కణం...కణం...ఖండగా మారి
అఖండిత కొండగా రూపాంతరం చెందాలన్న
పరిణామక్రమంలో....
ఉసురుకెంత ఉబలాటం!
ఉనికి తెలుసుకున్న అమ్మకెంత ఆరాటం
మగాడు... మృగాడై
ముదితల తలరాతల్ని ఏమార్చి రాస్తాడన్న తలంపో
'అర్థపు'పరమార్థం
ఆమె జీవన్మార్గాన్ని నిర్దేందన్న అభద్రతా భావమో
కన్నపేగు కలలు సాకారమయ్యే దిశలో కలవరం
కన్నతండ్రి కంట్లో పురుడోసుకున్న కర్కశం
మది గదిని దాటని ముదిత మనోభావం
ఎదురు నిలబడలేక....ఎదద బాపుకోలేక
మగని ఆంక్షనే ఆకాంక్షగా మలచు కోవడమెంత పోరాటం...!
చిందులు తొక్కుతోన్న సాంకేతిక పరిజ్ఞానం
ఛిద్రమైపోతోన్న మానవతా పరిమళం
వక్రమార్గం పడుతున్న లింగనిర్ధారణం
వేలెడు ప్రాణం..... జానెడు గర్భంలో నిశ్శబ్ద ఖననం
అబల ముద్రతో అనాదిగా ఆమె హక్కుల హరణం
ఆనవాయితీగా మారుతోన్న ఆడశిశు జనన నిర్బంధనం
నిస్సిగ్గుగా చూస్తోన్న సభ్య సమాజం
నిభాయించుకోగలదా భవిష్యద్దర్శనం...!
అతివలేని అవనిలో...నరనారీ సహిత విలువల అతిక్రమణలో
అతడి బతుకెంత అనిశ్చితం..
ఆలసింపక ఆత్మపరిశీలన చేసుకోవడం ఇపుడనివార్యం.

- ఇల్ల ప్రసన్నలక్ష్మి

యదార్థ గాథ

# విలువైన జీవితం

- కె. సమత

ఒకరోజు హాస్టల్‌లో అందరం చాలా శ్రద్ధగా పరీక్షలకు ప్రిపేర్ అవుతున్నాము. ఒక్కసారిగా అరుపులు. మా వింగ్‌లోని చివరాఖరి రూమ్ నుండి మా ఫ్రెండ్ అరుస్తూ పరుగులు తీసింది. "నా రూమ్ మేట్ ఉరేసుకుంది" అని. వెంటనే వింగ్‌లో అందరం వెళ్ళి తనని క్రిందకి దించాం. కొన ఊపిరితో ఉంది. శరీరం చల్లబడిపోయింది. ఊపిరి ఇచ్చి, కాళ్ళు రుద్ది, తెలిసినంతలో అంగరం ఏదో ఒకటి చేశాం. చివరికి గుండె కొట్టుకోవడం మొదలయింది. అంబులెన్స్ వచ్చి ఆ అమ్మాయిని అందులో ఎక్కించేలోగానే ప్రాణాలు విడిచింది. కొద్ది సేపటికే పోలీసులు, మీడియా వాళ్ళు గుంపులు గూడారు. మరుసటి రోజు మాకు సెమిస్టర్ పరీక్ష ఉందన్న విషయమే మరచిపోయాం. ఆ అమ్మాయి ఎందుకు ఆత్మహత్య చేసుకుంది, బాగా చదువుతుంది, చలాకీగా ఉంటుంది, ఎందుకు ఇటువంటి నిర్ణయం తీసుకుంది? అని అనుకుంటూ ఉన్నాము మేమంతా. నాకు క్లోజ్ ఫ్రెండ్ కాకపోయినా తనతో బాగానే పరిచయం ఉంది. నవ్వుతూ పలకరించేది, చక్కగా మాట్లాడేది. అతి సున్నితమైన స్వభావం తనది. ఆ రోజు రాత్రి అయ్యే సరికి తను మాతో మాట్లాడిన మాటలు, మా అందరితో కూర్చొని తన ప్రేమ కథ చెప్పిన జ్ఞాపకాలు కళ్ళ ముందు ప్రత్యక్షమయ్యాయి.

తనని అంబులెన్స్ ఎక్కించి, పోలీసులు వచ్చే లోపు మేం తన రూమ్ మొత్తం వెతికాం ఏమైనా విషయం తెలుస్తుందేమోనని. డైరీ దొరికింది. అది చదివాక అర్థమైంది స్వాతి ఎంత పిచ్చిపని చేసిందో. స్వాతి వాళ్ళ నాన్నగారు కొద్ది సంవత్సరాల క్రితం ఆత్మహత్య చేసుకున్నారట. అప్పటి నుండి స్వాతి, వాళ్ళ అక్క, తమ్ముడు, అమ్మ అందరూ వాళ్ళ తాతయ్య దగ్గర పెరిగారు. స్వాతి 6వ తరగతి నుండి జవహర్ నవోదయ హాస్టల్లో ఉండి చదువుకుంది. తనకు స్కూల్ నుండి ఫ్రెండ్ అయిన నరేష్ అనే అబ్బాయిని ప్రేమించింది. ఇద్దరూ కలిసి హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీకి ఇంటర్ తర్వాత ఇంటిగ్రేటెడ్ కోర్సుకి వ్రాసారు. స్వాతికి

ప్రతి వ్యక్తికీ కుటుంబం చాలా ప్రధానమైనది. కుటుంబ వాతావరణం జీవితాన్ని ప్రభావితం చేస్తుంది. తన తండ్రి చావు స్వాతిని మానసికంగా కృంగిపోయేలా చేసింది. ఏ బంధుత్వంలో అయినా మనస్పర్థలు వస్తూ ఉంటాయి, ఇబ్బందులు, మోసాలు జరుగుతూ ఉంటాయి. వాటిని ధైర్యంగా ఎదుర్కోవాలి కానీ చావు దానికి పరిష్కారం కాదు.

మాత్రమే సీట్ వచ్చింది. దాంతో ఆ అబ్బాయి మళ్ళీ ఒక సంవత్సరం వృథా అయినా తనకి జూనియర్‌గా మా యూనివర్శిటీలోనే సీట్ తెచ్చుకున్నాడు. ఇద్దరూ సంతోషంగానే ఉన్నారు. ఒక సంవత్సరం తర్వాత ఇద్దరకీ మనస్పర్థలు వచ్చాయి. ఆ అబ్బాయి తన క్లాస్‌మేట్ అయిన ఇంకో అమ్మాయితో క్లోజ్‌గా తిరగడం, స్వాతిని నెమ్మదిగా దూరం ఉంచడం మొదలుపెట్టాడు. తన తండ్రి చనిపోయినప్పటి నుండి ఆ అబ్బాయి తనకు తోడుగా ఉంటాడని నమ్మింది. అమ్మ తన పనిలో తాను ఉండేది. ఇంట్లో సరైన వాతావరణం లేక, అన్నీ తానే అనుకున్న వాడు వదిలేసాడు, నాకింక ఈ లోకంలో ఎవ్వరూ లేరు నాన్నా! అంటూ డైరీలో రాసుకుంది. ఇలాంటి లోకంలో నేను ఉండలేను, నీ దగ్గరకి వచ్చేస్తున్నా అని తన డైరీ చివరి పేజీలో రాసి ఆత్మహత్యకు సిద్ధమైంది. ఆరోజు ఉదయం కూడా చాలా చలాకీగా మా ముందు తిరిగిన స్వాతి మధ్యాహ్నం 12 గంటలకు శవమై కనిపించింది. ఆ డైరీలో రాసిన విషయాలు, ఆ అమ్మాయి ఉరేసుకున్న విధానం అన్నీ గమనిస్తే తను కేవలం ఆ అబ్బాయిని బెదిరించడానికి మాత్రమే అలా ఆత్మహత్య చేసుకుందని అర్థం అయింది. సాధారణంగా ఆత్మహత్య చేసుకునే వాళ్ళు డోర్ మూసేసి గడియ పెట్టుకుని చేసుకుంటారు. కానీ తను డోర్ మూయలేదు. ఎప్పుడూ సందడిగా ఉండే ఆ వింగ్‌లో ఎవరో ఒకరు వస్తారులే, కాపాడుతారులే అనుకుంది కాబోలు. అదేంటో రోజూ అల్లరిగా అటూ, ఇటూ తిరుగుతూ ఉండే మేం కూడా ఆరోజు శ్రద్ధగా పుస్తకాలకి అతుక్కుపోయాం. ఇంకొంచెం ముందు మేం ఆ అమ్మాయిని చూసి ఉంటే కాపాడే వాళ్ళమేమో, బ్రతికి ఉండేది కదా! అని అందరికీ చాలా బాధేసింది. డైరీలో వ్రాతలు అన్నీ వాళ్ళ నాన్నతో చెబుతున్నట్లుగానే వ్రాసింది. చనిపోయిన వాళ్ళ నాన్న తన డైరీలో రాసినవన్నీ చదువుతున్నాడని ఊహా లోకంలో ఉంది. అతి సున్నితమైన మనస్తత్వం, ప్రతి విషయాన్ని పెద్దది చేసుకోవడం వల్లనే ఆ అమ్మాయి మానసిక పరిస్థితి తీవ్రంగా దెబ్బతింది.

పైకి చాలా మామూలుగా నవ్వుతూ తిరిగే స్వాతి ఇంత మానసిక ఒత్తిడికి గురవుతుందన్న విషయం తన స్నేహితులు, కుటుంబ సభ్యులు ఎవ్వరూ గమనించలేదు. స్వాతి (చనిపోయింది) ఆత్మహత్య చేసుకుంది అన్న విషయం తెలియగానే ఆ అమ్మాయి కాదేమో, తను ఎప్పుడూ అలా కనిపించదు, చాలా సంతోషంగా నవ్వుతూ ఉంటుంది కదా అనిపించింది.

ప్రతి వ్యక్తికీ కుటుంబం చాలా ప్రధానమైనది. కుటుంబ వాతావరణం జీవితాన్ని ప్రభావితం చేస్తుంది. తన తండ్రి చావు స్వాతిని మానసికంగా కృంగిపోయేలా చేసింది. ఏ బంధుత్వంలో అయినా మనస్పర్థలు వస్తూ ఉంటాయి, ఇబ్బందులు, మోసాలు జరుగుతూ ఉంటాయి. వాటిని ధైర్యంగా ఎదుర్కోవాలి కానీ చావు దానికి పరిష్కారం కాదు. మంచి తెలివితేటలు కలిగి, మెరిట్ స్టూడెంట్ అయి ఉండి, మంచి భవిష్యత్ ఉన్న స్వాతి అలా చిన్న విషయానికి జీవితాన్ని అంతం చేసుకోవడం చాలా బాధాకరమైన విషయం. ప్రేమ జీవితంలో భాగం మాత్రమే, ప్రేమే జీవితం కాదు. ఎన్నో కష్టాలకోర్చి పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రులకు మిగిల్చేది విషాదమేనా?

కష్టాలు వచ్చాయని కృంగిపోకుండా, వాటిని ఎదుర్కొంటూ ఆత్మస్థైర్యంతో ముందుకు పోవడమే యువత లక్ష్యంగా ఉండాలి. జీవితం చాలా విలువైనది. దానిని సార్థకం చేసుకోవాలి!

# అమ్మకో కానుక

(మానవి కథల పోటీలో మూడవ బహుమతి పొందిన కథ)

- పి.వి.శేషారత్నం

'డాడీ! మీరు, నేను, అమ్మా మొట్టమొదటిసారి కలుసుకున్న రోజు ఇంకా నా మదిలో పచ్చగానే ఉంది. ఆరోజున మన నగరం నడిబొడ్డున సహజీవన సంఘం వారు ఓ పచ్చని గ్రౌండ్‌లో ఏర్పాటుచేసిన సమావేశంలో....ఎందరో వయోధికులు ఒంటరితనంతో విసిగిపోయి తోడుకోసం ఆరాటపడుతూ వచ్చి తమతో సహజీవనం చేసే వ్యక్తిని అక్కడున్నవారిలో వెతుక్కుంటున్నారు.

తెల్లజుట్టు...ముక్కుమీద జారిపోయే కళ్ళజోళ్ళతో కొందరు, టక్ చేసి, షూ వేసుకుని హుందా నటిస్తూ కొందరు మగవాళ్ళ మధ్య....నగం నెరిసిన జుట్టుతో....సింపుల్‌గా, స్వచ్ఛమైన ఖద్దరు బట్టలతో హుందాగా ఉన్న మీరు నా మనసులో 'నాన్నంటే ఇలాగే ఉండాలి' అనిపిస్తూ ప్రత్యేకతను చాటుకున్నారు. అక్కడకి వచ్చిన వయస్సు మళ్ళిన స్త్రీలలో నేతచీరతో స్త్రీత్వానికి మారుపేరులో ఉన్న మా అమ్మ దగ్గరికి నడుచుకుంటూ వచ్చి 'మనం కాస్త దూరంగా అక్కడ పచ్చికలో కాసేపు కూర్చుందామా?' అనేసరికి నా బలవంతంమీద అక్కడకు వచ్చిన అమ్మ ఉలిక్కిపాటు నాకింకా గుర్తుంది. తర్వాత మీరన్న మాటలూ గుర్తున్నాయి.

" నా పేరు కోదండమూర్తి. మిలటరీలో ఉన్నప్పుడు నా హోదాను అనుభవించిన నా భార్య నేనక్కడి నుండి పదవీ విరమణ చెయ్యగానే అప్పటికే తను ఎంచుకున్న వ్యక్తితో ఓరోజు నాతో జీవితం తనకిష్టంలేదని నా ముఖంమీదే చెప్పి మరీ వెళ్ళిపోయింది. పిల్లలు కూడా లేని నేను ఇంక నా తమ్ముళ్ళే నాకు మిగిలారనుకున్నాను గాని అప్పటికే వారి వారి సంసార బాధ్యతల్లో మునిగినవాళ్ళు.....నాతో కలవలేక నన్ను ఒంటరివాడిని చేసేసరికి ఎవరికోసం జీవించాలో అర్థం కాని స్థితిలో అలమటించిపోయాను. నిన్న దినపత్రికలో ఈ సమావేశం గురించి చదవగానే ఇక్కడకు వచ్చి ముఖ్యంగా మిమ్మల్ని చూడగానే నాలో ఏదో ఆశ చిగురించింది. మీరు కళ్ళు లేనివారని కించపడాల్సిన అవసరం లేదు. మీరు నా మనసుకు తోడుంటే చాలు మీకు నేను కళ్ళయి తోడుంటాను. మీ ఆడపిల్లలకు తండ్రిగా ఉంటాను'.

అమ్మ మాటలు రాక స్థబ్దుగా ఉండిపోతే నేనే మీతో మాట్లాడాను . గుర్తింది కదూ డాడీ! నా చిన్నప్పుడే మానాన్న పోయారు. తనకి చూపున్నంత వరకూ అమ్మ వంటలు చేసి మమ్మల్ని పోషించింది. ఆదుకోవలసిన బంధువులు ఆనరా ఇవ్వకపోగా అమ్మను మాత్రం అనకూడని మాటలతో రాబందుల్లా పొడుచుకుతిన్నారు. ప్రాణాలు మామీదే పెట్టుకుని అవన్నీ భరించింది అమ్మ. రెక్కలు వచ్చిన అన్నయ్య డబ్బున్న తోడు వెతుక్కుని మా బాధ్యతల నుండి తప్పించుకోవడమే కాకుండా మా అక్కచెల్లెళ్ళిద్దరినీ ఆడవాళ్ళ హోంలోను.... మా అమ్మని వృద్ధాశ్రమంలోను పడేసి విదేశాలకు ఎగిరిపోయాడు. మూడు నెలలుగా అమ్మ ఆశ్రమంలో ఉంటూ ఏడుస్తూ అమ్మ రాసిన ఉత్తరం చదివి అక్కయ్య, నేను తట్టుకోలేకపోయామంటే నమ్ముతారు కదూ! 'అమా! చిత్రా, తారా! మీ నాన్న పోయినా ఇంతవరకూ మీ బాధ్యతల్లో మునిగిపోయిన నాకు ఒంటరితనం తెలియలేదమ్మా.....ఇప్పుడు జీవితం మలిదశలో మీ పెళ్ళిళ్ళు చేసేసి అల్లుళ్ళు, కొడుకు కోడలు మనవల మధ్య సందడిగా గడపాలనుకున్న నాకు ఈ ఆశ్రమంలో ఇంతమందున్నా ఒంటరితనం కోసేస్తోంది. రాత్రిళ్ళు ఇంకా మీమధ్యలోనే ఉన్నట్టు భ్రమలతోనే కాలం గడుపుతున్నా తెలియని బాధ...నన్ను నిలువనీయటంలేదు. ఇక్కడ ఎక్కువమంది వృద్ధులు తమకోసం ఎవరూ రారని తెలిసినా రోజంతా కిటికీ ఊచలను వదలకపోతోంటే గుండె చెరువైపోతోంది. బిడ్డల బరువు ఇన్నాళ్ళూ మోసిన అమ్మలు బిడ్డలకు ఎంత బరువైపోయారో? పోయిన వారం నా రూంలో ఉండే మంజుల అనే ఆవిడ తనవాళ్ళని ఆఖరిచూపు చూడాలని తపించిపోయినా అయినవాళ్ళెవరూ రాకపోతే నిట్టూరుస్తూనే గుండెలనిండా శోకంతో ఆక్రోశంతో నా కళ్ళముందే చనిపోయింది. ఆశ్రమం నిర్వాహకులు ఇది మామూలే అన్నట్లు తుది సంస్కారాలు కానిచ్చేస్తుంటే నాగుండెలవిసిపోయాయి. ఇప్పటికే నాకోసం ఆశ్రమానికి బోలెడు డబ్బు కట్టి ఋణం తీర్చుకున్న మీ అన్నయ్య నేను పోతే వస్తాడనే ఆశ ఎలాగూ లేదు. కనీసం బ్రతికున్న నాలుగు రోజులయినా ముష్టెత్తైనా మిమ్మల్ని నా కళ్ళముందే ఉంచుకోవాలనుంది.. కాదనరుకదూ!

**అభాగ్యురాలయిన మీ అమ్మ.**

ఈ ఉత్తరంతో ఒక నిశ్చయానికి వచ్చి అక్కయ్య, నేను హోంవాళ్ళతో మాట్లాడి అమ్మని తెచ్చేసుకున్నాం. అక్కయ్య తను నేర్చుకున్న టైలరింగ్ చేస్తూ..... నేను

ట్యూషన్లు చెబుతూ అమ్మను చూసుకుంటున్నాం. ఏ భగవద్గీతతోనో కాలక్షేపం చెయ్యడానికయినా అమ్మకి చూపు పూర్తిగా నశించింది. గవర్నమెంటు ఆస్పత్రిలో చూపిస్తే....కార్నియా మారిస్తే తప్ప ఇంక చూపు లేనట్టే అన్నారు అయినా అమ్మ మానసికంగా ఎంతో ఒంటరితనంతో కుమిలిపోతోంది. ఆ మధ్యనే ఈ సమావేశం గురించి పేపర్లో చదివేసరికి మాలో ఏదో ఆశ. అమ్మకి తనకు తోడు దొరుకుతారనే నమ్మకం లేకపోయినా గాల్లోకి రాయి విసరాలని నేనే మొండిగా తీసుకొచ్చాను. కళ్ళు లేకపోయినా అమ్మ మీకు మంచి సహచరిణి అవుతుందని నాకు నమ్మకముంది.

డాడీ....తర్వాత కూడా అమ్మ లోకం ఏమంటుందోనని భయపడుతుంటే మేమే నచ్చచెప్పాం.

మీ ముఖంలో ఎంతటి కారుణ్యం!! మిమ్మల్ని డాడీ అని పిలుస్తూంటే...ఎప్పట్నుంచో మీరు మాకు పరిచితమయిన భావన....అంటే అమ్మకు మీరిచ్చినమాట తప్పకుండా మాకు నిజంగానే కన్నతండ్రి అయిపోయారు. ఊహ తెలిసినప్పట్నుండి నాన్నంటే ఎరుగని నేను ఆర్తిగా మీతో ఎన్ని భావాలు...ఆశలు పంచుకున్నానో మీకు తెలుసు.

ఆ తర్వాత నాలుగేళ్ళు 'కాలానికి కళ్ళెం లేదు' అన్నట్లు కాలం పంచకళ్యాణిలా కదం తొక్కుతూ ముందుకు కదిలిపోయింది. అక్కయ్య, మీ పుణ్యమా అని ఓ ఇంటిదయింది. తనో బిడ్డకు తల్లి అయి తనకో చక్కటి కుటుంబం ఏర్పడింది.

అమ్మ ముఖంలో నేను ఎన్నడూ చూడనంత తృప్తి వలన ఎంతటి సౌందర్యం! రక్తం పంచుకు పుట్టినవారే ఈ రోజుల్లో ఎవరికెవరూ కాకుండా పోతుంటే....ఏ జన్మలో మేమేం పుణ్యం చేసామనో మీరు మాకు కోరకుండానే దేవుడిచ్చిన వరంగా ప్రసాదింపబడ్డారు. మన జీవితాలమీద ఎవరి నీడా....అపభ్రంశపు మాటలు పడకూడదని మీరు మన కుటుంబాన్నే ఊరు మార్చేసారు. అక్కడ వాళ్ళంతా మన కుటుంబ అన్యోన్యత చూసి ఆశ్చర్యపోవడమేగాని మనం నాలుగేళ్ళ క్రితం వరకూ ఏమీ కామన్న నిజం తెలిస్తేగా....అసలు ఎవరికయినా అనుమానం వచ్చేలా మనమున్నామా?

ఇంక నేను మీ సలహా ప్రకారం డిగ్రీ పూర్తి చేసేసాను. ఎంబిఎ చేయిద్దామనుకున్నారు. కానీ విధికి పొదరిల్లులాంటి మన సంసారం చూసి కన్నుకుట్టినట్టుంది. లేకపోతే....నాకు ఇంటెస్టైనల్ కాన్సరేమిటి? అదీ చాపకింద నీరులా స్టేజీ దాటిపోవడమేంటి? మీలాంటి డాడీ అభిమానాన్ని ఆనందంగా ఆస్వాదిస్తున్న తరుణంలో భగవంతుడు ఇలా చేసాడెందుకో? నాకింకా తనివితీరలేదు డాడీ! అందుకే వచ్చేజన్మలో కూడా మీరే నాకు డాడీ కావాలని కోరుకుంటున్నాను డాడీ.

కానీ అమ్మ....అమ్మను తల్చుకుంటేనే ఏడపొస్తుంది. తెలిస్తే మళ్ళీ అమ్మ మనస్సు కకావికలమైపోతుంది. నాకు తెలిసీ జీవితంలో అమ్మ ఎప్పుడూ సుఖసంతోషాలనుభవించింది లేదు.

ఒకవైపు పేదరికం...ఇంకోవైపు సవతి తల్లి ఆధ్వర్యంలో మా అమ్మకి చిన్నతనమంతా అర్ధాకలితోనే గడిచి పోయిందట. పెళ్ళవుతోందనే సంతోషం వయస్సు ముదిరిన వ్యక్తిని చూడగానే ఆవిరైపోయినా డబ్బుకు లోటులేదులే అని తృప్తి పడిందట అమ్మ. కాని ముగ్గురు పిల్లల తల్లిని చేసి ఆయన అర్ధాంతరంగా చనిపోతే...దాయాదులు ఆస్తిని తన్నుకుపోతే.....రెక్కలతోనే పిల్లలను సాకింది. బాధ్యతల్ని పంచుకోవాల్సిన కన్నకొడుకు దగా చేసి వెళ్లిపోతే....ఆపద్భాందవుడిలా మీరు అమ్మను ఆదుకున్నారు. అందుకే ఇప్పుడిప్పుడే కుదుటపడుతున్న అమ్మ జీవితంలో ఈ చరమదశలో నా కారణంగా పెను తుఫాను రాకూడదనే నా పట్టుదలను మీరు ఎంత బాగా అర్థం చేసుకున్నారో డాడీ... పిచ్చి అమ్మ.... చదువుకోసం మీరు నన్ను దూరంగా పంపిస్తున్నారంటే నమ్మింది. నేను లేకపోయినా మీరు అమ్మను ప్రాణంగా చూసుకుంటారనే విషయంలో నాకెటువంటి సందేహమూ లేదు.

"కన్నీటి చుక్కలు పడితే అక్షరాలు చెరిగిపోతాయి. ఏకంగా వరదలే కొట్టుకొస్తే? చిమ్మ చీకటి అలుముకుంటుంది. ఆ చీకటిని ఛేదించడానికి ప్రేమ సిరా నింపిన ఓ దీపం కావాలి. ఆ దీపం మీరే డాడీ!!"

ఆ మధ్యన ఉన్నట్టుండి అన్నయ్య ఊడిపడి ఓసారి ఏదో సంతకం కావాల్సివచ్చి ఆ విషయం చెప్పకుండా అమ్మతో ప్రేమ నటించినప్పుడు...అది గ్రహించిన అమ్మ ఆడపిల్లలకు అన్యాయం జరగకూడదని సంతకం చెయ్యననేసరికి...మిమ్మల్ని నానా మాటలూ అన్నా ఎంత సహనం వహించారో....తను బ్రతికున్నంత వరకూ ఆడపిల్లలకు ఎటువంటి లోటూ ఉండదు గనుక సంతకం పెట్టమని మీరు అమ్మకి నచ్చజెప్పినట్టు అమ్మే నాతో స్వయంగా చెప్పింది. అన్నయ్యతో అన్ని బంధాలూ తెగతెంపులు అయిపోయినందుకు మాత్రం ఆ తల్లి మనసు రోదించింది. అప్పుడు కూడా అమ్మను మీరేఎంతగా ఊరడించారో చెప్పింది.

డాడీ! కాలానికి తీరం లేదు.. అందుకే కలకాలం ప్రవహిస్తూనే ఉంటుందని తెలుసు....కాలానికి గాలం వెయ్యాలంటే సాధ్యం కాదనీ తెలుసు. ఎందుకంటే పెద్దలన్నట్లు 'కాలఃక్రీడతి

గచ్ఛత్యాయః అందుకే కాబోలు ఇప్పుడు కాలం నాతో ఆడుకుంటోంది. ఇంకోవైపు నా ఆయువు గతించిపోతోంది. అందుకే ఎలాగూ రాబోయే మంచి చెడ్డలు నాకు తెలిసిపోయాయి కనుక ఉన్నంతలో ఉన్నతంగా జీవించాలనుకుంటున్నాను డాడీ....ఈ లోకం వదిలి వెళ్ళిపోయాకకూడా జీవించాలనే అనుకుంటున్నాను. అందుకు చివరిసారిగా.... నా మనసెరిగిన తండ్రిగా....మీ సాయం కోరుతున్నాను. ఇందులో నా స్వార్థం కూడా ఉంది డాడీ అదేంటో తెలుసా???? నాకు రక్తమాంసాల్ని పంచిన అమ్మ కోరిక ఒకటి తీర్చాలని...??

"నాకు కొత్త జీవితాన్ని ప్రసాదించిన ఆయన్ని కళ్ళారా చూసుకునే అదృష్టం లేకుండాపోయిందే....ఆయనను చూసాక నాకు చూపు పోయినా ఫరవాలేదు....." అని ఎన్నోసార్లు అమ్మ అనుకోవడం తెలిసీ అప్పట్లో నేను అసహాయంగా ఉండిపోయాను. కానీ ఇప్పుడు ఆ కోరిక తీర్చే అవకాశం భగవంతుడే కల్పించాడనుకుంటున్నాను. క్యాన్సర్ రోగులు నేత్రదానం చెయ్యవచ్చా డాక్టర్? అనడిగాను. నాది బ్లడ్ క్యాన్సర్ కాదు కనుక లింఫాటిక్ కూడా కనుక నిరభ్యంతరంగా నాకళ్ళు పనికొస్తాయన్నారు డాక్టర్‌గారు.

మొన్న మీరు వచ్చినప్పుడు డాక్టర్‌గారు నాకు ఇంక ఈ నెల గడవటం కష్టమని చెప్పడం రహస్యంగా నేనూ విన్నాను. అందుకే మిమ్మల్ని కోరుకుంటున్నాను. నా రెండు కళ్ళనూ అమ్మకు పెట్టే ఏర్పాటు చెయ్యండి డాడీ! కానీ అవి నేనిచ్చినట్టు మాత్రం అమ్మకు చెప్పకండి. అది ఎంత కష్టమో నాకు తెలుసు.... ఇందులో నా స్వార్థం ఏమిటో తెలుసా? అమ్మద్వారా నా కళ్ళతో మిమ్మల్ని ఎప్పుడూ చూసుకోవచ్చనే స్వార్థం. ఈ ముద్దుల కూతురి కోరిక తీరుస్తారు కదూ? డాడీ! ఒకోసారి కడుపులో రగిలే బాధ తట్టుకోలేక 'ఒక్కసారి అమ్మ ఒడిలో పడుకుంటే బావుంటుందనిపిస్తుంది. ఈ నాలుగు రోజుల ఉపశమనం కోసం బ్రతికున్నన్నాళ్ళూ తడి ఆరని కళ్ళతో ఏడ్చే అమ్మను ఆలోకం నుండి చూసి భరించగలనా? మీరేం చెప్తారో నాకు తెలీదు. నాకోరిక మాత్రం తీర్చాల్సిందే. నా కోరిక తెలియజేసే డాక్టర్ గారి అంగీకార పత్రం కూడా ఇచ్చాను. ఒక్కసారి మీ ఒడిలో తల పెట్టుకుని తనివితీరా ఏడ్వాలని ఉంది. నేను వీడ్కోలు తీసుకునేలోపే మీరు నా వద్దకు తప్పక వస్తారుకదూ! అమ్మకు కానుకగా ఇచ్చిన నా కళ్ళలో మాత్రం ఎప్పటికీ కన్నీళ్ళు చిప్పల్లకూడదు నాన్నారూ! ఆ విషయంలో నాకు ఎటువంటి సందేహం లేదనుకోండి!.

**-మీ కూతురు నయన.**

ఉత్తరాన్ని మడిచి భోరున ఏడ్చింది సులోచన. 'ఏవండీ! నా చిట్టితల్లి నయన ఏడాది క్రితం మీకు రాసిన ఉత్తరం కదూ ఇది! ఇన్నాళ్ళూ ఈ బాధను గుండెల్లో దాచుకుని ఎంత నరకం అనుభవించారండీ! నా బిడ్డలను కన్నబిడ్డలుగా చూసుకున్న మిమ్మల్నే అనుమానించిన పాపిష్టిదాన్ని...నాకు కళ్ళు వచ్చాక మిమ్మల్ని కళ్ళారా చూసుకునే అదృష్టం నాకు భగవంతుడు కలిగించాడని మురిసిపోయాను.

"చదువుకోవడానికని దూరంగా వెళ్ళిన నయనని చూసి చాలాకాలం అయింది... తనకి ప్రాజెక్టులతో వచ్చే తీరిక లేకపోతే మనమే వెళ్ళి చూసొద్దాం రండీ' అని మిమ్మల్ని శతవిధాల పోరినా మీరు కదలకపోయేసరికి పాపిష్టిదాన్ని....మీకు కోపం తెప్పించాలని ఎన్ని మాటలన్నాను?...'అది మీకు కన్నబిడ్డ కాదుగా మీరు దాన్ని చూడకపోయినా ఉండగలరు...కానీ నాది కన్నకడుపండీ...అసలు నిజంగా నాబిడ్డ చదువుకుంటోందా? లేక మీకు అడ్డంగా ఉందని మాయం చేసేసారా? అని ఎత్తిపొడిచానే....నయన మీది ప్రేమతో మీరు దాని మరణం తట్టుకోలేక బి.పి తెచ్చుకున్నారని తెలియక ఇన్నాళ్ళూ మిమ్మల్ని సాధిస్తూనే ఉన్నాను. కానీ మీరు మాత్రం కూతురికిచ్చిన మాట తప్పకూడదని నోరు విప్పలేదు. చివరికీ రోజు చెదలుపడుతున్నాయని పాత కాగితాలు సర్దుతుంటే నా తల్లి రాసిన ఉత్తరం బయటపడి ఉండకపోతే నాకీ నిజం ఎప్పటికీ తెలిసేదేకాదు. నేను మిమ్మల్ని ఆడిపోసుకుంటూ ఇంకా పాపం మూటకట్టుకుంటూనే ఉండేదాన్ని. లేదా నయన మనకు చెప్పకుండా ఎవరినో పెళ్ళి చేసుకుని గాని వెళ్ళిపోయిందేమోనని అపోహపడేదాన్ని.

నన్ను మన్నించండి. మీరు కూతురికిచ్చిన మాటను నేను వమ్ము చేయను. ఈ కళ్ళు నా చిట్టితల్లి నయనవి. వీటినుండి కన్నీరు కార్చితే ఏ లోకంలో ఉన్నా దాని ఆత్మ ఘోషిస్తుంది. అందుకే నేనెప్పుడూ కంటతడి పెట్టనని మాట ఇస్తున్నాను. అయినాగానీ ఎందుకు కన్నీళ్ళు? నాతల్లి ఏ తల్లికీ ఏ కూతురుకూడా ఇవ్వలేని కానుకను నా నయన నాకిచ్చింది. ఆపకుండా ఏదేదో మాట్లాడుతున్న సులోచన నోటిని సున్నితంగా తన చేత్తో మూసి మరో చేతితో ఆమె తలను మౌనంగా తన గుండెలకానించుకున్నారు కోదండ మూర్తిగారు.

ఆ స్పర్శలోని ఊరడింపు సులోచనకు అర్థమయింది. నీ కోరిక తీరిందా చిట్టితల్లీ! అనుకుంటూ ఆమె కళ్ళవంక ఆర్తిగా చూసారు మూర్తిగారు.

★

# ఐద్వా ఉద్యమం - కొన్ని విశేషాలు

- అల్లూరి మనోహిని

1981లో ఐద్వా ఏర్పడ్డ నాటి నుంచి దేశ వ్యాపితంగా, మహిళలెదుర్కొంటున్న అనేక సమస్యలపై పనిచేయడంతోపాటు అంతర్జాతీయంగా కూడా సమస్యల్లో ఉన్న మహిళలకు అండగా నిలబడ్డది. ఎవరికోసమైతే పనిచేస్తుందో ఆ మహిళలందరిని భాగస్వాములను చేస్తూ పోస్ట్ కార్డు ఉద్యమం, సంతకాల సేకరణ లాంటి మహోద్యమాలకు నాంది పలికింది. నాటి నుండి నేటి వరకు కొన్ని విశేషాలు:

**(1981-2012)**

**1982:** మహిళా దినోత్సవ ఐక్య కార్యక్రమాలకై మహిళా ఉద్యమాల రథసారధి ఐద్వా పిలుపు. ఐద్వా, మహిళా సమాఖ్య ఆధ్వర్యంలో ఐక్య ప్రదర్శనలు, సభలు.

**1983:** వరకట్న మారణ హోమం, హింసల నుండి బాధిత మహిళల రక్షణ కోరుతూ నాటి ప్రధాని ఇందిరాగాంధీకి ఐద్వా ఆధ్వర్యంలో విస్తృతంగా పోస్టు కార్డుల ఉద్యమం. దాని ఫలితమే 1983 డిశంబర్ 9,10 తేదీలలో పార్లమెంట్‌లో చర్చ. వరకట్న హింస నుండి రక్షణ కోసం సుప్రీమ్ కోర్టు ఆదేశాలు జారీ చేసింది. ఫలితంగా 1985లో రాష్ట్రపతి ఆమోదం పొంది 498ఎ సెక్షన్ దేశ వ్యాపితంగా అమల్లోకి వచ్చింది. ఇది ఐద్వా సాధించిన విజయం.

**2.1983:** ఎన్‌టిఆర్ ముఖ్యమంత్రిగా తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. నాడు ఆంధ్ర ప్రదేశ్ మహిళా సంఘం పేరుతో రాష్ట్ర నలుమూలల నుండి మహిళల నుండి కోటి సంతకాలు సేకరించి హైదరాబాద్‌లో నిర్వహించిన బహిరంగసభలో ముఖ్యమంత్రికి మెమోరాండం సమర్పించింది. 6 డిమాండ్లను ప్రభుత్వం అంగీకరించింది.

అందులో చారిత్రాత్మకమైన డిమాండ్లు రెండు: 1. ఆడపిల్లలకు పుట్టుకతోనే సమాన ఆస్తిహక్కు. 2. శ్రామిక మహిళలకు ప్రసూతి సహాయ నిధి. రాష్ట్రంలో అట్టడుగు స్థాయి నుంచి మహిళల పోరాటం వల్ల సంపూర్ణ మద్య నిషేధం అమలు చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ.

**3.1984:** పాకిస్తాన్‌లో జియా ప్రభుత్వం మహిళలపై కొరడా దెబ్బలు శిక్షను అమలు జరుపుతున్న కాలమది. ఈ ఆటవిక శిక్షను వెంటనే రద్దు చేయాలని ఎక్కడికక్కడ మహిళా గ్రూపులను, సంస్థలను కూడగట్టి సమావేశాలు జరుపుతూ తీర్మానాలు చేసి జియా ప్రభుత్వానికి పంపింది. భారత ప్రధాని ద్వారా జియా ప్రభుత్వానికి టెలిగ్రామ్స్ పంపే ఉద్యమాన్ని నడిపింది. ఫలితగా జియా ప్రభుత్వం అమానవీయ కొరడా దెబ్బల శిక్షను రద్దు చేసింది. అంతర్జాతీయ సౌభ్రాతృత్వం, సంఘీభావం లక్ష్యాలుగా పని చేస్తున్న ఐద్వా అనేక దేశాల మహిళలకు తోడునీడుగా విశాల వేదికలు నిర్మించింది.

**4. 1985:** ఎవిడెన్స్ యాక్టులో మార్పు. మహిళలపై అత్యాచారాలకు సంబంధించి కోర్టుల్లో విచారించేటపుడు, మహిళ తనకు జరిగిన అన్యాయాన్ని వివరించే క్రమంలో మార్పు.

**5.1986:** రాజస్థాన్‌లోని దేవరాల గ్రామంలో 18 సంవత్సరాల రూప్ కన్వర్ సతీ సహగమనం. ఆ ఘటనపై చర్యలు తీసుకోవాలని ప్రధాని రాజీవ్ గాంధీకి లక్షలాది పోస్టుకార్డులు, సంతకాల సేకరించి పంపడంతో నిందితులపై కేసులు నమోదు అయినవి.

6. "స్త్రీ బలహీనురాలు, పురుషుడు తన శక్తి ద్వారా ఒక రాత్రిలో ఎంతమంది పిల్లలనైనా పుట్టించగలడు"అని స్త్రీలను కించపరుస్తూ పూరి శంకరాచార్యులు చేసిన వ్యాఖ్యలను ఖండిస్తూ అతనిపై చర్యలు తీసుకోవాలని ఐద్వా దేశ వ్యాపిత ఉద్యమాలు, ఆందోళనలు, సంతకాలు, పోస్ట్ కార్డు క్యాంపెయిన్ నిర్వహించింది. ఫలితంగా స్త్రీ జాతికి పూరి శంకరాచార్యులు క్షమాపణలు.

**7. 1987:** ముస్లిమ్ మహిళ షాబానో కేసులో సుప్రీమ్ కోర్టు ఇచ్చిన తీర్పును అమలు చెయ్యాలని దేశా వ్యాపితంగా ఆందోళన కార్యక్రమాలు, పోస్ట్ కార్డు క్యాంపెయిన్ చేసింది. జిల్లా కోర్టుల్లో రికార్డు అయిన ముస్లిమ్ మహిళల వకాల్తాలు కూడా ఐద్వా సేకరించింది. ఫలితంగా ముస్లిమ్ మహిళల హక్కులు చర్చనీయాంశమైనవి.

**1992:** సోషలిస్టు క్యూబాపై అమెరికా కక్షగట్టి మహిళలకు, పిల్లలకు ఆహారం అందకుండా చేసినపుడు ఐద్వా దేశ వ్యాపితంగా ఇంటింటికి 1 కేజి బియ్యం సేకరణ ఉద్యమం ప్రకటించింది. వేల టన్నుల బియ్యం సేకరించి పంపింది.

**1995:** 1995 జులై 7వ తేది దేశ వ్యాప్తంగా ఒక రోజు క్యూబా బాలలకు సహాయంగా మందులు, పెన్సిళ్ళు, పాలడబ్బాలు సేకరించి క్యూబాకు పంపి సంఘీభావం తెలిపింది. అమెరికా విధించిన ఆంక్షలను, దాని అమానవీయ దృక్పథాన్ని ప్రజల్లో వివరించి ఎండగట్టింది.

# EAMCET - 2012


RB VAISHNAVI
HT : 5105828

MEDICAL STATE 20th Rank

## జూనియర్ - సీనియర్ ఇంటర్, ఇంజనీరింగ్ - మెడిసిన్‌లలో స్టేట్ బెస్ట్
## కర్నూలు నారాయణ విద్యా సంస్థలు

| | |
|---|---|
| Jr. MPC | 466 |
| Jr. BIPC | 435 |
| Sr. MPC | 983 |
| Sr. BIPC | 981 |

| EAMCET - 2012 | | |
|---|---|---|
| 1 | 100 BELOW | 2 |
| 2 | 1000 BELOW | 20 |
| 3 | 2000 BELOW | 48 |
| 4 | 3000 BELOW | 71 |
| 5 | 5000 BELOW | 118 |
| 6 | 10000 BELOW | 236 |

### Inter I Year MPC 99% ఉత్తీర్ణతాశాతం

SAI PRIYANKA B 466 HT : 1210112038
HARIPRIYA P 466 HT : 1210110267
KASHIF MOIZ MOHAMMAD 464 HT : 1210119404
VENKATA RAMANA N 464 HT : 1210112420
DEEPTHI M 464 HT : 1210113243
AISHWARYA J 464 HT : 1210110243
SINDHU M 464 HT : 1210122655
NAVEEN KUMAR B 464 HT : 1210110142
BHARTESH JAIN N 464 HT : 1210110700

### Inter I Year Bipc 99% ఉత్తీర్ణతాశాతం

SYEEDA F.M 435 HT : 1210111471
SANA ASFIYA 434 HT : 1210111352
TEJASWINI G.N 433 HT : 1210123047
HARSHITHA SVD 433 HT : 1210122525
NARESH KUMAR REDDY 433 HT : 1210112320
SRAVYA G 433 HT : 1210122464
SWATHI D 433 HT : 1210122489
JAYA SIRISHA 432 HT : 1210122478
PAULGIDEONRAJ 432 HT : 1210110573
UMAMAHESWARI 432 HT : 1210111920

### Inter II Year MPC 99% ఉత్తీర్ణతాశాతం

SUMANA A 983 HT : 1210221390
HIMAJA KUMARI B 982 HT : 1210212987
DIVYA KARANAM 981 HT : 1210218374
HARIKA R 981 HT : 1210218471
SAI CHARITHA K 981 HT : 1210218385
NASREEN BANU S 980 HT : 1210212072
MOUNIKA U 980 HT : 1210224698
NOOR BASHA P 979 HT : 1210212295
SOMASEKHAR REDDY 979 1210220844
MADHURI 979 HT : 1210211373

### Inter II Year Bipc 99% ఉత్తీర్ణతాశాతం

VISHNU HARIKA K 981 HT : 1210221244
SIVA PRASAD D 981 HT : 1210212050
MOHANA GANAPATHY 979 HT : 1210213420
MEENA 975 HT : 1210220539
FARHADNISHAD S 975 HT : 1210212396
PAVANI KATEGARU 972 HT : 1210210191
HARIKA PUJARI 970 HT : 1210211932
DV KAVYA 968 HT : 1210212046
DURGA MOUNICA 965 HT : 1210213662
ACHYUTHKRISHNA 962 HT : 1210210037



EAMCET RANKERS తో నారాయణ విద్యాసంస్థల జోనల్ ఇన్‌చార్జ్ పి. లింగేశ్వర రెడ్డి

### EAMCET 2012 MEDICAL

VAISHNAVI RB 20 RANK HT : 5105828
VISHNU HARIKA K 71 RANK HT : 5105553
MEENA 230 RANK HT : 5102356
MOHANA GANAPATHY 275 RANK HT : 5103172
BHARATH C 389 RANK HT : 5102152
PRAKASH B 554 RANK HT : 5102754
ARIFULLA S 712 RANK HT : 5104049
KIRAN KUMAR MADDELA 861 RANK HT : 5105730
SANA FARHEEN M 905 RANK HT : 5103461
SIRI CHANDANA 906 RANK HT : 5102027
PAVANI KATEGARU 952 RANK HT : 5105847

### EAMCET 2012 ENGINEERING

HARIKA R 209 RANK HT : 2105337
KOULINI MOUNIKA 234 RANK HT : 2103170
SUMANA A 263 RANK HT : 2101173
SAI SANDEEP N 314 RANK HT : 2106261
NOOR BASHA P 506 RANK HT : 2110122
NOAH M 831 RANK HT : 2106550
GAGAN ABHISHEK 929 RANK HT : 2101190
HIMAJA KUMARI 982 RANK HT : 2105107
HEMANTH S 1007 RANK HT : 2104378
SAI TEJASWINI 1039 RANK HT : 2113039
SASHIDHAR REDDY 1076 RANK HT : 2102508

### NARAYANA JUNIOR COLLEGE - KURNOOL MEDICAL SEATS

| S NO | YEAR | NO OF MEDICAL SEATS |
|---|---|---|
| 1 | 2009 | 29 |
| 2 | 2010 | 35 |
| 3 | 2011 | 55 |
| 4 | 2012 | ABOVE 75 |



మానవి దశాబ్ది ప్రస్థానం
సందర్భంగా హృదయపూర్వక శుభాకాంక్షలు

# లోక్‌సత్తా పార్టీ

## కూకట్‌పల్లి నియోజకవర్గం



**టి. పద్మజా రాణి**
ప్రెసిడెంట్,
గ్రేటర్ హైదరాబాద్ మహిళా సత్తా



**ఎన్. శ్రీనివాసన్**

**డా. జయప్రకాశ్ నారాయణ్**




# విజయవాడ నగర పాలక సంస్థ

## Towards a welfare and inclusive Society...






Sri.S.A.M.Rizvi, IAS
Collector and Spl.Officer



Sri.G.Ravi Babu, IAS
Commissoner

విజయవాడ నగరం బహుముఖ రంగాలలో అభివృద్ధి చెందుతుంది. విద్య, వ్యాపారం, సాంస్కృతిక, రాజకీయ రంగాలలో ఈ నగరం ఆంధ్రప్రదేశ్‌కే కేంద్రము వంటిది. మౌలిక వసతుల కల్పనతో నగరం అసాధారణ రీతిలో అభివృద్ధి చెందుతోంది. అన్ని రంగాలలో నగరం ప్రగతి పథంలో పయనించేందుకు నగరపాలక సంస్థ నిబద్ధతతో, మనస్ఫూర్తిగా పనిచేస్తుంది.

నగరాన్ని మురికివాడ రహితంగా తీర్చిదిద్దాలని, మురికివాడలలో అంతర్జాతీయ స్థాయిలో ప్రమాణాలతో సదుపాయాలు కల్పించేందుకు ప్రభుత్వం సహకారంతో నగరపాలక సంస్థ కృషి చేస్తోంది.



**అవార్డులు :**

యూరో - ఇండియా సంస్థచే బెల్జియం నందు నిర్వహించిన ఎస్కా అవార్డుల రేసులో ఎన్విరాన్‌మెంటల్ సస్టెయినబుల్ సిటి (ఎస్కా) నందు ఎనర్జీ సేవింగ్స్ నందు రెండవ స్థానం సాధించి అవార్డు పొంది దేశంలోని అగ్రగామిగా నిల్చిన సంస్థ.

జె.ఎన్.ఎన్.యు.ఆర్.యం. పథకం ద్వారా ప్రభుత్వ మరియు ప్రైవేటు వారి భాగస్వామ్యముతో జక్కంపూడి నందు చేపట్టిన గృహసముదాయముల నిర్మాణమునకు బెస్ట్ సిటి - 2011 అవార్డు సాధించి ఢిల్లీ నందు భారత ప్రధాని డా.మన్మోహన్ సింగ్ గారి చేతులు మీదుగా అవార్డు పొందిన సంస్థ.



- ★ అభివృద్ధి పథకములు జె.ఎన్.ఎన్.యు.ఆర్.యం. పథకం క్రింద రూ.1422.67 కోట్ల అంచనాలతో 28152 జీ+3 గృహ నిర్మాణములు చేపట్టిన సంస్థ.
- ★ రూ.152.64 కోట్లతో టి.ఆర్.టి.ఎస్. ఏర్పాట్లు.
- ★ ట్రాఫిక్ వ్యవస్థను క్రమబద్ధీకరించుటకు వివిధ ప్రాంతాలలో బస్ బేల ఏర్పాటు.
- ★ రూ.271.48 కోట్లతో 5 ప్రాజెక్ట్‌ల ద్వారా అండర్ గ్రౌండ్ డ్రైయినేజి వ్యవస్థ నూరు శాతం అండర్ గ్రౌండ్ డ్రైయినేజి వ్యవస్థను అభివృద్ధి పరుచుట.



- ★ నగరంలో సుమారు రూ.5 కోట్ల వ్యయంతో నూతనంగా న్యూ రాజరాజేశ్వరపేట, దుర్గాపురం ప్రాంతాలలో అధునాతన వసతులతో మోడరన్ చేపల మార్కెట్‌లను నిర్మించుటతోపాటుగా బీసెంట్ రోడ్డు మహంతి మార్కెట్ ఆధునీకరించుట.
- ★ నగరంలోని ప్రధాన కూడల యందు నూతనంగా హైమాస్ట్ లైటింగ్ వ్యవస్థను ఏర్పాటు చేయుటంతోపాటుగా సెంట్రల్ డివైడర్‌ల యందు లైటింగ్ వ్యవస్థను మెరుగుపరుచుట.

- ★ రాజీవ్ అవాస్ యోజన పథకం (ఆర్ఎవై) నగరాన్ని స్లమ్ ఫ్రీ సిటిగా తీర్చిదిద్దటానికి పథకం ద్వారా రాబోవు 5 సం॥లలో మురికివాడలలో అవసరమైన మౌలిక సదుపాయల కల్పనకై రూ.2223 కోట్ల వ్యయంతో ప్రతిపాదనలను రూపొందించి అభివృద్ధి పరచుటకు చర్యలు చేపట్టబడినది.
- ★ పైలెట్ ప్రాజెక్ట్ క్రింద రెండు ప్రాంతాలలో ఇళ్ళను సర్వే నిర్వహించి డిజైన్ మరియు అంచానాలతో పూర్తి నివేదిక తయారు చేసి ప్రభుత్వ అనుమతి కొరకు పంపుట జరిగింది. మిగిలిన స్లమ్ ఏరియాలకు డీటైల్ ప్రాజెక్ట్ రిపోర్టులు తయారు చేయుట జరుగుతుంది.
- ★ స్వయం సహాయ సంఘాల వారికి లక్ష్యాన్ని మించి అత్యధికంగా బ్యాంక్ లింకేజి ఋణాలు అందించి రాష్ట్రంలోనే ప్రథమ స్థానములో నిలిచి అవార్డు పొందిన సంస్థ.
- ★ నగరంలో సిటి శానిటేషన్ ప్లాన్ ద్వారా పారిశుధ్య పరిస్థితులను మెరుగుపరచుటకు ప్రజల భాగస్వామ్యంతో శానిటేషన్ వార్డు కమిటీలను ఏర్పాటు చేసి సమస్యలను సత్వరమే పరిష్కారించేలా చర్యలు చేపట్టిన సంస్థ.
- ★ ప్లేస్కూలు నగరంలో పారిశుధ్య కార్మికుల పిల్లల సంరక్షణకై అవసరమైన అన్ని సదుపాయలతో నగరపాలక సంస్థ పరిధిలోని మొట్టమొదటిగా ప్లే స్కూలు ఏర్పాటు చేసి జాతీయ స్థాయిలో గుర్తింపు పొంది పలువురి ప్రశంసలను అందుకున్న సంస్థ.
- ★ విద్యారంగంలో పురోగతి - 5 ఉన్నత పాఠశాలలో ఏర్పాటు చేసిన ఈ లెర్నింగ్ సెంటర్లు నందు కంప్యూటర్ ద్వారా పాఠ్యాంశాలను బోధించుట. నూతనంగా ప్రాథమిక విద్యార్థుల కొరకు మరో 3 సెంటర్‌ల ఏర్పాటుకు చర్యలు చేపట్టి జూన్ 2012 నాటికి అందుబాటులో ఉంచుట.
- ★ 10వ తరగతి నందు చదువులో వెనుకబడిన విద్యార్థులకు మొట్టమొదటిగా రెసిడెన్షియల్ పద్ధతిలో విద్యను బోధించి ప్రతి ఒక్కరు ఉత్తీర్ణత సాధించునట్లుగా కృషి చేస్తున్న సంస్థ.
- ★ రాజీవ్ యువకిరణాలలో భాగంగా 3000 మందికి నిరుద్యోగ యువతీ యువకులకు శిక్షణతో కూడిన ఉపాధి కల్పన.
- ★ అంతర్జాతీయ మహిళా దినోత్సవం పరిష్కరించుకొని 30 కోట్ల లింకేజీ ఋణాలను స్వయం సహాయక సంఘాల వారికి అందజేయుట జరిగింది.
- ★ సోలార్ ఎనర్జీ నగరంగా ఎంపిక కాబడి నగరంలో సౌరశక్తి ద్వారా విద్యుత్ వాడకాన్ని తగ్గించుటకు ప్రణాళికలను రూపొందించుట జరిగింది.
- ★ పూర్తి స్థాయిలో రక్షిత మంచినీటి సరఫరా అందించేందుకు కోట్ల ఖర్చుతో డిస్ట్రిబ్యూషన్ పైపులైన్‌లు వేసి ప్రతి ఒక్కరికి 160 లీటర్ల మంచినీటినిఅందిస్తుంది.
- ★ నగరంలో పూర్తి స్థాయిలో అన్ని రంగాలలో అభివృద్ధి చేసేలా అనేక నూతన పథకములను అమలు చేసి ప్రజలను భాగస్వాములను చేయుటకు కృషి.
- ★ నగరంలో వాతావరణ కాలుష్య నియంత్రణకై బందరు రోడ్డు, ఏలూరు రోడ్డు మరియు టి.ఆర్.టి.ఎస్. రోడ్డుల యందు ప్రత్యేకంగా సైకిల్ ట్రాక్ ఏర్పాటు చేసి సైకిల్ వినియోగంపై ప్రజలను చైతన్యవంతులను చేయుట జరిగింది.
- ★ ఎస్.ఎస్.సి. బోస్‌నగర్ నందు యు.పి. & పి.యం.సి. రూ.64 లక్షల నిధులతో నూతనంగా క్రిస్టియన్ కళ్యాణమండపం నిర్మాణం.











- ★ నగర ప్రజల అవసరాలకు అనుగుణంగా అన్నీ ప్రాంతాలలో మంచినీటి సరఫరా, అండర్‌గ్రౌండ్ డ్రైయినేజీ, రోడ్లు అభివృద్ధికి వేలకోట్ల రూపాయలు ఖర్చు చేసి ప్రజలకు అందుబాటులో ఉంచడమైనది.
- ★ నగరంలో గల కాలవ గట్టు ప్రాంతాలను సుందరీకరించి వాకింగ్ ట్రాక్‌లుగా అభివృద్ధి పరుచుట.

**నగరాభివృద్ధిలో ప్రతి ఒక్కరు భాగస్వాములై ఆరోగ్య నగరంగా తీర్చిదిద్దుదాం.**









# జిల్లా గ్రామీణా అభివృద్ధి సంస్థ - ఇందిరా క్రాంతిపథం

## అనంతపురం

## ప్రకటన




## రాజీవ్ యువకిరణాలు



ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము గ్రామీణ ప్రాంతాలలోని నిరుద్యోగ యువతీయువకులకు వారి ఆసక్తిననుసరించి, ఉచిత భోజన వసతి కల్పిస్తూ వివిధ రంగములలో శిక్షణ ఇస్తూ తదనంతరం వారికి ప్రైవేట్ రంగాలలో ఉద్యోగములు కల్పించవలెనని బృహత్ లక్ష్యంతో ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తున్న రాజీవ్ యువకిరణాలు పథకము అనంతపురం జిల్లాలో ప్రతి కుటుంబానికి ఒక ప్రైవేట్ ఉద్యోగ కల్పన లక్ష్యంతో విజయవంతముగా నిర్వహించబడుచున్నది. ఈ పథకము అమలులో జిల్లాలోని గ్రామైఖ్య సంఘాలలోని జాబ్స్ - సబ్ కమిటీలు ముఖ్య పాత్రవహిస్తూ స్వయం సహాయక సంఘాలకు చెందిన యువతీయువకులకు ఉపాధికల్పనతో ఆయా కుటుంబాలు సాంఘిక, ఆర్థిక హోదా పెంపొందించకోవడము జరుగుచున్నది. ఈ పథకముపై యువతకు సంపూర్ణ అవగాహనకై జిల్లాలోని అన్ని గ్రామ పంచాయతీలయందు వాల్ పెయింటింగ్‌ల ద్వారా సమాచారమును అందించడం జరిగినది. గత సంవత్సరములో ఈ కార్యక్రమ నిర్వహణలో అనంతపురం జిల్లా రాష్ట్ర స్థాయిలో ప్రథమ స్థానంలో నిలిచినది.

2012-2013 సంవత్సరమునకు జిల్లా వ్యాప్తంగా 50 శిక్షణా కేంద్రాలలో 27 కోర్సులను 28 శిక్షణా సంస్థల ద్వారా 17475 మంది యువతకు లబ్ధి చేకూర్చే లక్ష్యంగా కార్యక్రమమును నిర్వహించడమైనది.

| విద్యార్హత | శిక్షణ అందించే కోర్సుల వివరములు |
|---|---|
| 8వ తరగతి | హోంకేర్ నర్సింగ్, ఇండస్ట్రియల్ హెల్పర్, వెల్డింగు |
| 10వ తరగతి పాసు / ఫెయిల్ | హోటల్ మేనేజ్‌మెంటు |
| 10వ తరగతి పాసు | కంప్యూటర్ అసిస్టెంట్ / డాటా ఎంట్రీ, ఫిట్టర్ మరియు మెషనిస్టు, కంప్యూటర్ మెయింటినెన్స్ హర్డ్‌వేర్, కస్టమర్ రిలేషన్ సేల్స్, మెడికల్ ల్యాబ్ అసిస్టెంట్, నర్సింగ్ అసిస్టెంట్, రిఫ్రిజరేషన్, ఎయిర్ కండిషనింగ్, టెలీసేల్స్, వైట్‌గూడ్స్ ఎలక్ట్రానిక్స్ సేల్స్, వైర్‌మ్యాన్. |
| ఇంటర్ పాసు | నెట్ వర్కింగ్, సప్లయి చైన్‌మేనేజ్‌మెంట్ |
| ఇంటర్ ఆపైన | బి.పి.ఓ. నాన్‌వాయిస్ బేస్, మల్టీ మీడియా |
| ఇంటర్ కామర్స్‌తో | అకౌంటింగ్ ఫైనాన్స్, డెబిట్ రికవరీ ఏజెంట్స్, ఇన్సూరెన్స్ జాబ్ |
| డిప్లొమా, ఆపైన | ఆటోక్యాడ్, జి.ఐ.ఎస్.. అనాలిస్ట్ - ఇంజనీర్ |
| డిగ్రీ | బి.పి.ఓ. వాయిస్ బేస్, జి.ఐ.ఎస్, అనాలిస్ట్ - ఇంజనీర్, వెబ్ డిజైనింగ్, టీచింగ్ అసిస్టెంట్ |
| డిగ్రీ కెమిస్ట్రీ | ప్రొడక్షన్ కెమిస్ట్ |

బ్యాంకు అప్పులు సకాలంలో చెల్లించడం లోనే మీ అభివృద్ధి దాగి ఉంది.
బ్యాంకుల నుండి తీసుకున్న అప్పులు సకాలంలో చెల్లించండి. ఇది ప్రజల సొమ్ము.
తిరిగి ప్రజలకే ఉపయోగపడుతుంది.
బ్యాంకుల కన్న తక్కువ వడ్డీకి ఏ బంధువు, ఏ వడ్డీ వ్యాపారి కూడా ఇవ్వలేదు.
బ్యాంకుల నమ్మకాన్ని కోల్పోవద్దు. వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాలలో నలిగిపోవద్దు.
ఆర్థిక క్రమ శిక్షణలో మెలగండి. మీ అభివృద్ధి దేశాభివృద్ధికి మూలమని గమనించండి.

**ప్రాజెక్ట్ డైరెక్టర్**
డి.ఆర్.డి.ఎ. - అనంతపురం

**జిల్లా కలెక్టర్ / చైర్మన్**
డి.ఆర్.డి.ఎ. - అనంతపురం

**2000సం॥:** ప్రపంచ మహిళల గ్లోబల్ మార్చ్ సందర్భంగా రెండు ప్రధాన డిమాండ్లపై దేశవ్యాపితంగా సంతకాలు సేకరించి యుఎన్ఓ కార్యదర్శి కోఫీ అన్నన్‌కు పోస్ట్ చేశాము.

**పోస్ట్ కార్డుపై వున్న డిమాండ్లు:**

**1. పేదరికాన్ని నిర్మూలించాలి. ప్రపంచంలోని సంపద మొత్తం పేద, ధనికులకు మధ్య సమానంగా పంచాలి.**

**2. స్త్రీలపై సాగుతున్న హింసను నిర్మూలించాలి. స్త్రీ పురుషుల మధ్య సమానత్వాన్ని పెంపొందించాలి.**

**2006:** ఆడపిల్ల అత్త వారింట్లో ఎదుర్కొంటున్న హింస నుండి రక్షణ కోసం అనేక సంవత్సరాలు పోరాడి 2006లో గృహ హింస నుండి రక్షణ చట్టం సాధించింది.

**2010:** మహిళలకు విధాన నిర్ణయాల్లో భాగస్వామ్యం కల్పించాలని కోరుతూ చట్ట సభల్లో మహిళలకు 33% రిజర్వేషన్లు కల్పిస్తూ చట్టం చేయాలని దేశవ్యాపితంగా అనేక రూపాల్లో పోరాటంచేస్తూ ఉంది. దానికి తోడుగా రాజకీయ పార్టీలపై కూడా వత్తిడి తెచ్చింది. ఫలితంగా 2010 మార్చి9న అంతర్జాతీయ మహిళా దినోత్సవానికి 100 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా రాజ్య సభలో బిల్లు ఆమోదం పొందింది. దీనికి ఐద్వా కృషి ఎంతైనా ఉంది.

మహిళలపై కనిపించని అణచివేత కొనసాగుతూంది. మహిళలు తమ అణచివేతను తావే అంగీకరించేటువంటి తిరోగమన సాంస్కృతిక విధానాల పట్ల నిత్యం మెలకువగా వ్యవహరించే విధంగా ఐద్వా మహిళలను చైతన్యం చేస్తోంది. మహిళా ఉద్యమ శ్రేయోభిలాషులతోపాటు అభ్యుదయవాదులు మహిళా ఉద్యమాన్ని ప్రోత్సహించి అండదండలివ్వాల్సివుంది.

★

2000 మార్చి 20 : విజయవాడ

# కార్యకర్తలకు మోటూరు ఉదయం

## అపూర్వ సందేశం:

**ఆం**ధ్రప్రదేశ్ మహిళా సంఘం పునర్నిర్మాణంలో ప్రధాన పాత్రధారిగా, అత్యంత శక్తివంతమైన మహిళా ఉద్యమాన్ని నిర్మించారు మోటూరు ఉదయంగారు. ఒక సింహం వలె విజృంభించి, అన్ని వర్గాల ప్రజల్లోనూ బహుముఖంగా ప్రతిష్టాత్మకంగా మహిళా ఉద్యమ విస్తరణ కోసం దీర్ఘకాలం మహిళా సంఘానికి ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు.

కాలు దెబ్బతిని నడవలేని స్థితిలో కూడా మంచం మీదే ఉంటూ, ఉద్యమం పట్ల విపరీతమైన ఆరాటంతో ఉండేవారు. జ్ఞాపకశక్తి కూడా కొంత వరకూ దెబ్బతిని, తమ కుమార్తె, శ్రీమతి డాక్టర్ ఉషాసుధాకర్‌ల సేవలందుకుంటూ వారి దగ్గరే ఉంటున్నారు.

2000 మార్చి 19 ఉదయం ఎనిమిదిన్నర సమయంలో విజయవాడ, నా ప్రియతమ సోదరి మోటూరు ఉదయంగారిని చూడాలని వెళ్ళాను. నన్ను చూసి "వచ్చావా?" అని సంతోషంగా అన్నారు. మహిళా ఉద్యమానికి మీ సలహాలు కావాలి, మీరు లేవటంలేదు, మాకు ఏమీ చెప్పటంలదు" అని నేను బాధగా అన్నదానికి ఆమె స్పందించి అన్నమాటలు:

"ఫీల్డులో ఉంటే అనుభవాలు వస్తాయి. నాకు ఫీల్డులో ఉండే అవకాశం పోయిందిగా! ఇక అనుభవాలు ఎలా వస్తాయి? అనుభవాలు లేని సలహాలు పనికిరావు. మీరు జనంలో తిరిగి పనిచేస్తున్నారు. గ్రామ గ్రామం తిరిగి ఎన్నో అనుభవాలతో పనిచేస్తున్నారు. నేను మంచం మీద ఉండిపోయాను. మిమ్మల్ని చూసి సంతోషిస్తాను." అని ఆమె ఆవేదనగా అన్నారు. ఇంకా ఏమోమో చెప్తూ ఎవరు ఎంత వరకూ ఉపయోగపడితే అంత వారిని జీవితాంతం ఉపయోగించుకోవాలి. ఈ బూర్జువా వ్యవస్థలో ఉన్న జాఢ్యాలన్నీ వదిలించుకోవాలి. మనకు అభిమానులైన మిత్రులుగా ఉన్న శ్రేయోభిలాషుల్ని కూడా ప్రోత్సహించి, మనవైపు తిప్పుకుంటే వారు అనేక రకాల సహకారాలు అందిస్తారు."

**చివరిగా అన్న మాటలు:** "ప్రపంచంలోని బాధలు, కష్టాలు, నష్టాలూ స్త్రీకే" అని ఆవేదనతో అన్నారు.

-అల్లూరి మన్మోహిని

# బాధిత కుటుంబాలకు కొండంత అండ

- డి. ఇందిర

## మోటూరు ఉదయం ట్రస్టు

మహిళలపై తరతరాలుగా వివిధ రూపాల్లో జరుగుతున్న హింసను అరికట్టేందుకు ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో 1936లోనే ఆంధ్ర ప్రదేశ్ మహిళా సంఘం ఏర్పడి స్వాతంత్ర్యానికి పూర్వం మహిళల అణచివేతకు వ్యతిరేకంగా పోరాడారు. స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగం అమలులోకి వచ్చి, ప్రజాపాలన వచ్చినప్పటి నుండి మహిళలపై జరుగుతున్న హింసను ఎలుగెత్తి చాటింది ఆనాటి పత్రికా వ్యవస్థ. 1981లో జాతీయ సంస్థగా అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం(ఐద్వా) ఏర్పడినప్పటి నుండి కుటుంబ హింసను రూపుమాపేందుకుకు తన వంతు ప్రయత్నంగా కుటుంబ న్యాయ సలహా కేంద్రాల ద్వారా ఐద్వా శాఖ ఉన్న ప్రతి రాష్ట్రంలోనూ కృషి చేస్తోంది.

ఐద్వా వ్యవస్థాపకుల్లో ఒకరైన మోటూరు ఉదయం గారు 2002 మార్చిలో మరణించిన తరువాత ఆమె పేరుతో ఐద్వా ఆధ్వర్యంలో రాష్ట్రంలో మోటూరు ఉదయం ట్రస్టును ఏర్పాటు చేయటం, జిల్లా కేంద్రాల్లో కుటుంబ న్యాయ సలహా కేంద్రాలను ఏర్పాటు చేసి ముఖ్యంగా కుటుంబ హింసను ఎదుర్కొంటున్న మహిళలకు అండగా ఉంటూ వారికి కౌన్సిలింగ్ ఇవ్వటం ద్వారా కుటుంబ వ్యవస్థను కాపాడేందుకు కృషి జరుగుతోంది.

మహిళ ఉద్యమం నడిపిన అనేక పోరాటాల వల్ల మహిళలకు హక్కులు, చట్టాలు సాధించుకున్నాం. వీటిలో ముఖ్యంగా ఆస్తి హక్కు చట్టం, (హిందూ వారసత్వ చట్టం) (వారసత్వ సవరణ చట్టం) వరకట్న నిరోధక చట్టం 1961, ఐపిసి 498ఎ సెక్షన్ మరియు గృహహింస నుండి రక్షణ చట్టం 2005, మొదలగు నవి ఉన్నాయి. కానీ ఈ చట్టాల అమలును ప్రభుత్వాలు పూర్తిగా గాలికొదిలేశాయి. హక్కుల సాధన కోసం ఒక పోరాటమైతే, సాధించుకున్న హక్కుల అమలు కోసం కూడా మహిళలు ఉద్యమించాల్సిన అగత్యమేర్పడింది.

అనాది నుండీ స్త్రీ వివక్షకు గురవుతూ ఉంది. ఆదిమ సమాజంలోని మాతృస్వామిక వ్యవస్థలో స్త్రీకి ఉత్పత్తిపై,ఉత్పత్తి సాధనాలపై సంపూర్ణ అధికారాలతోపాటు గుంపుకు నాయకత్వం వహించింది. శ్రమ, సంపద అందరిదిగా ఉండేది. ఆ తరువాత కాలంలో వ్యక్తిగత ఆస్థికి అంకురార్పణ జరిగింది. ఆర్థిక సంబంధాలలో మార్పులు వచ్చాయి. స్త్రీ పూర్తిగా ఉత్పత్తి నుండి ఉత్పత్తి సాధనాల నుండి పక్కకు నెట్టివేయబడింది. అందులో భాగంగా స్త్రీ కూడా పురుషుడి కోరికలు తీర్చే ఒక సాధనంగా మారింది. ఆ దశలో




కన్యాశుల్కం అమలులోకి వచ్చింది. తరువాత కాలంలో వచ్చిన సరళీకరణ ఆర్థిక విధానాల ఫలితంగా వరకట్నం బాటలు వేసింది. ప్రస్తుతం వరునికి సంపాదనా మార్గంగా వరకట్నం మారింది. నేడు వరకట్న మహమ్మారి ఆడపిల్లల పుట్టుకతోపాటు జీవించే హక్కును కూడా

శాసిస్తోంది. ఈ నేపథ్యంలో పిండ దశలోనే ఆడపిల్లల భ్రూణ హత్యలు పెరిగాయి. పెరిగిన వరకట్న జాఢ్యం కుటుంబ విచ్ఛిన్నతకు దారితీసి కుటుంబ వ్యవస్థనే దెబ్బతీస్తోంది. కుటుంబ వ్యవస్థ దెబ్బతింటే సమాజం అస్తవ్యస్థంగా మారుతుంది. ఇలాంటి పరిస్థితుల్లో ఆడపిల్లకు అండగా ఉండేందుకు, భార్యా భర్తల మధ్య, అత్తవారింట్లో వస్తున్న అనేక సమస్యలకు కౌన్సిలింగ్ ద్వారా పరిష్కారాన్ని సూచించేందుకు మోటూరు ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో కుటుంబ న్యాయ సలహా కేంద్రాలు ఏర్పడ్డాయి.

రాష్ట్ర వ్యాప్తంగా ట్రస్టు ఆధ్వర్యంలో 18 సెంటర్స్‌లో కుటుంబ న్యాయసలహా కేంద్రాలు నడుస్తున్నాయి. అన్ని తరగతులకు సంబంధించిన స్త్రీలే కాక పురుషులు కూడా కౌన్సిలింగ్ సెంటర్స్‌కు వస్తున్నారు. ఒక్కో సెంటర్‌కు ప్రతి సంవత్సరం సుమారు 150 కేసులు వరకూ వస్తుండగా దానిలో 80 శాతం కేసులకు పరిష్కారం చూపగలుగుతున్నాం. కొన్ని కేసుల్లో అవసరమైతే పోలీసుల సహకారం తీసుకుంటున్నాం.

బాధితులు స్త్రీ అయినా పురుషుడైనా ఎటువంటి పక్షపాతం లేకుండా ఇరువురినీ పిలిచి కౌన్సిలింగ్ చేసి కాపురాలు నిలబెట్టడానికి కృషి చేస్తున్నాం. నూతన ఆర్థిక విధానాల నేపథ్యంలో కుటుంబంలో పెరిగిన రకరకాల సమస్యలకు పోలీస్ స్టేషన్లు, కోర్టును ఆశ్రయించడం కాకుండా ఇరుపక్షాలను కూర్చోపెట్టి వాళ్ళు కూడా సమస్యను గుర్తించేలా చేసి పరిష్కార మార్గంలో వాళ్ళను కూడా భాగస్వాములను చేస్తున్నాం. సమస్య మూలాల్లోకి వెళ్ళి (ఆర్థిక,సామాజిక, శారీరక, మానసిక, మద్యం, అనుమానాలు, అపోహలు మొదలైన సమస్యలు) పరిష్కారాలు సూచిస్తున్నాం. మనం కృషి ఒక్కటే సరిపోదు, ఆర్థిక సామాజిక అంశాలతో సక్రమమైన మార్పు వస్తేనే ఈ కుటుంబ వ్యవస్థ నిలబడగలదు. సమాజం పట్ల ప్రభుత్వ బాధ్యత కూడా పెరగాల్సిన అవసరమున్నది.

ఒకప్పుడు ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఉండేది. కుటుంబంలో ఏ ఒక్కరికి సమస్య వచ్చినా అందరూ పంచుకునేవారు. కష్టం, సుఖం అందరిదిగా ఉండేది. కానీ నేటి ప్రపంచీకరణ నేపథ్యంలో కుటుంబ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలుగా మారిపోయాయి. మహిళలు అటు ఉద్యోగం ఇటు కుటుంబ బాధ్యతలు నిర్వహిస్తూండటంతో వారిపై మరింత భారం పెరిగింది. దీనికి తోడు భర్త అసంతృప్తి, కోరికలు ఆమెకు వేదనగా మారాయి. మహిళలపైన కనపడని గృహహింస పెరిగింది. శారీరకంగా, మానసికంగా బాధపడుతూ సమస్యలు ఎదుర్కొంటున్న ఉద్యోగినులు కూడా కుటుంబ న్యాయసలహా కేంద్రాలను ఆశ్రయిస్తున్నారు. అదే క్రమంలో మారుతున్న ఆర్థిక సామాజిక విలువల ఫలితంగా పురుషులపై కూడా తీవ్ర ప్రభావం పడుతుంది. అసలు సమస్యలకు కారణాలు, పరిష్కారాలను చర్చించటానికి బదులు భార్యా భర్తలు పరస్పరం నిందించుకుంటున్నారు. ఫలితంగా కౌన్సిలింగ్ సెంటర్‌కు వస్తున్న పురుషుల సంఖ్య పెరుగుతోంది.

**పరిశీలించాల్సిన మరొక కోణం:**

భార్యా భర్తలంటే అవగాహన మరియు వివాహ వ్యవస్థ గురించి అవగాహన లేకుండా హడావిడి పెళ్ళిళ్ళు, పెరిగిన వినిమయ సంస్కృతి, నేను, నాది అనే స్వార్థం లాంటి అనేక అంశాలతో అంతే వేగంగా విడాకులకు వెళ్ళడం యువతీ యువకులకు సర్వసాధారణం అయింది. నేటి ఇన్‌స్టెంట్ విడాకులతో వారికి పుట్టిన పిల్లల బ్రతుకు ప్రశ్నార్థకంగా తయారవుతోంది. వివాహానికి ముందు ప్రీ మ్యారిటల్ కౌన్సిలింగ్, మ్యారేజ్ రిజిస్ట్రేషన్ మరియు హెల్త్ చెకప్, ఇరువురి మధ్య పరస్పర అవగాహన కొంత వరకూ సమస్య పరిష్కారానికి దోహదం చేస్తుంది. అలాగే వారి తల్లిదండ్రులకు కూడా అవగాహన కల్పించాలి. ఎన్నో కేసులలో తల్లిదండ్రుల ప్రమేయం వలన వారికి తెలియకుండానే పంతాలకు పట్టింపులకు పోయి చిన్న చిన్న కారణాలతోనే పిల్లల జీవితాలను ఛిన్నాభిన్నం చేస్తున్నారు. చివరికి భార్యాభర్తలు విడిపోతున్నారు. ఇటువంటి సందర్భాలలో కౌన్సిలింగ్ సెంటర్స్ సలహాలు తీసుకోవటం ఎంతైనా అవసరం.

పాశ్చాత్య విషసంస్కృతి మరియు వినిమయ సంస్కృతిలో పడి వస్తు వ్యామోహంతో యువత తనను తాను అగాధంలోకి నెట్టివేసుకుంటున్నారు. తద్వారా కుటుంబానికి, సమాజానికి తీరని నష్టం వాటిల్లుతోంది. విలాస జీవితాల పట్ల మోజు, పైపై ఆకర్షణే ప్రేమగా మరియు జీవితంగా భావించి భ్రమపడుతూ ఉన్నారు. ఆర్థిక సంబంధాలే పునాదిగా ఉన్న కుటుంబ యూనిట్‌ను సమూలంగా ప్రక్షాళన చెయ్యందే సమస్య పరిష్కారం కాదు. ఏ వ్యక్తిగత ఆస్థి ద్వారా సమాజం రెండు వర్గాలుగా చీలిపోయిందో స్త్రీ పతనానికి కారణమయిందో ఆ వ్యక్తిగత ఆస్తిని నిర్మూలించి స్త్రీ పురుషులు అన్ని రంగాలలో అభివృద్ధి చెందేట్టుగా చర్యలు తీసుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉంది. అప్పుడే పరస్పర నమ్మకం, విశ్వాసం, ప్రేమ, సహకారం, గౌరవం పునాదిగా ఆదర్శ కుటుంబ వ్యవస్థ ఏర్పడుతుంది.

# భ్రూణ హత్యలకు కారకులెవరు?

- మల్లు లక్ష్మి

మహిళలపై తరతరాలుగా వివిధ రూపాల్లో జరుగుతున్న హింసను అరికట్టేందుకు మూడు దశాబ్దాల క్రితం మహిళా సంఘం ఆధ్వర్యంలో కుటుంబ న్యాయ సలహా కేంద్రాలు ఏర్పడ్డాయి మహిళ ఉద్యమం నడిపిన అనేక పోరాటాల వల్ల మహిళలకు హక్కులు, చట్టాలు సాధించుకున్నాం. వీటిలో ముఖ్యంగా ఆస్తి హక్కు చట్టం, (హిందూ వారసత్వ చట్టం) (వారసత్వ సవరణ చట్టం) వరకట్న నిరోధక చట్టం 1961, ఐపిసి 498ఎ సెక్షన్ మరియు గృహహింస నుండి రక్షణ చట్టం 2005, మొదలగు నవి ఉన్నాయి. కానీ ఈ చట్టాల అమలును ప్రభుత్వాలు పూర్తిగా గాలికొదిలేశాయి. హక్కుల సాధన కోసం ఒక పోరాటమైతే, సాధించుకున్న హక్కుల అమలు కోసం కూడా మహిళలు ఉద్యమించాల్సిన అగత్యమేర్పడింది.

అనాది నుండీ స్త్రీ వివక్షకు గురవుతూ ఉంది. ఆదిమ సమాజంలోని మాతృస్వామిక వ్యవస్థలో స్త్రీకి ఉత్పత్తిపై,ఉత్పత్తి సాధనాలపై సంపూర్ణ అధికారాలతోపాటు గుంపుకు నాయకత్వం వహించింది. శ్రమ, సంపద అందరిదిగా ఉండేది. ఆ తరువాత కాలంలో వ్యక్తిగత ఆస్థికి అంకురార్పణ జరిగింది. ఆర్థిక సంబంధాలలో మార్పులు వచ్చాయి. స్త్రీ పూర్తిగా ఉత్పత్తి నుండి ఉత్పత్తి సాధనాల నుండి పక్కకు నెట్టివేయబడింది. అందులో భాగంగా స్త్రీ కూడా పురుషుడి కోరికలు తీర్చే ఒక సాధనంగా మారింది. ఆ దశలో కన్యాశుల్కం అమలులోకి వచ్చింది. తరువాత కాలంలో వచ్చిన సరళీకరణ ఆర్థిక విధానాల ఫలితంగా వరకట్నం బాటలు వేసింది. ప్రస్తుతం వరునికి సంపాదనా మార్గంగా వరకట్నం మారింది. నేడు వరకట్న మహమ్మారి ఆడపిల్లల పుట్టుకతోపాటు జీవించే హక్కును కూడా శాసిస్తోంది. ఈ నేపథ్యంలో పిండ దశలోనే ఆడపిల్లల భ్రూణ హత్యలు పెరిగాయి. పెరిగిన వరకట్న జాఢ్యం కుటుంబ విచ్ఛిన్నతకు దారితీసి కుటుంబ వ్యవస్థనే దెబ్బతీస్తోంది. కుటుంబ వ్యవస్థ దెబ్బతింటే సమాజం అస్తవ్యస్థంగా మారుతుంది. ఇలాంటి పరిస్థితుల్లో ఆడపిల్లకు అండగా ఉండేందుకు, భార్యా భర్తల మధ్య, అత్తవారింట్లో వస్తున్న అనేక సమస్యలకు కౌన్సిలింగ్ ద్వారా పరిష్కారాన్ని సూచించేందుకు మోటూరు ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో కుటుంబ న్యాయ సలహా కేంద్రాలు ఏర్పడ్డాయి.



రాష్ట్ర వ్యాప్తంగా ట్రస్టు ఆధ్వర్యంలో 18 సెంటర్స్‌లో కుటుంబ న్యాయసలహా కేంద్రాలు నడుస్తున్నాయి. అన్ని తరగతులకు సంబంధించిన స్త్రీలే కాక పురుషులు కూడా కౌన్సిలింగ్ సెంటర్స్‌కు వస్తున్నారు. ఒక్కో సెంటర్‌కు ప్రతి సంవత్సరం సుమారు 150 కేసులు వరకూ వస్తుండగా దానిలో 80 శాతం కేసులకు పరిష్కారం చూపగలుగుతున్నాం. కొన్ని కేసుల్లో అవసరమైతే పోలీసుల సహకారం తీసుకుంటున్నాం.

బాధితులు స్త్రీ అయినా పురుషుడైనా ఎటువంటి పక్షపాతం లేకుండా ఇరువురినీ పిలిచి కౌన్సిలింగ్ చేసి కాపురాలు నిలబెట్టడానికి కృషి చేస్తున్నాం. నూతన ఆర్థిక విధానాల నేపథ్యంలో కుటుంబంలో పెరిగిన రకరకాల సమస్యలకు పోలీస్ స్టేషన్లు, కోర్టును ఆశ్రయించడం కాకుండా ఇరుపక్షాలను కూర్చోపెట్టి వాళ్ళు కూడా సమస్యను గుర్తించేలా చేసి పరిష్కార మార్గంలో వాళ్ళను కూడా భాగస్వాములను చేస్తున్నాం. సమస్య మూలాల్లోకి వెళ్ళి (ఆర్థిక,సామాజిక, శారీరక, మానసిక, మద్యం, అనుమానాలు, అపోహలు మొదలైన సమస్యలు) పరిష్కారాలు సూచిస్తున్నాం. మనం కృషి ఒక్కటే సరిపోదు, ఆర్థిక సామాజిక అంశాలతో

(మిగతా 74వ పేజీలో)

**మీడియా**

# మాకొద్దీ చెత్త ప్రోగ్రాములు

– కె. అరుణ




సాయంత్రం ఆఫీసు నుండి ఉసూరంటూ ఇంటికొచ్చిన రాజు తలుపు తీయగానే కనిపించిన దృశ్యాన్ని చూసి దంగైపోయాడు. రాణి యమా సీరియస్‌గా ముఖమంతా బొట్ట బిళ్ళలు అతికించుకుంటోంది. ఇదేం చిత్రం అంటూ కంగారు పడ్డ రాజు, "ప్రొద్దున్న వెళ్ళేటప్పుడు బాగానే ఉందే, ఇంతలోనే ఏమైందబ్బా' అని గాభరాపడ్డాడు. అంతలో రాణి భర్తను చూసింది. 'వచ్చారా! రండి రండి మీకోసం పకోడీలు చేశా. తిందురుగాని' అంటూ కిచెన్‌లోకి వెళ్ళింది. ఆ మాటలు విన్నాక రాజు గుండె మళ్ళీ మామూలుగా కొట్టుకోవడం మొదలెట్టింది. 'ఫర్వాలేదు. నా భార్య బంగారం. తనకేమీ కాలేదు' అని నిట్టూర్చాడు. ఆ సంతోషం ఒకరోజు కూడా లేదు. మర్నాడూ అదే తంతు. ఈసారి రాణి జుట్టునిండా స్ట్రాలు దోపుకుంటోంది. "మళ్ళీ ఏమొచ్చిందే నీకు' అనుకున్నాడో లేదో బజ్జీల ప్లేటుతో నవ్వుకుంటూ రాణి కళ్లెదురుగా ప్రత్యక్షం. అది చూశాక తాను అంతకు ముందు చూసింది నిజమా లేక భ్రమా అన్న అనుమానం రాజుకొచ్చింది. కళకళలాడుతూ తిరుగుతున్న ఇల్లాలిని చూస్తుంటే అనుమానాలన్నీ పటాపంచలైపోయాయి. 'ఛ, ఛ! ఎండలో వచ్చాను కనుక ఇలా అనిపిస్తుందంతే! అనవసరంగా నా హృదయ సామ్రాజ్ఞిని అనుమానించాను' అని సంతృప్తిపడి గుండెల నిండా ఊపిరి పీల్చుకున్నాడు.

మూడో రోజు చరిత్ర పునరావృతమైంది. ఈసారి ట్రిబుల్ ధమాకా! రాణికి ఎదురింటి సరోజ, పక్కింటి రాధ తోడయ్యారు. చిత్ర విచిత్ర విన్యాసాలు చేస్తూ మురిసిపోతున్నారు. ముగ్గురి ఎదుటా ఒక టీపాయ్ ఉంది. దానిపై మూడు ప్లేట్లలో లడ్డూలున్నాయి. ముగ్గురూ రెండు చేతులూ వెనక్కు పెట్టుకుని నోటితో లడ్డులు అందుకుంటున్నారు. ఇక రాజు రెండో ఆలోచనకు తావివ్వలేదు. అచ్చంగా పాత సినిమాల్లో తాళికట్టే సమయానికి అన్నట్లే 'ఆపండి' అని అరిచాడు. తుళ్లిపడ్డ ఆ ముగ్గురు ముదితలు ముందుకు తూలిపడబోయి ఎలాగో అపుకున్నారు. 'ఏంటండీ!ఏమైంది మీకు! హైద్రాబాద్ ట్రాఫిక్, కాలుష్యంలో పడీ పడీ వచ్చేసరికి రూపంలోనే తేడా వస్తుందనుకున్నాను. ఇంకేమైనా తేడా చేసిందా ఏంటి?' ఆదుర్దాగా భర్తను ప్రశ్నించింది రాణి.

'నేనడగాల్సిన ప్రశ్న నన్నే అడుగుతున్నావా? తేడా చేసింది నీకా, నాకా?' ఉక్రోషంగా ఎదురు ప్రశ్నించాడు రాజు. 'మీరేం మాట్లాడుతున్నారో నాకర్థం కావడం లేదండీ' బేలగా అంది రాణి. రాధ, సరోజ మాత్రం మొగుడు పెళ్లాల మధ్యలో ఎందుకనుకున్నారో, ఏమో మెల్లగా గుమ్మం దాటసాగారు. మరోసారి రాజు, 'ఆగండి' అని గర్జించాడు. దెబ్బకు వాళ్లిద్దరూ బిక్కుబిక్కుమంటూ ఓమూల నక్కారు. 'అసలు మీకేమైంది? ఈ పిచ్చి పిచ్చి పనులేంటి? ఆకలేస్తే శుభ్రంగా ప్లేట్లో పెట్టుకుని కావలసినన్ని తినండి. ఎవరొద్దన్నారు? కానీ, ఇవేం పనులు? నలుగురూ చూస్తే నవ్విపోరూ?' అని మూణ్నాళ్ల వేదనంతా వెళ్లగక్కాడు రాజు. 'ఆ నలుగురూ చూడ్డానికేనండీ ఈ తపనంతా?' కొంగుతో నుదుటన పట్టిన చిరుచెమటను అద్దుకుంటూ సమాధానమిచ్చింది రాణి.

ఒక క్షణం తనను తాను మర్చిపోయాడు రాజు. 'ఆహా! నా రాణి కావ్యకన్యలా ఎంత ముద్దొస్తోంది' అనుకుని మైమరచిపోయాడు. అంతలోనే, 'నాలో అర్ధభాగంగా ఉండే ప్రాణమేనా ఇలా ప్రవర్తిస్తోంది' బాధపడ్డాడు రాజు. కానీ కర్తవ్యం గుర్తొచ్చింది. 'మరి మీ తిక్కపనుల వెనుకున్న మతలబేంటో చెప్పండి' హుంకరించాడు. 'అయ్యో! ఇదంతా 'మా

ఈసారి ట్రిబుల్ ధమాకా! రాణికి ఎదురింటి సరోజ, పక్కింటి రాధ తోడయ్యారు. చిత్ర విచిత్ర విన్యాసాలు చేస్తూ మురిసిపోతున్నారు. ముగ్గురి ఎదుటా ఒక టీపాయ్ ఉంది. దానిపై మూడు ప్లేట్లలో లడ్డూలున్నాయి. ముగ్గురూ రెండు చేతులూ వెనక్కు పెట్టుకుని నోటితో లడ్డులు అందుకుంటున్నారు. ఇక రాజు రెండో ఆలోచనకు తావివ్వలేదు. అచ్చంగా పాత సినిమాల్లో తాళికట్టే సమయానికి అన్నట్లే 'ఆపండి' అని అరిచాడు. తుళ్లిపడ్డ ఆ ముగ్గురు ముదితలు ముందుకు తూలిపడబోయి ఎలాగో అపుకున్నారు.

వనితలంటే కేవలం వంటల కార్యక్రమాలు, లేదంటే చీరల ధరలు చెప్పడాలు, కాదంటే ఈ తింగరి పనులకే పరిమితమా? మహిళల ప్రతిభాపాటవాలను ప్రదర్శించుకోవడానికి, వారిలోని సామర్థ్యాన్ని నిరూపించుకోవడానికి ఇంతకంటే మార్గాలు లేవా? చెప్పాలంటే, ఈ కార్యక్రమాలు మిమ్మల్ని అవమానపరిచేవి. వాస్తవ ప్రపంచాన్ని తెలుసుకోనీయకుండా మిమ్మల్ని బావిలో కప్పల్లా మిగిల్చేవి. మీరంతా వీటిని బహిష్కరించాలి.

ఇంటి సీతాయణం' అనే టివి ప్రోగ్రామ్ కోసమండీ!' భర్తతో చెప్పింది రాణి. 'అయితే...?' అర్థం కానట్లు వెర్రిచూపులు చూశాడు రాజు. టివి కార్యక్రమానికీ, ఈ తింగరి చేష్టలకీ లింకెలా కుదిరిందో అతనికి ఛస్తే అర్థం కాలేదు.

భర్త అమాయకత్వానికి జాలిపడుతూనే, 'ఆ కార్యక్రమంలో పాల్గొని చీరెలు కొట్టేయాలన్నా, బహుమతులు గెల్చుకోవాలన్నా ఇలాంటి పనులే చేయాలి. అందులో వాళ్లిచ్చిన టైములో టపాటపా ముఖమంతా బొట్టుబిళ్లలు పెట్టుకోవాలి. చకచకా స్ట్రాలు జుట్టులో దోపుకోవాలి. ఆ పోటీల్లో గెలిస్తే మన పంట పండినట్టే! వాళ్ళు చాలా ప్రైజులిస్తారు. అంతేనా! దేశమంతా మనల్ని టివిలో చూస్తారు. రోడ్డుమీద వెళ్తోంటే అంతా గుర్తువడతారు. బంధుమిత్రుల్లో మన పరపతి చాంతాడులా పెరిగిపోతుంది. అప్పుడు నన్ను చూసి వాళ్లేం ఖర్మ, మీరూ కుళ్లుకుంటారు. అన్నట్లు, ఇదేం చూశారు? అందులో నేను డాన్సు కూడా చేయాలి. అందుకోసం నేను 'సారొస్తారొస్తారే....' అన్న పాటకు ప్రాక్టీస్ చేస్తున్నా! చెప్పడం ఎందుకు? మీరలా కూర్చోండి' అంటూనే మ్యూజిక్ స్టార్ట్ చేసి రాణి స్టెప్పులేయడం మొదలెట్టింది. 'మేం కూడా' అంటూ రాణితో ఆమె మిత్రబృందం కదం కలిపారు.

రాజుకు ఒక్కసారిగా కడుపులో దేవినట్లయింది. వీళ్లకిదేం పోయేకాలం? ఎంతో పద్ధతిగా ఉండే వీళ్లలో ఈ తెగులేంటి? తమ వర్చనాలిటీలు పట్టించుకోకుండా....ఎదుట ఎవరున్నారో లెక్కచేయకుండా ఇలా ఒళ్ళు మరిచి డాన్సు చేస్తున్నారు. రేపు కెమెరా ముందు ఇలాగే చేస్తారా? అది చూసి అంతా నవ్వుకోరా? వీరి గురించి ఎగతాళిగా మాట్లాడుకోరా' జరగబోయేది కళ్లముందు రీలులా తిరిగేసరికి రాజు గుండెలు పీచుపీచుమన్నాయి. ఇలాగైతే లాభం లేదనుకున్నాడు. ముందు లేచి పాట కట్టేశాడు. ఆపై మెల్లగా గొంతు సవరించుకున్నాడు.

'చూడండి! ఆ కార్యక్రమానికి వెళ్లాలనుకోవడంలో తప్పేంలేదు. ఇంటిపనంతా ముగించుకుని కాసేపు రిలాక్సవడానికి మీరు టివి పెడతారు. మీకది అవసరం కూడా! ఆ సమయానికి ఈ అడ్డగోలు కార్యక్రమాలన్నీ వస్తుంటాయి. వస్తుంటాయేంటి, అవి మీ కోసం సృష్టించినవైతే! ఈ సమయం ఏరికోరి మరీ ఛానళ్లవారు వీటిని ప్రచారం చేస్తారైతే! సరే, అందులో ఇచ్చే బహుమతులు ఒక ఎత్తయితే...టివిలో కనిపిస్తున్నామన్న అత్యుత్సాహంతో పాల్గొనేవారు చేసే విన్యాసాలు మరోఎత్తు. ఇవన్నీ ప్రేక్షకులకు ఆసక్తిగా అనిపిస్తాయి. కుతూహలాన్ని పెంచుతాయి. ఎలాగైనా పాల్గొనాలనే ఉత్సుకతను రేకెత్తిస్తాయి. ఇంట్లోని ఇల్లాళ్లను ఆకట్టుకుని రేటింగ్స్ పెంచుకోవడం ఛానళ్లకు లాభాలపంట పండిస్తుంది. ఆ కార్యక్రమాల రూపకల్పన వెనుకదాగున్న వాస్తవం మరోటుంది. ఈ కార్యక్రమాలు వివిధ కంపెనీల వస్తువులు, చీరల షాపుల ప్రచార వేదికలు! ఈ ఎత్తుగడ పూలలో దారంలా పైకి కనిపించదు. అందులో భాగమే ఈ బహుమతులు, చీరెలు! మరి మార్కెటింగ్ ప్రపంచం వర్ధిల్లాలంటే మిమ్మల్ని మించిన వనరు వారికి ఇంకొకరు లేరుగా!

కానీ, ఒక్కసారి ఆలోచించండి. ఈ కార్యక్రమంలో పాల్గొనేవారు పోటీల పేరిట చేసే చేష్టలు ఏమైనా పద్ధతిగా అనిపిస్తున్నాయా? ఒక చీరకోసం, టివిలో కనిపించడం కోసం ఎంతకైనా దిగజారాలా? ఇదంతా ప్రజల్ని పిచ్చివాళ్ళని చేయడం కాదూ! స్త్రీల పట్ల వారికెంత చులకనాభావం లేకుంటే ఇలాంటి వెర్రి ప్లానులేస్తారు? గృహిణుల పట్ల వారికున్న తక్కువ భావం మీకర్థం కావడంలేదా? వనితలంటే కేవలం వంటల కార్యక్రమాలు, లేదంటే చీరల ధరలు చెప్పడాలు, కాదంటే ఈ తింగరి పనులకే పరిమితమా? మహిళల ప్రతిభాపాటవాలను ప్రదర్శించుకోవడానికి, వారిలోని సామర్థ్యాన్ని నిరూపించుకోవడానికి ఇంతకంటే మార్గాలు లేవా? చెప్పాలంటే, ఈ కార్యక్రమాలు మిమ్మల్ని అవమానపరిచేవి. వాస్తవ ప్రపంచాన్ని తెలుసుకోనీయకుండా మిమ్మల్ని బావిలో కప్పల్లా మిగిల్చేవి. మీరంతా వీటిని బహిష్కరించాలి. మళ్లీ మాట్లాడితే వీటికి వ్యతిరేకంగా పోట్లాడాలి.

నిజానికి మగువలకు ఎన్నో విశేష లక్షణాలున్నాయి. శ్రీమతిగా, తల్లిగా, స్నేహమయిగా ఇంట్లోనే కాదు, బయటి ప్రపంచంలోనూ మీరు అన్ని రంగాల్లోనూ ముందడుగు వేస్తున్నారు. అన్నిటా రాణించగల సత్తా....గగనతలాన్ని సైతం అందుకోగల మహోన్నత లక్షణాలు స్త్రీ జాతిలో నిండుగా కొలువుదీరాయి. వీలైతే వాటిని ప్రపంచానికి చాటిచెప్పే కార్యక్రమాలు ఏర్పాటుచేయమనండి. మీలో అంతర్లీనంగా ఉండే సృజనను వెలికితీసి, మరింత మెరుగులు దిద్దే ప్రక్రియలుంటే మేం సిద్ధమని సవాలు విసరండి. అంతేకానీ, మాలోని జిజ్ఞాసను కుదించే ఆషామాషీ వ్యవహారాలకు మేం దూరమని తెగేసి చెప్పండి. మా శక్తిసామర్థ్యాలను కూకటివేళ్ళతో పెకిలించే ఈ చెత్త పోటీలు మాకు తగవంటూ ధిక్కార స్వరాన్ని వినిపించండి' రాజు మాటలు ముగ్గురూ రెప్పలార్పకుండా విన్నారు.

స్త్రీలకే ప్రత్యేకంగా ఏర్పాటు చేసినట్లు కనిపిస్తున్న వీటి వెనుక కనిపించని పార్శ్వాన్ని కొత్తగా చవి చూశారు. తమ ప్రజ్ఞాపాటవాలకు తిలోదకాలిచ్చి మహిళా లోకాన్ని వంచనకు గురిచేస్తున్న కార్యక్రమాలివని తొలిసారిగా తెలుసుకున్నారు. తెలుసుకోవడమే కాదు, ఇకనుండి ఏం చేయాలో కూడా అవగతం చేసుకున్నారు. మరి మీరు?! ★

# బాల్య వివాహ నిరోధక చట్టం 1929 (శారద యాక్ట్)

- ఆర్. దుర్గా ప్రసన్న, అడ్వకేట్



ఏ వ్యక్తి అయినా ఏ సమాజం అయినా న్యాయం, ధర్మం అనే రెండు సూత్రాల మీదనే మనగలుగుతుంది. ఈ సూత్రాలకు విఘాతం కలిగినప్పుడు సమాజంలోని వ్యక్తుల మనుగడ కుంటుబడుతుంది. అపుడు శాసనాల ఆవశ్యకత ఏర్పడుతుంది. మన దేశంలో స్వాతంత్ర్యానికి పూర్వం నుండీ ఇప్పటి వరకూ అనేక చట్టాలు అమల్లోకి వచ్చాయి. ఇంకా కొత్త చట్టాల ఆవశ్యకత ఏర్పడుతూనే ఉంది. కొన్ని చట్టాలు కాలానుగుణంగా అవసరమైన మార్పులు, చేర్పులకు లోనవుతూ వున్నాయి. స్త్రీలకు సంబంధించినంతవరకు ప్రత్యేకించిన చట్టాలలో 'బాల్యవివాహ నిరోధక చట్టం, 1929ని మొదటగా చెప్పుకోవచ్చును. ఇదే శారదా చట్టంగా బాగా ప్రజలలో ప్రాచుర్యం పొందింది.

నేటి తరం స్త్రీలు బాగా చదువుకుని, మంచి, మంచి ఉద్యోగాల్లో ఉన్నారంటే దీనికి శారదా చట్టం ఎంతో దోహదకారి అని చెప్పక తప్పదు. కానీ వంద సంవత్సరాల క్రితం స్త్రీ విద్య సంగతే లేదు. పుట్టినప్పటి నుండీ ఆమెకి వివాహం ఒక్కటే ఆమె జీవితంలో ముఖ్యం అనుకునే రోజులవి. అప్పటి కాలము, పరిస్థితులు, కారణాలు మొదలైనవి పరిగణనలోకి తీసుకుంటే ఆడపిల్ల సంరక్షణని తల్లిదండ్రులు భారంగా భావించే రోజులని చెప్పక తప్పదు. వివాహానంతరం ఆడపిల్ల మరో ఇంటికి వెళ్ళి పోయేదిగానే భావించే వారే ఎక్కువమంది. విదేశీయులనేక మంది ఈ దేశంపై దండెత్తినపుడు వారు ఇక్కడి సంపదను కొల్ల గొట్టడమే కాక ఆడపిల్లలపై దాడులు, అత్యాచారాలు చేసేవారు. ఇటువంటి అనేక సాంఘిక నేపథ్యాలలో ఆడపిల్లలకి చాలా చిన్న వయస్సులోనే పెళ్ళిళ్ళు చేసి పెద్ద మనిషి అయిన తరువాత కాపురానికి పంపడం అనే సాంప్రదాయం నెలకొంది. 'పెళ్ళి కావలసిన ఆడపిల్ల గుండెలమీద కుంపటి' అనీ, 'ఆడపిల్ల పెళ్ళి చేసి బాధ్యత వదిలించుకోవడం'అనే మాటలు నానుడులు మనం వింటూనే ఉంటున్నాం.

ఈ బాల్య వివాహాల వల్ల ఆడపిల్లల్లో శారీరక, మానసిక పెరుగుదల ఆగిపోయేది. వారి యొక్క ఆరోగ్యం విద్య కుంటుపడడమే కాక వారి వ్యక్తిగత స్వేచ్ఛను కోల్పోయి వారి జీవన వికాసం దెబ్బతినేది. అంతేకాదు ఇంటిపని, వంటపని, పిల్లలని కనడం అంటేనే స్త్రీ అనే భావన సమాజంలో నెలకొంది. ఇందువల్ల వారి సమర్థత లోపించడమేకాక వారు మరింత బలహీనులుగా మారి, వారిపై జరిగే అత్యాచారాలను, అకృత్యాలను కూడా ఎదిరించలేని బేలలుగా మారిపోవడం పెరిగింది. ఈ పరిస్థితిని సమీక్షించి అప్పట్లో అనేక మంది సంఘ సంస్కర్తలు స్త్రీ విద్య, స్త్రీ ఆరోగ్యంలాంటి విషయాలపై దృష్టిని కేంద్రీకరించి బాల్య వివాహాలను వ్యతిరేకించారు. అనేక చర్చలు జరిపి చట్ట సభలో చట్టంగా/శాసనంగా తీసుకురావడానికి కావలసిన చర్యలూ చేపట్టారు. వాటి ఫలితమే ఈ బాల్య వివాహాల నిరోధక చట్టం-1929లో రూపుదిద్దుకున్నప్పటికీ 1930 ఏప్రిల్ నెల 11వ తేదీ నుండి ఇది పూర్తి స్థాయి అమలులోకి వచ్చింది. ఈ చట్టం అమలులోకి వచ్చినపుడు బాలికలకు 14 సం॥లు, బాలురకు 18సం॥లు వివాహ వయస్సుగా నిర్ణయించారు. అంటే 3 సం॥లు, 5సం॥ల వయస్సు పిల్లలను కూడా తల్లిదండ్రులు ఒడిలో కూర్చోపెట్టుకుని పిల్లలకు వివాహం చేసేవారు. ఈ చట్ట ప్రకారం ఈ కనీస వివాహ వయస్సు రాని

పిల్లలకు వివాహం చేస్తే ఆ వివాహం చెల్లదు. అంతేకాదు అటువంటి వివాహం జరిపించిన తల్లిదండ్రులూ, పెద్దలూ శిక్షార్హులే.

తరువాతి కాలంలో అమ్మాయికి వివాహ వయస్సును 18గానూ, అబ్బాయికి 21సం॥లుగాను నిర్ణయిస్తూ చట్టంలో సవరణలు జరిగాయి. ఈ చట్ట ప్రకారం 21సం॥ల లోపు వయస్సుగల అబ్బాయి మైనర్ అమ్మాయిని వివాహం చేసుకుంటే అతడు సెక్షన్ 3 ప్రకారం శిక్షార్హుడవుతాడు. రూ॥ 1,000 జరిమానా గానీ లేదా 15 రోజుల జైలు శిక్షగానీ వేయవచ్చును.

21సం॥లు దాటిన అబ్బాయి మైనర్ అమ్మాయిని వివాహం చేసుకున్నట్లయితే సెక్షన్ 4 ప్రకారం 3 నెలల జైలు శిక్ష మరియు జరిమానాను శిక్షగా వేయవచ్చును.

ఈ చట్టం ప్రకారం బాల్య వివాహాలను జరిపించిన తల్లిదండ్రులు, ఇతర పెద్దలు కూడా శిక్షార్హులే. అంతేకాదు బాల్య వివాహ నిరోధక చట్టంలో సెక్షన్ 12 ప్రకారం బాల్య వివాహం జరుగుతున్నట్లుగా తెలిసిన పక్షంలో ఇంజక్షన్ ఆర్డర్ ద్వారా అట్టి వివాహాన్ని జరువకుండా నిరోధించవచ్చును.

చట్టాలు సమర్థవంతంగా ఉపయోగించుకున్నపుడు ప్రజలకు మేలు జరుగుతుంది. అందుకు ప్రజా సహకారం మరియు ప్రజలలో చైతన్యం కూడా అవసరమే. అందుకు నిదర్శనమే బాల్య వివాహాల నిరోధక చట్టం 1929 అని చెప్పడానికి సందేహం లేదు. ఈ చట్టం ద్వారా బాల్య వివాహాలు నిరోధించబడ్డాయి. పసిపిల్లలకు వివాహం చేసే దురాచారాన్ని ఈ చట్టం సమర్థవంతంగా నిరోధించింది అనడం ఏమాత్రం అతిశయోక్తికాదు.

**(70వ పేజీ తరువాయి)**

సక్రమమైన మార్పు వస్తేనే ఈ కుటుంబ వ్యవస్థ నిలబడగలదు. సమాజం పట్ల ప్రభుత్వ బాధ్యత కూడా పెరగాల్సిన అవసరమున్నది.

ఒకప్పుడు ఉమ్మడి కుటుంబ వ్యవస్థ ఉండేది. కుటుంబంలో ఏ ఒక్కరికి సమస్య వచ్చినా అందరూ పంచుకునేవారు. కష్టం, సుఖం అందరిదిగా ఉండేది. కానీ నేటి ప్రపంచీకరణ నేపథ్యంలో కుటుంబ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలుగా మారిపోయాయి. మహిళలు అటు ఉద్యోగం ఇటు కుటుంబ బాధ్యతలు నిర్వహిస్తూండటంతో వారిపై మరింత భారం పెరిగింది. దీనికి తోడు భర్త అసంతృప్తి, కోరికలు ఆమెకు వేదనగా మారాయి. మహిళలపైన కనపడని గృహహింస పెరిగింది. శారీరకంగా, మానసికంగా బాధపడుతూ సమస్యలు ఎదుర్కొంటున్న ఉద్యోగినులు కూడా కుటుంబ న్యాయసలహా కేంద్రాలను ఆశ్రయిస్తున్నారు. అదే క్రమంలో మారుతున్న ఆర్థిక సామాజిక విలువల ఫలితంగా పురుషులపై కూడా తీవ్ర ప్రభావం పడుతుంది. అసలు సమస్యలకు కారణాలు, పరిష్కారాలను చర్చించటానికి బదులు భార్యా భర్తలు పరస్పరం నిందించుకుంటున్నారు. ఫలితంగా కౌన్సిలింగ్ సెంటర్‌కు వస్తున్న పురుషుల సంఖ్య పెరుగుతోంది.

**పరిశీలించాల్సిన మరొక కోణం:**

భార్యా భర్తలంటే అవగాహన మరియు వివాహ వ్యవస్థ గురించి అవగాహన లేకుండా హడావిడి పెళ్ళిళ్ళు, పెరిగిన వినిమయ సంస్కృతి, నేను, నాది అనే స్వార్థం లాంటి అనేక అంశాలతో అంతే వేగంగా విడాకులకు వెళ్ళడం యువతీ యువకులకు సర్వసాధారణం అయింది. నేటి ఇన్‌స్టెంట్ విడాకులతో వారికి పుట్టిన పిల్లల బ్రతుకు ప్రశ్నార్థకంగా తయారవుతోంది. వివాహానికి ముందు ప్రీ మ్యారిడల్ కౌన్సిలింగ్ మరియు హెల్త్ చెకప్, ఇరువురి మధ్య పరస్పర అవగాహన కొంత వరకూ సమస్య పరిష్కారానికి దోహదం చేస్తుంది. అలాగే వారి తల్లిదండ్రులకు కూడా అవగాహన కల్పించాలి. ఎన్నో కేసులలో తల్లిదండ్రు ప్రమేయం వలన వారికి తెలియకుండానే పంతాలకు పట్టింపులకు పోయి చిన్న చిన్న కారణాలతోనే పిల్లల జీవితాలను ఛిన్నాభిన్నం చేస్తున్నారు. చివరికి భార్యాభర్తలు విడిపోతున్నారు. ఇటువంటి సందర్భాలలో కౌన్సిలింగ్ సెంటర్స్ సలహాలు తీసుకోవటం ఎంతైనా అవసరం.

పాశ్చాత్య విషసంస్కృతి మరియు వినిమయ సంస్కృతిలో పడి వస్తు వ్యామోహంతో యువత తనను తాను అగాధంలోకి నెట్టివేసుకుంటున్నారు. తద్వారా కుటుంబానికి, సమాజానికి తీరని నష్టం వాటిల్లుతోంది. విలాస జీవితాల పట్ల మోజు, పైపై ఆకర్షణే ప్రేమగా మరియు జీవితంగా భావించి భ్రమపడుతూ ఉన్నారు. ఆర్థిక సంబంధాలే పునాదిగా ఉన్న కుటుంబ యూనిట్‌ను సమూలంగా ప్రక్షాళన చెయ్యందే సమస్య పరిష్కారం కాదు. ఏ వ్యక్తిగత ఆస్థి ద్వారా సమాజం రెండు వర్గాలుగా చీలిపోయిందో స్త్రీ పతనానికి కారణమయిందో ఆ వ్యక్తిగత ఆస్తిని నిర్మూలించి స్త్రీ పురుషులు అన్ని రంగాలలో అభివృద్ధి చెందేట్టుగా చర్యలు తీసుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉంది. అప్పుడే పరస్పర నమ్మకం, విశ్వాసం, ప్రేమ, సహకారం, గౌరవం పునాదిగా ఆదర్శ కుటుంబ వ్యవస్థ ఏర్పడుతుంది.

# స్పందన

చైతన్య మానవి ఏప్రిల్-జూన్ 2012 సంచిక చాలా విజ్ఞాన దాయకంగా ఉంది. 60 సం॥రాలు పైబడిన స్త్రీల ఆరోగ్యం గురించి వారికి వచ్చే అనేక రకాల సమస్యల గురించి వివరంగా వ్రాశారు. ఇలాంటివి చదివితే వార్థక్యంలో భయం లేకుండా జాగ్రత్తపడవచ్చు. రచయిత్రి చాగంటి కృష్ణకుమారిగారి ధన్యవాదాలు.

అమ్మకడుపులో ఆడపిల్ల కవిత నేటి పరిస్థితులకు అద్దం పట్టేదిగా ఉంది. సంఘ సంస్కర్త వీరేశలింగంగారిని గూర్చి రాసినట్టే, సంఘసంస్కర్తలకు ఒకపేజీ కేటాయిస్తే బాగుంటుంది.

**-కె.శుభ, కుకట్‌పల్లి.**

చైతన్య మానవి తడవ తడవకి అనేక కొత్త విషయాలు విజ్ఞానదాయకంగా, చదివించేలా ఉంటోంది. ఆరోగ్యం శీర్షిక మాదిరిగానే న్యాయసలహాలు శీర్షిక కూడా కొనసాగిస్తే మంచిది.

**- కె.సత్యవతి, కూకట్‌పల్లి.**

ఏప్రిల్-జూన్ 2012 చైతన్య మానవి కవర్‌పేజీ, నేటి సందర్భానికి అద్దం పట్టేలా ఉంది. సామాన్యుడిపై పాలకులు మోపే భారాలతోపాటు మోయలేక నడ్డి ఎలా విరుగుతుందో కవర్‌పేజీ చూపించింది. ఇక పత్రికలో ఆర్టికల్స్ అన్నీ బావున్నాయి. ముఖ్యంగా హైమావతిగారి వేదాలు, పంచాంగాలు ఎవరి కోసం అనే ఆర్టికల్ బావుంది. స్త్రీని అణిచివేయడానికి వేదాలు, పంచాగాలు ఎలా పనికొస్తున్నాయి వివరించారు. అదే ఆర్టికల్ చివరిలో వ్రాసిన పేరా బావుంది. సర్టిఫికెట్ ఉండే చదువులు మాత్రమే సరిపోవు. మనల్ని మనం రక్షించుకోవడం అర్థమవ్వాలి. ఇది చదువుకుంటే మన పిల్లలకు మనం అదే నేర్పుతున్నామా? అనే ప్రశ్న కలుగుతూ ఉంది. 60 సం॥రాలు పైబడిన స్త్రీల ఆరోగ్యం సంభాషణ బావుంది. దాంట్లో చివర్లో కాంతమ్మ అన్న మాటలు "ఏ రోగం లేకుండా చెట్టునుండి పండురాలినట్లు" రాలిపోవాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను'' అనే మాటలు హృదయానికి హత్తుకున్నాయి. అలా జరగాలి అంటే "చైతన్య మానవి' వంటి పత్రికలను చదువుతూ, ఐద్వాకు వీలైన టైమ్ కేటాయిస్తూ ఉంటే మానసిక ప్రశాంతతతోపాటు చైతన్యవంతమైన అనేక విషయాలు తెలుస్తాయని నేను అభిప్రాయపడుతున్నాను.

కవితలు అన్నీ బావున్నాయి. అగ్నిశిఖ థెస్సీ థామస్ గురించి మానవి డెస్క్ పేరుతో వచ్చిన కవిత చాలా బావుంది. నాగమణి వ్రాసిన ''నువ్వు అభ్యుదయవాదివేనా? అనే కవిత చాలా బావుంది. మనస్సుకు టచ్‌చేస్తోంది. ఎవరునీవు, విచ్చుకత్తుల బోను అమ్మ కడుపులో ఆడపిల్ల చాలా బావున్నాయి. ఈ మానవి అన్ని కోణాల నుండి అన్ని రకాలుగా ఆలోచింపచేసేదిగా ఉంది.

**- వి. రమ,కూకట్‌పల్లి.**

చైతన్య మానవి ఏప్రియల్-జూన్ పత్రిక కవరు పేజి ప్రస్తుతం ప్రజలపై పడుతున్న భారాలను చక్కగా తెలుపుతుంది. పారిస్ కమ్యూన్ విప్లవం చదివితే పారిస్ కమ్యూన్‌లో మహిళలు నిర్వహించిన వీరోచిత పాత్ర గురించి ఆనాటి పరిస్థితుల గురించి తెలిసింది. వివాహ చట్టం సవరణలు వ్యాసంలో విడాకుల చట్టంలో స్త్రీకి ఏవిధంగా న్యాయం చేస్తే బావుంటుందో మంచి సూచనలు ఉన్నాయి. చట్ట సవరణ ప్రతిపాదనలపై ఐద్వా ఇతర మహిళా సంఘాలు చేసిన సూచనలు ఆమోదయోగ్యంగా ఉన్నాయి.

ఓల్గా గారు రాసిన మృణ్మయనాదం కథ చాలా బాగుంది. మహిళలు తన ఉనికిని వ్యక్తిత్వాన్ని నిలుపుకోవడం అవసరమని తమపై తమకు ఉన్న అధికారాన్ని వదులుకోకుండా ఉంటే ఎంత శక్తిసామర్థ్యాలతో జీవించగలరో సీత ద్వారా తెలిపారు. ఇది మహిళలు ఆలోచనని ఆత్మ విశ్వాసాన్ని పెంచేదిగా ఉంది. కాని కథ చాలా పెద్దగా ఉంది. సంఘ సంస్కర్తలు వ్యాసం వీరేశలింగం గారి జయంతి సందర్భంగా ఆయన మహిళల గురించి చేసిన కృషిని మననం చేసుకునేదిగా ఉంది. ఆయన చేసిన లోతైన అధ్యయనం, విషయంపై పట్టు సంపాదించడానికి తోడ్పడింది అనిపించింది.

ఆహార భద్రత బిల్లుపై ఐద్వా వ్యాఖ్యలు వ్యాసంలో బిల్లు పై అవగాహన కలిగించేదిగా ఉంది. వేదాలు పంచాంగం ఎవరి కోసం వ్యాసంలో ఈ మధ్య పంచాంగం పేరుతో ఆడపిల్లలపై బురద జల్లడాన్ని తెలిపింది. పంచాంగంలో శ్రీనివాస గార్గేయ ఆడపిల్లలనుద్దేశించి రాసింది, యధావిధిగా కోట్ చేస్తే విషయం, అతని నికృష్ట రచన అందరికీ అర్థమయ్యేది. కేస్ స్టడీలో దుర్గాప్రసన్న గారు రాసిన కేసులో ఐద్వా కేసులను ఎలా పరిష్కారం చేస్తుందో తెలిసింది. కేసులో బాధిత మహిళకు ధైర్యాన్ని కలిగించారు. కాని కేవలం కొట్టకుండా వుండటమేకాదు. ఏవిధమైన హింసనూ భరించనవసరం లేదు అనే ధైర్యాన్ని కూడా కలిగిస్తే బాగుండేది. స్టైల్ అంటే తాగడమా అనే వ్యాసంలో ఈ రోజుల్లో సినిమాలల్లోను పిల్లలపై వాటి ప్రభావాన్ని వివరించడం బాగుంది. "మనసుతో మాట్లాడుకుందాం" శిలాలోలిత గారి ఆర్టికల్ చాలా బాగుంది. ఆరోగ్యం ఆర్టికల్ ఉపయోగకరంగా లేదు.

మొత్తం మీద మానవి మహిళలకు ఉపయోగపడే విధంగా ఉంది. భాష సరళం చేస్తే ఇంకా ఎక్కువమంది చదివి అర్థం చేసుకుంటారు.

**- జి. నాగమణి**

కేస్ స్టడీ

# ఓ దీనురాలి గాథ

ఒకనాడు ఒక వృద్ధురాలు కొడుకు సాయంతో ఐద్వా లీగల్‌సెల్‌కు కుంటుతూ నడవలేక నడుస్తూ భోరున ఏడుస్తూ వచ్చింది. ఆ కుంటడం కాళ్ళ నొప్పులతో, కీళ్ళనొప్పులతో కాదు కొట్టడం, తన్నడం వల్ల వచ్చిన నొప్పులు.

ఆమెపేరు సత్యమ్మ. భర్త ఉన్నన్ని రోజులు బాగానే జరిగింది. అకస్మాత్తుగా భర్త చనిపోయాడు. సత్యమ్మకు ఇద్దరు కొడుకులు. ఒక కూతురు. భర్త ఉన్నప్పుడు చిన్నతనంలోనే కూతురు పెళ్ళి చేసేశారు. ఇద్దరు కొడుకులను పెంచి చదువు చెప్పించాల్సిన బాధ్యత సత్యమ్మపై పడింది.

సత్యమ్మ మిషన్ కుడుతూ కొడుకలను చదివించింది. దానికి తోడు డబ్బులు పొదుపు చేస్తూ ఇల్లు వాకిలి సంపాదించింది.

ఎంతో కష్టపడి చదివించినందుకు కొడుకులు ఉన్నత చదువులు చదివి, గవర్నమెంటు ఆఫీసులలో మంచి ఉద్యోగాలు చేస్తున్నారు.

ఇద్దరు కొడుకులకు పెళ్ళిళ్ళు కూడా చేసింది సత్యమ్మ. సత్యమ్మ అంటే బంధువులలో మంచి పేరు. ఇతరులకు సహాయపడాలన్న ఆమె గుణమే ఆ పేరు తెచ్చింది.

చిన్న కొడుకుకు ఇద్దరు పిల్లలు, పెద్ద కొడుకుకు ఇద్దరు పిల్లలు. ఉద్యోగరీత్యా చిన్న కొడుకు దూరం పోవలసి వచ్చింది. 10 ఏళ్లుగా పెద్ద కొడుకుతోటే గడుపుతున్న సత్యమ్మ జీవితంలో అలజడి రేగింది ఒకనాడు.

పెద్దకోడలు " మీ అమ్మను 10 ఏళ్ళుగా మనమే చూస్తున్నాము. ఇప్పుడు మీ తమ్ముడి దగ్గరకి పంపండి లేకపోతే నేను ఇంట్లో ఉండను అని మొరాయించింది. భర్త ఎంత చెప్పినా వినిపించుకోదు. సత్యమ్మ ఆర్థికంగా వాళ్ళకు భారంగా లేదు. ఆమెకున్న ఇంట మీద బ్యాంకులో ఉన్న లక్ష రూపాయల డబ్బు మీద ఆదాయం వస్తుంది. అయినా ఎందుకో పెద్ద కోడలు వినడం లేదు.

సరేనని పెద్ద కొడుకు తమ్ముడి దగ్గరకు సత్యమ్మను పంపించాడు. సత్యమ్మ ఇద్దరు కొడుకులు 30, 40 వేలు సంపాదించే ప్రభుత్వ ఉద్యోగులు. ఆర్థికంగా ఎవరికి ఏ ఇబ్బంది లేదు.

చిన్న కోడలుకి సత్యమ్మ రావడం ఏమాత్రం ఇష్టం లేదు. ఇక సత్యమ్మ కష్టాలు మొదలైనాయి. సత్యమ్మ గతంలోకి వెళ్ళింది. తను పొదుపు చేసి సంపాదించుకున్న ప్లాట్లు ఉన్నాయి. ఇల్లు వాకిలి ఉన్నాయి. తన పని తాను చేసుకోగలుగుతోంది. అయినా తను ఎందుకు భారమైంది? తన భర్త చనిపోయినా కూడా వాళ్ళను పెంచడం తన బాధ్యత అనుకుంది కాని తన కొడుకులు తనకు భారం అనుకోలేదు.

చిన్న కొడుకు ఇల్లు, అలవాటులేని పరిసరాలు. మనమండ్లు తన దగ్గరికి రావడంలేదు. కోడలు మాట్లాడడం లేదు. అయినా బిత్తరపోతూ మూలకు చూస్తుంది సత్యమ్మ.

ఇంట్లో ఎవరూ మాట్లాడటంలేదు. కొడుకు మంచివాడే కాని భార్యకు భయపడతాడు. ఏం చేసేది? ఎవరు మాట్లాడకపోయినా ఫర్వాలేదు టైంకు ఇంత ముద్ద పెడితే చాలనుకుని మనస్సు రాయి చేసుకున్నది సత్యమ్మ. మెల్ల మెల్లగా వాళ్ళ అసలు రూపం బయటపడింది.

ఒకరోజు డిగ్రీ చదువుతున్న ఇద్దరు మనమండ్లు ఆమెను మోకాలి కింద పిక్కలను కాళ్ళతో తన్నడం మొదలుపెట్టారు. ఆమె ఆ దెబ్బలను తాళలేక బిగ్గరగా అరుస్తుంటే నోటిలో గుడ్డలు కుక్కారు. ఆ దెబ్బలకు తట్టుకోలేక అరుస్తుంటే ఇరుగు పొరుగు చూడలేక దగ్గరలో ఉన్న పోలీసు స్టేషనుకు ఫోన్ చేశారు. ఇంకేం పోలీసులొచ్చారు. ముసలమ్మను ఎందుకు కొట్టారని నిలదీశారు. అంతలోగా చిన్నకోడలు నవ్వుతూ 'లేదుసార్ జోక్ చేస్తున్నారు' అంటూ పోలీసువాడి చేతిలో నోట్ల కట్టలు పెట్టిందట సత్యమ్మ చూస్తుండగానే. ఇంకే ఈ పోలీసువాడు ప్లేటు ఫిరాయించి ఇది నవ్వులాటగా తీసుకుని అలా కొట్టకూడదు నాయనమ్మను అని బుద్ధి చెబుతూ బుజ్జగించి వెళ్లిపోయాడట. ఇలా వుంది మన పోలీసు వ్యవస్థ. ఎప్పుడు గడ్డి తినడం మానుతారో ఏమో!

ఈ విషయం పెద్ద కొడుకు తెలుసుకుని ఎంతో బాధపడి అమ్మను తన ఇంటికి పిలుచుకొచ్చాడు.

పాపం సత్యమ్మ!!

అత్తను చూడగానే పెద్ద కోడలు అగ్గిమీద గుగ్గిలం అయింది. వెంటనే మూటా ముల్లె సర్దుకుని పుట్టింటికి బయలుదేరింది. " మీ అమ్మ ఉన్నన్ని రోజులు నేనీ ఇంటికి రాను. కావలిస్తే నేనే వేరుగా ఇల్లు చూస్తాను అక్కడికి రా" అని చెప్పి తన ఇద్దరు పిల్లలతో వెళ్ళిపోయింది.

పెద్ద కొడుకు తొణకలేదు. బెణకలేదు. నా తల్లి ఎంతో కష్టపడి మమ్మల్ని పెంచింది. ఈరోజు మేము ఇంత

సంపాదించుకుంటున్నది మా అమ్మ చదివించినందుకే కదా! అనే కృతజ్ఞతాభావంతో పెద్ద కొడుకు తల్లికి అండగా నిలబడ్డాడు. తన భార్య అలిగి వెళ్లిపోయినా బాధపడలేదు కానీ దీనికి ఏదైనా పరిష్కారం దొరుకుతుందేమోనని మా లీగల్‌సెల్ ఆఫీసుకు వచ్చాడు. విషయమంతా విన్నాం. సత్యమ్మ కోరుతున్నదేమంటే 'నాకు కొంత డబ్బు బ్యాంకులో ఉంది. ఇంకా రెండు మూడు ప్లాటులున్నాయి. అవికూడా అమ్మేసి బ్యాంకులోపెట్టి నన్ను ఓల్డేజ్‌హోమ్‌లో పెట్టండి' అని కళ్ళనీళ్ళ పర్యంతమయింది. ఆర్థికంగా వాళ్ళ మీద ఆధారపడకపోయినా సమస్యలా? ఎంత స్వార్థం!

వెంటనే లీగల్‌సెల్ ద్వారా పెద్ద కోడలికి, చిన్న కొడుక్కీ లెటర్సు పంపాం.

వాళ్ళు వారం తరువాత వచ్చారు. పెద్ద కోడలు నేను పెట్టుకోనంటే పెట్టుకోనంది. ఇంకో విచిత్రమైన కోరిక కోరింది ఆమె తన భర్త తను చూపించే ఇంట్లో రావాలట. తల్లి దగ్గర ఉండకూడదట. నరేచిన్న కొడుకు మంచివాడే కాని నోట్లో నాలుక లేనివాడు. ''అమ్మ ఎంతో కష్టపడి పెంచింది, చదివించింది'' అని కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ చెప్పాడు. ఇప్పుడు ఎలా బాబు అంటే నా భార్య ఉండనివ్వదు అమ్మను కష్టపెడుతుంది అన్నాడు.

అప్పుడు మేం ఒక నిర్ణయానికి వచ్చాం. ఇద్దరు కొడుకులు చెరి రెండున్నర వేలు అంటే నెలకు ఐదు వేలు ఇచ్చి సత్యమ్మ కోరుకున్నట్లుగా ఏదైనా ఓల్డేజ్‌హోమ్‌లో ఉంచాలని నిర్ణయించాం. ఇద్దరు కొడుకులు సరేనని సంతోషంతో ఒప్పుకున్నారు.

కానీ ఒకరోజు పెద్ద కొడుకు వచ్చి "మా అమ్మ ఓల్డేజ్‌హోమ్‌లో ఉండటానికి ఒప్పుకోవడంలేదు. మా అమ్మకు షుగర్,బి.పి, హార్ట్ ప్రాబ్లమ్ అన్నీ ఉన్నాయి. మెత్తగా అయింది. మరో అంటే మూడు నాలుగేండ్లు ఉండొచ్చు. వద్దు మేడమ్ అమ్మను బాధపెట్టదలచుకోలేదు. నా తల్లికి వండిపెడతాను. నేను, అమ్మా కలిసే ఉంటాము" అన్నాడు. 'చావుకు దగ్గరైన నా తల్లిని వదిలిపెట్టను' అని కన్నీళ్ళతో చెప్పాడు. అమ్మ కష్టాన్ని అర్థం చేసుకున్న ఆ కొడుకును అభినందించాము. అటువంటి కొడుకు ఉండటం ఆమె అదృష్టం. అలాగే ఆమెకు కౌన్సిలింగ్ చేశాము. ఆమె కోడలికి కూడా తన నిర్ణయాన్ని మార్చుకునేందుకు కౌన్సిలింగ్ ఇవ్వాలని అనుకున్నాము. కౌన్సిలింగ్ ద్వారా ఆమె కూడా మారుతుందని ఆశిస్తున్నాము. ★

# పాటకు తూటాల తూట్లు

## పాక్‌లో పష్తో గాయని గజాలా కాల్చివేత

కళ్ళను కట్టిపడేసే సౌందర్యం...మనసును మైమరపించే గాత్ర మాధుర్యం ఆమె సొంతం. ఆమె పాట వింటే స్థానికులు పరవశించిపోతారు. కానీ, కరడుగట్టిన మనస్తత్వంతో మానవత్వానికి ఆమడ దూరంలో ఉన్మాదులుగా బతికే ఉగ్రవాదులకు ఆమె కళానైపుణ్యం, గాన కౌశలం ఎలా కనిపిస్తాయి? అందుకే ఆమెను నిర్దయగా పొట్టనబెట్టుకున్నారు. ఈ సుమధుర గళాన్ని బుల్లెట్లతో తూట్లు పొడిచారు. పష్తో గాయనిగా ప్రజల్లో మంచి పేరు సొంతం చేసుకున్న గజాలా జావేద్‌ను పాకిస్థాన్‌లోని పెషావర్ పట్టణంలో కొందరు ఆగంతకులు కాల్చి చంపారు. సోమవారం రాత్రి స్థానిక దగ్గారీ బజార్‌లో ఓ బ్యూటీపార్లర్ నుండి గజాలా బయటకు వస్తుండగా....మోటూరు సైకిళ్ళపై వచ్చిన ఆగంతకులు బుల్లెట్ల వర్షం కురిపించారు. ఈ ఘటనలో ఆమెతోపాటు తండ్రి మెహమ్మద్ జావేద్ కూడా ప్రాణాలు కోల్పోయారు. జావేద్ సోదరి తృటిలో తప్పించుకున్నారు. సంగీతానికి కులం, మతం, జాతి ఇలాంటి భేదభావాలేమీ ఉండవు. ప్రతి ఒక్కరినీ కదిలిస్తుంది. ఉగ్రవాదులను తప్ప. దీనికి నిదర్శనమే తాలిబన్లు. "సంగీతం ఇస్లాంకు వ్యతిరేకం" అని ప్రకటించిన తాలిబన్లు కొద్ది సంవత్సరాలుగా ఖైబర్-ఫక్తున్‌ఖ్వా ప్రావిన్స్ ప్రాంతంలో సంగీత కళాకారులు లక్ష్యంగా హత్యలకు తెగబడుతున్నారు. వీరి చేతిలో ఇప్పటికే పలువురు కళాకారులు ప్రాణాలు కోల్పోగా....మరి కొంతమంది బతుకు జీవుడా అంటూ వలసపోయారు. అయితే జావేద్ హత్యకు భర్తతో ఉన్న విభేదాలు కూడా కారణం కావొచ్చని పోలీసులు అనుమానిస్తున్నారు. అభిప్రాయభేదాల కారణంగా గత ఏడాది భర్తనుంచి వేరుపడిన గజాలా తండ్రితో కలిసి ఉంటున్నారు.

# డాక్టర్ సలహాలు



**2. పిరియడ్స్ ఆగిపోయే ముందు వచ్చే సమస్యలు, వాటికి తీసుకోవలసిన జాగ్రత్తలు వివరించగలరు?**

జ. పీరియడ్స్ ఇర్రెగ్యులర్‌గా అంటే ఒకోసారి ఆలస్యంగా లేకపోతే ముందుగా, ఎక్కువగా లేదా చాలా తక్కువగా కావచ్చు. ఒకోసారి కడుపునొప్పి రావచ్చు. బ్రెస్ట్ నొప్పి అనిపించవచ్చు. ఏదైనా ఒక మోతాదుకు మించితే వెంటనే దగ్గరలో ఉన్న డాక్టరుని సంప్రదించాలి. కొద్దిగా ఉంటే అంత ఆందోళన పడాల్సిన అవసరం లేదు. అయితే సంవత్సరానికి ఒకసారి పాప్‌స్మియర్ టెస్ట్, మెమోగ్రఫీ చేయించుకోవటం మంచిది.

**2. టీనేజ్ అమ్మాయిలు పిరియడ్స్ టైమ్‌లో కడుపు నొప్పితో బాధపడుతున్నారు. మా అమ్మాయి బరాల్గన్ అనే ట్యాబ్లెట్ వాడుతుంది. వాడవచ్చా? దాని వలన సైడ్ ఎఫెక్ట్స్ ఏమైనా వుంటాయా?**

**-రమ, కుకట్‌పల్లి.**

జ: పీరియడ్స్ సమయంలో కడుపునొప్పి అనేది చాలా సహజం. అయితే అది కొద్దిమందిలో భరించలేనంత నొప్పి ఒక్కోసారి వాంతులు, చేతులు, కాళ్ళు నొప్పులు ఎక్కువగా ఉంటాయి. అటువంటివారు తగిన మందులు వాడాల్సి ఉంటుంది. కడుపునొప్పికి బెరాల్గన్ మంచిదికాదు. అవి బ్యాన్ చేసిన మాత్రలు. మెఫ్టాల్ స్పెస్ వాడితే మంచిది.

**3. ప్రెగ్నెన్సీ సమయంలో కుంకుమ పువ్వు పాలలో కలుపుకుని తాగితే పిల్లలు తెల్లగా పుడతారని అంటారు. దాంట్లో వాస్తవం ఎంత?**

జ: ప్రెగ్నెన్సీ అప్పుడు ఆహారంతోపాటుగా పాలు, పండ్లు తీసుకోవటం మంచిది. కుంకుమపువ్వు వల్ల పిల్లలు తెల్లగా పుట్టడమనేదాంట్లో ఏమాత్రం వాస్తవం లేదు.

**4. ఇంటర్‌నెట్ బాగా వాడుకలోకి వచ్చిన నేటి కాలంలో ఏ జబ్బు వచ్చినా నెట్ ద్వారా వివరాలు, మరియు సమాచారం సేకరిస్తున్నారు. నెట్ పై ఆధారపడటం సరైనదేనా?**

**-జి.నాగమణి, హైదరాబాద్.**

జ: ఇంటర్‌నెట్‌లో జబ్బు గురించి నాలెడ్జ్ పెంచుకోవడం వరకూ ఉపయోగ పడుతుంది. వైద్యం మాత్రం ఇంటర్‌నెట్ ద్వారా చేసుకోవటం అనేది ప్యారాచూట్‌తో ప్రపంచం మొత్తం తిరగటమవుతుంది.

**5. నా వయస్సు 39 సం॥రాలు. ఇంతకు ముందు నాకు బ్రెయిన్‌కు వెళ్ళే నరాలకు బ్లడ్ సరిగ్గా పోవటం లేదని విషయంగా నేను ట్రీట్‌మెంట్ చేయించుకున్నాను. ప్రస్తుతానికి దానికి సంబంధించిన మందులు రెగ్యులర్‌గా వాడుతున్నాను. నాకు పీరియడ్స్ రెగ్యులర్‌గా రావు. అలా ఆలస్యమైనప్పుడు ఒళ్ళంతా బరువుగా, అనీజీగా, ఇదీ అని చెప్పలేని అస్వస్థతగా ఉంటుంది. ఇవి చాలవన్నట్టుగా కొంత కాలంగా అంటే రెండు మూడు నెలల నుండి అప్పుడప్పుడూ ఛెస్ట్‌లో (రెండు వైపులా) చురుకు చురుకు మంటోంది. ఇది దేనికి దారితీస్తుందోనని ఆందోళనగా ఉంటోంది. వివరంగా తెలుపగలరు.**

జ: మీరు ఇంతకుముందు వాడుతున్న మందులు కంటిన్యూ చేయండి. మీరు ప్రీ.మెనోపాజల్ వయసులో ఉన్నారు కాబట్టి మీరు చెప్పి లక్షణాలన్నీ దానికి సంబంధించినవే. మీరు సోయాబీన్స్ గింజలు రోజుకు ఒక గుప్పెడు ఉడకబెట్టి తినండి. లేదా టీ ఎక్కువగా తాగండి. ఎక్కువ ఆందోళన చెందకండి. బి.పి.,షుగర్ వంటి పరీక్షలు రెగ్యులర్‌గా చేయించుకోండి. అలాగే పాప్‌స్మియర్ మెమోగ్రఫీ చేయించుకోండి.

★

# ఉద్యమాల బాటలో

**ఎక్సైజ్ పాలసీని మార్చాలి - మద్యాన్ని నియంత్రించాలి.**

రాష్ట్ర ప్రభుత్వం కొత్త ఎక్సైజ్ విధానాన్ని రూపొందించేముందు ప్రతిపక్ష పార్టీలు, మహిళా, యువజన సంఘాలతో సమావేశం జరిపి చర్చించాలని, ప్రభుత్వ ఎక్సైజ్ పాలసీ


కడప

మద్యం వినియోగాన్ని తగ్గించేదిగా ఉండాలని,మద్యం వ్యాపారంలో మాఫియాలకు ఆస్కారం లేకుండా చేసేందుకు టోకుగానూ, చిల్లరగానూ మద్యం వ్యాపారాన్ని ప్రభుత్వమే నిర్వహించాలని ఐద్వా రాష్ట్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది.


ప్రకాశం

ప్రభుత్వం మద్యంపై వస్తున్న ఆదాయాన్ని ప్రధాన వనరుగా ఎంచుకుంది. వేలంపాటలు పెట్టి విచ్చలవిడిగా మద్యం షాపులకు లైసెన్స్‌లు ఇస్తుంది. ప్రభుత్వం మద్యంపై ఆంక్షలు విధించినపుడు తాగడానికి సిగ్గుపడినవారు నేడు వ్యసనానికి బానిసలుగా మారుతున్నారు. తాగడం తప్పుకాదనే భావాన్ని ప్రభుత్వమే పెంచిపోషించడంతో 14-15 సంవత్సరాలకే తాగుడుకి అలవాటు పడుతున్నారు. వీధి వీధినా బెల్టుషాపులు ఏర్పాటు చేయడంతో తమ ఆదాయాన్ని మద్యానికే ఖర్చు చేస్తున్నారు. మద్యం సేవించి మహిళలను హింసించడం పెరిగింది. కుటుంబాలు ఆర్థికంగా చితికిపోవటమే గాక, కుటుంబాలలో కలహాలు పెరిగాయి. మహిళలు, బాలికలపై అత్యాచారాలు, హింసాత్మక దాడులు పెరుగుతున్నాయి. విపరీతంగా త్రాగడంతో చిన్న వయస్సులోనే దీర్ఘకాలిక జబ్బులపాలై అకాల మరణానికి గురవుతున్నారు.

రాష్ట్రంలో మద్యం మాఫియాలు సామాజిక వ్యవస్థను నాశనం చేస్తున్నాయి. మద్యం సిండికేట్లు, పాలక పార్టీల నాయకులు, ఎక్సైజ్ అధికారులు కుమ్మక్కై ప్రజలను, ప్రభుత్వ ఆదాయాలను ఏరకంగా కొల్లగొడుతున్నారో ఎ.సి.బి. విచారణలో వెల్లడయింది. వందల సంఖ్యలో మద్యం దుకాణాలు బినామీ పేర్లు మీద పలుకుబడిగల వారు సొంతం చేసుకున్నారని వివరాలు వెల్లడవుతున్నా ప్రభుత్వం మాత్రం బినామీల వెనుక వున్న అసలు వ్యక్తులను బయటకు లాగే పని చేయడంలేదు. పైగా కొందరు అధికారులు ఇటువంటి ప్రయత్నాలు చేస్తే వారిని ఆటంకపరుస్తున్నది. చర్యలు తీసుకుంటున్నది. కేబినెట్ మంత్రులకే మద్యం మాఫియాలతో సంబంధం వుందనీ, లంచాలు తీసుకున్నారని ఆరోపణలు వచ్చినా ప్రభుత్వం వారిని సమర్థిస్తున్నది. ఇటువంటి ప్రభుత్వం ప్రజల ఒత్తిడి లేకుండా మద్యం మాఫియాలను బద్దలుకొడుతుందని ఆశించడం అత్యాశే అవుతుంది. ఎక్సైజ్ శాఖ మద్యం మాఫియాలతో కుమ్మక్కయ్యే అవకాశం లేకుండా కొత్త విధానం రూపొందించాలని డిమాండ్ చేస్తూ ఐద్వా రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాలలో మద్యం షాపుల లాటరీలను అడ్డుకుంది. జనావాసాల మధ్య, నియమ నిబంధనలకు వ్యతిరేకంగా ఉన్న షాపులను వెంటనే తీసివేయాలని, అమ్మకాలను తగ్గించాలని ఐద్వా ప్రభుత్వాన్ని కోరుతోంది.

**స్వయం సహాయ సంఘాల సమస్యలపై:**

ఎస్. హెచ్.జిలు ఎదుర్కొంటున్న సమస్యలపై ఐద్వా 16

జిల్లాలలో సర్వే నిర్వహించింది. ఆ సర్వేలో పావలా వడ్డీ రుణాలు అన్ని గ్రూపులకు రావటం లేదని, వడ్డీలేని రుణాలు ప్రారంభం కాలేదని, అభయహస్తం పించన్ పథకం కొందరికే వర్తింప చేస్తున్నారని, లింకేజీ లోన్లు రావటంలేదని, దీపం పథకం క్రింద ఇచ్చే గ్యాస్ కనెక్షన్లు చాలా సంవత్సరాలుగా పెండింగ్‌లో ఉన్నాయని తదితర సమస్యలు వెలుగులోకి వచ్చాయి. వీటన్నింటిపై ఎక్కడిక్కడ స్థానికంగా ధర్నాలు, అధికారులకు మెమోరాండాలు ఇవ్వడంతోపాటు జులై 16వ తేదీన స్వయం సహాయక సంఘాల సమస్యలపై రాష్ట్ర సదస్సు హైదరాబాద్‌లో నిర్వహించబడింది. ఈ సదస్సుకు ఐద్వా ఆలిండియా నాయకురాలు తపసీ ప్రహరాజ్, సెర్ప్ డైరెక్టర్ జమునగారితోపాటు రాష్ట్ర, జిల్లా నాయకులు పాల్గొన్నారు.

ఎన్నికల ముందు దీపం పథకం, అభయహస్తం పెన్షన్ స్కీమ్, పావలావడ్డీ రుణాలు ఇస్తామని ప్రభుత్వం వాగ్దానం చేసింది. ప్రతినెలా 10తేదీ లోపు రుణ వాయిదా చెల్లించాలని షరతు విధించటం వలన దళిత, గిరిజన గ్రూపులు నష్టపోతున్నాయి. 2008 నుండి పావలా వడ్డీకి సరిపడా బడ్జెట్ కేటాయింపులు లేక గ్రూపులకు



వరంగల్

లోన్లు అందరికీ అందటంలేదు. ఆర్భాటంగా అభయహస్తం పెన్షన్ స్కీమ్ ప్రారంభించిన ప్రభుత్వం 73 లక్షల మంది అప్లికేషన్స్ పెడితే 43 లక్షలకే ఫుల్‌స్టాప్ పెట్టింది. ఇప్పటికి వందలాదిమందికి బాండ్ పేపర్స్ ఇవ్వనేలేదు. పథకంలో చేరటానికి మహిళలు ముందుకు


నల్గొండ

వచ్చినా ప్రభుత్వం కొనసాగింపు చర్యలు లేవు. దీపం పథకంలో గ్యాస్ కనెక్షన్స్ ఓట్ల రాజకీయంగా మారిపోయింది. అరకొర వచ్చిన




గ్యాస్ కనెక్షన్లు తమ అనుయాయులకు పంపిణీ చేస్తున్నారు.



ఆమ్ఆద్మీ, జనశ్రీ బీమాయోజన, సంజీవని, స్వావలంబన వంటి స్కీమ్‌లు ప్రవేశపెట్టి మహిళల మూలుగులు పీల్చి,పిప్పి చేస్తున్నారు. స్కాలర్‌షిప్‌లు ఇస్తామని చెపుతున్నా సక్రమంగా అమలు చేయటం లేదు.

గ్రామ దీపికలు, బ్యాంక్ మిత్రలు, బుక్ కీపర్స్ మొదలైన వారిని గ్రూపులను ఆర్గనైజ్ చేయటానికి నియమించి వారికి వేతనం ఇవ్వకుండా గ్రూపు సభ్యుల వద్ద వసూలు చేసుకోమని చెప్పటంతో సభ్యులపై భారాలు పెరిగాయి. దేశంలోనే అగ్రగామిగా నడుస్తున్న స్వయం సహాయ సంఘాలు ప్రస్తుతం ప్రభుత్వం, బ్యాంకర్లు, గ్రూపులలో వస్తున్న సమస్యలతో ఛిన్నాభిన్నమయ్యే పరిస్థితి వస్తుంది. కావున వడ్డీలేని రుణాలు, అభయహస్తం పించను పథకం గ్రూపులన్నింటికీ వర్తింపచేయాలని, గ్రూపులు ఎదుర్కొంటున్న ఇతర సమస్యలను పరిష్కరించాలని ఐద్వా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది.

**కెప్టెన్ లక్ష్మి సెహగల్ మృతికి సంతాపం**

జులై 23న ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధురాలు కెప్టెన్



లక్ష్మిసెహగల్ గారి (97సం॥) జులై 23న కాన్పూర్‌లో మరణించారు. ఐద్వా రాష్ట్ర అధ్యక్షురాలు టి.జ్యోతి అధ్యక్షతన ఐద్వా రాష్ట్ర కార్యాలయంలో సంతాప సభ జరిగింది. కేంద్ర కమిటీ సభ్యురాలైన మల్లు స్వరాజ్యంగారు కెప్టెన్ లక్ష్మీ సెహగల్‌గారి చిత్రపటానికి పూలమాల వేసి శ్రద్ధాంజలి ఘటిస్తూ ఆమెతో వున్న తన అనుభవాలను సభలో పంచుకున్నారు. సుభాష్ చంద్రబోస్ ఏర్పాటు చేసిన ఆజాద్-హింద్-ఫౌజ్‌లో రాణీ ఝాన్సీ రెజిమెంట్ దళానికి కెప్టెన్‌గా లక్ష్మీ సెహగల్‌ని నియమించారు. దేశంలోనే మొట్టమొదట తుపాకీ పట్టిన మహిళ. స్వాతంత్ర్య పోరాట యుద్ధంలో పాల్గొంటూనే, యుద్ధంలో గాయాలపాలైన సైనికులకు వైద్య సేవలందించారు. స్వాతంత్రానంతరం ప్రజాసేవలో అంకితమై పనిచేశారు. ఆమె చివరి వరకూ ప్రజాసేవలోనే ఉన్నారు అని ప్రసంగించారు.

ఐద్వా ఉపాధ్యక్షురాలు ఎస్. పుణ్యవతి మాట్లాడుతూ 1981లో అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఏర్పాటు జరిగినపుడు మొట్టమొదటి కమిటీకి ఉపాధ్యక్షురాలుగా ఉన్నారు. ఆమె వివిధ సందర్భాలలో ఆంధ్రప్రదేశ్‌కు వచ్చినపుడు ఆమెతో కలిసి ఉన్న సంఘటనలను గుర్తు చేసుకున్నారు. స్వాతంత్ర్య పోరాటం తరువాత కూడా ప్రజలలో మమేకమవ్వటం, ఉద్యమాల్లో పాల్గొనటం అసాధారణ విషయం. పోరాట యోధురాలిగా, వైద్యురాలిగా, మహిళా ఉద్యమంతో కలిసి ఉన్న పరిపూర్ణ జీవితం ఆమెది. 98ఏళ్ళ వయస్సులో కూడా వైద్య సేవలు అందిస్తూ మరణానంతరం కూడా ఆమె నేత్రాలను, దేహాన్ని సమాజానికి ఉపయోగపడేలా ఇవ్వటం ఇవన్నీ నేటి యువతకు ఎంతో స్ఫూర్తిదాయకం. ఆమె మరణం ఒక్క మహిళా ఉద్యమానికే గాక అభ్యుదయ వాదులందరికి, పీడిత వర్గానికి తీరనిలోటు. ఆమె ఆశయాలు ముందుకు తీసుకు వెళ్ళటమే ఆమెకు మనమిచ్చే నివాళి అన్నారు. ఈసభలో ఐద్వా సీనియర్ నాయకులు, కార్యకర్తలు పాల్గొని కెప్టెన్ లక్ష్మిసెహగల్‌కు నివాళులర్పించారు.



**అస్సాంలో బాలికపై జరిగిన ఘటనను ఖండిస్తూ...**

అస్సాం రాజధాని గౌహతిలో జరిగిన ఘటన సభ్యసమాజాన్ని నివ్వెరపరిచేవిధంగా ఉంది. ఒక మైనర్ బాలికపై 20 మంది యువకులు అమానుషంగా దాడి చేసి జుట్టుపట్టుకుని ఈడ్చి హింసించిన ఘటనపై పాల్పడటాన్ని ఐద్వా రాష్ట్ర కమిటీ తీవ్రంగా ఖండించింది.

రాష్ట్ర సచివాలయానికి, స్థానిక పోలీస్ స్టేషన్‌కి కూతవేటు దూరంలో ఈ ఘటన జరగటం, ఫిర్యాదు అందిన వెంటనే పోలీసులు జోక్యం చేసుకోకపోగా పోలీసులంటే ఎటిఎం కార్డులు కాదు, కార్డు పెట్టిన వెంటనే డబ్బులు వచ్చేవిధంగా సంఘటనా స్థలానికి రావటానికి అనే వ్యాఖ్యలు చేయటం అనేది మరింత సిగ్గుమాలిన, ఖండించవలసిన విషయం. ఈ వ్యాఖ్యలను ఆ రాష్ట్ర మంత్రి సమర్థించటమనేది దేశంలో మహిళల పరిస్థితులకు అద్దం పడుతున్నాయి. చుట్టూ ఉన్న స్థానికులు దానిని ఎదుర్కోకపోగా బాధ్యతారాహిత్యంగా నిలబడి వినోదం చూడటం సమాజంలో మహిళల భద్రత ఏతీరున వున్నదీ అద్దం పడుతోంది.



వెంటనే ఈ ఘటనపై న్యాయ విచారణ జరిపి దోషులను కఠినంగా శిక్షించాలని, ఇటువంటి ఘటనలు పునరావృతం కాకుండా కఠినమైన చర్యలు చేపట్టాలని కేంద్ర హోంశాఖను ఐద్వా రాష్ట్ర కమిటీ డిమాండ్ చేస్తూ, ప్రభుత్వ దిష్టిబొమ్మను దగ్ధం చేసింది.

**మంచినీటి సమస్యపై:**

వైరా ప్రాజెక్టు నుండి బోనకల్ గ్రామానికి 20 రోజులుగా మంచినీటి సరఫరా జరగటంలేదు. గ్రామాల్లో మంచినీళ్ళు దొరకకపోయినా కాపుసారా మాత్రం ఏరులై పారుతోంది. తీవ్రమైన నీటి సమస్యతో మహిళలు ఇబ్బంది పడుతున్నారు. దీనిని నిరసిస్తూ



ఐద్వా ఆధ్వర్యంలో మహిళలు పెద్ద ఎత్తున వైరా-జగ్గయ్యపేట ప్రధాన రహదారిపై ఖాళీ బిందెలతో మూడు గంటలపాటు రాస్తారోకో నిర్వహించారు. చివరకు మహిళల ఆందోళనతో దిగివచ్చిన వైరా



ప్రాజెక్టు జె.ఇ రెండు రోజులకు ఒకసారి మంచినీటిని సరఫరా చేస్తామని హామీ ఇవ్వడంతో ఆందోళన విరమించారు.

**ఐద్వా కేంద్ర కమిటీ సమావేశాలు:**

ఐద్వాకేంద్ర కమిటీ సమావేశాలు జూన్ 29 నుండి జులై 1వ తేదీ వరకూ విజయవాడలో నిర్వహించబడ్డాయి. ఈ సమావేశాలకు ఆలిండియా కార్యదర్శి సుధాసుందర్ రామన్, ప్యాట్రన్ శ్రీమతితోపాటు వివిధ రాష్ట్రాల నుండి 60 మంది కేంద్ర కమిటీసభ్యులు హాజరయ్యారు. కేంద్ర కమిటీ సమావేశాల సందర్భంగా మీడియా-మహిళలపై ప్రభావం, యువతులు ఎదుర్కొంటున్న సమస్యలు, ప్రపంచీకరణ "మహిళలపై ప్రభావం" అనే తదితర అంశాలపై సెమినార్లు విజయవాడ నగర కమిటీ నిర్వహించింది. ఈ సెమినార్‌లలో హర్యానా రాష్ట్ర కార్యదర్శి జగ్మతి, ఆలిండియా సహాయ కార్యదర్శి వాసుకి, సుధాసుందర్ రామన్‌లు పాల్గొన్నారు. మూడు రోజులపాటు జరిగిన కేంద్రకమిటీ సమావేశాల్లో కుంచించుకుపోతున్న ప్రజాపంపిణీ వ్యవస్థ, ఆహారభద్రతా చట్టంలోని లోపాలు, తగ్గిపోతున్న స్త్రీ, పురుష నిష్పత్తి, చట్టసభల్లో మహిళా రిజర్వేషన్ బిల్లు తదితర అంశాలపై చర్చించి భవిష్యత్‌లో నిర్వహించాల్సిన ఆందోళనా కార్యక్రమాలకు పిలుపునిచ్చారు.

**నగదు బదిలీ పథకంపై:-**

ఆహార భద్రత బిల్లులోని లోపాలను సవరించాలని, ప్రజలందరికీ ఆహార భద్రత కల్పించాలని, ప్రజాపంపిణీ వ్యవస్థను పటిష్ట పరచాలని కోరుతూ ఐద్వా రాష్ట్ర వ్యాపితంగా పౌరసరఫరాల ఆఫీసుల ముందు ధర్నా నిర్వహించింది. నగదు బదిలీ పథకం వద్దని, సరుకులేఇవ్వాలని అధికారులకు మెమోరాండాలు ఇచ్చింది.



నగదు బదిలీ ద్వారా మహిళా సాధికారత దెబ్బతింటుందని, ఆ డబ్బు భర్తల ద్వారా మద్యం షాపులకు వెళుతుందని ఎనభై శాతం మంది పిల్లలు, మహిళలు పోషకాహార లోపంతో బాధపడుతున్నారని తెలిపారు. రేషన్ షాపుల ద్వారా పద్నాలుగు రకాల నిత్యావసర సరుకులు ఇవ్వాలని ప్రభుత్వాన్ని ఐద్వా కోరుతోంది.

## సూక్తులు

చదరంగంలో మాదిరిగానే జీవితంలో కూడా
ముందు చూపు ఎంతో అవసరం.

– వీరేశలింగం

అక్షర రూపం దాల్చిన ఒక్క సిరా చుక్క
లక్ష మెదళ్ళకు కదలిక. ఆ కదలికకు సాధనం గ్రంధాలయం.

– కాళోజీ నారాయణరావు

# సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ (ఐటిడిఏ) - పార్వతీపురం

## PROPOSED ACTION PLAN FOR 2012-2013(Revised)

### Sector-wise Abstract of ITDA, Parvathipuram, Vizianagaram District

| Sl. No. | Sector | Physical | | | Financial (Rs. in Lakhs) | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | No. of Units | No. of Benf. | Acres | SCA | # % | IF | BC | Others | Total Outaly | ##% |
| 1 | Agriculture | 136 | 1180 | 75.00 | 58.000 | 29 | 96.00 | 10.000 | 52.800 | 216.800 | 36 |
| 2 | Infrastructure | 115 | 390 | 425.00 | 42.00 | 21 | 0.00 | 42.00 | 33.75 | 117.75 | 19 |
| 3 | ISB | 195 | 195 | 0.00 | 40.50 | 20 | 109.00 | 0.00 | 0.00 | 149.50 | 25 |
| 4 | Land Purchase Scheme | 0 | 0 | 0 | 0.00 | 0 | 0.00 | 0.00 | 0.00 | 0.00 | 0 |
| 5 | Innovative Schemes | 44 | 1446 | 0 | 40.00 | 20 | 40.00 | 0.00 | 0.00 | 80.00 | 13 |
| 6 | Existing Schemes | 252 | 332 | 0 | 20.25 | 10 | 18.25 | 2.00 | 0.00 | 40.50 | 7 |
| | Total | 742 | 3543 | 500.00 | 200.750 | 100 | 263.250 | 54.000 | 86.550 | 604.550 | 100 |

No. of Benf. - No. of Beneficiaries  SCA - Special Central Assistance  IF - Institutional Finance  BC - Beneficiary Contribution
# % of total SCA allocation  ## % of total Outlay

## WORKS TAKEN UP BY THE TRIBAL WELFARE ENGINEERING ,PARVATHIPURAM

| Sl. No | Name of the Work | IAP | | | | NABARD RIDF | | | | Article 275(i) | | | | GURUKULAM | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | No of Works | Est. Cost (Rs. in Lakhs) | No grounded | Expenditure (Rs. in Lakhs) | No of Works | Est. Cost (Rs. in Lakhs) | No grounded | Expenditure (Rs. in Lakhs) | No of Works | Est. Cost (Rs. in Lakhs) | No grounded | Expenditure (Rs. in Lakhs) | No of Works | Est. Cost (Rs. in Lakhs) | No grounded | Expenditure (Rs. in Lakhs) |
| 1 | Construction of Cause Ways & Bridges | 6 | 136.00 | 5 | 7.05 | | | | | | | | | | | | |
| 2 | Construction of Additional Accommodation to Tribal Welfare Educational Institutions | 6 | 525.00 | 6 | 0.00 | 1 | 95 | 1 | 76.76 | | | | | 1 | 81.805 | 1 | 29.80 |
| 3 | Construction of School Buildings to Tribal Welfare Educational Institutions | | | | | | | | | | | | | 1 | 565.00 | 1 | 480.14 |
| 4 | Construction of Addl. Class Rooms to Tribal Welfare Educational Institutions | | | | | | | | | | | | | | | | |
| 5 | Providing of BT Surface Roads | 2 | 680.00 | 0 | 0.00 | 5 | 1099.00 | 5 | 453.52 | 4 | 396.74 | 2 | 129.11 | | | | |
| 6 | Construction of Tribal Youth Centre at Parvathipuram | 1 | 250.00 | 0 | 0.00 | | | | | | | | | | | | |
| 7 | Construction of PHCs Buildings | | | | | | | | | | | | | | | | |
| 8 | Construction of Sub centre Buildings | | | | | | | | | | | | | | | | |
| 9 | Construction of Godown cum Storage and sales Depots | | | | | 10 | 135.00 | 6 | 6.16 | | | | | | | | |
| 10 | Construction of DR Depot cum Storare Buildings | | | | | 7 | 57.40 | 7 | 3.75 | | | | | | | | |
| 11 | Improvemets to Lanja Chck dam and Construction of Channals | | | | | | | | | 1 | 91.86 | 1 | 59.89 | | | | |
| 12 | Construction of Anganwadi Buildings | 7 | 39.90 | | | | | | | | | | | | | | |
| | Construction of Cultural Centre Buildings(Community halls) | | | | | | | | | | | | | | | | |
| | TOTAL | 22 | 1630.90 | 11 | 7.05 | 23 | 1386.40 | 19 | 540.19 | 5 | 488.60 | 3 | 189.00 | 2 | 646.81 | 2 | 509.94 |

| Sl. No | Name of the Work | CSS | | | | NRHM | | | | SSA | | | | CCDP | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | No of Works | Est. Cost (Rs. in Lakhs) | No grounded | Expenditure (Rs. in Lakhs) | No of Works | Est. Cost (Rs. in Lakhs) | No grounded | Expenditure (Rs. in Lakhs) | No of Works | Est. Cost (Rs. in Lakhs) | No grounded | Expenditure (Rs. in Lakhs) | No of Works | Est. Cost (Rs. in Lakhs) | No grounded | Expenditure (Rs. in Lakhs) |
| 1 | Construction of Cause Ways & Bridges | | | | | | | | | | | | | | | | |
| 2 | Construction of Additional Accommodation to Tribal Welfare Educational Institutions | | | | | | | | | | | | | | | | |
| 3 | Construction of School Buildings to Tribal Welfare Educational Institutions | 1 | 126.62 | 1 | 15.59 | | | | | | | | | | | | |
| 4 | Construction of Addl. Class Rooms to Tribal Welfare Educational Institutions | | | | | | | | | 247 | 1335.50 | 246 | 0.00 | | | | |
| 5 | Providing of BT Surface Roads | | | | | | | | | | | | | | | | |
| 6 | Construction of Tribal Youth Centre at Parvathipuram | | | | | | | | | | | | | | | | |
| 7 | Construction of PHCs Buildings | | | | | 4 | 160.00 | 4 | 59.96 | | | | | | | | |
| 8 | Construction of Sub centre Buildings | | | | | 6 | 54.00 | 6 | 10.23 | | | | | | | | |
| 9 | Construction of Godown cum Storage and sales Depots | | | | | | | | | | | | | | | | |
| 10 | Construction of DR Depot cum Storare Buildings | | | | | | | | | | | | | | | | |
| 11 | Improvemets to Lanja Chck dam and Construction of Channals | | | | | | | | | | | | | | | | |
| 12 | Construction of Anganwadi Buildings | | | | | | | | | | | | | 17 | 66.6 | 17 | 26.6 |
| | Construction of Cultural Centre Buildings(Community halls) | | | | | | | | | | | | | 52 | 149.32 | 47 | 33.3 |
| | TOTAL | 1 | 126.62 | 1 | 15.59 | 10 | 214.00 | 10 | 70.19 | 247 | 1335.50 | 246 | 0.00 | 69 | 215.92 | 64 | 59.92 |

## TW EDUCATION

No. of Institutions: 61  Enrollment:13547

**Category wise breakup:**

| S. No | Name of the School/ Hostel | No. of Institution | Enrollment | | Total |
|---|---|---|---|---|---|
| | | | Boys | Girls | |
| 1 | TW High Schools | 27 | 4566 | 4196 | 8762 |
| 2 | TWAUPS Schools | 17 | 1930 | 748 | 2678 |
| 3 | TW Primary Schools | 06 | 309 | 248 | 557 |
| 4 | TW Hostels | 11 | 926 | 624 | 1550 |
| | Total | 61 | 7731 | 5816 | 13547 |
| 1 | Govt. Primary Schools | 349 | 3598 | 3427 | 7025 |
| | Total | 349 | 3598 | 3427 | 7025 |

There are 10 A.P.T.W.Res. Schools are functioning, out of which 3 High Schools for boys, 2 High Schools for girls and 1 Mini Gurukulam are working. 5 Res. Jr. Colleges are also working, out of which 2 for boys and 3 for girls are catering for 4847 students during Out of which Boys 2006, Girls 2841.

## SSC RESULTS (2012):

| Institution | No Appeared | No Passed | Percentage of Pass |
|---|---|---|---|
| TW High Schools & Hostels | 1339 | 1248 | 93.20% |
| Gurukulam | 1050 | 996 | 94.86% |
| TOTAL | 2389 | 2244 | 93.93% |



శ్రీ ఎం.వీరబ్రహ్మయ్య, ఐ.ఎ.ఎస్.
జిల్లా కలెక్టర్, విజయనగరం



బి.ఆర్. అంబేద్కర్, ప్రాజెక్టు అధికారి
ఐ.టి.డి.ఎ., పార్వతీపురం



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A 136 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 2/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |